# అర్పణ

పాకల రామలక్ష్మి

గాయత్రీ పబ్లికేషన్సు,
[redacted] యవాడ - 2.

ప్రథమ ముద్రణ :
2000 ప్రతులు
1965 అక్టోబరు

ఆంధ్రప్రభ వారపత్రికలో సీరియల్ గా
ప్రకటింపబడిన నవల.



## అర్పణ

## 1

స్నేహం అమూల్యమైనది. అనిర్వచనీయమైనది. స్నేహలతకు బీజం ఎక్కడ, ఎప్పుడు, ఎలా పడుతుందో ఎవరూ ఊహించలేరు. అది చిన్న మొలకదగ్గర పడినా మహా వృక్షందగ్గర పడినా ఒకే దృక్పథంతో సాగిపోతుంది. చూచేవాళ్ళకు చిన్నా, పెద్దా, గొప్పా, బీదా, మంచీ, చెడ్డా తారతమ్యంగాని స్నేహమనే లత పీటిని లక్ష్యపెట్టకుండా స్వేచ్ఛగా ముందుకు అల్లుకుపోతూనే వుంటుంది. ఆ పురోగమనంలో అది నశించినాసరే, వ్యాపించినాసరే-ఒకటే లక్ష్యం, ఒకే దృష్టి.

రకరకాల స్నేహాలలో బాల్యస్నేహాలు ప్రథమంగా మమతలను సృష్టిస్తాయి. అవి సాధారణంగా ఎప్పుడూ ఉండేవి కావు. ఉద్యోగరీత్యా, కుటుంబ ధర్మరీత్యా బాల్య స్నేహితులు విడిపోక తప్పదు. అయినా ఎన్ని అగాధాలు, అంబోధులు అడ్డగించినా, మరెన్ని అవరోధాలు ఏర్పడినా బాల్యస్నేహ స్మృతులు మాత్రం ఎవరికి వారు మరిచిపోలేరు. జీవితమంతా ఆ స్మృతులు చల్లగా స్పృశిస్తుంటాయి. మానవ జీవిత దర్పణంలో అది ఒక అందమైన భంగిమ, కలకాలమూ కనిపిస్తూనే వుంటుంది.

ఆ స్నేహానికి ప్రారంభం చూచాయ మాత్రమే కాని, అనుభవం జీవిత కాలమంతా స్పష్టాస్పష్టంగా గుర్తువస్తుంది. శరీరం, మేధ, వాంఛ పెరుగుతున్నకొద్దీ సర్వమానవ సహజమైన ద్వేషాగ్నికాని, అసూయకాని రగులుకున్నా, ఆ బాల్య దశలోని స్నేహ స్మృతి మాత్రం ఎప్పటికీ వదిలిపెట్టదు.

అనుభవమూర్తి అయిన మానవుడి జీవితంలో అవి అందమైన రోజులు. పీడకలలు రాని, బాధ్యతలు అడ్డుకోని మంచిరోజులు.

చిన్న తోట. బంగారు వన్నె లేడిలా ఒక అమ్మాయి ఆ బడి వెనక ఉన్న తోటలో పరుగు పెడుతోంది. పచ్చని పాదాలకు అడ్డుపడుతున్న పరికిణీని ఒక చేత్తో పట్టుకుని అలిసి పోతూ అందకుండా పరుగెత్తుతున్న ఆ అమ్మాయి వెనక రెండు జడలు కట్టి, మిగతాది గాలికి వదిలి, పంజాబీ డ్రెస్సుతో షోకుగా మెలికలు తిరుగుతూ మరొక పిల్ల వెంబడిస్తున్నది. నీ రెండ కాంతిలో ఆకుపచ్చని ఆ పచ్చిక మీద వాళ్ళు పరిగెత్తడం చూస్తే వివిధ వర్ణ విలసితాలైన సీతాకోక చిలుకలు గుర్తు వస్తాయి.

పరిగెత్తి పరిగెత్తి కాళ్లు లాగేస్తుంటే పరికిణీఅంచు కాలికి చుట్టుకుని దభాలున ఒత్తుగా పెరిగిన . పచ్చగడ్డిమీద పడి, మూర్ఛపోయినట్టు నటించింది మొదటి అమ్మాయి. వెంబడిస్తున్న పంజాబీ వేషం పిల్ల క్షణంలో రివ్వున వచ్చి ఆ అమ్మాయిని చుట్టేసి కితకితలు పెడుతూ తనూ నవ్వడం మొదలుపెట్టింది.

మొదటి అమ్మాయి కసురుతూ లేచికూర్చుంది. జడ గంటలతో ఉన్న తన పొడవైన జడ చేత్తో సర్దుకుంటూ, "పార్వతీ! నీ అల్లరి జాస్తి అయిపోతూంది... అమ్మయ్య! అలిసిపోయాను బాబూ! ఆయాసం వస్తోంది గుండెల్లోంచి. హుష్!... ఏమిటి, నావైపలా చూస్తావు?" అంది. అలా అంటున్నప్పుడు కనుబొమలు చిత్రంగా కదిలాయి. మెల్లిగా నవ్వుతూ పెదాలు విరిచి వెక్కిరించింది. పార్వతి ఆ అమ్మాయి మాటలు లెక్కచెయ్యకుండా వెంకిగా చూస్తూనే వుంది.

'సరోజ ఎంత అందమైనది! గుండ్రని పచ్చని మొహంపైన నల్లటి మెరిసే జుత్తు, చిన్నవైనా ఆకర్షణీయమైన కళ్ళు, సామాన్యమైన ముక్కు - ప్రత్యేకించి ఏ అవయవాన్నీ చెప్పలేకపోయినా మొత్తంమీద అందగత్తే. గుండ్రిపు మొహం కావటం వల్లనేమో, నిండుగా హుందాగా కూడా ఉంటుంది. పన్నెండేళ్ళకే ఇంత అందంగా వుంది! ఆడపిల్లలు పెద్దయితే మరీ అందంగా తయారవుతారట! ఏమో!' వికసిస్తున్న పార్వతి హృదయంలో అనేక భావాలు వచ్చి చేతికి చిక్కకుండా పారిపోతున్నాయి. అరిచేతులతో వెనక్కు ఆనుకుంది. "సరూ! నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా?" అలవోకగా తల తిప్పుతూ అంది పార్వతి.

"నీ అందంకన్నానా?" అంది సరోజ ఆకాశంవైపు చూస్తూ.

"నా అందం గురించి నువ్వేం చెప్పినా, అతిశయోక్తి అంటారే మన మాస్టారు – అదే అవుతుంది." పైజమాకు అంటిన ఇసుక దులుపుకుంటూ అంది పార్వతి.

"నా అందం అతి సామాన్యమైనది, పారూ! నా లాగా, నాకన్నా తెల్లగా ఉన్నవాళ్ళున్నారు వాళ్ళందరిలో నేను కూడా కలిసిపోతాను. కాని నీకు ఒక ప్రత్యేకమైన అందం వుంది. నీతో కొన్నాళ్ళు కలిసి మెలిసి ఉన్నవాళ్ళకు ఆ సంగతి తెలుస్తుంది" అంది సరోజ సున్నితంగా.

"నువ్వెన్ని చెప్పినా సరే నేను నమ్మను." పెదాలు బిగించింది పార్వతి.

"నేను నమ్మింపుతాను, చూడు!" అంది సరోజ పిడికిలి చూపించి పట్టుదలగా.

"నన్ను నమ్మించడ మెందుకు ? నా అందంపైన ఒక వ్యాసం లాంటిది వ్రాసి మాస్టారికి చూపించు. నిన్నూ, నన్నూ బడితతో పూజిస్తారు" నవ్వుతూ అంది పార్వతి.

సరోజ, పార్వతి మాటలు వినిపించుకోకుండా చెబుతున్నది: "నీ అందం ఎట్లాంటిదంటే, పార్వతీ! తెలుపులో నలుపు కలసిన చందం."

పార్వతి అడ్డుపడింది. "అవును. నాకూ తెలుసు ఆమాత్రం. దాన్నే మనవాళ్ళు చామన ఛాయ అంటున్నారుగా ?"

"అదికాదు. ఆ ఛాయ సంగతి నాకు తెలీదూ ? నీ రంగు అలాంటిది కాదు. నాలుగు పాళ్ళ తెలుపులో ఒక

పాలు గాఢమైన నీలమేఘపు రంగు కలిసి ఉన్న ఛాయ నీది. పోలిక ఏదైనా చూపించమంటావా ? అదిగో చూడు, ఆకాశం వైపు." నవ్వుతూ పడమటి నీలాకాశం వైపు వేలుతో చూపించింది సరోజ.

తెల్లని దూదిలా పరుచుకున్న పెద్ద మబ్బులో సగానికి పైగా ఆక్రమించుకున్న నీడలాంటి నీల వర్ణపు మేఘం.

ఆశ్చరంగా చూసింది పార్వతి. "అమ్మయ్యో ! అంత అందంగా ఉంటానా నేనూ ?" దీర్ఘంతీస్తూ అంది.

"మరేమిటి ?" అంది సరోజ ఆ మాటను అందుకుని సాగదీస్తూ.

"అయ్యో ! ఆ మేఘం పారిపోతోంది. అల్లాగే ఆకాశం పైన ఉంటే ఎంత బావుండును ! నేను నల్లగా ఉంటానని వెక్కిరించే వాళ్ళ నందరినీ తెచ్చి, నా అందం ఈ మేఘంలాంటి దని చెప్పి ఉందునే !" పార్వతి హాస్యంగా కళ్ళు విప్పింది.

"అంతేకాదు. నీ కళ్ళల్లో విచిత్రమైన ఆకర్షణ కూడా వుంది. నీతో బాగా సన్నిహితంగా మెలగేవాళ్ళు ఆ కళ కనిపెడతారు."

"అయితే, ఇంతకీ నాతో కొన్నాళ్ళు కలసి తిరిగితే కానీ నా అందం సంగతి ఎవరికీ తెలియదంటావు. అంతేనా"

"అవును" అంది సరోజ.

"నన్నింత వర్ణించావు ! ఇక నువ్వెలా ఉంటావో నేను చెప్పనా ?" సరోజవైపు కంటి కొనలతో చూచింది.

సరోజ మాట్లాడకుండా పరికిణీ జాగ్రత్తగా సర్దుకుని మోకాళ్ళను చేతులతో చుట్టి కూర్చుంది.

"మీ ఇంట్లో పసుపు పువ్వులు పూసే గులాబీ చెట్టు ఉందా ?" అడిగింది పార్వతి.

"ఊఁ !"

"దానికి మొగ్గ లున్నాయా ?"

"ఆఁ !"

"సగం విడిలిన మొగ్గ ఉన్నదా అని ?"

"అబ్బబ్బ ! ఊఁ, ఉన్నట్టుంది."

"అయితే రేపు తెల్లవారుఝామున నాలుగు గంటలకి లేచి చూడు అప్పుడు దాని మిగిలిన రేకులు కూడా విచ్చుకుంటూ ఉంటాయి."

"అయితే ?" అర్థమౌతూ అవనట్టు చూసింది సరోజ.

"అప్పటి దాని అందమే నీది. ముగ్ధలా కనిపిస్తా నెఱజాణ !"

నవ్వాగలేదు సరోజకు. "చాల్లే. మాట లెక్కువవుతున్నాయి. ఈ మాటల నేర్పంతా రాబోయే పరీక్షలో ఉపయోగించు. తెలుగు మాష్టారికి అభిమానం కలుగుతుంది ముందు అటు చూడు మీ బావ చేస్తున్న ఘనకార్యం." మాట తప్పిస్తూ అంది.

ఆ అమ్మాయిలకళ్ళు ఒకసారి ఆ పరిసరాలను కలయజూశాయి.

అది బడివెనక ఉన్న చిన్న తోట. రింగ్ ఫెన్సును ఆనుకుని గోరింటమొక్కలు, ఎర్రగన్నేరుచెట్లు అక్కడక్కడా ఉన్నాయి. పడమటివైపు దట్టంగా చింతమానులు తోటమధ్యగా నుయ్యి ఒకటి ఉంది. ఆ నూతికి ఈవలివైపు తోటమాలి పూరిల్లు: ఆవలివైపు మామిడిచెట్లు. నూతికి అడ్డంగా రెండువైపులా అరటిచెట్లు బాగా పెరిగి, గెలలతో నిండుగా ఉన్నాయి. అక్కడినుండి చూస్తే బడితరగతులు - వెనకవైపువి స్పష్టంగా కనిపిస్తాయి.

కొందరు అబ్బాయిలు గడ్డిలోపడి పొర్లుతూ అల్లరి చేస్తున్నారు. మరికొందరు ఆడుకుంటూ ఉంటే, కొంతమంది ఆడపిల్లలు సినిమాకబుర్లు చెప్పుకుంటున్నారు గుంపుగా కూర్చుని.

వీ టన్నిటినీ మించి ఒక బృందం మామిడిచెట్టకింద చోటు చేసుకుంది. వా రందరిలో రాజు విరాజమానంగా వెలుగుతూ హుషా రిస్తున్నాడు. మధ్యఉన్న అబ్బాయిలు చెట్లమీదకు రాళ్ళు విసిరి పిందెలు రాల్చుకుని కొరుకు తున్నారు ఊళ్ళోసంగతు లన్నీ ఒకటితర్వాత ఒకటి ఏకరువు పెడుతూ

రాజు గబుక్కున లేచి, "క్రిందపడినవి తింటున్నార్రా? చూడండి. నేను చెట్టుకున్నవే తెంపుకోగలను" అంటూ ఒక్కఉదుటున చెట్టు ఎక్క నారంభించాడు. ఇద్దరు ముగ్గురు కొంటెపిల్లలు అతన్ని అనుసరించారు వెంటనే

"మన రాజు ఒక్కొక్క కొమ్మా ఎలా ఎక్కిపో

తున్నాడో చూశారా? ముందుముందు అలానే క్లాసులన్నీ దాటి, గొప్ప డిగ్రీ సంపాదిస్తాడు." అన్న గోపాలం మాటలకు రాఘవం తాళం వేశాడు నవ్వుతూ.

వాళ్ళ మాటలు ఆలకించిన రాజు తల ఎగరేసి మామిడిపిండెలు వాళ్ల మీదకు విసురుతూ, "ఎప్పుడో ఎందుకోయ్! ముందు ఈ లాస్ట్‌పీరియడ్ మాస్టారు పెట్టబోయే క్లాసుపరీక్ష నెగ్గితే చాలు నాకు" అన్నాడు దానితో చెట్టు కింద ఆటగా గెంతుతున్న పిల్లల్లో కలకలం బయలు దేరింది.

"ఆ మాట మరిచేపోయానురోయ్! అయితే చదువుకోవాలి కొంచెం" అంటూ క్లాసులోకి పరుగుతీశాడు ఒక అబ్బాయి.

"నా పెన్నులో సిరా అయిపోయిందని ఆఖరిక్షణంలో కోస్తాను. మీ రెవరూ దానం చెయ్యకండిరా, పుణ్యం ఉంటుంది. ఆ మాస్టారి దగ్గర ఎప్పుడూ పెన్ను ఉండదు, నయం !" మరొక డన్నాడు పెంకిగా.

"మేం వెళ్ళిపోతున్నాంరా! ఏమీ చదవలేదు. ఈ మాస్టారు మాట మాటకీ మధ్య ఒక పరీక్ష పెట్టి మా కొంప కూలుస్తున్నాడు." ఇద్దరు మట్టికొట్టుకున్న అబ్బాయిలు పరుగుతీశారు ప్రహారీగోడ రహస్యంగా గెంతడానికి. మర్నాడు తగిలే చివాట్లకు వాళ్ళు సిద్ధమే.

"అంతగా రాకపోతే ఏదో గీకిపారేస్తాలే !" అంటూ ధైర్యం చెప్పుకున్నాడు ఒక మహానుభావుడు చెట్టుకింద తీరిగ్గా కూర్చుని.

ఇంతలో తోటమాలి కర్రపట్టుకుని రావటం చూశారు పిల్లలు. గందరగోళంగా కేకలుపెడుతూ తలా ఒకవైపు పారిపోయారు. తోటమాలి వస్తూనే గుడ్లెర్రచేసి చూశాడు రాజు వంక, అంతే! కిందికొమ్మపైనుండి వరండామీదకు ఒక్క దూకు దూకాడు రాజు నరుడుకాని నరుడిలా.

"కిందపడితే బావుండును. దెబ్బలేకాకుండా, అత్తయ్య చేత తిట్లుకూడా నాలుగు తగులును!" దూరంనుండి అంతా చూస్తున్న పార్వతి అన్నది.

"ఏం? మీ బావ కేదన్నాఅయితే నీకే నష్టంకదా?" సరోజ నవ్వింది.

"అలా అన్నావంటే తంతాను నిన్ను. వాడేమైతే నాకేమిటి మధ్యన?" పార్వతి మొగం చిట్లిస్తూ అంది.

"ఏమో మరి! మీ అత్తయ్య నీ మీదే ఆశలు పెట్టుకున్నట్టు కనిపిస్తుంది నాకు. అయినా మీ బావని 'వాడు', 'వీడు' అని సంబోధించేటప్పుడు కొంచెం కంఠస్వరం తగ్గించు తల్లీ! అతనికిగాని వినిపించిందంటే దిక్కులేకుండా అయిపోతావు. ఆనక నన్ను తోడుపడలేదని నిందిస్తే లాభంలేదు" అంది సరోజ.

"చాల్లెస్తూ! మరి చెప్పకు నువ్వయితే అలా మనిషి మనిషికీ జడుస్తావేమో! నేనలా లొంగే ఘటాన్ని కాను. మొన్న మొన్న ఈ బావమహాశయుడే వెంకివెధవ లందరితో కలిసి గెంతుతూ కొళాయి గట్టుదగ్గర కాలుజారి

పడ్డాడు. ఇక చూసుకో ! మా అత్తయ్య తిట్లవర్షం దగ్గర ఏ వడగళ్ళవాన పనికొస్తుంది! సాధారణంగా బావను పల్లెత్తు మాట అనని అత్తయ్య ఆ రో జెందుకో గట్టిగా కోప్పడ్డది. అదీ ప్రేమచేతనే అనుకో ! అయినా ఆ అదను ఊరికే పోనివ్వలేదు నేను. ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పి, మరి నాలుగు తిట్టించాను. బలే గమ్మత్తుగా భరించాడులే. తేలు కుట్టిన దొంగ అంటారు, అలా."

"అయినా నేను నమ్మలేను" అంది సరోజాదేవి అంద మైన పెదాలను మరింత అందంగా ముడిచి.

"ఏమిటి ?" ఆశ్చర్యంగా అడిగింది పార్వతి.

"నీమీద పగ తీర్చుకోకుండాఉన్నాడంటే నమ్మను." పార్వతి ముఖంపైన సూర్యకిరణం పడి ఎర్రగా కనిపించింది.

"చెప్పకేం ?" అంది సరోజ చప్పున నవ్వుతూ. పార్వ తికి కూడా నవ్వు వచ్చింది.

"ఆ మర్నాడు నేను నిద్ర పోతున్నాను. అత్తయ్య లేపమంది కాబోలు. వచ్చి నా చెవ్వు గట్టిగా నులిమి, చేతి మీద కొట్టిపారిపోయాడు. అబ్బ! ఇంకా నొప్పి పెడుతూంది"- పార్వతి అంది, నవ్వులో కోపాన్ని మిళితంచేసి.

సరోజ విరగబడి నవ్వింది.

అంతలో గంట వినిపించింది ఇద్దరికీ. పార్వతి చెంగున లేచి చెయ్యిపట్టుకు పైకి లాగింది సరోజను. క్లాసులోకి పరి గెత్తారు జంటగా.

వా రిద్దరూ మరువలేనటువంటి రోజు.

౽ ౽ ౽

"నాకు అన్నం వడ్డించు, అత్తయ్యా! ఆకలితో కడుపు రామరామ అంటూంది." పార్వతి పీట వాల్చుకుని కూర్చుంది. జానకమ్మ నవ్వుకుంది. పార్వతి మాటలకు ఆవిడ కెప్పుడూ నవ్వు వస్తుంది.

"ఏమిటే! రామరామ అంటున్నదీ కడుపు? పోనీలే నువ్వు అనకపోతే అదైనా అంటూవుంది. పుణ్యం తెచ్చుకోవడానికి" అన్న దావిడ వంటిల్లు సర్దుతూ.

"నీ గమ్మత్తు నాకు తెలుసులే అత్తయ్యా! ఇలా నన్ను మాటల్లోపెట్టేసి, ఈ లోగా మీ కుమారుడుగారు రాగానే అతనికే ముందు వడ్డించెయ్యాలని చూస్తున్నావు కదూ?"

"నీ అనుమానాలు బంగారంకానూ! వాడుకూడా వస్తే నీ సొమ్మేం పోయిందీ? చెప్పు,"

"అఁహా! ఏంలేదు. నేను క్లాసులో ఫస్టు వచ్చాను కాబట్టి నాకే ముందు అన్నం పెట్టితీరాలి ఊఁ-తొందరగా!"

జానకమ్మ వడ్డిస్తూ "పారూ! వాడుగాని సున్నా చుట్టాడా ఏమిటే?" అని అడిగింది రహస్యం అడుగుతున్నట్టు. కొడుకు తెలివి తేటలమీద అపరిమితమైన విశ్వాసం ఆవిడకు.

"అదికా దత్తయ్యా!" గట్టిగా అన్నది పార్వతి. "మాష్టారు నిన్న కొన్ని ప్రశ్నలు వేశారు క్లాసులో. బావని ధృవప్రాంతంలో చలా ? వేడా ? అ నడిగితే..."

"నోరు తగ్గించు కొంచెం, మగవాడిలా అరుస్తుంది సిగ్గులేక!" అవతలిగదిలో మేడమెట్లు దిగుతూ అరిచాడు రాజు.

పార్వతికి గొంతు నెవరో నొక్కిన ట్టయింది. అప్పటికి తెలిసింది త నెంత గట్టిగా చెప్తున్నదో. మరి మాట్లాడకుండా తలవంచి అన్నం తినటంలో నిమగ్నురా లైంది.

"బాగానే వుంది!" అని నవ్వుకుంది జానకమ్మ.

"అన్నం పెట్టమ్మా!" అంటూ రుసరుసగా వచ్చాడు రాజు.

"ఇదిగో, సిద్ధంగా వుంది. నువ్వు రాకపోతే ఎవరిది తప్పు ?" అన్నది జానకమ్మ ఆదరా బాదరా వడ్డిస్తూ.

వరసగా ఒకొక్క ముద్ద ఎక్కిస్తున్న పార్వతికి వట్టి పుణ్యానికి నవ్వు వచ్చింది రాజులో కోపం రేగింది. తనను పరిహాసం చెయ్యటానికే అలా నవ్వుతున్న దనుకొన్నాడు.

క్రీగంట చూస్తూ "పాడున వ్వాకటి వచ్చు ప్రతి దానికీ" అన్నాడు

తల వంచుకుని తింటూ "నవ్వడం తప్పయితే నవ్వకు. ఆ పోజులో వుండు, ఇష్టమైనంత సేపు." అన్నది పార్వతి.

ఇంకా అర్థంలేకుండా వస్తున్న నవ్వును బుగ్గల్లోనే దాచటానికి వ్యర్థప్రయత్నం చేసి చివరకు ఆ నవ్వు కొక

కారణం సృష్టించాలనే ప్రయత్నంలో ఏదో గొణిగింది. అసలే రాజుకుంటున్న రాజు ఇక పట్టలేకపోయాడు.

"ఏమి టా సణుగుడు? - అనే దేదో తిన్నగా అను !"

"నే నేదో అనుకుంటే నీ కేమైంది?" అంది పార్వతి కళ్ళు చిట్లించి, "క్లాసులో సున్నాలైనా, మహారాజులా ఇక్కడ అధికారం చలాయిస్తాడు." అన్నది మళ్ళీ స్వరం తగ్గించి.

"జన్మానికి శివరాత్రిలా ఒక్కసారి ఫస్టు వచ్చింది కదా! ఏం గర్వంరా, భగవంతుడా!" అన్నాడు రాజు దేవుణ్ణి మధ్యవర్తిగాచేసి.

"అవును. నాకు గర్వమే. జన్మకేకాదు, పదిజన్మల కొక్కసారి శివరాత్రిచేసినా నాకు గర్వంగా వుంటుంది" పార్వతి జోరుగా అని పెదవి కొరుకుక్కుంది.

"ప్రతిసారీ ఫస్టున వచ్చే మా కెంత గర్వం ఉండాలో అలా అయితే?" నవ్వాడు హేళనగా.

"నీ కిప్పుడు కళ్ళు నెత్తికి వచ్చాయి. ఇంక ఫస్టు రావటం ఒకటి!" పార్వతి కళ్ళు జేవురించాయి.

రాజు ఉద్రిక్తుడయ్యాడు "నోర్ముయ్యి. నువ్వొక్కదానివే అయినట్టు కోతలు కోస్తున్నావు సరోజకూడా ఫస్టే."

"నువ్వు సరోజ కావుగా."

"ముందు నోరు ముయ్య మంటున్నాను!"

"నోరు ముయ్యమనటానికి నువ్వెవడివో? నాకు దిక్కులే దనుకుంటున్నావా?"

రాజు కంచంముందునుంచి చెంగున దూకాడు పార్వతి మీదికి, కట్టలు తెంచుకున్న కోపంతో. అవతలకు వెళ్ళిన జానకమ్మ అప్పుడే గదిలోకివస్తూ దృశ్యంచూసి నిర్ఘాంత పోయి, చప్పున రాజును అదిమిపట్టి అన్నంముందు కూచో బెట్టింది. పార్వతి నిర్లక్ష్యంగా ఒక్క చూపు చూసింది రాజువైపు.

"ఉండమ్మా! దీని పెంకితనం అణుస్తాను. మ నింట్లో వుండికూడా దీని కింత పొగ రెందుకో ?" అన్నాడు విసురుగా అన్నం కలుపుతూ.

జానకమ్మ వారించి "ఏమిట్రా ఆమాటలు. అదేం గతిలేక మ నింట్లో ఉం దనుకున్నావా ? నీలాంటివాళ్ళని నలుగుర్ని కొనగల ధనవంతురాలు. కదు తల్లీ ?" అన్నది పార్వ తిని సంబోధిస్తూ.

"ఎంత డబ్బుంటే ఏమిటి- తక్కువ బుద్ధి పుట్టుకతో వస్తుంది" అన్నాడు రాజు.

పార్వతికి సహజమైన కోపం ముంచుకొని వచ్చింది. కాని - జానకమ్మ ఎదురుగా అతన్నేమీ అనకూడదనే విచక్షణ అప్పు డప్పుడే వస్తున్నదికాబట్టి ఓర్చుకుంది. అయినా లోలోపల మధ్యందినసూర్యుడు మండుతున్నాడు. తన పసివాడి మనసులో ఇల్లాంటి భావా లేమిటా అని విస్తు పోయింది జానకమ్మ.

"ఏ పాపం ఎరగని పిల్లని పట్టుకు అల్లాంటిమాట లంటా

వేమిట్రా రాజూ? ఈమా రన్నావంటే ముందు నీ పళ్ళు రాలతాయి

"ఏమీా ఎరగదు పాపం! నీ నొక్కాదానికే అలా కని పిస్తుందేమో? స్కూలుకు రా తెలుస్తుంది! ప్రతి స్టూడెంటూ దీనిమాటలే చెప్పుకుంటాడు."

"దానిమాటెందుకూ మధ్య?" జానకమ్మ తెల్ల బోతూ అడిగింది.

"ఎందుకేమిటి? ఆ మగవాడివేషం చూసి, బూడిద పూసినట్టు పౌడర్లూ షోకులూ! అందరూ నవ్వుతుంటే నాకు సిగ్గేస్తుంది." చెప్పుకుపోతున్నాడు.

పార్వతికళ్ళల్లో వేడికి లోపలి శీతల జలపాతాలు ఉష్ణ జలపాతాలుగా మారిపోతున్నాయి. ఇక అణిచిపెట్టిన ఆవే శాన్ని వెలిగ్రక్కకుండా ఉండలేకపోయింది

"ఏం? నాయిష్టం! నే నెలా తయారైతే మీకేం? మీా తాతలు దిగివచ్చి చెప్పినా నేను నా యిష్టప్రకారం శృంగారించుకుంటాను" అంది తీవ్రంగా అరుస్తూ.

"ఇంకేం? - ఆ రెండు జడలూకూడా కత్తిరించేసుని మరికొంచెం షోగ్గా నడువు!" వెకిలిగా నవ్వాడు రాజు.

"నీలాంటి కోతులు వెక్కిరిస్తాయని నా కిష్టమైన వాటిని విడిచిపెడతా ననుకుంటున్నావేమో? ఎప్పటికీ అలా జరగదు." అన్నది.

అక్కడనుంచి లేచి తొందరగా గదిలోకి పోయింది.

తరవాత, రాజుకూడా అన్నం తినకుండా చాలా పారేసి చెయ్యి కడుక్కున్నాడు.

"ఏమిటో, ఈ పిల్లలు ?" అని కలికాలం మహిమను తలుచుకుని కొంతసేపు ఊరికే కూర్చుండిపోయింది జానకమ్మ. తర్వాత పని గుర్తుకువచ్చి గబగబా ఇల్లు కడిగింది. గదంతా శుభ్రం చేసుకున్నది. 'పనిమనుషులుకూడా సెలవు కాగితాలు పంపిస్తుంటే ఏం చెయ్యడం ?' అనుకుంటూ పరధ్యానంగా వున్న ఆవిడకు మేడమీద గదిలో పెద్ద గోల వినిపించేసరికి, గ్రామసింహాలకు గది అప్పగించి ఒళ్ళు తెలియకుండా పరుగెత్తింది

జానకమ్మ వెళ్ళేసరికి ఒక దృశ్యం అప్పుడే ముగిసిపోయింది. మరొక దృశ్యంలో రాజు తనని దూసుకుంటూ మెట్లమీదనుంచి పరుగెత్తడం కనిపించింది. రెండు చెంపల పైనా చేతులు కప్పుకొని ఏడుస్తున్న పార్వతి జానకమ్మను చూసి మెట్లమీద కూలబడిపోయింది.

"ఏంచేశాడే, పారూ ?" అన్న జానకమ్మకు సమాధానం దొరకలేదు. కాగా పార్వతి మోకాళ్ళలో తలదూర్చి మరింత వెక్కి వెక్కి ఏడ్చింది.

"వాణ్ణి రానియ్యి. ఇవాళ అన్నం పెడతానేమో చూడు దొంగవెధవకు! నాతల్లివికదూ! ఊరుకోఅమ్మా!" అని జానకమ్మ అనగానే పార్వతికి కొంత ఉపశమనం కలిగింది. తర్వాత బావ తన నెలో జడను ఒడిసిపట్టి చెంపలపైన

కొట్టాడో ఆ వైనమంతా తీరిగ్గా చెప్పింది, అతనికి జరగబోయే శాస్తిని కసితీరేలా ఊహించుకుంటూ.

ఇంతలో ఒక గంభీరస్వరం గదిలోకి వినిపించింది. ఆ యింటియజమాని రామనాథస్వామి గారిది. "లోపల ఏమి టా గోల ?" అన్నారు వారు నాటకం ముగిసి అరగంట కావస్తుంటే. ఆయన అలా అడిగేటంతవరకు అతి ముఖ్యమైన మనిషి ఒకరు సమీపంలోనే ఉన్నారన్న సంగతి ఆ యింట్లోవారు సామాన్యంగా మరిచిపోతూనే ఉంటారు.

రామనాథంగారి గురించి చెప్పుకోవాలంటే పెద్ద లకోటాలు దించవచ్చు. విసుగనిపిస్తే మూడు ముక్కలతో ముక్తసరిగా అనుకున్నా సరిపోతుంది.

రాఘవపూర్‌లో ప్రతి మానవ మాత్రుడికీ ఆయనెవరో తెలుసు. వ్యావహారికంలో ఆయనను లక్షాధికారి అంటూ చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా అందరూ గౌరవిస్తారు. కొందరు గౌరవం నటిస్తారు. ఏ టన్నిటినీ మించి మహానుభావులని లోకంచేత అనిపించుకునే పురుషోత్తములు కొందరు ఆయనను చుట్టి కొంగజపం చేస్తుంటారు, గుట్లు ఏమైనా దొరక్కపోతాయా అని. ముఖ్యంగా వ్యాపార జిజ్ఞాస అధికంగా ప్రబలుతున్నది కాబట్టి రామనాథంగారి వంటి అనుభవజ్ఞులు ఎన్ని అంతస్తులు ఎటువంటి పరిస్థితుల్లో ఎక్కి దిగారో, దిగి ఎక్కారో తెలుసుకోవా లనుకుంటుంది లోకం.

కాకపోతే వయసు మళ్ళుతూ, కావలిసినంత కలిగి వుండి, ఇక లోకంపోకడ ఎలావున్నా దాని ప్రమేయం తనకనవసరమన్న ధోరణిలో ప్రపంచంవైపు క్రీగంట చూసే ఆయనదగ్గరకు అనునిత్యం ఆడంబరంతో గొప్పగొప్ప నిపుణులు, కార్యనిర్వాహకులు, కోరి వస్తున్నారంటే కారణం ఏమని చెప్పుకోవాలి ? అయితే ఆయనదగ్గరకు వచ్చేవారిలో వ్యాపారసంస్థలవారు అధికం.

అదీకాక ఎవరైనా నవలా రచయితగాని, నాటక రచయితగాని దారితప్పి రామనాథంగారి దగ్గరకు వచ్చాడా అంటే అవసరానికి సరిపోయేవస్తువు సంగ్రహించుకుపోతాడు. అంటే సాహిత్యసృష్టికి కావలిసిన పరికరాలు అన్నమాట. మరేమీ లేదు. ఆయనమనస్తత్వం ఎవరికీ సరిగ్గా అంతుపట్టదు. ఒకరికి మంచి కార్యశూరుడులా కనిపిస్తే మరొకరికి విజ్ఞానఖనిలా అనిపిస్తాడు. కొందరు మహా వేదాంతి అని చెప్పుకుంటారు ఆయన్ను. మరికొందరు ఆపద్బాంధవుడిగా భావిస్తారు. ఒకొక్కరు ఆయనను కఠినుడని నిందించడం కూడా కద్దు.

ఇక అర్థంకాకపోవడం అన్నదానిలోనే ఉన్నది గమ్మత్తు. వ్యాపారసల్లాపాలు చెయ్యడానికి వచ్చిన పురుషపుంగవులకు మహావేదాంతిలా కనిపిస్తారు. తప్పి చెడీ ఎవరైనా వచ్చి వేదాంతోపన్యాసం ఇస్తుంటే, - తన గతజీవితప్రగతి, ఇప్పటి ఔన్నత్యం చెప్పుకుపోతారు. వాగ్ధాటితో. కర్మంచాలక ఎవరైనా శాస్త్రజ్ఞుడుగానీ, ఇంజనీరు

కానీ సమీపిస్తే రోగిని చూచినట్లు శల్యపరీక్ష చెయ్యటం ఒకగుణం. ఆయన కావాలని ప్రవర్తించకపోయినా ఈ భావ భేదాన్ని భరించలేసి వాళ్ళు రామనాథంగారిని కటిక హృదయుడిగా అనుకొని కొంత ప్రచారంకూడా సాగించి ఊరుకుంటారు. ఆయన మంచితనాన్ని సంపూర్ణంగా గ్రహించినవారంటూ ఏ కొద్దిమందో ఉంటారు.

అభిజ్ఞతకు అర్థం తెలిసినప్పటినుంచి పరరాష్ట్రంలోనే ఉండిపోయిన రామనాథంగారు ఒకానొకప్పుడు ఆంధ్రదేశానికి తరలిపోదామనుకున్నారు కాని ఇక్కడున్న పరపతి, పలుకుబడి అమితం. ఆ ఆలోచన ఆయనపాదాలకు బంధాలు వేసింది. రామనాథంగారి తాతగారు గొప్ప వేదాంతి అని పేరు. వారి వేదాంతగ్రంథాలు కొన్ని ఆ యింట్లో ఎక్కడో కునుకుతూనే ఉన్నాయి ప్రపితామహులు విఖ్యాతులైన వైద్య శిఖామణులట. ఇక తండ్రిగారు శాస్త్రజ్ఞానం విద్యార్థులకు బోధిస్తూ, బోధిస్తూ తన జ్ఞానాన్ని శూన్యం చేసుకున్నారు అందుచేతనే ఆయన స్వర్గస్థులయ్యేవేళకు ఆస్తి అనేది చిల్లిగవ్వకూడా మిగల్లేదు.

చివరకు వారందరూ సంపాదించి మిగిలించిన అభిఖ్యనే ఆధారంచేసుకుని చీకటిదారులవెంటా, వెన్నెల రేఖల వెంటా పయనించి పయనించి సౌఖ్యమనే ద్వారాన్ని చేరుకున్నారు రామనాథంగారు. జీవితాకాశంలో సంధ్యవాలకముందే గమ్యం చేరుకోనబట్టి సంపాదించిన సౌఖ్యద్వారంలో సంధ్యాదీపం వెలిగించి కొంత రూపు దిద్దుకో

గలిగారు. తర్వాత ఆయన పేరు మారుమోగటంలో వింత లేదు.

కార్యనిర్వహణలో నేర్పరితనంలో తాత ముత్తాతలను అధిగమించినా వారి తత్వాలుమాత్రం కొంత కొంతగా రామనాథంగారిలో మిళితమై తొంగిచూస్తాయి. అదీకాక పుట్టుకతో తెచ్చుకున్న మాటపట్టింపు గుణం ఉన్నది. గంభీరమైన ఆకృతితో వుండే ఆయనను చూసి కొందరు అసూయపడితే, కొందరు అభిమానిస్తారు. రూపంలో రాజుకూడా తండ్రిలా అందంగా తీర్చిదిద్దిన ట్టుంటాడు. కాని తండ్రిలోని ఈ సర్వగుణ సమ్మేళనాన్ని చూచి హడులుకుంటాడు. రామనాథంగారు ఒక మాట గట్టిగా అంటే చాలు, పెరట్లోనుంచి పరిగెడతాడు. తనను గురించి చెడ్డమాట ఏదైనా తల్లిగాని, పార్వతిగాని ఆయనకు చెప్పకూడదు. చెప్పారో, అయిందన్న మాటే! ఆడవాళ్ళమీద పౌరుషం చూపించడంలో ఘటికుడే రాజు.

## 2

అందమైనది అనిపించే భవనం ముందుగదిలో చక్కని ఫర్నిచర్ మధ్య ఒక సోఫాలో పక్కకు చేరగిలి చెక్కిట చెయ్యిచేర్చి దీర్ఘంగా ఆలోచిస్తున్నది ఒక

అమ్మాయి. పలచని నీలిదుస్తుల్లో నీలాంబరంలా ఒదిగివున్న ఆ అమ్మాయి పార్వతే.

కట్టిన నైలాన్ చీర చెరగు సగం సోఫాపైనుండి మోకాళ్ళమీదుగా నేలను తాకుతున్నది. ముత్యాలు పొదిగిన కుడిచేతి గాజు, ఎడమచేతికి అమర్చుకున్న డైనీవాచ్‌తో పోటీపడుతూ స్క్వేర్‌కటింగ్ బ్లౌజులో మెరుస్తున్న కొత్త రకం నెక్లెస్ పార్వతి గొప్పయింటి అమ్మాయి అని రుజువు పరుస్తూంది.

సెలవులిచ్చిన తర్వాత పదిరోజుల క్రితమే పార్వతి స్వగ్రామానికి వచ్చింది. వచ్చిందన్న మాటేగాని, ఆ పల్లెటూళ్ళో ఏమీ తోచక అవస్థపడుతూ, అస్తమానం విసుక్కుంటూ గడిపింది.

పొద్దుటే లేచి సింగారించుకుని తోటలన్నీ తిరిగి తిరిగి ఇంటికి చేరుకుంది. అలిసిపోయిన పార్వతి సోఫాలో కూర్చోగానే స్వల్పంగా జరిగిన తన జీవితానుభవాలను తలచుకోవా లనిపించింది. తర్వాత చిన్నప్పటి సంగతు లనేకం గిరగిర తిరిగాయి పార్వతి మనసులో.

ఇంతవరకూ పార్వతి మేనత్త ఊళ్ళోనే పెరిగి చదువు సాగించింది. మరొక సంవత్సరం చదివి బి. ఎ. పూర్తిచెయ్యాలని దృఢంగా నిశ్చయించుకుందికూడా. పార్వతి సహాధ్యాయిని సరోజకు డాక్టరు కావాలని ఉత్సాహం. సహజంగానే సరోజతల్లిదండ్రులు పిల్లల అభిరుచులను గ్రహించి అనుకూలంగా నడుచుకునే ఆదర్శవాదులు కాబట్టి, అభ్యంతరం

చెప్పలేదు. వెంటనే సరోజ కొత్తగా ఆ వూళ్ళో తయారవు తున్న మెడికల్ కాలేజీలో చేరి స్వాభిలాషను సాధించుకో గలిగింది ఒక విధంగా.

పార్వతికి ఇలాంటి భావా లేమీ లేవు. అందరూ చదువుతున్నారు; తనూ చదువుతున్నది. ఎవరైనా కర్మం చాలక చదవద్దూ—అన్నారంటే పళ్ళు రాలాయన్నమాటే—అంతమటుకు ఎవరూ అలా అనలేదుకాబట్టి సరిపోయింది కాని! ముఖ్యంగా పార్వతికి మూల కూర్చోవటమంటే గిట్టదు. ఏదో పని చేస్తుండాలి. అంతే. చిన్నప్పటినుండి పట్టణవాతావరణంలో పెరిగి పెద్దయిన పార్వతిలో ఆ భావం మరింత బలపడింది. తను ఆడదో, మగవాడో అన్నవిషయం ఆ పిల్ల ఎప్పుడూ పట్టించుకోలేదు. మేనత్త ఆ విషయం తెలియజేయడానికి ప్రయత్నించనూ లేదు.

పోతే, రాజుసంగతి మరొక విధం. అతను చిన్న క్లాసులు చదువుతున్నప్పుడే ఒకటి రెండుసార్లు డబుల్ ప్రమోషన్‌లతో పార్వతి, సరోజల అంతస్తు దాటి వెళ్ళి పోయాడు. రెండుసంవత్సరాల క్రితమే బి. ఎ. చదువు పూర్తిచేసి, యాభై మైళ్ళ దూరంలో ఉన్న యూనివర్సిటీకి వెళ్ళాడు. ఆ ఊళ్ళో బంధువు లెవరూ లేక, హాస్టల్లో ఉండ వలసి వచ్చింది. అతనికి ఎకనామిక్సు అభిమానపాత్రమైన సబ్జెక్టయినా, పాటించడమనేది సున్నే. బోలెడు ఖర్చుపెట్టు కొని నెలకు పదిసార్లు ఇంటికివచ్చి తల్లిని కావలించుకుంటాడు. అలా వచ్చిన రాజును చూస్తే పార్వతికి నవ్వు. అలా నడు

స్తున్నాయి. ఆ ముగ్గురి జీవితాలు మరికొందరు సహజీవుల మధ్య. కొన్నాళ్ళకు ఈ సెలయేరువంటి జీవన ప్రవాహమే ఉత్తుంగ తరంగ వాహినిగా ప్రవహిస్తుందేమో!

సోఫాలో వెనక్కువాలి గతాన్ని పర్యాలోకిస్తున్న పార్వతి ఒక్కసారి నిట్టూర్చింది. తన చిన్ననాటి స్నేహపు అమృతకలశంలో విషబిందువు పడుతుందేమోనని అనుక్షణం భయపడేటట్టు చేసిన బావ ప్రవర్తనే అర్థంకాలేదు తనకు. ఆంతర్యమేమిటో అసలు అవగతమే కాలేదు. 'ఒక్కచోట పెరగటంవల్లనే మీ ఇద్దరికీ ఒకరంటే ఒకరికి గిట్టదు'— అంటుంది సరోజ. కాని ఆ మాటను నమ్మలేకపోయింది. తను కొందరిని తెలుసుకుంది. వాళ్లు ఒక్కదగ్గరే చిన్ననాటి నుండి పెరిగినా, ఎంత ప్రేమాభిమానాలతో పెనవేసుకుని ఉన్నారు! దానికి అంతటికీ వ్యతిరేకంగావుంది తమధోరణి.

మొదట్లో బావ అంటే తనకు అసహ్యం వేసేది— అతని చేష్టలకూ, ఆ మాటలకు. 'ఇల్లాంటి పిల్లలనుకూడా తల్లిదండ్రులు అందరికంటే భిన్నంగా, ప్రత్యేకమైన ప్రేమతో ఎందుకు పెంచుతారో!' అనుకునేది. అస్తమానం అతను తనను పట్టి తిట్టి కొట్టినా సమానంగా తనూ పగ తీర్చుకునేది. రానురానూ అత్తయ్య అతనిపై ఈగ వాలనివ్వకుండా చూడటం, అతడిమీదే ఆశలన్నీ నిలుపుకున్నా నన్నట్టు మాట్లాడటమూ గమనించాక తను బావ నేమీ అనలేక పోయేది. అప్పటినుంచి అతని అభిమానంకోసం పాకులాడింది కూడా. అయినా తన ప్రయత్నం సాఫల్యాన్ని పొందక

పోవడం సరిగదా, మరెన్నో తన్నులూ, తిట్లూ నిరభ్యంతరంగా లభించాయి. అక్కడితో అతనంటే తనకు ఒకరకమైన నిర్లక్ష్యం ఏర్పడిపోయింది. చిరాకుపడుతున్నట్లు అతని మాటలేవీ వినిపించుకోకుండా ఊరుకుని అక్కడినుంచి లేచి వెళ్ళిపోయేది. తన భావం అర్థంచేసుకున్న ట్టున్నాడు. సూటీపోటీగా ఏవో అనేవాడు. అవన్నీ అప్పుడు అతనిమీద అస్పష్టంగా ద్వేషాన్ని కలిగించాయి. బావ కేది ఇష్టం ఉండదో అదే చెయ్యా లనిపించేది ఎప్పుడూ.

ఒకసారి ఏం చేసిందంటే—

అప్పుడు పదమూడేళ్లు ఉంటాయేమో తనకు బావకు ఆడవాళ్ళు మగవేషంలోతయారై తే చెప్పలేనంత అసహ్యం. ఆ సంగతి తనకు తెలుసు. పనికట్టుకుని అత్తయ్యచేత ఒక ఫాంటు, షర్టు మంచివి తీయించి కుట్టించుకుంది. అవి తను వేసుకున్నప్పుడు చూడాలి—అత్తయ్య నవ్వూ, బావ ఉడికిపోవడమూను. ఇక పట్టలేక నేరుగా వచ్చి అడిగేశాడు—"ఆ బట్టలు తీస్తావా, లేకపోతే తన్ననా" అంటూ. తనైతే మొండికి శతమొండి. ఆ రోజంతా ఎన్ని దరిద్రపు తిట్లు తిట్టాడో ఆ బ్రహ్మకే తెలుసు!

తర్వాత బావప్రవర్తన అలాగేఉండేది కానీ అందరూ కాలేజి చదువులకు వెళ్లినతర్వాత కొన్ని కొన్ని మార్పులు కోరకుండానే తమలో వచ్చాయి.

ఇప్పుడు హాస్టలునుండి వస్తే తనతో లడాయి అంతగా

పెట్టుకోడు. ఏమైనా వాగ్యుద్ధాలు వస్తే, అత్తయ్య సమక్షంలోనే. ఒంటరిగా ఉంటే ఏమన్నా అనటం కూడ తక్కువ.

ఆ తీరు తనను ఆకర్షించింది. అత నేమన్నా నవ్వి ఊరుకోవాలనిపిస్తుంది. అదేదో చాలా తేలిక అయినట్లు. అయినా, బావ కెందుకో తనంటే విముఖత్వం? అది తలుచుకోగానే హృదయం జ్వలిస్తుంది అకారణంగా.

తన పట్లనే ఆ విముఖత్వం అని తెలియటానికి కూడా కారణం లేకపోలేదు. మొన్న కాలేజీకి క్రిష్టమస్ సెలవులు ఇచ్చినప్పుడు జరిగిన సంగతి—

బావ వస్తున్నాడంటే ఎందుకో ఆనంద మనిపించింది. ప్రత్యేకంగా అలంకరించుకోవాలని కోరిక పుట్టింది. ఈరోజు లాగే తయారయింది. అదేమో, ఆ రోజు వస్తూనే తగువు పెట్టుకుని మనసు విరిచాడు. ఇంతకూ ఆ తగువుకు కారణం తన అలంకరణలో నైలాన్ చీర ఒక భాగం కావడమే. తనకు నచ్చదు కనక తన ఎదురుగా అట్లాంటివి ధరించకూడ దని ఏదో ప్రపంచా న్నంతటినీ శాసిస్తున్నట్టు చెప్పాడు. అది తీసెయ్యమని ఒకటే ఏడిపించాడు. పర్యవసానంగా తన మనసు మళ్ళీ ఎదురు తిరిగింది. తన ప్రాణాలు పోయినా అతని ఇష్ట ప్రకారం ఉండనని కుండ బద్దలు కొట్టినట్టు చెప్పింది. అవును మరి! అతనికి అంత అయిష్టమైన వస్తువు తనకు ఎంతో ఇష్టం. అత నేదో అన్నాడని మానుకుంటుందా తను, పిచ్చి దానిలాగా!

ఆ సాయంత్రం జరిగిన సంఘటనే మరింత ఆశ్చర్యకరమైనది. ఆ రోజు సరోజ పుట్టినరోజని గుర్తుపెట్టుకొని ఆమెకు బర్త్‌డే గ్రీటింగ్స్ అందజేయడానికి బయలుదేరింది. హాల్లోనే సరోజపిన్నిగారు నవ్వుతూ ఎదురై, "సరోజ కోసమా ? అలా డాబామీదికి వెళ్లమ్మా!" అని చెప్పింది. వెనకనుంచి వెళ్ళి కంగారు పుట్టించెయ్యాలని చకచకా మెట్లెక్కుతున్న తను, ఆఖరిఅడుగు పడకుండానే ఆగిపోయింది. లోపలినుంచి మాటలు వినిపిస్తున్నాయి. ఆ రెండు కంఠాలు పరిచితమైనవే - అతి సన్నిహితులవి, స్నేహితులవి.

"సరూ! ఇవాళ ఎలాఉన్నావో చెప్పనా? అతులిత సౌందర్యరాసులను ఎలా వర్ణించాలో నాలాంటివాడికి తెలుస్తుందా? పదసౌందర్యాన్నంతా సమీకరించి ముత్యాల రాసుల్లా వాటిని బహూకరించడానికి నేనేం కవిని కాను కదా!" అంటున్నాడు బావ. అతనుకూడా ఒక సౌందర్యోపాసకుడై నాడన్న విషయం ఆనాటివరకు తెలియలేదు.

సరోజనవ్వు వినిపించింది. "నీలాంటి మహాకవిని నేనిప్పటివరకు చదవలేదోయ్!" అన్నది.

"నీలాగ నిరాడంబరంగా ఉండగలగడం, అందునా నీఅంత అందగత్తెలు ఇంత సాధారణంగా ఉండటం ఇంకెక్కడాచూడలేకపోయాను. అలంకరణలో ప్రాచీన హిందూ స్త్రీకి ప్రతిరూపంగా, భావాలలో నవీన భారతయువతికి ప్రతిబింబంగా ఉన్న స్త్రీలంటే, ఎవరికైనా గౌరవభావం కలుగుతుంది. నాకు మరీను. కొంద రున్నారు చూశావూ సరూ!

చర్మానికి అంగుళంమేర పౌడరు, దానికి సరిగ్గా వ్యతిరేకంగా వున్న నల్లని పెదాలకు ముదురురంగు లిప్‌స్టిక్. అంత మాత్రపు అందానికి బ్లాక్ లెస్ జాకెట్టు. అటువంటిస్త్రీని ఉదహరించాలంటే నీవంటి యువతులను అవమానించిన ట్లవుతుందేమో!"

అతని ఉద్దేశాలు అవికావోలు. ఆ మాట లన్నీ తనమీద దెబ్బతియ్యటానికే అని తెలుసుకున్నది. ఇంతలో సరోజ నవ్వు, దానితో మిళితమై బావ నవ్వు వినిపించాయి. సరోజ కంఠం వింటూ ఇక ఆగలేకపోయింది తను. తనకంటె అతనే ఎక్కువాప్తమిటె సరోజకి? అనుకుంటూ లోపలికి వెళ్ళింది.

పడకకుర్చీలో విలాసంగా వెనక్కు వాలి, తెల్లని బట్టల్లో రాజహంసలా వెలుగుతున్న సరోజా, ఆమెకు ఎదురుగా కూర్చీలో కూర్చుని కుతూహలంతో సంభాషిస్తున్న బావ దృశ్యమయ్యారు.

"పార్వతీదేవి వచ్చారు." అన్నాడు బావ అదోక విధంగా చూస్తూ.

తనను చూడగానే చటుక్కున లేచి చెయ్యిపట్టుకుని కూర్చోబెట్టింది సరోజ. లోపలికి వెళ్ళింది టీ తీసుకు రావడానికి.

ఆ రెండు నిముషాలు బావఎదుట నిశ్శబ్దంగా గడపటానికి చచ్చినంత పనైంది తనకు అతని దగ్గర నోరు విప్పిందంటే ఏవో వెంకిమాటలుతప్ప సామాన్యమైన భాష రాదు.

ఒకవేళ సరసంగా మాట్లాడ ప్రయత్నించినా విరసంగా పరిణమించి ఊరుకుంటుంది. అతనిపరిస్థితీ అదేనేమో? ఉక్కిరిబిక్కిరి అయ్యాడు సరోజ వచ్చేవరకు. నిజంగా చెప్పాలంటే మగవాడుకావడంవల్ల ధీరుడులా నిలవగలుగుతున్నాడుగాని తనంటే బావకూ భయమే, ఏ క్షణంలో తగువుకు దారి తీస్తుందో అని.

టీ సరంజామాతో పైకివచ్చిన సరోజ "ఏమిటర్రా ఇద్దరి ఆలోచన?" అన్నది.

"ఏమీ లేదు." అంటూ "ఇక వెళ్తాను!" అన్నాడు బావ.

"అప్పుడేనా రాజూ? ఇద్దరూ కలసిపోదురుగాని" అంటున్న సరోజఅభ్యర్థననుంచి తప్పించుకొని పారిపోయాడు. తను సమయానికి వెళ్ళకుండావుంటే ఇంకా కాస్సేపు అక్కడే గడుపునేమో పాపం!

తర్వాత సరోజను పరీక్షగా చూసింది తను. బావ అన్నంత నిరాడంబరత్వం కనిపించలేదు తనకు. అలంకరణ లోప మేమీ చెయ్యలేదు సరోజ. అన్నివిధాల సౌందర్యానికి మెరుగుపెట్టుకున్నట్టే తోచింది ముఖ్యవిశేష మేమంటే సరోజకూడా ఆ రోజు తెల్లని, చాలా నాజూకుగావున్న నైలాన్‌చీర కట్టుకుంది. అది చూడగానే తనకు పుట్టెడునవ్వు వచ్చింది. అభిమానులుగా హృదయమంతా ఆక్రమించుకున్నవారు, మనసునను ఇంద్రజాలికులులాగా స్వాధీనపరుచుకున్నవారూ ఏ రూపంలో కనిపించినా, ఎటువంటి స్వభావం

కలవారైనా అంతరంగం అంగీకరిస్తుంది కాబోలు! తప్పు పట్టలేనటువంటి, చెడును చూడలేనటువంటి మైకం కమ్ముకుంటుం దేమో! తన కేం తెలుసు ?...

ఏమైనాకాని, ఈపరిసరాల్లో క్షణం గడపడం కష్టమై పోతూంది. ఆ పట్టణవాతావరణంలో ఉత్తేజం ఇక్కడ లోపించి, ఈ నిషాను తట్టుకోలేక పోతున్నది

"రేపే పెట్టే గిట్టే సర్దుకునేసెయ్యాలి" అని నిశ్చయించుకున్నది పార్వతి దృఢంగా.

పార్వతికి జానకమ్మ తల్లికంటె ఎక్కువ అయింది. ఆమె ఆదరణలో, పెట్టుపోతలలో ఇన్నాళ్లు పెరిగిన పార్వతి ఒక్క క్షణంకూడా ఆమె సాన్నిధ్యంనుంచి తప్పించుకో లేదు. కానీ పార్వతికి తనమనస్సును తాను గ్రహించుకొనేటంత శక్తి రాలేదు. ఇంకా అస్పష్టమైన భావాలన్నీ సహజమైనవి అనుకుంటుంది. తనకున్న అనుభవంలో దేన్నీ స్పష్టంగా తెలుసుకోదు. ఒకరు వ్యక్తీకరించినా అర్థంచేసుకొనేటంతమాత్రపు ప్రజ్ఞా పాటవాలు లేవు. ఒకరి వైభవాన్ని, హోదాను, అధికారాన్ని చూసి అంతకంటె ఘనులు లేరనుకుంటుంది. ఒక విశిష్టతనూ, విజ్ఞానాన్నీ, నైపుణ్యాన్ని చూసి అంతకంటె పూజనీయమైందీ, గౌరవనీయమైందీ మరొకటి ఉండ దనుకొంటుంది. ఆమె ఆలోచనలపరిధుల్లో ఎప్పటి కప్పుడు జరుగుతున్నవే, తన చుట్టూ పరిభ్రమిస్తు

న్నవే ఆక్రమించుకుంటాయి. అనుభవ శూన్యతవల్ల లోక వైశాల్యాన్ని జీవన పరిమాణాన్ని, వాంఛా వైవిధ్యాన్ని గుర్తించలేదు. ఇంకా ఆ స్థితి రాలేదు. అనుభవజ్ఞురాలు కాలేదు.

## 3

పార్వతి గదిలో తిరుగుతూ హడావుడిగా బట్టలు పెట్టెలో సర్దుతున్నది. ఆమెకు ప్రాణప్రదమైన బట్టలు పెట్టెలో ఉచితాసనాధిష్టులులాగా భద్రపరచబడుతుంటే, అప్రియమైనవి కింద గుట్టలుగా పడి, అభాగ్యుల్లాగ తృణీకారం సహించలేక నలిగిపోతున్నాయి. గోడనున్న గడియారం పది గంటలు కొట్టి ఆగింది. పార్వతి చీరమడతలు నలిగిపోకుండా పెట్టి, టాయిలెట్ సామాను చిన్న సూట్‌కేసులో సర్దుతూ వుంది. ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలబండిలో వెళ్ళిపోవాలని ప్రయత్నం. ఆ తొందరలో అక్కగారి రాకను గమనించలేదు పార్వతి.

ఆమె అక్క సరస్వతి ముఖంలో సౌమ్యతతప్ప మరొకటి కనిపించదు. సహజంగా పచ్చగా వుండి సౌందర్యవతిగా చెప్పబడే సరస్వతిని వైధవ్యం వరించింది. ముఖవైఖరివలన అతి అమాయకురాలిగాను, బేలగాను కనిపిస్తున్నా, మంచి

ధైర్య స్థయిర్యాలుగల స్త్రీ సరస్వతి. అందుచేతనే ఆమె దుఃఖాన్ని ఇతరులెవ్వరూ ఎప్పుడూ చూడలేదు. పార్వతి అంటే ఆమెకు ప్రాణం. అది వ్యక్తం చెయ్యాలనికాని, ప్రదర్శించాలకాని తాపత్రయ పడదు. చెల్లెలి శ్రేయస్సును మూగగా మనసులోనే కోరుకుంటుంది. పాతిక సంవత్సరాలైనా నిండని సరస్వతి పార్వతిపట్ల మాతృత్వం నెరపాలని కోరుతుంది. అటువంటి అక్కనుగురించి పార్వతిమాత్రం ఎప్పుడూ మనస్ఫూర్తిగా ఆలోచించలేదు. తనంటే అక్కకు చాలా ఇష్టం అనుకుంటుంది. ఆ అనుకోవడమైనా సరస్వతితో మనసారా మాట్లాడుతున్నప్పుడు మాత్రమే.

"పారూ! నాన్నగారు నిన్ను పిలుస్తున్నారు ఎందుకో వెళ్ళమ్మా!" అన్నది సరస్వతి మృదువుగా.

"అక్కా! వెళ్ళేటప్పుడు ఆ చీర కట్టుకుంటాను - అదిగో, అక్కడ. దానిమీదకు ఈ బ్లౌజు బావుంటుందా?" చీరనూ జాకెట్టునూ చూపిస్తూ సరస్వతి మొఖంలోకి చూచింది పార్వతి.

సరస్వతి పెట్టెలోని బట్టలన్నీ చేత్తో కదిపి చూసి "ఈ ఆకుపచ్చచీర కట్టుకుని, ఆ నల్లటిబ్లౌజు వేసుకో." అంది.

పార్వతి చిరాకుగా "అబ్బ! నీ సెలక్షనూ, కాంబినేషనూ ఇలాగే ఏడుస్తాయి. నీలాటి తెల్లవాళ్ళకు ఆ ముదురు రంగులు, ముతకచీరెలూ అమురుతాయి. అలాటివి నాలాటి నల్ల మొద్దులు కట్టుకుంటే అసలు మనుషులం కనిపిం

చనే కనిపించం" అంది, తనకు నచ్చిన చీర ఇవతల పడేస్తూ.

సరస్వతి బాధపడింది. చెల్లెలు తననుతాను కించపరుచుకున్నా కష్టమనిపిస్తుంది ఆమెకు.

"నీకేమే? బంగారంలా వుంటావు. ఎటొచ్చీ మీ బావ ఆ నైలాన్ చీరెలూ, సిల్కు-మిల్కు-లూ అంటే ఇష్టపడడుకదా అని చెప్పాను. ఎందుకు కట్టడం అవి?" సరస్వతి రాజు స్వభావాన్నికూడా కనిపెట్టింది! ఈసారి నిజంగానే కోపం వచ్చింది పార్వతికి.

"నేనూ వేరుగా మనిషినే! అది తెలుసా? నాభావాలు నావి. బావకు కష్టమైనా నష్టమైనా నా కెందుకు? - నువ్వూ సరోజ ఒక్క-లాగే బోధిస్తారు." అన్నది ముఖం చిట్లిస్తూ.

"అదికాదే. ఊఁ సరే, పోనీ - నాన్నగా రెందుకో పిలుస్తున్నారు వేగంగా వెళ్ళు" అంటూ సరస్వతి వంటింట్లోకి వెళ్ళి పోయింది, వంటమనిషి పిలుస్తున్నదని.

పార్వతి సామానులన్నీ అలా వదిలేసి హాలులోకి వెళ్ళింది. అక్క-డ అంతా నిశ్శబ్దంగా వుంది. పిథివసారాలో కూర్చున్న తండ్రిదగ్గరకు నడిచింది.

ఆయన చుట్ట నోట్లో కాలుతూవుండగా వాలు కుర్చీలో చేరగిలి తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

పార్వతి తండ్రి నరసింహమూర్తిగారి వ్యక్తిత్వం గొప్పదని ఎక్క-డకాకపోయినా ఆ పల్లెటూళ్ళోమాత్రం చెప్పుకుంటారు. కండబలం, తెలివి తేటలు వున్నంతమాత్రాన

మనిషిని అందరూ గౌరవంచేయరు. వ్యక్తిగతమైన జీవితం లోకి కాస్తయినా తొంగిచూడక మానదు లోకం. ప్రవర్తన కూడా నిర్వ్యాజమైన దైతే ప్రతివారూ పూజ్యభావం ప్రకటిస్తారు. ఎవరికివారే అటువంటి వ్యక్తిత్వమున్నవారి సాన్నిహిత్యం కోరతారు.

అన్నిటా సమర్థు లనిపించుకున్నారు నరసింహమూర్తి గారు. తరతరాలుగా వచ్చిన కరణీకాన్ని చేపట్టి, పల్లెటూళ్ళో ప్రతిఒక్కరి అభిమానాన్నీ సంపాదించుకొన్నా రాయన. తాత ముత్తాతలు వదలివెళ్లిన ఆస్తిపాస్తులకు ఈ పలుకుబడి తోడుపడి, మరింత మెరుగుపెట్టింది. ఆ ఊరు విడిచిపెట్టడం ఇష్టంలేని నరసింహమూర్తి గారికి అక్కడే అన్నిహంగులూ ఏర్పడ్డాయి.

అందరిచేతా గౌరవనీయులు అనిపించుకున్నా, వారి జీవితంలో మాత్రం కొన్ని లోటుపాట్లు, అసంతృప్తి తప్పలేదు. పార్వతిని కన్నతర్వాత కొన్నాళ్ళకు ఆయనభార్య పరలోకగతురాలైంది. అప్పటినుంచి ఆయనస్వభావంలో మార్పు వచ్చింది. మునుపు, ఆమె బతికిఉన్నరోజుల్లో ఆయనవదనంలో ఎప్పుడూ కొత్తకళలు కనిపించేవని ఎరిగినవా రంటారు. అటు తర్వాత ముభావం, గాంభీర్యంమాత్రమే ముఖంలో మిగిలినా, తన బిడ్డలను గాఢమైన వాత్సల్యంతో ప్రాణపదంగా చూచుకొనేవారు. నరసింహమూర్తిగారికి వయసు పైబడుతున్న కొద్దీ మానవజీవితం చాలా చిత్రంగా కనిపించేది. దీని నంత

టినీ నడుపుతున్న విశ్వశక్తిని అంతరంగంలోనే ఆరాధించే వారు. క్రమేణా ఆ దృష్టిలో ఆయనను అమితంగా ఆకర్షించినదీ, సాక్షాత్కరించిన మాతృదేవిగా తోచినదీ దుర్గామాతే. సర్వసృష్టీ ఆవిడదే అనిపించేది. హృదయంలో ఆ భక్తి పెంపువల్ల తగిన మనశ్శాంతి లభించేది. స్త్రీలను దేవీ స్వరూపాలుగా భావిస్తూ తనబిడ్డలు ముగ్గురికీ ఆ దేవిపేర్లే పెట్టుకున్నారు.

పెద్దకుమార్తె లక్ష్మి అందగత్తె. దానికితోడు అదృష్టవంతురాలుకూడా. పుట్టింటికి చాలా దూరప్రాంతంలో ఎయిర్ ఫోర్సులో పనిచేస్తున్న భర్తతో సౌఖ్యంగా జీవితం గడుపుతున్నది. తండ్రికోసం ఆందోళన చెందుతూ, నిరంతరం ఉత్తరాలు వ్రాయడమే ఆమెకు మరో వ్యాసంగం.

సుఖప్రదమైన ఆవిడ జీవితంగురించి ఆలోచన లేకపోయినా, సరస్వతిజీవితం అధ్వాన్నమైపోయినందుకే అదోకరకం వ్యాకులత పట్టుకున్నది నరసింహమూర్తిగారికి. తనబిడ్డలు అదృష్టవంతులని భావిస్తూ మురిసే ఆయనకు అదోక గర్వభంగం అనిపించింది. సరస్వతిభర్త కారుప్రమాదంలో చనిపోయాడనే అశనిపాతంలాంటి వార్త రాగానే ఆయన నవనాడులూ జీవశక్తిని కోల్పోయాయి. సరస్వతైనా కొన్నాళ్ళు ఏడ్చి ఊరుకొన్నదేమోకాని, ఆయనమనసు స్థిమితపడలేదు. తర్వాత కుమార్తెముఖంలో ధైర్యమూ, ఆనందమూ కనిపించినప్పుడంతా మరింత కుమిలిపోసాగాడు. కానీ, సరస్వతి, గుండెదిటవుతో జీవితాన్ని తండ్రిసేవలో

గడిపి, తర్వాత ఏమైనా అయిపోవచ్చు ననే నిశ్చయానికి వచ్చింది. ఆ అభిప్రాయం కలగ్గానే ఆమెకు ధైర్యం కలిగింది. దుఃఖం చాలావరకు దూరమై రోజులు దీర్ఘమైన వనిపించ లేదు. చివరిఅమ్మాయి ఆ పిల్ల పొత్తిళ్ళలోవుండి తల్లిని కోల్పోయిన సమయంలో అన్నగారిఊరికి భర్తతోసహా వచ్చిన జానకమ్మ పార్వతిని తన బాధ్యతలోకి తీసుకుంది. భార్యావియోగవేదన ఇంకాఆరని నరసింహామూర్తిగారికి ఇది ఇంకొకబాధను రగుల్కొలిపింది. క్షణక్షణమూ ఎదురు తిరిగే మనసుతోనే ఉత్తమోత్తమాలు ఆలోచించాడు. ఏమైనా అనుభవంగల స్త్రీ అండలోనే పార్వతి చక్కగా పెరగగలదని తోచింది.

జానకమ్మభర్త రామనాథంగారుకూడా సాలోచనగా నరసింహామూర్తిగారివైపు చూస్తూ, దేవుడు ఆటఆడించక పోతే. విధిలిఖితం తిన్నగావుంటే పార్వతిని తన కోడలుగా చేసుకోవడానికి అన్నివిధాల ప్రయత్నిస్తా నంటూ చేతిలో చెయ్యివేసి చెప్పారు, ఆత్మీయులైనా ప్రేమ వాత్సల్యాలు సమధికంగా చూపించినప్పుడు హృదయం పొందే స్పందన, ఆనందం వర్ణనాతీతం అటువంటి నిష్కల్మషమూ, కళంక రహితమూ అయిన బంధుప్రేమనూ, ఓదార్పునూ పొందు తున్నప్పుడు నరసింహామూర్తిగారుకూడా విచలితమైన తను వును అదుపులోకి తెచ్చుకోగలిగారు. నిర్మలమైన అంతఃకర ణతో మనిషి ఏ కోరికనైనా భగవంతుడినే కోరనక్కరలేదు.

మనసునుకోరినా అది నెరవేరుతుందట. ఈ నిర్ణయం విని, తప్పకుండా జరుగుతుందన్నారు నరసింహామూర్తిగారు.

ముగ్గురు బిడ్డలలోను సరస్వతికోసం ఆయన పడే ఆవేదన ఇంతా అంతా కాదు. ఎప్పుడూ ఆ ఆలోచనలలో ఉంటూ బంధువులతోనైనా, స్నేహితులతోనైనా విధవా వివాహాలను గురించి ప్రసంగిస్తా రాయన. వితంతువుల పునర్వివాహాలను సమర్థించేగ్రంథాలు ఎన్నో తెప్పించి చదివారు. మనసులో తను ఆ విధానాలను ఆచరణలో పెట్టాలని కోరిక పుడుతున్నా, తానై బంధువులను అడగటానికి సాహసం కలగలేదు అతులిత భాగ్య భోగాలతో, మహా గౌరవంతో ఇంతవరకు గడిచిన జీవితం అపవాదం, అనామకం అయిపోతుందేమో, కీర్తిలత లన్నీ సడలిపోతాయేమో నని భయం కలిగింది. ఎప్పుడూ అయనలో కలిగేది ఈ భావ సంచలనమే. అందుచేతనే వయసు సంధ్యవాలుతున్న సమయంలో కన్నులు అరమోడ్పుచేసి, కర్తవ్యమేమిటో అని అంతులేకుండా అన్వేషిస్తుంటా రాయన.

తండ్రి పెదవులమధ్య కాలుతున్న లంకపుగాకుచుట్టను తమాషాగా చూస్తూ "నాన్నా, పిలిచావా?" అని మేలో కలిపింది పార్వతి. ఆయన ఉలిక్కిపడి కళ్ళు తెరచి నోట్లోనుండి చుట్టను పైకితీసి నుసిరాలుస్తూ, "అలా కూర్చో అమ్మా!" అన్నాడు

కొంతసే పయ్యాక "ఇవాళ వెళ్తున్నావటకదూ?" అని అడిగాడు పార్వతివంక చూచి.

"నిన్న చెప్పానుకదు నాన్నా? మరిచిపోయావా ?" అన్నది, అయనవైపు విచిత్రంగా చూస్తూ పార్వతి. తండ్రిని 'నువ్వు' అనడమే అలవాటు.

"ఆఁ అదే! అసలుసంగ తేమిటంటే-మీ మామయ్య ఉత్తరం వ్రాశాడు..."

పార్వతి ఎగిరిపడింది. "ఏమిటి నాన్నా. ఏ ఉత్తరా లొచ్చినా నా చేతి కివ్వవూ?"

"నన్ను చెప్పనియ్యవే అమ్మాయి! అందులో మామయ్య వ్రాసినవిషయం - ఇంకొక రెండు మూడు నెలల్లో రాజుకి పెళ్ళి చేసెయ్యాలని నిశ్చయించుకున్నాడట. నీతో ఆ సంగతి మాట్లాడమని వ్రాశాడు. బావని పెళ్ళాడటం నీ కిష్టమేకదూ ?"

తండ్రి అలా సూటిగా అడగగానే సిగ్గుమాట అటుంచి, చిరుకోపం వచ్చింది పార్వతికి.

"ఆ విషయం నాతోనే చెప్పాలేమిటి? అక్కయ్యతో చెప్పకూడదూ ?" అని రుసరుసలాడుతూ లోపలికి వెళ్ళిపోయింది.

"పిచ్చి మొద్దు !" అనుకుంటూ తృప్తిగా నవ్వుకున్నా రాయన.

# 4

పార్వతి రైల్లో కూర్చుంది. గబగబా తన చుట్టూ సామాను పెట్టేసుకుని హాయిగా కిటికీలో తల ఆనించి బయటికి చూడసాగింది. బండి మెల్లగా కదిలింది. దూరంగా వెళ్లిపోతున్న తండ్రిని చూస్తుంటే బాధ అనిపించింది. 'ఇంత ఎండలో ఎందుకు రావాలి వద్దంటుంటే ?" అని తండ్రిపైన విసుక్కుంది మనసులో.

జోరుగా ముందుకు పరిగెడుతున్నది రైలు. వేసవి కావడంవల్ల వేడిగాలి కొడుతున్నా, చుట్టూ ఆకుపచ్చగా కనిపిస్తున్న చెట్లనూ, దూరంగా చెదిరిన నీలపురంగులో గోచరిస్తున్న కొండలనూ, చూస్తుంటే దాహం తీరినట్టుగా వుంది సెకండ్ క్లాసు కంపార్టుమెంటు కావడాన ఎక్కువమంది జనం లేరు. ఉన్న వాళ్ళలో నిద్రపోతున్న వారే ఎక్కువ. బండి ఆగకుండా పరుగెడుతున్నది. మధ్యాహ్నంవేళ నిశ్శబ్దత ఆ కంపార్ట్ మెంటును వదల్లేదు.

పార్వతి పక్కకుతిరిగి చూసింది. ఒక చిన్న అబ్బాయి అల్లరిచేస్తే తల్లి లేచి మంచినీళ్ళు ఇచ్చి అరటిపండు చేతి కందిచ్చింది. పార్వతికి ఎడమచేతివైపు అడ్డంగా వున్న మరొక సీటులో ఒకామె కూర్చుని వుంది. నీలంచీర కట్టుకున్న ఆవిడ చేతిలో రవీంద్ర కవీంద్రుడి బొమ్మవున్న ఏదో పుస్తకం. ఆ పుస్తకాన్ని ఒళ్ళో పెట్టుకుని, దగ్గరగావున్న తల్లీ పిల్లలను

దీక్షగా చూస్తున్న ఆ యువతి పార్వతివైపు చూసింది. చటుక్కున ఇటుతిరిగి - స్టేషన్‌గాని వచ్చిం దనుకుందేమో! కాని తనవైపు చూస్తున్న పార్వతి కంటబడింది. ఆమెకు పట్టుబడి పోయినట్టుగా ఉలిక్కిపడిన పార్వతి మళ్ళీ దృష్టిని పరిభ్రమిస్తున్న చెట్టు పుట్టల మీదికి మళ్ళించింది. భయం వేసింది. ఆవి డేమిటి అలా చూస్తుంది? అంత పరిశీలనగా! ముఖం అంత గంభీరంగా పెట్టకపోతే వచ్చిన ప్రమాద మేమిటో?

దూరంగా పాడుపడిన నుయ్యి. దానిచుట్టూ పెరిగిన ఎండిన గడ్డిని బక్కచిక్కిన ఆవులు పది పన్నెండు మేస్తున్నాయి. ఒక రిద్దరు మందకాపరులు - చిన్నపిల్లలు - చెట్టు కింద కూర్చుని మాట్లాడుకుంటూ చేతిలోని ఫ్లూటు తమాషాగా వూదుతున్నారు. ఆ ధ్వని వినీ వినిపించక జారి పోయింది. మరొక పాడుపడిన నుయ్యి.

పార్వతికి ఎన్నో ఆలోచనలు వస్తున్నాయి. ఇక్కడి దృశ్యాలు బాగున్నాయి అనుకుంది. అదొక పాడుపడిన నుయ్యి. ఏమి టిక్కడ ఇన్ని బావులున్నాయి? లక్ష్మక్కకు ఇల్లాంటి చోట్లంటే తగని భయం! పిచ్చి అక్క! ఏం చేస్తున్నదో? ఇలాంటప్పుడు పుస్తకాలు చదువుకుంటుం దేమో, ఇంట్లో కూర్చుని. దానికి తెలుగు బాగా వచ్చు. బావకూడా ఇంట్లో ఉండి ఉంటాడా?

బావ అంటే జ్ఞాపకం వస్తున్నది. తన పెళ్ళిగురించి నాన్న ప్రసంగం ఎత్తగానే పైకి కోపం నటించింది తను. కాని - లోపల భయంకూడా వుంది. ఈ బావకు తనను

చేసుకోవడం ఇష్ట ముండదనే తోస్తున్నది. ముఖ్యంగా దీని గురించి ఎంత రాద్ధాంతం జరుగుతుందో తలుచుకుంటే ఒళ్ళు అలసిపోతున్నది అనుభవిస్తున్నప్పుడు ఉండదుగాని, అనుభవానికి రాబోయే క్లిష్టపరిస్థితి తలుచుకుంటే మహా సంకటంగా ఉంటుంది. దే న్నయినా ఎదుర్కోవడానికి తను సిద్ధంగా ఉండాలి. లొంగిపోయిన ట్లయితే మరింత లోకువ. ప్రపంచంలో ఉన్న నాలుగురోజులూ దర్జాగా ధాటీగా బ్రతకాలి. దేవుళ్ళూ, దయ్యాలూ, వెర్రి వేదాంతాలు, ఆచారాలు అంటూ కూర్చుంటే అనుభవించవలసిన సౌఖ్యం అంతా అందినట్టే అంది జారిపోతుంది. ఒకవేళ దేవుడంటూ వుంటే చచ్చాక ఎలాగా వెళ్ళక తప్పదుకదా ఆయన దగ్గరికి? అలాంటప్పుడు ఇక్కడినుంచి దేవులాడ్డ మెందుకు? అవివేక మనిపిస్తుంది తనకు. అయినా ఉన్నారు భక్తులు - త్యాగరాజట, రామదాసు, సూరదాస్, జయదేవ్, మీరా... ఒహ్హొ! నాన్నకూడా ఒక భక్తుడే! ఏటా దుర్గకు మహోత్సవాలు జరిపిస్తాడు, ఆ రోజుల్లో ఇల్లంతా కలకల్లాడుతూ... కంట్లో నలుసుపడింది. రైలువేగంతో సరిసమానంగా పరిగెత్తుతున్న పార్వతి ఆలోచనలు ఠకీమని ఆగిపోయాయి. ఎంత ప్రయత్నించినా రాదు ఆ నలక. గింజుకుంది. పూర్తిగా ఎర్రబడింది కనుగుడ్డు. అగ్గిమీద గుగ్గిలం వేసినట్టు ఇందాక పరిశీలనగా చూసిన ఆవిడ కలకలా నవ్వింది. పార్వతికి కోపం వచ్చింది. కాని ఆవిడ పార్వతి దగ్గరకు వచ్చి పక్కనే తగులుతూ కూచుంది.

"అయ్యో! అలా నలపకండి. ఏదీ ఇటుచూడండి!" పార్వతి ఆవిడవైపు మొహంతిప్పింది. ఆమె పార్వతి కను రెప్పను వేలుతో పైకెత్తి, బుగ్గలు రెండూ పూరించి కంట్లోకి ఊదింది. నవ్వు పట్టలేక కిలకిలా నవ్వింది ఆవిడను చూస్తూ పార్వతి. ఆవిడమాత్రం "పోయిందా?" అని గాబరా పెట్టేస్తుంది. ఆ సందడిలో కంట్లోనలుసు ఎటు పోయిందో!

ఇంకా ఇద్దరూ సరిగ్గా పరిచయం కాకముందే ఒక స్టేషన్‌లో బండి ఆగింది.

"అమ్మయ్యో!" ఆవిడ చెంగున తన సీటుదగ్గరకు పరిగెత్తింది. హోల్డాలు చుట్టి, పెట్టెమీద పెట్టి, అదీ ఇదీ సరిచూసుకుని "వెళ్తానండీ!" అంటూ తన వైపు నవ్వుతూ చూసి కిందికి దిగిపోయింది. కూలీ వచ్చి సామాను దించాడు. పార్వతి ప్లాట్‌ఫారంమీదికి చూచింది. ఆమెపక్కన పొడుగ్గా, అందంగా ఉన్న ఒకాయన ఉన్నాడు. అతను నవ్వుతూ ఏదో ప్రసంగిస్తున్నాడు. గానీ, ఆమెముఖం ఉదాసీనంగా కనిపించింది. "ఏమిటో, చిత్రమైన మనిషి! అని పార్వతి అనుకున్నంతలో ట్రెయిను కదిలింది. ఆమెకూడా ఒకసారి పార్వతి ఉన్న పెట్టెవైపు చూసి, అంతలో పడమటి ఆకాశంవైపు చూపు తిప్పుకుంది. ఆ సంధ్యాసమయంలో, బండిఆవిడను అక్కడ వదలి ముందుకు పోతుంటే అవ్యక్తంగా గుండె బరువెక్కింది పార్వతికి. ఎందుకు? అని ప్రశ్నించుకుంటే సమాధానం దొరకదు. కాకపోతే రైలుస్నేహితులూ, బస్సు

స్నేహితులూ ఎలా వెళ్తున్నారో, ఎక్కడికి వెళ్తున్నారో గుర్తుపెట్టుకో గలమా?

సంధ్యచీకట్లు నలుమూలలా వ్యాపించాయి. కొద్దిగా తమోగుణాన్ని పొందుతున్న పశ్చిమాకాశంలో నీడలుగా దృశ్యమౌతున్న కొబ్బరిచెట్లు గుండ్రంగా తిరుగుతున్నాయి రైలుపరుగులో. చవుకుచెట్లు జీమూతానికిమల్లే కంటికి అలుక్కుపోతున్నాయి. అసురసంధ్య. కొందరికి అటువంటి సంధ్యఅంటే చాలాయిష్టం. చంద్రోదయం అవుతుంటే మరీను! మంచిమంచి ఊహలెన్నో కదులాడుతాయి అంతే గాక వేదాంత తర్కాదులకు సంబంధించిన మధురమైన భావన లెన్నో మెరుపులమాదిరిగా చొకళిస్తాయి. పక్కనుంచిపోయే పెద్ద చెట్లలో రామచిలుకలు హాయిగా పలుకుతున్నాయి.

అలాంటి సంధ్య అంటే పార్వతికి భయం. దిగులు పుట్టించే తలపులు వస్తాయి ఆమె మెదడులోకి. లోపలకు కళ్ళు విప్పింది. అప్పుడే లైట్లు వేశారు ఇద్దరు మగవాళ్ళు తీవ్రంగా చర్చించుకుంటున్నారు. ఇద్దరి అభిప్రాయాలకూ ఎక్కడా లంగ రందడంలేదు. ఇంకా కాస్సేటికి జుత్తూ జుత్తూ పట్టుకునేటట్లు వున్నారు. అప్రయత్నంగా మీదికి చూసిన పార్వతికి పై బెర్తుమీద ఒక యువకుడు తనవైపే చూస్తుండటం కనిపించింది. అతను పడుకుని ఉండటంవల్ల పొడవు నిర్ణయంగా తెలియకపోయినా, నల్లగా ఉన్నాడని తెలుస్తున్నది. చాలా ఒళ్ళు అతనికి. పెంకితనంగా చూస్తున్న

ట్టనిపించలేదు. రెండుసార్లటుచూసి, మరోకమూలకు చూచింది. మధ్యాహ్నం మంచినీళ్ళు త్రాగిన అబ్బాయి కదులున్న రైల్లోంచి దూరంగా కనిపిస్తున్న తెల్లటి కట్టడం వైపు చూపించి ప్రశ్నవేశాడు వాళ్ళ అమ్మను. ఆవిడ పొంగిపోయి కొడుకు బుగ్గలమీద ముద్దులు కురిపించి ఒళ్ళో కూచోబెట్టుకుంది. పార్వతికి ఆ తల్లీబిడ్డలను మరీ మరీ చూడా లనిపించింది.

"ఏమండీ! పత్రిక చదువుతారా?" పై బెర్తుమీద యువకుడు సమాధానం రాకుండానే వారపత్రికను పార్వతి సీటుమీదకి విసిరాడు. పార్వతి తడబడింది.

"ఎక్కడిదాకా వెళ్తారండీ?" అతనే అడిగాడు. ఒకసారి అతనివైపు చూసి, ఎక్కడికి వెళ్తున్నదో చెప్పి ఊరుకుంది పుస్తకం చూస్తూ పార్వతి పుస్తకం చూస్తున్నట్టు పేజీలు తిరగవేస్తూనే ఆ యువకుడి చొరవకు ఆశ్చర్యపడింది. తనకు స్కూల్లో, కాలేజీలో మగస్నేహితులు లేకపోలేదు. శేఖరమూ, శర్మ తనతో మరీ పూసుకు తిరుగుతారు వీరందరిలో స్కూలుసహాధ్యాయుడు గోపాలకృష్ణే తనకు నచ్చిన స్వభావం కలవాడు. అతను మాట్లాడుతుంటే గంటల తరబడి వినా లనిపిస్తుంది. అతనుకాని నవ్వితే ఇల్లెగిరిపోవలసిందే! పెంకిఘటమేగాని, తనబోటివాళ్ళ దగ్గర వినయంగా మాట్లాడతాడు. చిన్నప్పటినుంచి వాళ్ళతో పరిచయంవల్ల కొత్త అనిపించదు. సిగ్గు అంతకంటే వుండదు. శర్మ అక్కడెక్కడో పల్లెటూళ్ళో గుమాస్తా చేస్తున్నా

డిప్పుడు. ఎప్పుడైనా సొంత ఊరు వస్తే తనదగ్గరకు వచ్చి తిష్ఠవేస్తాడు. తను తీరికగా కూర్చుని అతనితో మాట్లాడాలి. లేకపోతే కోపగించుకొని పెద్ద రాద్ధాంతం చేస్తాడు. ఎందు చేతనో మూడు నాలుగు నెలలుగా అతను కనిపించలేదు. ఏమైనా తనకు మగవాళ్ళతో కొత్తగా పరిచయం అంటూ కాగానే వెంటనే మాట్లాడెయ్యడం చేతకాదు. ఎటువంటి వారో, ఏమో అన్న జంకు పుడుతుంది.

పార్వతి ఒకటి రెండు శీర్షికలు చదివి తిరిగి అతనికిచ్చే సింది ఆ వార పత్రిక.

## 5

"అత్తయ్యా! సరోజ ఊళ్ళోనే ఉందా? వాళ్ళ బాబాయిగారివూరికి వెళ్తానందిలే నాతో."

"వెళ్ళలేదమ్మా! మొన్ననే శుక్రవారంనాడు వచ్చి కొంతసేపు కూర్చుని వెళ్ళింది. ఉన్నంతసేపూ నిన్ను గురించే ఆపిల్ల మాటలు!"

"నాకు తెలుసు, నువ్వు నామీద లేనిపోని వెన్ని కల్పించి చెప్పిఉంటావో – 'ఆ పెంకి పార్వతి నన్నూ నా కొడుకునూ సుఖంగా బ్రతకనివ్వడం లేదమ్మా' అంటూ!" పార్వతి నటించి చెప్పబోయింది.

జానకమ్మ నవ్వుతూ "ఆఁ ఆఁ, ఈ బాధ పడ లేకుండా ఉన్నాను; వేగిరం వాళ్ళిద్దరికీ పెళ్ళిచేసెయ్యా లనుకుంటున్నాను-అనికూడా చెప్పాను." అంది.

"ఆఁ, పోదూ! అని పార్వతి ముఖం తిప్పుకుంది. జానకమ్మ అదే మంచి తరుణంగా భావించింది అభిప్రాయం తెలుసుకునేటందుకు. చేతిలోపని వదిలిపెట్టి వచ్చి, పార్వతి ప్రక్కను కూర్చుంది. పార్వతి ముంగురులు సరిచేస్తూ,

"పారూ ! బావను పెళ్ళిచేసుకోవడం నీ కిష్టమేనా ? మనసులోమాట చప్పు" అంది. పార్వతి సిగ్గుపడింది. మరు క్షణంలో తమాయించుకుని జానకమ్మగారి కళ్ళల్లోకి చూసి నవ్వుతూ, అదికా దత్తా! బావ కిష్టమో కాదో అని నా అనుమానం" అంది.

"అదంతా నే నడిగి చూసుకుంటాలే! ముందు నీ ఇష్టాయిష్టాలే కావాలి మీ మామయ్యకూడా పార్వతి కిష్ట మైతే చాలు, తక్కినదంతా జరిగిపోతుంది--అంటున్నారు;" అన్నది జానకమ్మ.

పార్వతి మరి మాట్లాడకుండా లేచి నిలుచుంది ముఖం కడుక్కొని, టీ తాగి సరోజఇంటికి బయలుదేరింది. సరోజను చూచి పదిరోజులే అయినా, కలుసుకొని ఎన్నో విశేషాలు తనివితీరా మాట్లాడుకోవా లని వుంది. వాళ్ళ ఇంటికి వెళ్ళే దారిలో ఎక్కువ చెట్లు, పచ్చిక ఉన్న స్థలంలో ఒక పార్కు వుంది. దాన్ని దాటి వెళ్ళాలి సరోజ ఇంటికి. ఎందుచేతనో పార్కుమధ్యగా పోవా లనిపించింది. ఝల్లగా

ఎర్రటి స్లిప్పరున్నతో ఉన్న కాళ్ళను ఆకుపచ్చని పచ్చికమీద ఒత్తుతూ నడుస్తున్నది. ఎడమచేతివైపు పాడుపడినట్టున్న చప్టామీద చిన్నచిన్న పాపలు ఆడుకుంటున్నారు.

పార్వతి అటువైపుచూస్తూ నడుస్తున్నది. వెనకనుంచి చప్పట్లు వినిపించి, తలతిప్పి చూసింది. వెనక మూడుగజాల దూరంలో రాజుతోసహా కూర్చునివున్న సరోజ రమ్మని పిలుస్తూంది. స్నేహితురాలిని చూసిన క్షణం పార్వతిముఖం నీలికలువలా వికసించింది. ఆత్రుతగా అటువైపు నడిచింది.

వాళ్ళను సమీపిస్తూనే, "ఏం సంగతి? ఇక్కడ విహారిస్తున్నావా? నీకోసం అష్టకష్టాలుపడి వస్తున్నాను" అంది సరోజను ఉద్దేశించి. అలా అంటూ వారికి కొంతదూరంలో సిమెంటుబెంచీని ఆనుకుని కూర్చుంది. "గొప్పపనే!" అన్నాడు రాజు పార్వతినిచూసి నవ్వి.

అస్తంగతసూర్యుడి విచిత్రవర్ణికలు ఆకాశంలో విన్యసిస్తున్నాయి. ఒకటి రెండు కిరణాలు ఆ ముగ్గురు యువతీయువకులు కూర్చున్న పచ్చని గడ్డిమీద పడి మెరుస్తూ ఉత్తేజితమైఉన్న వారిహృదయాల్లో మధురతర భావనలను మరింతగా కల్పిస్తున్నాయి. యవ్వనంలోఉన్న స్త్రీ పురుషుల భిన్న విభిన్న మానసిక పరిణామంలాగ విహాయసం క్షణ క్షణానికీ వింతరంగులు పూసుకుంటున్నది.

రాజు సరోజకు అంత సమీపంలో కూర్చొనడం పార్వతికి కష్టమనిపించడమేకాకుండా సూటిగా చూడటానికి జంకు పుట్టించింది. ఆ సమయంలో, అతనికి అంత చనువిచ్చిన

సరోజపైన కోపంకూడా వచ్చింది ఆ అమ్మాయికి. తన మనోభావాన్ని సరోజకుకళ్ళతో వ్యక్తంచెయ్యాలని ప్రయత్నించింది. కానీ సరోజ నోట్లో ఒక గడ్డిముక్క పెట్టుకొని, పరధ్యానంగా ఏదో ఆలోచిస్తున్నది. రాజు మోచేయి ఆధారంతో గడ్డి మీద ఆనుకుని. పిచ్చిమొక్కలు లాగుతూ, దూరంగా వస్తూ పోతున్న జంటలను చూస్తూ కూర్చున్నాడు. ముగ్గురిమధ్య నిశ్శబ్దత తాండవిస్తున్నది.

సరోజకు ఆలోచననుంచి చప్పున స్పృహ వచ్చింది. రాజుముఖంలోకి చూస్తూ, "అయితే నువ్వు చదువు పూర్తి చేసి ఏ ఉద్యోగం చేద్దామనుకుంటున్నావు రాజూ ?" అంది.

నులిమెత్తగా నవ్వాడు రాజు. "ఎమ్.ఎ. చదివినవాడేం చేస్తాడు ? అందుబాటులోఉన్న మంచి ఉద్యోగం లెక్చరర్. దానిలో ఆసక్తిలేనివాళ్ళు అదృష్టంమీద ఆధారపడి వెతుక్కోవాలి. తమరికేం ? ఇంకొన్నాళ్ళలో డాక్టరుమహాశయులౌతారు.

సరోజ సిగ్గుపడినట్లు అయింది. "నాకు మొదటినుంచీ ఉన్నకోరికే !" అన్నది తూర్పువైపు వినిర్గత మౌతున్న చందమామను చూస్తూ.

"మా పార్వతి పెళ్ళిచేసుకుని మూల కూర్చుంటుంది" అన్నాడు రాజు పెంకితనంగా. సరోజ నవ్వింది. పార్వతికి నవ్వురాలేదు.

"నేను ఏదోఒక ఉద్యోగం చేస్తాను. జీవితాంతం ఉద్యోగం విడిచిపెట్టను" అంది పైకి నిశ్చయించుకున్నట్టు. లోపల రాజు అంతర్గతభావాన్ని గురించి పార్వతికి సమస్య రేగిCది. తన పెళ్ళిగురించి అంత తేలికగా పైకి అంటున్నాడు కదా! అతని మనసులో ఎటువంటి అభిప్రాయం వుందో, ఏమని నిశ్చయించుకున్నాడో అని అన్యమనస్కరాలైంది అంతలో.

"సరూ! ఇంత సౌందర్యవతివి ఎప్పుడూ రకరకాల రోగులమధ్య తిరుగుతూ, నీ అందాన్ని నిరర్థకం చేసుకుంటావా? రోగులకి సుందరంగా ఏదైనా కనిపిస్తే చిరాకు కలుగుతుంది. అసలు వారికి దేన్నిచూసినా విరక్తి, వేదన, విసుగు కలుగుతుంటాయి. అది వారి దోషంకాదు, కర్మ అనుకో! అయినా అటువంటి స్థలాల్లో ప్రఫుల్లమై, నిరంతరం ఆనంద జగత్తుల్లో విహరించవలసిన నీ భవిష్యత్తు వ్యర్థం అవుతుందేమో?" అన్నాడు రాజు ఆమెకు తన ఉద్దేశం సూచిస్తూ.

సరోజ వెంటనే అన్నది "అంత సంకుచితంగా ఆలోచించలేదు రాజూ నేను. పోనీ, నేను ఒక్కదాన్నే కావాలని ఇరుకునపడుతున్నట్టయితే నువ్వు చెప్పినా ఆలోచించి వుందును వేలకొలది ఉన్నారు డాక్టర్లు. వాళ్ళ నిష్కల్మషమైన సేవను తలుచుకుంటేనే ఒళ్ళు పులకరిస్తుంది అలాంటి మానవసేవలో జీవితాన్ని గడపడం ధన్యం. నేనలా నిష్కపటంగానూ, నిష్కామంగానూ సేవ చెయ్యగలనో లేదో

కాని, డాక్టరుగా కొన్నాళ్ళయినా వుండి, ఆ సేవలోని మాధుర్యాన్ని రుచిచూడాలనిపిస్తుంది నాకు."

"నాకూ డాక్టర్లపైన గౌరవమేసరూ! నీలాంటి సుకుమార హృదయినులు అటువంటి పనులకు తట్టుకోవడం కష్టమని అన్నాను. ఓర్పు అవసరం డాక్టరు అనగానే. సహనం అనే భూషణం ఉన్నవారు డాక్టర్లయితే వాళ్ళంత పూజ్యులూ ప్రేమమయులూ మరెవరూ వుండరు ప్రపంచంలో. నాకు తెలిసి ఒకడాక్టరు ఉండేవాడు. అతను వస్తున్నాడంటే చాలు ఇక రోగికి, రోగి పరిచరులకి ప్రాణాలు లేచిరావటం అటుంచి పైపైకి పోయేవి యమదూతను చూసినట్టు అంతకంటె కఠినులు మరొకరుండరు బాబూ అనుకుంటూ రంసరూ. కొందరుడాక్టర్లు మొదట్లో మంచిగావున్నా, తర్వాత తర్వాత రోగుల విసిగింపులకూ, పిచ్చి జాడ్యాలకు అలవాటుపడిపోయి కోపగుణానికికూడా లొంగిపోతారు." అన్నాడు రాజు.

"పోనీ. ముందుగా నాకు నువ్వు బోధించడమే మంచిదయింది. సహనాన్ని నిలబెట్టుకోవడానికే ఎప్పుడూ ప్రయత్నిస్తాను. ఎంత మంచి సలహాయిచ్చావు స్నేహితుడా!" నవ్వింది సరోజ.

పార్వతి పరధ్యానంగాఉండటం చూసి, "ఏమిటో! పార్వతీదేవి ఊహాలోకాల్లో తిరుగుతూంది." అన్నది మళ్ళీ.

"మరేంకాదు నా కెప్పుడైనా ప్రాణాలమీదకి వచ్చినా ఫరవాలేదని అనుకుంటున్నాను." అంది పార్వతి నవ్వకుండానే. సరోజ పకపకా నవ్వింది.

"ఏమీ తెలియనట్టుండి చమత్కారంగా మాట్లాడ టంలో మా పార్వతి మహా నిపుణురాలు." అంది. అంతలో ఆ అమ్మాయిచేతి కేదో ముల్లుగుచ్చుకుంది. "అమ్మ మ్మో!" అంటూ పైకితీసిన చేతిని ఆత్రంగా పట్టుకున్నాడు రాజు. సరోజ తెల్లని అరచేతిమీద ఎర్రని రక్తపుచుక్క నిలిచింది.

రాజు దాన్ని తనచేత్తో తుడిచేస్తూ, "డాక్టరు ఇలాటి దెబ్బలను లెక్క చెయ్యకూడదు" అన్నాడు, సరోజచేతిని వదలకుండానే.

సరోజ అతనిచెయ్యి తొలిగించి, "అందుకే ఓర్చు కున్నాను." అన్నది పట్టింపులేకుండా.

పార్వతి అంతా చూస్తూనే వుంది. "నొప్పి పెడు తున్నదా?" అన్నది సరోజనుచూసి, "లేదు" అంటూ తల అడ్డంగా ఊపి, రాజువైపు చూసింది సరోజ.

రాజు సరోజపైపే ఏకాగ్రతతో చూస్తూ, "అబ్బ!" అన్నాడు.

"ఏం ?" అంది సరోజ.

"ఏం లేదులే–" అన్నా డతను పార్వతికి కనిపించ కుండా నాలిక కొరుక్కొని.

"కారణంలేకుండా ఉంటుందా? అలా ఎందుకన్నావో చెప్పు." సరోజ నిలదీసి అడిగింది.

"ఇది చెప్పవలసిన చోటు కాదు" అన్నాడు కళ్ళు చిన్నవిచేసి నవ్వుతూ.

పార్వతికి రాజువ్యవహారం చిరాకు తెప్పించింది. "అర్థంలేకుండా ఏమిటా సంభాషణ ?" అని మనసులో విసుక్కుంది.

"పద సరూ ! ఆరు దాటుతూంది. ఇంటి కెళ్ళిపోదాము" లేచి ఆవలిస్తూ సరోజదగ్గరకు వెళ్ళి నిలబడింది పార్వతి.

"పార్వతీ ! నువ్వు వెళ్ళు. మే మిద్దరం కొంచెం మాట్లాడుకోవాలి" అన్నాడు రాజు.

"ఉఁహూ—నేనూ పోతాను !" అంటూ సగంలేచిన సరోజను చెయ్యిపట్టి కుదేశాడు.

"ఏమిటిది ?" అంటూనే అస్తవ్యస్తంగా కూర్చుంది సరోజ ముఖం చిరాగ్గా పెట్టి.

పార్వతికి పౌరుషమూ, ఉక్రోషమూ ముంచుకొచ్చాయి. సరోజ నిలవమంటున్నా వినిపించుకోకుండా, ఎలక్ట్రిక్ లైట్ల వెలుగులో వేగంగా నడుస్తూ పార్కు దాటిపోయింది.

"చూశావా, రాజూ ! పార్వతికి కోపంవచ్చింది. చూడు, ఎంత జోరుగా వెళ్ళిపోయిందో ?"

"ఆడవాళ్ళకు కోపంరావడంలో ఆశ్చర్య మేముంది ? ఎంత అమాయకురాలైనా పెదాల్లోను, కళ్ళల్లోనే దాస్తుంది కోపాన్ని."

"నువ్వేమిటి ? ఆడవాళ్ళగురించి ఏవో ప్రత్యేక గ్రంథాలు చదువుతున్న ట్లున్నావు చూస్తే ? లేకపోతే ఇన్ని

విషయాలు ఇదివరకు మాట్లాడేవాడివి కావే! మెచ్చుకోవలసిందే? ఇంతకీ నాతో మాట్లాడతానన్న రాచకార్య మేమిటి?" అంది సరోజ.

"అదే! ఇందాక కారణ మడిగావుగా? చెబుదామని."

"ఏమిటో?" పెదాలు బిగబెడుతూ అడిగింది.

"ఇందాక నువ్వు నావైపు తీక్షణంగా చూసినప్పుడు, రాధికాక్రోధం కనిపించింది నీకళ్ళల్లో." స్నిగ్ధంగా నవ్వుతూ అన్నాడు రాజు, సరోజముఖం పరిశీలిస్తూ.

సరోజ పెద్దకళ్ళుచేసి, "ఆఁ, అందుకా? ఈమాట చెప్పడానికేనా పార్వతికి కోపంతెప్పించి, నన్ను నిలేశావు? ఘటికుడివయ్యా! ఇంకా ఉంటానా ఇక్కడ! మా అమ్మ ఎదురుచూస్తుంది." అని లేచి రెండడుగులు వేసింది సరోజ.

"సరూ! ఉండు." రాజు వెంబడించి ఆమెచెయ్యి పట్టుకున్నాడు.

"ఏమిటిది?" అంది సరోజ విసుక్కుంటూ.

"పద, సినిమాకు వెళ్దాము" సరోజను మరొకవైపు లాగాడు.

"ఆమాట ముందే చెప్పలేకపోయావా? పార్వతిని ఉండమని ఉందును, నేనురా నిప్పుడు"

"పార్వతెందుకు మనమధ్య-అని చెప్పలేదు. మాట్లాడకుండా పద" అన్నాడు రాజు.

"అయితే అంతకన్నా రాను. అదే నీకు శిక్ష"
మరింత బిగదీసుకుపోయింది సరోజ.

"సరూ! నా మీద కొంచెం అయినా అభిమాన మంటూ నీకుంటే నా మాట తోసెయ్యవు" అదోక మాదిరిగా ముఖంమార్చి అన్నాడు రాజు.

సరోజ లొంగిపోక తప్పలేదు. అసలే సున్నితమైన మనసు ఆ అమ్మాయిది. అందుచేత స్నేహితుడైన ఒక మగవాణ్ణి నిరాశపరచడం సాధ్యంకాలేదు.

"ఉఁహూ! చురుకైనఅస్త్రం ప్రయోగించావే! వెళ్దాము నడు. నీ మీద అభిమానంఉండడం నిజమేగాని, అంతకంటె ఎక్కువ అభిమానం మరికొందరిమీద నాకు వుందిసుమా!" అంది కొంటెగా చూస్తూ.

నవ్వాడు రాజు. ఆమాటకొస్తే రాజు అపురూపంగా నవ్వినా పరమసుందరంగా వుంటుంది ఆ నవ్వు. ఆ అందానికి కొంతసేపు మైమరచింది సరోజ నడుస్తూనే. ఆలోచనలు మబ్బుతెరలలాగా, మానసాకాశంలో అలుముకుంటుంటే, వెలవెలబోతున్న వెన్నెలను ఓడిస్తున్న ఎలక్ట్రిక్ దీపాల కాంతిలో నడుస్తున్నది సరోజ.

ఏమిటో రాజుప్రవర్తన కొద్దిరోజులుగా కొత్తదనంతో జోడవుతున్నది. తనంటే ఎక్కువ ఆపేక్షను ప్రదర్శిస్తున్నాడతడు. మగవాళ్లు తొందరగా బయటపడిపోతారు కాబోలు! తనకు అతనిపై అభిమాన మెక్కువకావాలని ప్రయత్నం చేస్తున్నాడా? ఎందుకని? పార్వతికి అతను కాబోయేభర్త

అని అతనికి తెలీదా? లేక పెద్దవాళ్లు అంత దృఢనిశ్చయులుగా ఉన్నారని తెలుసుకోలేదా ఇంకా? తన అందం చూసి ఇతను భ్రమపడుతున్నాడు. వట్టి వెలుగునే చూస్తున్నాడతను. ఆ వెలుగులో నీడవంటి అందంవున్న పార్వతిని గుర్తించకుండా వున్నాడు. పార్వతికి ఇతను భర్తలయితే ఇద్దరూ సరససంభాషణ చేస్తుంటే చూడాలనివుంది తనకు. వివాహానంతరం ఎటువంటివారి మనసులైనా కలిసిపోతాయంటారు. ఎందుకో పార్వతీ రాజుల మధ్య, అటువంటి సాన్నిహిత్యం, సన్నికర్ష ఏర్పడతాయని ఊహించడానికి కూడా అసాధ్యంగా వుంది తనకు, అయినా చూడాలనివుంది ఆ దాంపత్యం. బాగుంది! జీవితాలతో ఆట! అతని ఉద్దేశం తెలుసుకోవాలి. ఎలా? అంత తేలికగా లొంగేవాడు కాకపోయినా చివరకు చెప్పక ఏంచేస్తాడులే? పైగా తనంటే అంతో యింతో ప్రేమో, అభిమానమో ఉన్నవాడే!

సరోజ ఉలిక్కి-పడింది.

-"నువ్వు భూమిమీద నడుస్తున్నావని గుర్తుందా? గాలిలో తేలిపోతున్న ట్లనుకుంటున్నావా? నేను పట్టి లాగక పోతే ఆ కారుకింద పడి..."

"చచ్చివుందును. ఆ మాట అనడానికి అంత భయం దేనికి? అయినా నీలాటి అభిమానుడి పక్క-న చావడం కూడా అదృష్టమే."

"సంతోషించాలే—అదిగో, సినిమా ప్రారంభించినట్టున్నారు నేను టిక్కెట్లు తీసుకొస్తాను. ఇక్కడే నిలబడు."

"అలాగే నన్నెవరూ ఎత్తుకుపోరులే" అని చల్లని అరుగుమీద అటూ, యిటూ, మెల్లగా తిరుగుతూ నిలబడింది సరోజ. దూర దూరంగా సినిమాహాలుచుట్టూ జట్లుగా తిరుగుతున్న అబ్బాయిలు సరోజను చూడనట్టునటిస్తూనే క్రీగంట ఆమెను గుర్తిస్తూవున్నారు. రాజు టిక్కెట్టు తీసుకు నిగోసజతో కలిసి హాలులోపలికి వెళ్లిపోయాడు.

## 6

ప్రముఖ రచయిత్రి చేసిన సున్నితమైన ప్రకృతివర్ణనలా, హస్తవాసిగల చిత్రకారుడు గీసిన అందమైన వర్ణచిత్రంలాగ, మధురగాయకుడు పాడిన మంజులగానం మాదిరి ఉన్నది ఆ శుభోదయం. తూర్పువైపు కనిపించే ఆ అందమంతా భక్తులకు పరమాత్ముడి చిరునవ్వులాగా, పరమేశ్వరి లాలనలాగా అనిపిస్తుండే, భావుకులకూ, కవులకూ కవితాప్రేయసి చిరుకోపంగానూ, ప్రకృతిదేవి ప్రేమ బహుళాకృతిగానూ కనిపిస్తున్నది.

తూర్పువైపు కిటికీలోనుంచి ఆ తెల్లవారుజామున బయటికిచూచిన రాజుకు వ్యక్తావ్యక్తంగా అవే భావాలు

పుట్టాయి అంతరాంతరాల్లో. కానీ వాటిని స్పష్టంగా తెలుసుకునేటందుకు, తెలియజేసేటందుకు కవి కాడు; భక్తుడు అంతకంటే కాడు.

పూర్వాద్రిలోనుండి బాలభానుడు పైకి లేస్తున్నాడు ఆ రోజు రాజుకు చెప్పరానంత ఉల్లాసంగా ఉంది. అందుచేతనే అతను కొంతసేపైనా భూమాత అందచందాలను పరిశీలించ గలిగాడు. సర్వప్రకృతీ, సకల చరాచరాలూ అతన్ని ఆకర్షించాయి ఆ రోజు. మనిషి జీవితంలో ప్రతిదినం ఆనందపూరితం కాజాలదు. ఒక్కొక్క రోజు ఉంటుంది—అపూర్వమైనది, అనుస్మరణీయమైనది. బాహ్య ప్రపంచంలోనూ, స్వయంప్రవృత్తిలోనూ ఎన్నిమార్పులు వచ్చినా ఆంతరంగికంగా మరిచిపోలేనటువంటి రోజు లుంటాయి. చెప్పేదేమిటంటే—చెడ్డరోజైనా, మ చిరోజైనా మరుగుపడిపోకుండా జ్ఞాపకం ఉండిపోతుంది.

బాగా అలంకరణ పూర్తి చేసుకుని బయట పడబోతున్న రాజును అడుగులోనే నిలేశారు రామనాథంగారు. మహాబాగా ఇరు న పడ్డాడు రాజు.

రాజుకు వయసు పెరుగుతున్నకొద్దీ తండ్రిపైన అసదృశమైన గౌరవాభిమానాలు వృద్ధి అయినాయి కాని, చిన్ననాటి తత్వం అతన్ని వదిలిపెట్ట లేదు. తండ్రి ఎదటపడి నాలుగు మాటలు మాట్లాడటానికే అతనికి సాహసం లేదు. ఇంట్లో అవసరమైన చోట్లకూడా అతి ముభావంగా సంచరిస్తారు తండ్రి కొడుకులు. అటువంటి తండ్రి కొడుకును ఆపి సంభా

పించటానికి పూనుకున్నా, ఆ కుమారరత్నం ఒక విధాన నిలిచి నాలుగు మాటలు మాట్లాడినా కానీ విశేషమనే చెప్పాలి.

ఒకమాటు కొద్దిగా గొంతుసర్దుకుని. "నీ పెళ్ళివిషయ మోయ్!" అన్నారు రామనాథంగారు.

రాజుగొంతులో వెలక్కాయ పడినట్లయింది. అసలే అంతంతమాత్రపు సరసంలో ఇలాంటి పిడుగులాటి మాటే అఘోరించాలీ? ప్రత్యుత్తరం రాలేదు రాజునుంచి. చేసుకున్న కర్మానికి అతను వేసుకున్న హవాయ్‌జోడు సగానికి పైగా అరిగిపోయింది. నేలకు కాలు రాస్తూ ఆలోచనామగ్న మానసుడై నిలబడ్డ రాజును చూసి చూసి, రామనాథం గారు మళ్ళీ రెట్టించారు.

"నీ పెళ్ళి ఈ మూడునెలల్లోగా జరిగిపోవాలని నా ఉద్దేశం" అన్నారు తాపీగా - అగ్గిపుల్ల వెలిగించినంత తేలికగా.

రాజు మూసుకుపోయిన గొంతు కాస్త విడివడక తప్ప లేదు. ఎవరినిచేసుకోవాలి? ఎక్కడైనా సంబంధం చూశారా ఏమిటి? అనే సమస్యల మధ్యా, మరికొన్ని అనుమానాల మధ్యా సతమతమవుతూ, వాటి నన్నింటినీ కప్పిపెడుతూ, పైకి ఏదో సమాధానం చెప్పవలసిన అవసరం ఉంది. వెనక్కు వెళ్లనా, ముందుకురానా-అన్న ఈ వ్యవహారంలో మరికొన్ని భయాలుకూడా మిళితమై ఉన్నాయి.

"చదువు పూర్తయ్యాక పెళ్ళిచేసుకుంటాను నాన్న గారూ" అన్నాడు జంకుతూ.

వెంటనే రామనాథంగారు "ఇప్పుడు చదువంటావు, రేపు ఉద్యోగం రావాలంటావు. సరే. నువ్వు ఆలోచించుకో. ఇప్పటికే ఆలస్యం జరిగింది. పార్వతికి నిన్ను చేసుకోవడం అంగీకారమే" అన్నారు.

తండ్రి చెప్పిన ఆఖరివాక్యం రాజుమెదడుకు అశని పాతంలా అయింది.

'ఏమిటి? తనకు పార్వతిని ఇచ్చి, పెళ్ళి? ఇంత దృఢ నిశ్చయంతో ఉన్నారా వీళ్ళందరూ? ఎలా తలపెట్టారు ఈ పెళ్ళి? పార్వతికి, తనకు ఒక్క క్షణంకూడా పడదే! మేనరికం ఉంటే చిన్నతనంలో హాస్యమాడటం అందరి కుటుంబా ల్లోనూ ఉన్నవిషయమే. అంతమాత్రానికి, విధిగా జరిగి తీరా లని ఎక్కడుంది? పైగా పార్వతికి, తనకు మధ్య ఉన్న ద్వేషం సామాన్యమైనది కాదు. ఈ పరిస్థితిలో పార్వతిని విమర్శించక తప్పదు. అందరు యువతుల్లాంటిది కాదు పార్వతి. ఆమెకు వేరే వేషా లున్నాయి. తనకు చాలావరకు పార్వతి ఉద్దేశాలు, ఊహలు తెలుసు. అసహ్యకరంగా కని పిస్తుంది ఆమెనడత తనకు. అది ప్రేమలేకపోవడంవల్లనే కావచ్చు. ఏమైనా తమ ఇద్దరి భావాలూ రైలు పట్టాల లాగా ఎక్కడా కలియవు. ఒకవేళ కలిసినా మనోవేగంతో వస్తున్న జీవితపు శైలును దభాలున కూల్చేస్తాయి.

'ఛీ! ఆమెను చేసుకోవడం అసంభవం. ఈ విష యంలో, తండ్రి అంటే తన కెంత భయ భక్తులున్నా పిరికి వాడు కాకూడదు! చెప్పవలసింది నిర్మొగమాటంగా చెప్ప లేకపోతే ఆ తర్వాత అవస్థపడాలి. చేతులారా జీవితాన్ని దుఃఖమయం చేసుకున్న ట్టవుతుంది. తనను సరోజ అమితంగా ఆకర్షించింది. సున్నితమైన మన స్తత్వం, సహజ లావణ్యం ఉన్న స్త్రీని పొందటమే అదృష్టం. ముందుగా నా హృదయగతభావాన్ని వీళ్లకు విశదపరచాలి. ఇక్కడ వెనకడీ స్తే బతుకంతా అన్యాయం!'

"చెప్పవోయ్ రాజూ! ఏమంటావు? ఏం నిశ్చయం చేసుకున్నావు? అవతల పని ఉంది. తొందరగా తెముల్చు. తర్వాత మీ అమ్మతో ప్రస్తావిద్దాము" తొందరపడుతూ పైకి తాపీగా అడిగారు రామనాథంగారు.

"నేను పార్వతిని పెళ్లి చేసుకోలేను నాన్నగారూ! అది ఎంతమాత్రం జరగకూడదు" అన్నాడు రాజు జరగ బోయే పరిణామాన్ని ఊహిస్తూ.

"ఆఁ!" ఒక్కమారు నిర్ఘాంతపోయారు రామనాథం గారు. ఆయన ఎదురుచూసినదీ, రాజునుండి ఆశించినదీ ఆ జవాబు కాదు తన బావగారికి ఇచ్చిన వాగ్దానం ఈ నాటి వరకు మొక్కవోనిదిగానే ఉన్నదని దృఢంగా విశ్వసిస్తూ ఉన్నారు ఇప్పుడు అంతరిక్షంవరకు సాగిన తన నమ్మకాన్ని ఎవరో నిలువునా కూలదోసిన ట్లయింది.

అందుచేతనే రాజు సమాధానం విన్నంతలో రుద్రు లయ్యారు. ఆయనవంక చూశాడు రాజు. రామనాథంగారు పైకి ఆగ్రహావేశాల్తో కనిపించలేదు. కళ్లు చెప్పుకోదగినంత క్రోధం గానూ లేవు. అయితే అంతవరకు ఉపవిష్టులై ఉన్న కుర్చీని వెనక్కు ఒక్కతోపు తోసి, అంతుతోచనట్లు పచార్లు సాగించాడు. ఆయనలో జరుగుతున్న మానసిక సంఘర్షణను ఊహించాలని ప్రయత్నించినప్పుడంతా రాజు హృదయం, మెదడు అదిరిపోతూ ఉన్నాయి.

కొంసకు నిశ్శబ్దాన్ని కళంకపరుస్తూ "అయితే ఎప్పుడు ఈ నిశ్చయానికి వచ్చావు?" అన్నారు గంభీరంగా.

రాజు ఎటువంటిసమాధానం ఇవ్వాలో అప్పటికప్పుడు మెదడుకు సరఫరా చేశాడు. తను చిన్నతనంనుండి అనిర్ణయంలో ఉన్నట్టు చెబితే దాన్ని పట్టి మొండితనంకింద కొట్టిపారేయడానికి అవకాశం ఉంది. బాగా జ్ఞానోదయం అయినతర్వాత తను యుక్తాయుక్తాలను యోచించుకున్నట్టు యుక్తియుక్తంగా చెప్పాలి.

రాజు గొంతు సవరించుకుని రామనాథంగారితో అన్నాడు. "నేను కాలేజీలో చేరినతర్వాత ఆలోచించుకున్నాను, నాన్నా! సరిపడలేదు."

రామనాథంగారు రాజువైపు సూటిగా చూస్తూ, "అలా ఆలోచించుకున్నపక్షంలో నాతో వెంటనే చెప్పి ఉండవలసింది. ఇప్పుడు – పార్వతి అంగీకారం తీసుకున్న

తర్వాత – ఆ పిల్లమనసు నొప్పించడం అసంభవం" అన్నారు ఖండితంగా.

"అదికాదు, నాన్నగారూ! పార్వతికికూడా నన్ను చేసుకోవడం ఇష్టంలేదు." రాజుచెప్పిన కొత్తవిషయం విని అదిరిపడ్డారు రామనాథంగారు.

"ఎవరు చెప్పారు?" ఆతృతగా అడిగారు.

రాజు కొంచెం సంకోచించి, "నేను భావిస్తున్నాను" అన్నాడు.

రామనాథంగారు తేలికగా ఊపిరితీసుకుని, "అలా చెప్పు! ఏమో అనుకున్నాను. పార్వతి నిన్ను పెళ్ళిచేసుకోవడం తన కంగీకారమేనని మొన్ననే చెప్పింది" అన్నారు ఒకవిధమైన గాఢ విశ్వాసంతో మాట పూర్తిచేసి.

రాజుస్థితిమాత్రం మిన్నువిరిగి మీదపడినట్లు అయింది. 'పార్వతి తనను పెళ్ళిచేసుకోవడానికి ఎలా ఒప్పుకున్నది? అలా ఎప్పుడూ జరగదనుకున్నాడు తను. చిత్రం! ఏమన్నా వెంకితనానికి అన్నదేమో? ఇదేదో ఖండితంగా పార్వతి ఎదుటే తేల్చుకోవాలి! కానీ, ఆమెలో పట్టుదలను మరింత రేకెత్తించినట్టు కాదుకదా?

రాజు ఆలోచిస్తున్నంతలో జానకమ్మ అక్కడికి మెల్లగా వచ్చింది. ఆమెను చూస్తూ రామనాథంగారు ఇక ఆగలేకపోయారు "నీ కొడుకు పార్వతిని చేసుకో నంటు న్నాడు ఇప్పుడు అలా కాదంటే వల్లగాదు ఈ పెళ్ళి జరిగి తీరాలి!"

ఆయన ఆ వేగపుమాటలు సరిగ్గా అర్థం కాలేదు. "ఏమిట్రా?" జానకమ్మ కొడుకువైపు ప్రశాంతంగా చూచింది.

"పార్వతిని చేసుకోవటం నాకు ఇష్టంలేదమ్మా! దాన్ని పెళ్ళి చేసుకుని నేను సుఖపడలేను" అన్నాడు. తల్లి రాగానే రాజు హృదయం కుదుటపడింది కొంతవరకు.

అతనిమాట పూర్తికాకుండానే రామనాథంగారు విరుచుపడ్డారు. "అహఁ! సుఖపడలేనివాడివి నా కా మాట ముందరే చెప్పావుకావేం? ఇప్పుడు నేనందరిమధ్యా చెడ్డవాణ్ణి కావాలి! మాట తప్పినవాణ్ణి కావాలి! స్వయంగా బావగారికి వాగ్దానంచేసినవాణ్ణి - పోనీ, అదేదో సర్దుకుపోదా మనుకున్నా - పార్వతిపగ్గర ఒప్పించుకుని, ఇప్పుడు అమాంతంగా అన్యాయం చెయ్యనా? ఎన్నటికీ జరగదు. ఆ పిల్లని నేను నొప్పించలేను. ఈ పెళ్లి జరిగితీరుతుంది" అంటూనే రాజువైపు తిరిగి, "నీ కిష్టంలేదని దాన్ని బెదరించి ఈ పెళ్లి చెడగొట్టబోగలవు! నీ వెన్నిప్రయత్నాలు చేసినా లాభంలేదు" అన్నారు తీవ్ర కంఠస్వరంతో.

"వీల్లేదు, నాన్నా! మీరు నిర్బంధిస్తే నేను పెళ్ళే మానుకుంటాను. వాగ్దానాలు చెడతాయనే మీ రింతగా బాధపడుతున్నారు. ఇకఇష్టంలేనిపెళ్లి చేసుకుని జీవితపర్యంతం నే నెంత ఆవేదన పడాలో ఆలోచించారుకారు!" అన్నాడు రాజు గంభీరమైన ముఖకవళికలతో.

తండ్రీకొడుకుల సంభాషణ వింటూ దిగ్భ్రాంతితో

మాటరాక నిర్విణ్ణురాలై ఉండిపోయింది జానకమ్మ. ఉద్రేకంతో రామనాథంగారి శరీరం చెమటలు పట్టింది.

"ఏమైనా పార్వతిని వివాహం చేసుకునేపక్షంలో ఇక్కడ నిన్ను ఉండనిస్తాను, ఈ ఇంట్లో. అలా కాకపోతే మళ్ళీ ఈ గడప తొక్కకు. ఈ ఊళ్ళోకే రావద్దు ఏ అడవుల్లోకో పో. కావలిస్తే ఈ ఖజానా అంతా మోసుకుపోయి ఎక్కడ సుఖపడతావో పడు. మా కళ్ళకుమాత్రం మళ్ళీ పడకు. ఒకవేళ నువ్వొచ్చినా నీ తల్లినిగాని, తండ్రినిగాని చూడలేవు ఇక ఆలోచించుకో. చెప్పవలసింది చెప్పాను."

జానకమ్మ నిర్ఘాంతపోతూ, "అదేమిటండీ!" అంటూ ఉండగానే కంపిస్తూ గబగబా వీధిలోకి నడిచి ఎటో వెళ్ళిపోయారు రామనాథంగారు;

రాజుకుమాత్రం తండ్రి చివర అన్నమాటలు కేవలం బెదిరింపులుగా తోచాయి. కానీ ఆయన మాటల్లోని నిశ్చితత్వం భయపెట్టకపోలేదు. కోపంతో, వాడిన వదనంతో తన గదిలోకి పోయాడు. జానకమ్మ కొడుకును అనుసరించింది.

"రాజూ! పార్వతిని పెళ్లిచేసుకుంటే ఏమయిందిరా? అందం వుంది; చదువు వుంది. ఏమిటి లోపం!" అంది అమాయకంగా.

రాజుకు మండింది. "ఆహా! ఆ మొహం అందాన్ని నువ్వే వర్ణించాలి! లేకపోతే నన్నొక గుడ్డివాడికింద జమకట్టి, నాకీ ప్రపంచంలో ప్రతివస్తువూ వర్ణవిభేదం లేకుండా కనిపిస్తుం దనుకుంటున్నావా?" అన్నాడు. ఆ మాటలు

రాజుహృదయంలో మండుతున్న దావాగ్నినుండి చెదిరిన అగ్నికణాలు.

"ఏమిట్రా ?" అన్నది జానకమ్మ ఈసారి అయోమయంగా. కాకపోతే ఏమిటమ్మా ! దీనికి అంతటికీ మూలం నువ్వా. నాన్నగారికి తెలియకపోతే నీకు తెలియదూ ? ఆయన ఈ ప్రసక్తి తెచ్చినప్పుడు నాకూ, పార్వతికీ పెళ్లి కుదరదని చెప్పలేకపోయావా ? చూస్తున్నావుగా, మా సఖ్యత! ఈ విధంగానే దాంపత్యజీవితంలో జరిగితే ఇక మా ప్రాణాలకు సుఖం సున్నే. ఇప్పటికైనా నాన్నకు అర్థమయ్యేలా చెప్పు" అన్నాడు రాజు, తల్లిమీద తన కోపాన్ని దులపరించి.

7

ఆ రోజంతా రాజుకు ఆలోచనలతో గడిచిపోయింది. ఎక్కడికి వెళ్లినా, ఎవరితో సంభాషిస్తున్నా అన్నింటిమధ్యా తన జీవితసమస్యే మెదులుతున్నది. ఆ విషయానికి సంబంధించిన సంగతులే ముసురుతున్నాయి.

పార్వతిని పెళ్లిచేసుకోవడం తనకు ఎంతమాత్రం ఇష్టంలేదు. తండ్రిచూస్తే నిశ్చయంగా, దృఢంగా అంటున్నట్లున్నాడు. పైగా కావలసినంత డబ్బుతీసుకుని అడవిలోకో,

చైనాలోకో పొమ్మంటున్నాడుకూడా. తల్లిసంగతి సరే సరి! పెద్దతరహా తప్పించి, అంతా అమాయకత్వం. ఇక తనేం చెయ్యాలో, నిజానికి వాళ్ళ కెలా వ్యక్తపరచాలో, వాళ్ల నిర్ణయంవల్ల ముందు ముందు రాబోయే తన నూరేళ్ల జీవితపు అనర్థాలను ఎలా దర్పణంలోలాగా వాళ్లకు చూపించాలో అర్థం కావటంలేదు. ఇంకా పార్వతి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలని ఉంది. ఏమైనా ఆమెగనుక తనను వ్యతిరేకించి మాట్లాడబోతే ముందే బెదరగొట్టాలి.

ఆలోచనలను మథించి మథించి చివరకు ఒక నిర్ధారణకు వచ్చాడు రాజు.

అప్పుడు సాయంకాలం నాలుగుగంట లయింది. రాజు మనఃపథంలో తిరిగి తిరిగి, ఒక కొలిక్కి వచ్చేసరికి అంతవేళ అయింది. మహోత్సాహమయంగా ఉన్నది ఆ సమయం ప్రపంచానికి.

రాజు ఇంట్లోకి అడుగుపెడుతుండగానే అతనికళ్ళు పార్వతికోసం వెదుకులాడాయి.

"పార్వతి ఏదమ్మా ?" అని అడిగాడు, కాఫీ పట్టుకుని ఎదురైన తల్లిని.

"తోటలో తిరుగుతున్న ట్టుంది." అని ఆమె సమాధానం ఇచ్చింది నెమ్మదిగా. రెండుగుక్కల్లో కాఫీ తాగి పడమటివైపున ఉన్న ద్వారంలోనుంచి పెరటివైపు వెళ్లాడు రాజు.

ఎక్కువ విశాలంగా లేకపోయినా ఆ స్థలంలో పెద్ద చెట్లు గుబురుగా చుట్టూ ఉన్నాయి. మధ్యభాగంలో కంపెనీ నుండి తెప్పించిన పువ్వులతీగెలు, వేయించారు రామనాథం గారు. పువ్వులు వయ్యారంగా గాలితో సయ్యాటలాడుతున్నాయి. ఆ పూలమొక్కలుంచిన కుండీలమధ్య పార్వతి చేతులు కట్టుకుని, అన్యమనస్కంగా, ఆలోచనాధీనురాలై తిరుగుతున్నది.

రాజు ఒక్కక్షణం అజ్ఞాతంగా ఉండి పక్కనుంచి ఆమెను పరకాయించి చూశాడు.

కట్టుకున్నది ఉల్లిపొరవంటి తెల్ల చీర. ఎంత పొందికగా కట్టినా బట్టల్లో దాగకుండా లీలగా స్పష్టమౌతున్న శరీరభంగిమ. మెడలో నగ లేదు. నుదుట సన్నటి బొట్టయినా కనిపించలేదు. ఎడమచేతికి వాచీతప్ప ఇంకేమీ లేవు చేతులకు. ఏదో బొంబాయిఫాషన్‌లో జడలను పైకి కట్టింది. రాజుకు ఆమెను చూడగానే జుగుప్స కలిగింది. తన తలదన్నేవారెవరూ లేరన్నట్టు పచార్లు సాగిస్తున్న పార్వతిని చూస్తే అసహ్యం, తెలియరాని విద్వేషం అతనిలోకి చొచ్చుకువచ్చాయి. ఆమెతో ఆ సమయాన మాట్లాడాలనిపించలేదతనికి. అయినా తప్పనిసరి. ఆమెతో విషయాన్ని ఖండితంగా తేల్చుకునేవరకు మనశ్శాంతి ఉండదు.

రాజు ముందుకునడిచి తన రాకను తెలియజేస్తూ, గొంతు సవరించుకున్నట్టు దగ్గాడు.

పార్వతి అతన్ని చూసి ఆశ్చర్యపడింది మొదట. తర్వాత అతనివైపు చూసి, "ఏం బావా, ఇలా రావడం?" అన్నది నవ్వుతూ. పార్వతి మనోహరంగా నవ్వడమైతే నవ్వింది కానీ, రాజు సమ్మోహితుడు కాలేదు ఆ నవ్వుకు. తమకు ఇష్టంలేనివాళ్ళమీద అభిమానం ఎక్కడ కలిగిపోతుందోనని బెదరడంకూడా ఒక లక్షణం. ఇష్టా యిష్టాలకు వ్యతిరేకంగా పోయేది ఆ వేగం. ఆ అనుభూతికి అభిముఖుడైనట్లు రాజు కొన్నిక్షణాలు మౌనవ్రతం స్వీకరించవలసి వచ్చింది.

"ఏమిటి బావా, ఆలోచిస్తున్నావు?" ప్రశ్నార్థకంగా అతనివైపు చూసింది పార్వతి.

"నీతో ఒకవిషయం మాట్లాడాలి పార్వతీ!" అన్నాడు రాజు. పార్వతి కిలకిలా నవ్వింది. "సూటిగా చెప్పకుండా ఒకవిషయం మాట్లాడాలంటూ చెప్పాలా బావా?"

"ఇది చాలా ముఖ్యవిషయం. అందుకే నిన్ను దానికి తగిన పరిస్థితిలోకి తీసుకురావాలని అలా అన్నాను."

"అలాగా!"

"మ నిద్దరికీ పెళ్ళిచెయ్యాలని నిశ్చయించుకున్నారు మనవాళ్లు. నీకు తెలుసా పార్వతీ?" అన్నాడు రాజు అతి సామాన్యమైన సంగతి చెప్తున్నట్లు — దూరంగా పొరుగింటిలోఉన్న పొగడచెట్టువైపు చూస్తూ.

పార్వతి నవ్వును మందహాసరూపంలో వుంచలేక ప్రఫుల్లమైన ముఖంతో నవ్వుతూ, రాజుకళ్ళల్లోకి చూచింది.

ఆమెభావాలను పరిశీలించాలనే ఆత్రుతతో సరిగ్గా అప్పుడే రాజుకూడా ఆమె ముఖంలోకి చూచాడు.

ఇంకా పార్వతి ప్రఫుల్లహాసంతోనే "ఎప్పటికీ పెళ్లి చేసుకోకుండా ఉండిపోతామా బావా?" అంది ఆమె అర్థంచేసుకోలేకపోవడం రాజుకు విసుగుతెప్పించింది ఆయినా పైకి తేలలేదు.

"పెళ్ళిచేసుకునేమాట కాదు. మనిద్దరినీ భార్యాభర్తలు చెయ్యడానికి నిర్ణయం జరుగుతూంది. ఇది అనాలోచితంగా చేస్తున్న వ్యవహారం." అంటూ ఆగాడు రాజు.

పార్వతి ముఖంలో ఒక వన్నెతగ్గింది. "నీ ఉద్దేశం ఏమిటి బావా?" అంది గులాబీఆకులను వ్రేళ్లతో స్పృశిస్తూ

"వధూవరులు తమ ఇష్టాయిష్టాలు పరస్పరం తెలుసుకుని ఒప్పుకుంటేనే శ్రేయస్కరమని నేననుకుంటాను. అది ఉత్తమంకూడా" అన్నాడు రాజు.

"అవును. కొంతవరకు నిజమే!" ముక్తసరిగా అన్నది పార్వతి. చెప్పవలసిందేదో ఖండితంగా చెప్పెయ్యటానికి తహతహలాడుతున్నది రాజు అంతరం.

"ముందుగా నే నడిగినదానికి అడ్డదోవలు తిప్పకుండా తిన్నగా సమాధానం చెబుతావా పార్వతీ? ఇందులో దాగుడుమూత లాడటానికి ప్రయత్నించినా, కేవలం ఆటగా పరిగణించినా మన జీవితాలే బలి అవుతాయి. తర్వాత విచారించినా లాభం ఉండదేమో! అందుచేత ఏదీ దాచకుండా, పంతాలకు పోకుండా మనసులోవున్నమాట చెప్పు.

పార్వతి నాసాపుటాలు ఎగరేస్తూ "అయితే చెప్పవల సిందేదో చెప్పుమరి !" అంది. ఆమెది అంతా పసిపిల్ల వాటంగా ఉంది ఆ సమయంలో.

"నన్ను పెళ్ళిచేసుకోవడం నీకు మనసులో ఇష్టం ఉండదని నాకు తెలుసు పార్వతీ! అది స్పష్టంగా ఎవరికీ భయపడకుండా పైకి చెప్పెయ్యి. అదే నేను కోరేది. ఆ పైన నేను ఈ పెళ్ళి జరగకుండా చేస్తాను ఏం? ఏమం టావు?"

అతను సమాధానంకోసం ఎక్కువసేపు నిరీక్షించ నవ సరం లేకుండానే పార్వతి కంయ్ మంది "అదేమిటి బావా? నిన్ను చేసుకోవడం నాకిష్టంలేదూ? ఎవరు చెప్పారు? నేను నిన్నుతప్ప మరెవరినీ చేసుకోనుగాక చేసుకోను!"

రాజు ఉలిక్కిపడ్డాడు పార్వతి తన అయిష్టతను గుర్తించిందో లేదో ఆమె ముఖభావంవల్ల సహస్రాంశమైనా తెలియలేదతనికి. అలా మాట్లాడటమే తప్పయిందని పదే పదే ఉసూరుమన్నాడు మనసులో. ఇప్పుడు ఈ పార్వతిని, మొండిఘటాన్ని మరోకవైపు మళ్ళించడమనేది మాటలతో సాధ్యమయ్యేపని కాదు. ఇక జాప్యంచేస్తే లాభంలేదు— అనుకున్నాడు రాజు. ఏమైతే అయింది; ఈ వివాహంపట్ల తన విముఖత్వాన్ని స్పష్టీకరిస్తేనే ఆమె మనసుకూడా విరగ వచ్చు. అప్పు డది తనకు ఆనందదాయకమే. అయో మయంగా తిరిగి సంభాషణ ప్రారంభించాడు.

"పార్వతీ! సరిగ్గా ఆలోచించే అంటున్నావా?" అన్నాడు.

"నిశ్చయంగా!" అన్నది పార్వతి అవనతముఖంగా నిలబడి.

"వివాహానికి ముందు వధూవరు లిద్దరూ ఒకరి నొకరు అంగీకరించ గలిగినప్పుడే అది హర్షించదగిన, సంస్కార భావాలతో కూడిన వివాహ మౌతుందని ఒప్పుకుంటావుకదూ పార్వతీ?"

"ఇందాకనే అవు నన్నానుగా?"

"అయితే నా అభిప్రాయం తెలుసుకోవాలి ఇప్పుడు నువ్వు" అన్నాడు రాజు.

"ఏమిటి?" తలఎత్తి అతన్ని చూచింది పార్వతి. అంతరాంతరాల్లో అతను చెప్పబోయేది ఆమెకు తెలుస్తున్నది కొద్దిగా. అతన్ని వివాహం చేసుకోవడం ఇష్టమున్నా, లేకపోయినా ఆ సందర్భంలో, ఆ క్షణంలో బరువుగా, బాధగా అనిపించింది పార్వతికి.

"ఈ వివాహం జరగకూడదు!" అన్నాడు రాజు కాస్త బొంగురుపోయిన గొంతుతో పార్వతి మాట్లాడక పోవడంతో ఆమెవైపు చూడకుండానే, "ఈ విషయంలో నాకు భిన్నమైన, ప్రత్యేకమైన అభిరుచులు ఉన్నాయి. అదీ కాక నువ్వు నన్ను అంగీకరించడమే ఆశ్చర్యంగా వుంది నాకు. నేను నీవంటి యువతికి తగనేమోకూడా" అన్నాడు

చివరిమాటలు నెమ్మదిగా వ్యక్తపరుస్తూ. ఎంత నిష్కర్షగా చెప్పా లనుకున్నా రాజులో కొంత సంకోచం అడ్డువచ్చింది.

ఎంత తిరస్కారం! పార్వతిమెదడులో బరువూ, బాధా తగ్గి, ఆ స్థానంలో కోపమూ, ఉక్రోషమూ మంటల లాగా వెలిగి, నసాళం బద్దలుచేశాయి

రాజు తన అందాన్ని అంగీకరించ లేకనే తిరస్కరిస్తున్నాడని భావించింది పార్వతి. తనను తన ఎదురుగానే వేలెత్తిచూపి, హేళన చేస్తున్నట్లు ఊహించిన పార్వతి ముఖం కృంగిపోతున్న సూర్యబింబంలా కందిపోయింది. మనుషులువేరు, మనసులు వేరు. మాటలుకూడా వేరే. మనుషులను, మాటలనూ తెలుసుకోనడం సులభసాధ్యమే అయినా, మనసులను గుర్తించడం కష్టం. ఎదటివ్యక్తి మనసులో ఏముందో గుర్తించాలనే తీవ్రయత్నంలోనే పూర్తిగా బోల్తా పడుతుంటారు మానవోత్తములు. ఎదుటిమనిషి అంతర్యంలో ఏముందో ఊహించి, తను ఊహించినది నిజమని అకారణంగా అపోహల్లో పడటం, భ్రమించడం—అదంతా తప్పటడుగు వెయ్యటంగాక మరేమిటి? అయినా మనుషుల చిత్తస్థైర్యం బలవత్తరమైనదిగా ఉండదు. అనుకున్నదే అక్షరాలా నిజం అనే తత్వం చాలామందికి బాగా ఉంటుంది. పీక తెగగోసుకున్నా అప్పటికి ఆ భావం మారేది లేదు. పార్వతి స్వభావం బొత్తిగా అట్లాటిది కాకపోయినా ఆ పిల్లకు కొన్ని సమయాల్లో ఆత్మవిశ్వాసం మహావృక్షంలాగ పెరిగిపోతూ ఉంటుంది.

ఆ సాంధ్యరాగపు సుమనోహరసమయంలో అటు వంటి స్థితిలో పడింది పార్వతి.

పార్వతిముఖంలో ఏ క్రోధారుణ రేఖలు ప్రతిఫలిస్తు న్నాయో, ఆమెహృదయంలో ఎన్ని ఆగ్రహావేశ నదాలు తరంగోన్మత్తం అవుతున్నాయో అని ఆమెవైపు చూడటా నికి సాహసించ లేక పోతున్నాడు రాజు.

'ఎంత తిరస్కారం! ఊఁ. మరెంత అవమానం!' అని ఇంకా అనుకుంటూనే ఉంది పార్వతి. 'ఇలా'టి అభి ప్రాయాన్ని మొగమాటంలేకుండా అతను చెప్పెయ్యగలడని ముందే తెలుసు. తీరా అతను చెప్పవేశాక ఇంత కోపం ముంచుకు వస్తున్నది. ఇతనికోసం తను దుఃఖించవలసిన అవ సరం లేదు. ఇతన్ని తలదన్నే వాళ్ళు తనకు భర్తకావటానికి కోరతారు. కాని... కాని—'

లోపల వేడిగా ఉంది. మనసు, హృదయం, శరీరం అంతా కుతకుతలాడిపోతున్నట్టుగా ఉంది. పగ, కసి, విద్వేషం, కోపం ఎలా తీర్చుకోవాలి ?

సరోజ సౌందర్యం చూచినతర్వాతే ఇతను తనను మరింత వికారంగా చూసి, కొరగానిదానికి పనికిరానంతగా తీసిపారేస్తున్నాడు. ఇతనికి ఇంత సౌందర్య పిపాస ఎందుకు ఉండాలి? సరోజకు ఎందుకు అంత అందం ఉండాలి?

ఒక్క-క్షణంకాలం అనుభవశూన్య, అమాయకురాలు అయిన పార్వతి హృతయకుహరంలో సరోజపైన ఈర్ష్య తలెత్తింది— తేలుపిల్లలా, కాని చదువుకున్నదికావటంవల్లా,

అంతో ఇంతో అత్మబలంకలది కావడంచేతా తప్పు తెలుసు కుంది మరుక్షణంలో. ఒళ్ళంతా చెమటలు కమ్మాయి. అసూయ విషంలా పనిచేస్తుంది. అవసరంవస్తే దానిలోపడి చావవచ్చుకూడా.

వెనువెంటనే పార్వతికి సరోజమీద ప్రేమ ఉప్పెనలా పొంగిది. 'సరూ ఈ రాజులాటి వాళ్ళకు ఎప్పటికీ లొంగిపోదు' అనుకున్నది చిన్ననాటి చెలిమివల్ల తెలుసుకున్న తన స్నేహితురాలి సుగుణాలను మనఃఫలకంమీద మరొకసారి దర్శిస్తూ.

'ఇక ఏంచేయ్యాలి? రాజుపైనే తన పగ తీర్చు కోవాలి. అతను ఆశించినదీ, అనుభవించకోరినదీ అందకుండా చెయ్యాలి. తనను ఇంత దుఃఖపెట్టి, అవమానపరిచి, చిన్న తనంనుంచి అనేకవిధాలుగా వేధిస్తున్న ఈ యువకుడిని పెళ్ళి చేసుకుని అతని ఇష్టాలకు వ్యతిరేకంగా ఉంటూ ఏడిపించాలి. సాధ్యమైతే తన విలువ అతడు తెలుసుకునేటట్లు చెయ్యాలి. కాకపోతే ఎందుకు అంత దురహంకారం ఇతనికి? ఈ గర్వం సడలగొట్టి తగిన శాస్తి చేస్తే తనకు తృప్తి కలుగుతుంది. మామయ్య తనమాటనే పాటిస్తాడు; తనెంతచెబితే అంత. ఈ పెళ్ళి ఎలా జరగకుండా ఉంటుంది? పార్వతి ఆవేశంగా ఏవేవో నిర్ణయాలు చేసుకుంది. కోపోద్రేకంలో వివేకం నశించడం సహజమే. కర్తవ్యాన్నిగురించి తర్కించుకుంటూ కూడా పార్వతి తన జీవితగమనం ఎలా ఉంటుందో

మున్ముందూ—అనే విషయమై ప్రత్యేకించి ఆలోచించలేదు. ఆమెలో ప్రతీకారవాంఛలాంటి దేదో పరవళ్ళు తొక్కుతూంది.

"మనిద్దరిలో ఎవరికి ఇష్టంలేకపోయినా జీవితం భరించలేనిదై పోతుంది. అందుకే నాన్నగారితో చెప్పేసెయ్యి, మన వివాహం జరగడానికి వీల్లే దని. ఏం?" అక్కడ ఒక బెంచీమీద కూర్చున్న రాజు ఆ మాటలు అని పార్వతిని చూడడానికి కాస్త సాహసించాడు.

పార్వతి చిన్న నవ్వు నవ్వింది. "నీకు ఇష్టంలేకపోతే నువ్వే మామయ్యతో చెప్పలేవా బావా? నేనే చెప్పాలని ఏముంది?"

పార్వతి నవ్వులోని భావం గ్రహించలేకపోయాడు రాజు.

"నాన్నగారు నే చెప్పేది సరిగ్గా వినడానికి ప్రయత్నించరు. ఇక అర్థంచేసుకోవడానికి అవకాశం ఎక్కడుంది? అందుకే నీచేత చెప్పించవలసివస్తోంది." అన్నాడు ఆ అమ్మాయివంక చూస్తూ.

"నీ మాటలే వినిపించుకోనివాళ్లు నా గొడవ అంతకంటే వినరు. నువ్వేదో నాకు లేనిగొప్పని అంటగడుతున్నావు" అంది పార్వతి.

"అలాకాదు, పార్వతీ! నీకీ పెళ్ళి ఇష్టంలేదని నాన్నతో స్పష్టంగా చెప్పు. నువ్వేంచెప్పినా శ్రద్ధగా వింటారని నా ఉద్దేశం."

నవ్వు రాకపోయినా పకపకా నవ్వింది పార్వతి. "మంచి బావవే! అబద్ధం ఆడమంటావా ఆయనతో? నీకైతే నన్ను పెళ్ళిచేసుకోవడం ఇష్టంలేదు. నేను పూర్తి అంగీకారంతో ఉన్నాను. అలాంటప్పుడు, నాకీ పెళ్ళి ఇష్టం లేదని ఎలా చెప్పడం?" రాజు మెల్లగా లేచి పార్వతిదగ్గరకు నడిచాడు. "చెప్పటానికేముంది పార్వతీ? మన జీవితాలను రక్షించుకోవడంతప్ప ఇందులో మహా అబద్ధం ఏముంది? కావాలంటే—నేనే ముందుగా నువ్వు ఇష్టపడటంలేదని చెప్పనా నాన్నతో?"

అనంగీకారం సూచిస్తూ "ఏమో? నీ ఇష్టం. నేను మాత్రం చెప్పడం సాధ్యంకాదు. దరిద్రపు అబద్ధాలు ఆడ లేను" అన్నది పార్వతి అంతలో గంభీరంగా ముఖంమార్చి.

రాజు ఉడికిపోయాడు. "ఆ మాటకి నువ్వాడుతున్నది అబద్ధం కాదూ?"

పార్వతి విస్మయంగా అతనివైపు చూచింది. "అబద్ధమా? ఎలా అనుకున్నావు?"

"నీకు నన్ను పెళ్ళిచేసుకోవడం అయిష్టమైనా ఎందుచేతనో బయటపెట్టకుండా ఉన్నావు." పరీక్షగా పార్వతి కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు రాజు.

పార్వతి మొహం మాడ్చుకొంది. "నేనేమీ అబద్ధం ఆడటం లేదు. ఆ అవసరం నాకులేదు" అన్నది.

"పార్వతీ! చెబుతున్నాను విను. మనసులో దురుద్దేశాలు లేకుండా పైకి చెడ్డమాట పలికినా అది తప్పని మన

సాక్షిని ఒప్పించలేము. ఇక మనసులో ఏదైనా గుప్తంచేసి పైకి నటిస్తే తాత్కాలికంగా ఎదుటిమనిషికి అది ఆనందం కలగజేయవచ్చుగాని అంతకంటే ద్రోహం మరొకటి ఉండదు అదే ప్రేమవిషయంలో అయితే మరీను. ఆలోచించుకో."

"బాగుంది. నేను అబద్ధం ఆడే మనిషిని కాను. మామయ్యతో ఈ విషయంగురించి నేనేమీ చెప్పను" అంటూ పార్వతి తొందరగా అక్కడినుంచి గదిలోకి వెళ్ళిపోయింది.

రాజుమాత్రం చాలాసేపు సంధ్యవేళ ఆ కనుచీకటిలో కూర్చుండిపోయాడు. అతనికి తను ఏంచేస్తే పార్వతి లొంగుతుందో అనూహ్యం అయింది. జానకమ్మ అటువైపు రావడం చూచి లేచి లోపలికి వెళ్ళిపోయాడు.

జానకమ్మ కొడుకుకూ, పార్వతికీ మధ్య జరిగిన సంభాషణ కొంత స్పష్టాస్పష్టంగా విన్నది. పార్వతి అంటే అతనికి అంత విముఖత ఉన్నదని జానకమ్మ గ్రహించలేకపోయింది ఇంతకాలం. ఏదో పైపై అల్లరులు, కోపాలు అంతేగాని మనస్సులో సహజమైన ప్రేమాభిమానాలు ఉండకుండా పోతాయా అనుకున్న దామె చాదస్తంగా. రాజు పార్వతిని తిరస్కరించడం ఆమెతో కలిసి ప్రత్యేకంగా మాట్లాడడం— అన్నీ చూస్తూంటే ఈ వైముఖ్య వైరస్యాలవల్ల రాజు భవిష్యత్తు ఏమవుతుందో అని బెంగపెట్టుకున్నది. కాని ఇన్ని ఆరాటాలమధ్య, భయాలమధ్య ఆమెకు మౌనమే శరణ్యమయింది.

# 8

చిరుగాలివచ్చి శరీరాన్ని గిలిగింతలు పెడుతున్నది. దూరంగా కొన్ని ఇళ్ళు దాటి వీధుల కొసల్లోనుంచి లీలగా వేణుగానం వినిపిస్తూంది గాలితెరల చల్లదనం వేణుగీతికతో కలిసి సమాకర్షి అవుతున్నది. వెన్నెలతరంగాల వెల్లువలు భూమిమీదకు తెల్లగా ప్రవహిస్తున్నాయి. చంద్రునిపట్ల కృతజ్ఞులై హాయిగా గాఢసుషుప్తిలో సుఖిస్తున్నారు అందరూ. రాజుకు నిద్ర కంటికి చేరలేదు. ఆలోచనల తీవ్రతలో బుర్ర పూర్తిగా వేడెక్కి స్వాధీనం తప్పింది. నిద్రాదేవికోసం కళ్లు మూసుకుని తపస్సు చేశాడు కనురెప్పలు బిగించడంతో ఎక్కువయ్యాయి సమస్యావేదనలు. తుదకు నిద్రాదేవి కూత వేటుదూరంలో కనిపించినట్టే కనిపించి మాయమయింది.

రాజు లేచి కూర్చున్నాడు. పైగదిలోనుంచి క్రిందకు చూచాడు. చావడిలో జానకమ్మగారు, వీధివసారాలో రామనాథంగారు నిద్రిస్తున్నారు. పార్వతిగది కొద్దిదూరంలో వుంది. రాజు మెల్లగా లేచి పార్వతిగదివైపు నడిచాడు, సందేహ స్పందనతో కూడిన హృదయాన్ని కట్టుదిట్టం చేసుకుని.

గదిలోకి చప్పుడు చెయ్యకుండా వెళ్ళాడు. బెడ్ లైటు వెలుగుతున్నది. ఒకపక్కకు జరిగి ప్రశాంతంగా నిద్రపోతు న్నది పార్వతి. అప్పుడే ఆ అమ్మాయికి నిద్రపట్టినట్లు ముఖం మీద ఇంకా చెదరని చిరునవ్వు తెలియజేస్తున్నది. నిశ్శ

బ్దంగా వున్న ఇంట్లో ఒక్క గడియారం చప్పుడే లయతప్ప కుండా వినిపిస్తున్నది.

రాజు, పార్వతిని మెల్లగా తట్టి లేపాడు. పార్వతి ఉలిక్కిపడి లేచి కూర్చుని, రాజుని చూసి, "ఏమిటి బావా?" అంది తలగోక్కుంటూ.

"ఇక్కడకాదు, పద మేడమీదకు. అక్కడ మాట్లాడు కుంటే ఇంకెవ్వరికీ మన మాటలు వినిపించవు" అన్నాడు రాజు.

పార్వతి ఆశ్చర్యంగా చూసి, బద్ధకంగా ఒళ్ళు విరుచు కుని రాజును అనుసరించింది. 'ఏదో బోధిస్తాడు కాబోలు' అని విసుక్కుంది మనసులో. అత డేంచెబుతాడో అనే ఉత్కంఠ లేకపోలేదు.

పార్వతిని తిన్నగా బాల్కనీలోకి తీసుకుపోయాడు రాజు. తను కూర్చుంటూ పార్వతికి మరొక కుర్చీ చూపిం చాడు.

అతని ఆనతిప్రకారం కూర్చుని ఆకాశంలోకి చూచింది పార్వతి. తెల్లని వెన్నెలతో ఆకాశమంతా ముచ్చట గొలు పుతూ కనిపించి, అక్కడ కాసేపు విహరించివద్దామా అని పించింది. తెల్లని మబ్బు తెరలు ఆకాశపుఅంచులు దాటి వస్తు న్నాయి. మంచి కోరికలుపుట్టించే వెన్నెల. సౌందర్యాన్ని ఉపమించడానికీ, మధురానుభవాలను గుర్తుతెచ్చుకోవడానికీ ప్రోత్సహించి వెర్రెత్తించే వెన్నెల. దూరంగా నల్లగా కని పించే కొబ్బరిచెట్లు వెన్నెలనంతా తామే అనుభవిస్తున్నట్టు

తల లూపుతూ గర్వంగా, ఠీవిగా, ఊగిసలాడుతూ ఆ సుధా కర తేజస్సుకు మరికొంత అందాన్ని సంతరించి పెడుతున్నాయి. అటువంటి రాగమయ వాతావరణంలో పార్వతి పరవ శించింది.

"పార్వతీ!" అని పిలిచి ఆమెను ఈ లోకానికి తీసుకు వచ్చాడు రాజు.

పార్వతి "ఏం?" అన్నది తన సౌందర్యావలోకనాన్ని మానకుండానే. కాని ఆమె ధ్యాస అతను చెప్పబోయే మాటల పైనే నిలిచింది.

"మనిద్దరం ఒకచోట పెరిగాము. అన్నిట్లో పాలు పంచుకున్నాం. ఎంత శత్రువుల్లాగా మెలిగినా స్నేహితుల్లాగ కూడా ప్రవర్తించవలసి వచ్చేది. అనురాగం మనమధ్య లేక పోయినా అప్పుడప్పుడు అభిమానం చూపుకున్నాము. ఆంత ర్యాలు ప్రతికూలించినా సర్దేసుకున్నాము." చెబుతూ ఆగాడు రాజు.

పార్వతికి అతను చెబుతున్నదాని సారాంశం అంతు పట్టలేదు. చెప్పినదానిలో కొన్ని అబద్ధాలుగా అనిపించాయి. తనపట్ల అంతమాత్రపు దయకూడా ఎప్పుడూ అతను చూపించ లేదు.

"నిజంగా బావనని నామీద నీకభిమానముంటే, నన్ను అర్థంచేసుకుని జవాబు చెప్పడానికి ప్రయత్నించు పార్వతీ! ముందుగా నేను నిన్ను అర్థిస్తున్నది అదే." రాజు మరోవైపు చూస్తూ అన్నాడు.

"సంగతి చెబితేకదా నేను ఆలోచించడానికైనా అవకాశం? ఎక్కువ ఉపోద్ఘాతాలు నీవి!"

రాజు కొంతసేపు మౌనం వహించాడు.

"నన్ను పెళ్ళిచేసుకోడానికి నీకు అభ్యంతరం లేదంటున్నావు. కానీ నాకుంది. ఈ మాట పదేపదేచెప్పి నిన్ను కించపరచడం ఇష్టంలేకపోయినా అనవలసివస్తున్నది. దానికి కారకురాలివి నువ్వుకూడా. నీలో ఏదో లోపం ఉందని నేను తిరస్కరిస్తున్నానేమో అని బాధపడకు. కోరితే నిన్ను పువ్వుల్లోపెట్టి పూజించేవారు దొరక్కపోరు ప్రపంచంలో. కాని నన్ను చేసుకుంటే నువ్వే మాత్రం సుఖపడలేవు. నీ మాట అలావుంచి నేను ఆనందించగలగడం కల్ల. ఇదంతా చెప్పేదెందుకంటే ఇకనైనా నామాటవిని చేతులు కాలకముందే చెప్పి, ఈ వివాహం ఆపించడానికి ప్రయత్నించాలి నువ్వు. నాన్నగారు నీ మాటంటే శ్రద్ధగా ఆలోచిస్తారని నిన్ను ప్రార్థేయ పడుతున్నాను." అన్నాడు రాజు.

రాజు మాటలతో ఆ చల్లనివెన్నెలకూడా వేడి పుట్టించింది, పార్వతిలో ఆ భావం ముఖంలో కనిపించనీయకుండా తగిన జవాబులిచ్చి తప్పించుకోవాలని నిశ్చయించుకుంది. అందుచేత పైకి మామూలుగానే నవ్వింది.

"ఎవరినైనా ప్రేమించావేమిటి బావా?"

ఆ అమ్మాయి ధరహాసలీల రాజుకు కాస్త ధైర్యాన్ని, మరికాస్త చనువును ప్రసాదించింది.

"ప్రేమమాట కాదిక్కడ. నీ మనసు మార్చు కున్నావా? అదిచెప్పు"

పార్వతి కొంతసేపటివరకు బయటకు లోతైన వెన్నె ల్లోకి చూస్తూ కూర్చుంది. ఆమె ఆలస్యం అతనిలో ఆత్రు తను అధికంచేసింది. అడిగినప్రశ్నే అడిగాడు. చివరికి గొంతు పెగిల్చింది పార్వతి.

"క్షమించాలి, బావా! నేను మామయ్యతో నువ్వు చెప్పమంటున్న విషయం చెప్పలేను. ఒకరి బలవంతానికి లొంగిపోయేటంత మనోదౌర్బల్యం నాలో లేదు. నాకూ ఆత్మ విశ్వాసం ఉంది."

రాజు చిరుకోపం ప్రదర్శించాడు ముఖంలో. "అను కుంటున్నావు, గొప్ప యోచనాపరురాలివని. ఇది వినోదం కోసం జరుగుతున్న నాటకంకాదు. ముందుముందు మధుర స్వప్నాలను నిజం చేసుకోవలసిన జీవితంలో నిప్పులు పోసు కున్నట్టవుతుంది. ఆ సంగతి ఇప్పుడు తెలియదులే! అంతా మించిపోయిన తర్వాత తెలుసుకున్నా లాభంఉండదు." అన్నాడు తనకేంపోయిందన్న ధ్వనితో.

"నువ్వు నీకు ఇష్టంలేనిదాన్ని వదిలించుకోవాలని చూస్తుంటే, నాకు ఇష్టమైనదాన్ని నేను దక్కించుకోవాలను కుంటున్నాను." అంది పార్వతి.

"అంటే!" అన్నాడు అర్థంకాక.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను, బావా !" పార్వతి గంభీరంగా అంది గారాబం మిళాయించి.

ఏడవాలో నవ్వాలో తెలియలేదు రాజుకు. ఇంకొక సమయంలో అయితే పార్వతిమాటకు ఆమె ఎదురుగా నవ్వే వాడే. ఇప్పటికీ మనసులో నవ్వుకున్నాడుగాని, బయటికి నవ్వతగిన స్థితి కాదది అతని విషయంలో.

"ఏడ్చినట్టుంది. ఆమాట అనడానికి సిగ్గుపడాలి" అన్నాడు.

"నేనేం మూలపడి ముక్కే ఛాందసురాలినా సిగ్గు పడేందుకు?" అంది పార్వతి.

"ఆ సిగ్గుకాదు నేనన్నది. నీకు నామీద, నాకు నీమీద ప్రేమ ఉందనుకుంటేనే సిగ్గుపడాలి. ప్రేమకునిర్వచనం తిట్టుకోవడం, కొట్టుకోవడమే అయితే మనది అక్షరాలా ప్రేమే"

"కొట్టుకునీ తిట్టుకున్నంతమాత్రానికి ప్రేమలు ఉండవను కుంటున్నావా బావా?" కాలుపై కాలువేసి కూచుంది.

"ఆహా ! ఉండకేం ? అగాధపు ప్రేమలు !"

కొంతసేపు మౌనగాంభీర్యం వారిమధ్య తాండవించింది. పార్వతి కుర్చీలో వెనక్కువాలింది.

"నువ్వెరినో ప్రేమించినట్టు నాకనిపిస్తోంది. నిజమేనా?" నవ్వుతూ ఠీవిగా కూర్చుని అంతరిక్షంలోకి చూస్తూ అడిగింది.

రాజు ఉలిక్కిపడ్డాడు ఆమెప్రశ్నకు. 'ఈప్రశ్ననే తిరిగి తిరిగి అడుగుతున్న దేమిటి ? పోనీ, ఈవిషయికంగానైనా ఈమెగారు తన పంతం వదులుతుందేమో చూడాలి!"

"నెరవేరడంగురించి సందేహాలు ఉన్నప్పుడు ప్రేమలు బయటపెట్టి ఏంలాభం?" అన్నాడు నిర్లిప్తంగా.

పార్వతి వినిపించుకోలేదు. "నువ్వు సరోజను ప్రేమిస్తున్నావు, కదూ బావా?" అంది.

ఈసారి రాజు ఉలిక్కిపడటమే కాకుండా ఆశ్చర్యంతో కొస్తఇరుకునకూడా పడ్డాడు. అయినా సమర్థుడుకాబట్టి "నీకెలా తెలుసు, పార్వతీ!" అనేశాడు.

"ఎంత నిగూఢమైన ప్రేమలైనా బయల్పడకుండా దాగిపోవు - కనీసం పరిసరాల్లోని వారికైనా" అంది పార్వతి.

"నీ ప్రేమసంగతి నువ్వు చెప్పేవరకు నాకు తెలియ లేదు మరి!" రాజు నవ్వి అన్నాడు.

పార్వతిముఖం క్షణంసేపు వివర్ణ మయింది. అయినా కప్పిపుచ్చుతూ, "సరోజమాత్రం నిన్ను ప్రేమిస్తున్నట్టు కని పించడం లేదు" అంది,

"నేను నిన్ను ప్రేమించనట్టు." అన్నాడు రాజు మొదటిధోరణిలో.

పార్వతికి కోపంవచ్చింది. కుర్చీలోనుంచి చటుక్కున లేచి, "నిద్రవస్తోంది" అని నడవబోయింది.

రాజుకూడా తటాలుమని లేచి పార్వతి వెళ్ళకుండా అడ్డుగా నిలబడ్డాడు.

"కోపం తెచ్చుకోకు పార్వతీ!"

"నా కెందుకు మధ్య, అనవసరంగా, అర్ధరాత్రికోసం? దారి వదులు."

"నా మాటవిని నాన్నగారితో చెప్పెసెయ్యి. నీకూ, నాకూ సుఖకరం ఆ మార్గం"

"ఉఁహు. నేను చెప్పలేను."

"ఎందుకని చెప్పవు ? ఎలా చెప్పవో చూస్తాను !" అన వసరంగా బెదిరించాడు.

"నేను చెప్పనంటే చెప్పను. ఇక అంతే ! ధైర్యవంతుడ వైతే నువ్వే మొరపెట్టుకో" మొండిగా అన్నది పార్వతి.

కొన్ని నిమిషాల క్రిందట ఉన్న తేలికభావంపోయి ఇద్దరిమధ్య ప్రళయకాలపు ఝంఝూమారుతం రేగింది. అది రానురానూ ఉధృతం అయిపో సాగింది.

"నన్ను వివాహం చేసుకుంటే నీకూ, నాకూకూడా సుఖం ఉండదు ప్రశాంతత ఉండదు. నాకు ఆ సంగతి తెలుసుకనుకనే నిన్ను పెళ్ళిచేసుకోవటం నాకు ఇష్టంలేదు. ఇప్పుడు స్పష్టంగా చెప్పేస్తున్నాను నీ ఆడంబరాలూ, అతి ధోరణులు నాకు నచ్చవు"

"ఆమాట ఇందాకటినుంచి చెపుతూనే ఉన్నావు."

"నీకు ఆనందమనేది కలగనే కలగదు."

"ఫరవాలేదు!" నిశ్చలంగా, పట్టుదలగా అన్న పార్వతిని విచిత్రంగా చూశాడు రాజు.

"ఎందుకని ? ఎందుకని ? సౌఖ్యాసౌఖ్యాలైనా, కష్ట నిష్ఠురాలైనా ఆలోచించకుండా, వినిపించుకోకుండా నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావు పార్వతీ ! నాలో ఏం చూశావు ?

"నీలో ఏం చూశానా ?" పార్వతి రాజును ఒకసారి నిలువునా పరికించి భావగర్భితంగా నవ్వింది "నీమీద నాకు అధికారం ఉంది. స్వతంత్రం ఉంది." అన్నది కళ్ళు విప్పార్చి అతనివైపు చూస్తూ.

రాజుకు అర్థమైంది. "ఓహో! అలా అనుకుంటున్నావా ? ఈ అధికారాలను స్వతంత్రాలను నిలుపుకోవాలనుకోవడం శుద్ధ అవివేకం."

"నీ దృష్టిలో అవివేకం కావచ్చు కాని, నాకు అనుసరణీయమే. నా వాంఛితాలను నేను వదులుకోలేను"

"అధికృత విషయంగా ఏవో కలలు కంటున్నావు. కానీ, నువ్వు నాకు భార్య వౌతా వప్పుడు. ఆ మాట మరిచిపోకు."

"అయితే?"

"నా చరణదాసి వన్న మాట. అంతకంటె ఉన్నత స్థానం పొందలేవు ప్రేమలెనిచోట."

"నాదగ్గర ఆ తుక్కు-పురాణాలు చదవద్దు. నిన్ను పెళ్లి చేసుకున్నంతమాత్రాన నేను నీ పాదదాసినై పడిఉంటాననుకోకు ."ఆగ్రహంతో పార్వతి నాసికాపుటాలు అదిరాయి.

"నాభార్య నాపాదదాసిగా పడిఉండటమే నాకోరిక." రాజు తన ధోరణిని మలుపుతిప్పాడు.

రెట్టింపువేగంతో కొట్టుకుంటున్నది పార్వతి హృదయం

"నీ కోరిక మరొకజన్మలో తీరవలసిందే. ఈ జన్మలో కాదు." అంది ఆ పిల్ల.

"ఎలా కాదో చూస్తావుగా? నాభార్య నా పాదధూళి తీసుకునే, ఏ పురోగతినన్నా ఆశించాలి. పరిపూర్ణవిధేయత కలిగిఉండాలి. కర్తవ్యబద్ధంగా ప్రవర్తించాలి! నువ్వే నా పెళ్ళానివైనా సరే."

"అయితే సరోజ నిన్ను పెళ్లిచేసుకున్నా అంతేనా? నవీనభావాలు గలది—అదెంత మాత్రం ఒప్పుకోదు ఇలాంటి పనులకి."

"నాచేత చెప్పించుకోకుండానే ఆమె చెయ్యగలదు" అన్నాడు రాజు.

"ఏమైనాసరే, నేనలాటి నీచమైనసేవలు ఎవ్వరికీ చెయ్యలేదు, చెయ్యబోను. ఇప్పుడే చెబుతున్నాను" అని పార్వతి కిందికి రెండుమెట్లవరకు పోయింది. రాజు అడ్డంవచ్చి పార్వతి రెండుచేతులూపుచ్చుకున్నాడు బతిమాలే ధోరణితో.

పార్వతిని వివాహంచేసుకోవడానికి అతని మనస్సెంత మాత్రం అంగీకరించడం లేదు. ద్వేషాగ్ని రగిలేచోట శాంతి ఉండదు, ఎప్పటికీ లభించదు - అని అతని విశ్వాసం. అందుచేతనే ఆమెదగ్గర తను అల్పుడులాగా ప్రవర్తించిఅయినా ఉద్దేశం మార్చాలని ప్రయత్నం.

పార్వతి రాజుచేతులు విడిపించుకోవాలని ప్రయత్నించి విఫలురాలైంది కాని దీనాతిదీనంగావున్న రాజు ముఖాన్ని ఆమె చూడనైనా లేదు.

"పార్వతీ! నిన్ను ప్రార్థిస్తున్నాను, ఈవివాహానికి ఒప్పుకోకు. నిష్కారణంగా మనజీవితాలు నిష్ఫలమౌతాయి. నీకేమైనా నమ్మకంఉందా? ఏ మాత్రమైనా ఫలవంత మౌతుందా?"

పార్వతి ముఖకవళికల్లో మార్పుఅనేది కనిపించ లేదు.

"లాభంలేదు బావా! ముఖ్యంగా మామయ్యతో అనంగీకారమని అబద్ధమాటడం నావల్లకాదు."

"నాన్సెన్స్!" రాజు ఆమెచేతులువదిలిపెట్టి ఉప్పొంగు తున్న ఆగ్రహ సముద్రప్రవాహానికి ఆనకట్టవేయలేక దీర్ఘంగా నిశ్వసించాడు. "నిజంగా నీకు సాధ్యంకానిదేముంది? ఎంత కైనా తెగించగలవు. అయినా నీరాత అలా వుంది!"

"అంటే?" అన్నది పార్వతి ముఖంపక్కకు తిప్పుకుంటూ

"నామాట వినకపోతే నిన్ను సర్వనాశనంచేస్తాను పార్వతీ! చూస్తుండు! నీఆశయాలు, ఆశలు, డాబులు, దర్పాలు వేషకావేషాలు మంటగలుపుతాను. ఈ అహంకారం, అతి శయం అన్నీవదలగొట్టి, అణగదొక్కి నాపాదాలుపట్టుకునేట్టు చేస్తాను. నా అంగీకారంలేకుండా ఏపనీ చెయ్యలేవు. నానుంచి నువ్వేమిటి ఆశించావో దానికి విరుద్ధమైనది దొరుకుతుంది. నాభార్య కావాలని ఉబలాటంమాట అటుంచి, బానిసవై ఊరుకుంటావు. ఇప్పుడైనా మించిపోయిన దేం లేదు. స్థిరంగా ఆలోచించి జీవితమార్గం కంటకావృతంకాకుండా కాపాడుకో. అందుకు తగ్గ వ్యవధానం నీకు వుంది!" అన్నాడు రాజు.

ఉద్రేకపరిస్థితి ఉనికిని మరపించిందేమో ఆవేశంలో మాటలు జోరుగా వచ్చాయి.

అతని కోపానికి చలించినట్లు, పార్వతి మెట్లమీాద నుంచి కిందకుదిగి తన గదిలోకి వెళ్ళిపోతూ, "ఎందుకు బావా బెదిరించాలని, భయపెట్టాలని ప్రయత్నిస్తావు? నువ్వను కున్నంత పిరికిదాన్ని కాను. మామయ్య అభిలాషకి అను గుణంగా నీ భార్యనైతే అవుతానుగాని, బానిస నెన్నటికీ కాను. జరిగేది జరగబోతుండగా ఎందుకు మనకీ కంఠశోష?" అనేసి లోపలికెళ్ళి తలుపువేసుకుంది.

"మైగాడ్!" రాజు స్థాణువులా నిలబడిపోయాడు. నుదుటిమీాది చిరుచెమటను తుడుచుకుంటూ బాల్కనీలోకి వచ్చి, కురుచ్చని పరిపూర్ణచంద్రబింబాన్ని అర్థవిహీనంగా, భావశూన్యంగా చూస్తున్నాడు రాజు. సరోజ సుందరరూపం హఠాత్తుగా తళుకున మెరిసింది కళ్ళవెనక చీకటిలో. అతని కనురెప్పలు నిస్సహాయస్థితిలో, అయోమయ కర్తవ్య సమస్యలో తడిశాయి స్వేదంతో ఆ వెలుగులో మెరుస్తూ. వెంటనే సాహసానికి పూనుకోవాలని మనసు హెచ్చరించిందేమో చేత్తో ముఖం తుడుచుకుని అక్కడే నిద్రపోయాడు.

౽ ౽ ౽

పొద్దుట నిద్రలేవటం తరువాయి - రాజు మెదడుకూ, శరీరానికీ విపరీతమైన బాధ మొదలయింది. ఒకేవిషయాన్ని తీవ్రంగా ఆలోచించడంవల్ల మనస్సు మొద్దుబారి ఏర్పడిన

అలసట అది. కొడుకుఅవస్థను గమనించినకొద్దీ జానకమ్మకు చాలా కష్ట మనిపించింది. రాజుకు పార్వతిని పెళ్ళిచేసుకోవాలే అన్న చింతతప్ప మరొక విచార మేమీ లేదని బాగా తెలుసుకుంది స్వల్పకాలంలోనే. వాళ్ళిద్దరి వాగ్వివాదాలను చూచాయగావిన్నది. కొడుకువివర్ణ వదనాన్ని చూస్తూ సహించ లేకపోయింది మాతృహృదయంలో నిండిన అనుకంపవల్ల పార్వతిపైన కోపంకూడా వచ్చింది స్త్రీ తన హృదయాన్ని రెండుభాగాలు చేసుకోవడమనేది తన బిడ్డల విషయంలోనే సులువుగా జరుగుతుందని చెప్పవచ్చు.

ఏదో మిషతో రామనాథంగారితో సంభాషణ కల్పించుకుంది జానకమ్మ. రాజు వైమనస్యాన్ని వివరంగా చెప్పింది, అయినా రామనాథంగారి నిశ్చయం మారలేదు.

"నీకెందుకు? ఈ సంగతంతా నేను చూస్తాను. అనవసరంగా జోక్యం కలగజేసుకోకు" అన్నారు పూర్వపు ఫక్కీలో.

తరతరాలుగా వస్తున్న స్త్రీ పౌరుషం దెబ్బతింది. జానకమ్మ అవమానం కలిగినట్లుగా ఆయనవైపు చూడకుండానే అంది "నీకెందుకని అంటున్నారా? నన్ను పెళ్లిచేసుకున్న తొలిరోజుల్లో ఇలా అనడానికి సాహసించారా? పోనీ, మాతృమూర్తినైన తర్వాతనైనా? అప్పుడైతే నేను కోపంతో ఎటైనాపోతే మీరు చిక్కున పడవలసి వస్తుంది.

అదంతా ఆలోచించారు విజ్ఞులు కాబట్టి. ఈనాడు నా కొడుకు విషయంలోనే నేను జోక్యం కలుగజేసుకోకూడదు! ఎంత..."

"ఆగాగు!" రామనాథంగారు అడ్డువచ్చారు.

కింద జరుగుతున్న తలిదండ్రుల వాదం మిద్దెమీద గదిలోకి వినిపించింది. రాజు కుర్చీని గోడ దగ్గరికి జరుపుకొని కుతూహలంగా వింటున్నాడు.

పార్వతికూడా తన గదిలోనుంచి వారి సంభాషణ పైనే మనసు కేంద్రీకరించింది. గుండె గుబగుబ లాడుతూంది పార్వతికి.

నీ కొడుకు కాదని ఎవ రన్నారు ? నాకన్నా నీకే ఎక్కువ హక్కుందేమో ఆ మాటకొస్తే. కానీ నువ్వు భార్యగా నా విషయంకూడా కాస్త వితర్కించాలి. నా మానావమానాలు నీవి కావూ ?"

మాట్లాడలేదు జానకమ్మ. వివేచనలో పడింది. నిస్పృహతో నిట్టూర్చాడు రాజు.

మళ్ళీ మాటలు వినిపించాయి. "ఆ రోజు మీ అన్నకు నేను వాగ్దానం చెయ్యడం కళ్ళారా చూశావు. పోనీ, అది ఏనాటి మాటో ! అలా ఉంచి మొన్న మొన్న పార్వతి అంగీకారం తీసుకోవడమూ, నీకు తెలియకుండా కాదు. నిజంగా తొందరపడ్డాను. ముందు రాజునే అడిగిఉండవలసింది వాడైనా తనమనసువిప్పి నాతో ముందుగా చెప్పిఉంటే - పార్వతికీ, వాళ్ళనాన్నకీ నచ్చజెప్పి ఏదో ప్రయత్నించి ఉందును. ఇంతవరకు పోయిన తర్వాత ఇప్పుడు ఆటంకపరచ

డమా? ముఖ్యంగా మీ అన్నదగ్గర మాటనిలుపుకోలేని వాడిగా నా కెంత నామోషి! ఇక అమ్మాయి పార్వతి సంగతి! మన కళ్ళముందు పెరిగిన ఆ లేత హృదయాన్ని చులకనచేస్తే ఎంత బాధపడుతుంది! పాపం, తల్లిలేని పిల్ల!" అన్నారు రామనాథంగారు.

కొంతసేపు మౌనంగా నేలచూపులు చూసి, "పోనీ, మరోకసారి పార్వతి అభిప్రాయాన్ని గట్టిగా అడిగిమాడండి! దానికికూడా యిష్టమో, అయిష్టమో సరిగ్గా తేలలేదు. ఆకుకు అందకుండా, పోకకు పొందకుండా అవుతుందేమో చివరికి?" అంది జానకమ్మ.

"సరే!"

రామనాథంగారి సమాధానానికి జానకమ్మ తృప్తి పడింది. అంతకంటే వెయ్యిరెట్లు ఉత్సాహం పుట్టుకొచ్చింది రాజులో.

## 9

రెండురోజులు ఎక్కడికీకదలలేదు రాజు. తప్పకుండా ఆ మధ్యకాలంలోనే ఎప్పుడో ఒకరోజు తండ్రి పార్వతితో సంభాషిస్తాడు. అప్పుడు తను వినాలి. ఫలితాన్ని గురించి తన కేమీ ఆశలేదు. ఉన్నాగానీ అది ఊహామాత్రమే అంటూ

అంతరాత్మ చివుక్కు-మనిపింప జేస్తూంది. జీవితాలు మలుపు తిరగడం. కోరినవి తలకిందులు కావడం మానవ చరిత్రలో అనాదిగావస్తున్నా అదొక సహజానుభవంగా, సాధారణ దృశ్యంగా అయిపోయినా, ప్రాణంనిండిన ప్రతి శరీరం ప్రత్యే కించి ఆ దుష్టక్షణాల్లో వ్యథాపూరితం అయిపోయి నైరా శ్యాన్ని, వైరాగ్యాన్ని పెంచుకుంటుంది. పరలోక భయ మనేది ప్రపంచభయం ముందు తీసిపోతుందేమో! అప్పుడు దేనినో అన్వేషిస్తున్నట్టు కనిపించే మనిషి బాహ్యస్వరూపం చూసి, ఆధ్యాత్మిక చింతనలో పడ్డాడని అనుకున్నా పొర పాటు ఉండదు. రాజు అటువంటి స్థితికి ప్రారంభదశలో ఉన్నాడు పగమాత్రమే రగులుతున్నది మదిలో.

"పార్వతి దాచిపెడుతున్న హృదయరహస్యాన్ని ఆమె ముఖదర్పణంలోనో, భావ స్వరూపంలోనో గ్రహించాలి. పార్వతి తనను ప్రేమించడ మనేది కల్ల. అసంభవం తను భావించినది నిజమైన పక్షంలో, పార్వతి స్వార్థపరురాలని ప్రస్ఫుటంగా తన కర్థమైపోతే - అంతవరకు చాలు. ఆ పైన తాను ఆమెపట్ల ఏవిధంగా ప్రవర్తించినా అది ఎంతమాత్రం అన్యాయం చేయడంకాదు"

దృఢమైన నిశ్చయంతో, నిప్పులు రగిలే కుంపటిలా వేగిపోతున్న హృదయంతో, తపించిపోయే మెదడుతో, తరి చలేకపోతున్న భావాలతో మానసికంగా, దైహికంగా ఆందోళన పడిపోతున్నాడు రాజు.

సమయం వచ్చింది. అభేరిరాగానికి అనుకూలమైన

వేళ. జానకమ్మ ఎక్కడ ఉందో, అంతటి ఇంట్లో. పార్వతి మాత్రం తనగదిలో కూర్చుని స్నేహితులకూ, తండ్రికీ ఉత్తరాలు వ్రాస్తున్నది.

వేసవికాలపు గాడ్పులూ, చిరుచెమటలూ విసుగు పుట్టిస్తున్నాయి

తండ్రి పార్వతిదగ్గరకు వెళ్ళటం చూచాడు రాజు. రెండుక్షణాలు ఏమి జరగబోతుందో అనే ఆత్రుతతో హృదయం చంచలించింది. మరుక్షణాన, ఏమిజరిగినా, నిర్ణయాలు ఎలా బలపడినా తను సిద్ధమేనన్నట్లు గుండె దిటవు చేసుకుని నిలబడ్డాడు.

లోపలి గదిలో పార్వతి కుర్చీ జరిపిన చప్పుడయింది. "కూర్చో, మామయ్యా!" సన్నటి కంఠం వినిపించింది. "మంచినీళ్లు ఇవ్వనా?"

'ఎంత వినయం ఒలుకబోస్తున్నది!' అనుకున్నాడు రాజు ఆ మాటలు వింటూ. ఉద్వేగంతో తీవ్రమైన పనేదో చేసెయ్యా లనిపిస్తున్నది. 'ఇప్పుడేవెళ్ళి కపటంతో నిండి పొర్లుతున్న ఆమె హృదయాన్ని నిలువునా చీల్చిచూస్తే?'

మాటలు, వినిపించాయి స్పష్టంగా.

"ఏమిటి మామయ్యా?"

"నీతో కొంచెం మాట్లాడాలమ్మా" అన్న రామనాథంగారి మాటకు పార్వతి వేసిన ప్రశ్న అది.

"మరేమీలేదు. నీకూ, రాజుకూ త్వరలో పెళ్లి చేసెయ్యాలనుకుంటున్నా కదమ్మా? ఇప్పుడు అడిగే దేమి

టంటే..." ఆయన దీర్ఘం తీస్తుండగానే పార్వతి అడ్డు వచ్చింది.

"పో, మామయ్యా! ఇందుకా రావటం! అక్కడ నాన్న, ఇక్కడ నువ్వు నన్ను చంపుతున్నారు"

'లేని సిగ్గు ఒలకబోసి ఉంటుంది'అనుకున్నాడు రాజు– "శూర్పణఖ!" అని గొణుక్కుంటూ.

"వినమ్మా! రాజుమంచివాడు కదూ?"

"అవును మంచివాడే!"

రాజుకు విసుగువచ్చింది. 'అదేమిటలా చవట ప్రశ్నలు వేస్తాడు. నాన్న? తనైతేనా, జడాయించి ఉండును!'

"అదేంప్రశ్న మామయ్యా? నీ కొడుకు మంచి వాడు కాకపోవడమేమిటి?" గలగలా నవ్వు.

"అయితే రాజుని పెళ్లిచేసుకోవడం పూర్తిగా నీ కిష్టమే నన్నమాట ?" ఏం ?

"పోనీ, ఇష్టం లేదన మంటావేమిటి? అత్తయ్య మాటలు, నీ మాటలుబట్టి చూస్తే అలాగేఉంది లేకపోతే ఒకమారు చెప్పినా ఇంకా ప్రశ్నలేమిటి?"

"అది కాదమ్మా! ఏ విషయమూ గట్టిగా తెలుసు కుందామని, అంతే."

"అయితే చెప్పమన్నావా మామయ్యా? రాజుని తప్పిస్తే మరెవర్నీ పెళ్ళిచేసుకోను. బ్రహ్మచారిణిగా ఉండి పోతాను అంతే మరి!"

"అంతేనా! అయితే మంచిది" రామనాథంగారు

గబగబ ఇవతలకు వచ్చి అరుగు దిగారు ఎటో వెళ్ళడానికి. ఘాటైన సంభాషణ జరిగినతర్వాత ఇంట్లోనుండి బయటపడి తిరిగిరావడం అలవాటాయనకు.

తండ్రి అసమర్థతకు, తన బలహీనతకు, పార్వతి మూర్ఖత్వానికి రాజు క్రోధాగ్ని వేడిలో సతమత మయ్యాడు. విలుప్తమైన ఆశాభావంతో మనసులో కొట్టుమిట్టాడాడు. అతని అరచేతులు బిగుసుకున్నాయి. ఊపిరి వేడిగా వచ్చింది. ఆనాటి పార్వతి వగలమారి మాటలు గుర్తువచ్చి సలసల కాగిపోయాడు.

'ఎంత టక్కు చేసింది—తనేమీ ఎరగనట్టు! కేవలం అత్తా మామయ్యల ఆజ్ఞమీరనిది అన్నట్టు చెప్పింది. ఇప్పుడో? అంతా తేలింది. ఇప్పుడుతనూ, అమ్మా మరెంత మొత్తుకున్నా, ఏడ్చినా వింటాడా నాన్న? ప్! తన జీవితాన్ని వృధాచేసి పారేసింది ఈ పార్వతి. తన పాలిట రాక్షసి! మూర్ఖత్వంతో స్వయంగా కల్పించుకుంటున్న నష్టాన్ని తెలుసుకోలేకుండా వుంది.'

ఆ పట్టునవెళ్ళి పార్వతిని మొహం వాచేలా నాలుగు మాట లనేయాలన్నంత ఉద్రేకంతో ముందుకు రెండడుగులు వేశాడు. కానీ మనసు తిప్పుకుని వెనక్కి మళ్ళాడు. 'ఎందుకు? ఎంత చెప్పినా ఇక అంతే! చేసుకున్నంత అంటారు. స్వయంకృతాపరాధాలు అనుభవంలోకి వస్తేకాని వివరం కావు. అర్థంకావు.'

రాజు ఏదో ఒక నిర్ణయానికి వచ్చినట్లు కనిపించాడు జానకమ్మకు. పైకి అలా కనిపించినా, ఆంతర్యంలో అతని స్థితి అర్థంకానివిధంగా ఎలా భగ్గుమంటున్నదో గ్రహించే వారెవ్వరూ లేకపోయారు. కాలేజీకి వెళ్ళిపోవాలంటూ పది రోజులు వ్యవధి ఉండగానే ప్రయాణమై వెళ్ళాడు ఊరికి. మరో ఏటికి ఎమ్. ఎ. పూర్తి అవుతుంది గాబట్టి అప్పుడే పెళ్ళిచేసుకోవడానికి నిశ్చయించుకున్న కొడుకుతో ఎక్కువ తర్కించ లేదు రామనాథంగారు.

## 10

చిరాకుపుట్టించే ఇంటి పరిస్థితులలోనుంచి దూరంగా పోవాలని హాస్టలుకు వచ్చిపడ్డాడు. కాని రాజుకు తను తిరుగుతున్న మహాపట్టణంకూడా అతిశూన్యంగా కనిపించింది

హాస్టలుకు రావల్సిన విద్యార్థులందరూ ఇళ్ళదగ్గర కులుకుతున్నారు. ఇంకా సెలవల్లో ఉన్నారు. తనెందుకు వచ్చేశానా అని బాధపడ్డాడు రాజు. 'సెలవలు పూర్తి కాకుండానే హాస్టలుకు వచ్చేసే విద్యార్థులు; జీవితం పూర్తి కాకుండానే చచ్చిపోయే మనుషులు!' చిత్రమైన ఆలోచనలతో తిరిగాడు ఊరి ఆద్యంతాలు.

హాస్టలు సూపరింటెండెంట్, అయిదుగురు అబ్బా

యిలు 'విద్యా పరదేవతే' అనే రకంవాళ్ళే హాస్టల్లో ఉంటు న్నారు. పై అంతస్తులో ఎప్పుడూ గడబిడ వినిపిస్తుంది. అయినా అతి విశాలమైన హాస్టలుభవనం ఖాళీగా, భయంక రంగా, దీనంగా ఉంది. ఎవరూ లేరని ధీమాతో ఊడిచేకుర్ర వాడు ఎగేస్తున్నాడేమో నేలమీద ధూళి మరకల్లా పేరు కుంది. పైన దివినుండి భువికి అన్నట్లు బూజు వేలాడుతున్నది. అందులో ప్రత్యేకించి కొన్నిగదులు చెప్పలేనంతగా అఘో రిస్తున్నాయి. వాటిని మరామత్తు చెయ్యడానికి అప్పుడప్పుడే సున్నండబ్బాలు దిగుమతి కావడంకూడా జరుగుతున్నది. ఊపిరి సలపక రాజు ఉద్యానవనాలు, రాచబాటలూ పట్టాడు. ఇసుకతిన్నెలమీద కాసేపు, కొండలమీద కాసేపు గడి పాడు.

అతనికి పరితృప్తి కలిగించే నిద్రమాత్రం హాస్టల్లో దొరికింది. అందుచేత పగలంతా ఎక్కడ సంచారంచేసినా రాత్రి ఎనిమిదోగంట దాటకుండా హాస్టలుచేరి కడుపులో ఏం పడేసుకున్నాడో ఆలోచించకుండానే నిద్రావశుడయ్యేవాడు. వేసినది కర్రమంచమైనా మెత్తని పరుపు, దోమతెర, చల్లని గాలి ఆలోచనలకు అవకాశం ఇవ్వవు.

౭ ౭ ౭

ఒకరోజు దీర్ఘాలోచనలో, తర్క వితర్కాలలో తేలుతూ బీచిలో కూర్చున్నాడు రాజు. కెరటాలువచ్చి

పాదాలు తాకేటంత సామీప్యంలో కాకుండా, గట్టిగా పడిన ఇసకలో కూర్చుని సముద్రపు ఆవలితీరాన్ని పరికిస్తున్నట్లు చూపులు నిశితంచేసి ఉన్నాడు. మత్తేభాల పోలికలో మబ్బులు ఆ వైపునుంచి తరుముకు వస్తున్నాయి.

"రాజూ! ఏమిటోయ్, ఏకాంతసేవ చేస్తున్నావు?" అంటూ హఠాత్తుగా ఒకకంఠం కనిపించడమే కాకుండా, రాజు వెనుదిరిగిచూసేలోగా రెండు పదులుదాటిన నవయువ కాకారం అతని భుజంమీద చెయ్యివేసి పక్కను బైఠాయించింది.

"నువ్వా, పద్మా! ఎప్పుడొచ్చావోయ్? చూడ లేదే నేను?"

"నేనా? మా నాన్న సంగతి చెబుతుంటాగా? నన్నొక పట్టాన నమ్మరాయన. నా మాటేమిటి — ఈనాటి యువకులంటేనే ఆయన కొక ఏహ్యభావం, అపనమ్మక మూను. 'అయ్యా! ఇంకొక రెండురోజులు సెలవ లున్నాయి అంటూ మొత్తుకున్నా వినక, 'దొంగ వేషా లేస్తున్నా' వంటూ తరిమారు. నేను చదువు ఎగేసినా, ఆ పల్లెటూళ్ళో నాకేం తోస్తుందని ఆయన ఉద్దేశ్యమో? ఇక్కడికి వచ్చానంటే మాపిన్నిగారేమో అతిగారాబంతో నన్ను నా కర్థంకానివ్వకుండా తయారుచేస్తుంది" అంటూ ఒకఉపన్యాసం లాంటి మొర వినిపించాడు పద్మచరణ్ హాస్యాన్ని పోషిస్తూ.

వెంటనే ముఖకవళికలు మార్చి, "నా విషయానికేం

గానీ, నువ్వేమిటి, మారినట్లున్నావు? విశేషాలేమైనా ఉన్నా యేమిటి?" అన్నాడు రాజును చూస్తూ.

"ఏముంది?" ఆ ఊళ్ళో ఉండబుద్ధికాక వారం రోజుల కిందటే ఇక్కడకు వచ్చేశాను" అన్నాడు మరేమని చెప్పాలో తోచని రాజు.

"ఆఁ? నీకు అచ్చట ఉండుటకు విసుగుపుట్టుటయా? నమ్మలేక పోతున్నాను. ప్రతినెలవరకూ ఇక్కడ ఉండలేనంటూ వెళ్లిపోయేవాడివి! పైగా... ఔను... నీ కొక పెళ్ళికాని మరదలున్నట్టు జ్ఞాపకం! ఇదేం చాదస్తమోయ్-షికార్లంటూ, సినిమాలంటూ — హాయిగా ఆనందించక?"

"ఆవిడగారి ధర్మమా అంటూనే వచ్చేయవలసి వచ్చింది." అప్రయత్నంగా అని, ఎందుకలా అన్నానా అని పశ్చాత్తాపపడ్డాడు రాజు.

పద్మచరణ్ మాటజారితే వదిలేరకంకాదు. కూర్చున్న వాడు కూర్చున్నట్టే ముందుకు జరిగి కుతూహలంగా అడిగాడు!

"ఏం? ఏం జరిగిందేమిటి? చెప్పు, చెప్పు. నాకు చెప్పడానికి మొహమాటమేమిటోయ్? అంత విషమ పరిస్థితి వస్తే సహాయపడతానుకూడా"

పద్మచరణ్ గమ్మత్తు మనిషి. ఏదైనా అడగాలని ఉంటే ఖచ్చితంగా అడుగుతాడు. అలాగే తనవిషయాలు కూడా సిగ్గుపడకుండా, దాచకుండా ఉన్నది ఉన్నట్లు చెబుతాడు. బి ఎస్ సి. చదువుతున్న పద్మచరణ్ ఒకానొక సమయంలో రాజును పరిచయం చేసుకున్నాడు. అప్పటినుంచి,

రాజు ప్రత్యేక అభిమానమేమీ ప్రకటించకపోయినా పద్మ చరణ్, అతనెక్కడ కనిపిస్తే అక్కడ కలగజేసుకుని మాట్లాడ తాడు. రానురాను అతనిధోరణి రాజుకు అలవాటే అయి పోయింది. అతను మాట్లాడుతుంటే సన్నిహితులదగ్గర కూర్చున్నట్లు అనిపిస్తుంది. పద్మచరణ్ అసాధ్యుడు. పెద్ద లందరూకూడి చిన్నతనంలో తనకు పెళ్ళిచేసిన పల్లెటూరి పిల్లను వదిలేశాడు తండ్రినే ఎదిరించి.

ఇప్పుడు పద్మచరణ్ తరిచి తరిచి తన విషయం అడుగు తుంటే, కొంతసేపటివరకు రాజు మాట్లాడలేదు.

జీవితాలతో ఆడుకునేవాళ్లు కొందరు. జీవితాల్లోకి తొంగిచూసేవారు కొందరు. ఇతరుల జీవితాలలో జోక్యం కలగజేసుకుని చీవాట్లు తినిపోయేవారు కొందరు. ఇంతాచేసి ఇతరులపట్ల సానుభూతి చూపించేవారు; గొప్ప కోసం కాకుండా, శరీరంతోనేకాక ఆత్మతోకూడా ఇతరు లకు సహాయపడేవారు ఏ కొద్దిమందో ఉంటారు, ముఖ్యంగా ఇటువంటి రకరకాల జీవితాలతో జోక్యం కలగజేసునుని విజయంపొందేది భగవంతు డనబడేవాడేనేమో!

ఆ భావనకు మనసులోనే నవ్వుకున్నాడు రాజు. ఒక వైపు పద్మచరణ్ ఊపిరి సలపనివ్వకుండా ఉన్నాడు.

"ఏముందోయ్, పద్మా? ఆపిల్లంటే నాకు ఇష్టంలేదు" అన్నాడు.

"ఏపిల్ల?" ఆవలించినంత పనిచేశాడు పద్మచరణ్.

"మా మరదలు"

"నీకిచ్చి పెళ్ళి చేస్తా మంటున్నా రేమిటి?"

"అదే వచ్చింది గొడవ!"

"పోనీ, ఏదో తెగేసి చెప్పెయ్యలేక పోయావా, నాలాగ ?"

"చెప్పడమూ అయింది; ఒప్పుకోకపోవడమూ అయింది."

"మరీ అంతపిరికివాడి వేమిటోయ్, చెక్కా-ముక్కా చేసుకోకుండా!"

"నా పరిస్థితుల్లో నువ్వుంటే తెలిసేది!" అన్నాడు రాజు లోపలపొంగే అస్పష్టమైన బాధతో.

"నేనుంటేనా? సరే! నేనొక మాట అడుగుతాను కోపం తెచ్చుకుంటావా రాజూభాయ్ ?"

"కోపం తెచ్చుకోవలసిందయితే కోపం తెచ్చుకోవడమేకాదు, లెంపకాయలు రుచిచూపిస్తాను."

"నీ కోపానికి నేను జడిసేదేమిటిగానీ, నీకా అమ్మాయి ఇష్టంలేదంటే మరో అమ్మాయి నీకిష్టమై ఉండాలి!"

"ఘటికుడివి మొత్తానికి!" రాజు నవ్వాడు.

మహాసత్యాన్ని కనిపెట్టినవాడిలా పోజుఇచ్చి కూర్చున్నాడు పద్మచరణ్—"ఇక కథచెప్పు" అంటూ.

ఆ సమయంలో తన మనోగత సమస్యను పైకి స్పష్టపరచా లనిపించింది రాజుకు. స్నేహితులకు ఏమైనా చెప్పుకోవడంలో తప్పేముంది? ఆ మాటకొస్తే దాచడంలో గొప్పే లేదు. మిత్రుల సలహాలకు ఒక విలువ ఉంది

సంఘంలో. అమోఘమైన సలహాలు ఇచ్చి, ఉపాయాలు చెప్పి మిత్రుల మానమర్యాదలను కాపాడిన స్నేహితు లెందరో ఉన్నారు. పద్మచరణ్ ఎటువంటి విషయమైనా పంతంపట్టి తెలుసుకునేవాడేగానీ పనిలేకుండా చాటే స్వభావంకా దతనిది. ఇన్నాళ్ల సాహచర్యంలో తను తెలుసు కొన్నది అదొకటి.

మెల్లగా మనసువిప్పి అంతా చెప్పాడు రాజు. వ్యక్తి గతసమస్యలు, తప్పించుకోలేని పరిస్థితులు తన కెంత పటి ష్ఠంగా ఉన్నాయో వివరంగా చెప్పాడు చెప్పలేనటువంటి సంగతులుసహితం సంకోచంతో చెప్పవలసివచ్చింది పద్మ చరణ్ ఒక్కమాటఅయినా పొల్లుపోనిచ్చే మనిషికాడు.

హృదయంలో బాధను, చిరాకును, మెదడులో సమ స్యలనూ, చిక్కులనూ బయటికి చెప్పి, ఇక చెప్పవలసిన బాధ్యత అవతలివ్యక్తి దన్నట్టు ఊరుకోగానే ఎంతో హాయి అనిపించింది మనసుకు. వీస్తున్న చల్లగాలి కన్నతల్లిలా ఓదా ర్చింది. పద్మచరణ్ ఏం చెయ్యమంటాడో విందామని ఆశ మొలకెత్తింది రాజులో.

"పార్వతిసంగతి వదిలేద్దాము. ముఖ్యంగా సరోజకు నువ్వంటే ఇష్టమేనా? అదీ ఆ పిల్లకు నువ్వంటే అపరిమిత మైన ఇష్టం ఉండాలి. లేకపోతే, ఆడపిల్లలు ఉన్నారే, వారు వేగంగా లొంగరు. ముఖ్యంగా తెగించలేరు," పద్మ చరణ్ ఏదో ముఖభంగిమపెట్టి అర్థయుక్తంగా అన్నాడు.

"ఏమిటో నువ్వు చెప్పేది ? ఇష్టానికేం? ఉంది. కాని నిశ్చితంగా తెలుసుకోవడానికి నాకు అవకాశం ఎక్కడ కలిగింది? ఆధారమేమీ దొరకలేదు. మరో మహాసమస్యను నెత్తిమీద పెట్టుకోవడానికి భయపడి ఆమెతో నాసంగతి చెప్పలేదు" అన్నాడు రాజు.

"అయితే ఒకపని చెయ్యి."

"ఏమిటి ?" రాజు చెవులే త నర్యాడు.

"తిన్నగా పరీక్ష లైపోగానే ఆ అమ్మాయిదగ్గరకి వెళ్ళిపో అప్పటికి ఎమ్ ఎ. పూర్తి అయిపోతుందిగా ! ఎక్కడో తాత్కాలికంగా ఒక చెత్త ఉద్యోగం దొరకకపోదు. అందుచేత ధైర్యంగా నీ మనసులోమాట ఆ అమ్మాయితో చెప్పు. ఆవిడ ఇష్టపడిందో—ఇక సమస్యే లేదు. కథ సుఖాంతపుదారి తొక్కుతున్న దన్నమాట."

"అయితే..." నసిగాడు రాజు.

"నీ కింకా అర్థంకాలేదా, మహారాజా ? అల్లదిగో, పడమటిదిక్కు చూడండి పక్షులు ఎగరడంలేదూ, జతలు జతలుగా ? ఇదిగో, కార్లు పరిగెత్తడంలేదూ, జోరుగా ? అలాగే మీరూను."

రాజు అర్థం చేసుకున్నాడు. సరోజను అలా ఊహించడం కష్టమైంది. కొంతసేపు ఆగిపోయాడు.

"నేను ఊహించలేకపోతున్నాను పద్మా ! ఆ అమ్మాయి అలా చెయ్యలేదు. సాహసం తక్కువకాక పోయినా, ఇష్టపడదని నమ్మకంగా తెలుస్తూంది నాకు.

పద్మచరణ్ బాగా శబ్దంవినిపించేటట్టు నిట్టూర్చి "నువ్వు ప్రతివిషయాన్ని ముళ్ళబాటలో పెట్టి ఆలోచిస్తే నా తరంకా దింక. అది నీ ఖర్మ. చెయ్యగలిగితే, నువ్వు సరోజను ఒప్పించటంలోనే ఉంది కార్యం ఫలోన్ముఖం కావడమైనా, కాకపోవడమైనా." అంటూ లేచి నిలబడ్డాడు.

రాజుకూడా లేచి నడుస్తూ, "సరేనోయ్! ప్రయత్నించి చూస్తాను" అన్నాడు ఫాంటు జేబుల్లోకి చేతులు పోనిచ్చి.

"ఆఁ అట్లా దారికిరా అబ్బాయి! దేనికైనా మొగవాడివి కాబట్టి నీవు సాహసించాలి." పద్మచరణ్ రాజు భుజంమీద చెయ్యివేసి మెచ్చుకున్నాడు.

కొంతవరకు నడిచినతర్వాత అడిగాడు పద్మచరణ్! "మీ మరదలు నీ కెందుకని ఇష్టంలేదు? అందంగా ఉండదా?"

"ఆమె అందమూ గుణాలూ నాకు నచ్చవు" చాలా తేలికగా అనేశాడు రాజు, మరో ప్రశ్నకి తా వివ్వకుండా.

## 11

కాలేజి పరీక్షలు అయినాయి. పార్వతికి తండ్రినీ, అక్కనూ చూడాలని ఉన్నా పల్లెటూరి వాతావరణం తలుచు

కుని భయపడి ఉండిపోయింది. అయినప్పటికీ సౌమ్యమూర్తి అయిన అక్క రమ్మంటూ వ్రాసిన ఉత్తరాలు మనసులో మెదులుతున్నాయి 'ఒంటరిగా అక్క ఆ పల్లెటూళ్ళో ఎలా ఉండగలుగుతున్నదో, ఎంత బాధపడుతున్నదో?' అని ఒక చింత మాత్రం పార్వతి నెప్పుడూ పీడిస్తుంది. 'తనే తండ్రి అయిఉంటే ఇప్పుడైనా చక్కగా చదివించి ఉద్యోగం చేయించి ఉండును. తండ్రితో ఆమాత్రం చెప్పే చనువు తనకు లేకపోలేదు కానీ, ఆ విషయంమీద వాదోపవాదాలు తర్కవితర్కాలు జరగక తప్పవు. అల్లాంటి వంటేనే తనకు చిరాకు. ఎప్పటి కప్పుడు వాయిదా వేసుకుంటూ వచ్చేసింది. 'ఏమిటో, దాని జీవితం అలా అయింది! చూసిచూసి, అది చివరికి ఒకనాడు...'

ఇక అలోచించ లేకపోయేది పార్వతి. పార్వతికి ఆలోచనలు ఎక్కువ. వాటిని ఒక రూపంలో పరిష్కరించుకోలేక తప్పించుకుంటుంది.

ఎండవేళ ఆలోచనల వేడికి తట్టుకోనలేక సరోజదగ్గరకి బయలుదేరింది పార్వతి. ఆకాశపు అంచుల్లో మేఘమాలికలు బారులు తీర్చి ఉన్నాయి. మధ్యాకాశం అంతా సూర్యుని తేజస్సులో లీనమయింది. సరోజావాళ్ళ కాలనీలో ఇళ్ళన్నీ అందంగా ఉంటాయి. చల్లదనాన్ని స్ఫురింపజేసే చలవ రాతితో నేల అందంగా తయారుచేసి ఉంటుంది. నాజూకు నేర్చిన పనితనంతో సౌఖ్యాన్ని కూడా ఆ ఇళ్ళలో అమర్చారనిపిస్తుంది.

పార్వతి వీధివాకిలిలోకి వెళ్ళగానే దక్షిణపుగాలి విసురుగావచ్చి నడిచినశ్రమ నంతటినీ పోగొట్టింది. చప్పుడు కాకుండా అడుగులోఅడుగు వేస్తూ కిటికీలోనుంచి తొంగి చూచింది. సరోజ కిటికీదగ్గరగాఉన్న మంచంమీద వెల్లకిలా పడుకొని నిద్రతోనూ, పట్టుకున్న పుస్తకంతోనూ కుస్తీ పడుతున్నది.

కిటికీలోనుంచే "ష్" అంది పార్వతి. సరోజ ఉలిక్కిపడింది. అరమూతలవుతున్న కళ్ళు విప్పారి నిండుగా చూశాయి.

"నువ్వా? లోపలికిరా. ఏమీతోచక చస్తున్నా" అంది.

"ఏమీ తోచకేం? ఏదో చదువుతున్నట్లున్నావుగా? పైగా నిద్రాదేవితో నేస్తంకడుతున్నావు!" నాలుగు వైపులూ పరికిస్తూ వచ్చి, స్నేహితురాలి దగ్గర కూర్చుంది పార్వతి.

"ఏమిటి చదువుతున్నావు?"

"ఏంలేదు డిప్రెషన్ గురించి ఆలోచిస్తున్నాను. నీకేం! ఈఏటితో బెడద తీరిపోయినట్లేకాబట్టి, ఎంత కులాసాగానైనా కబుర్లు చెప్తావు" సరోజ తన కష్టమంతా ముందే వుందనే బాధ మిళితమైన భంగిమలో అన్నది.

"అయినా, మేము పేదవాళ్ళం—మీలాగా డాక్టర్లూ, ప్లీడర్లూ కాగలమా? ఏదో డిగ్రీకోసం!" నిట్టూర్చింది పార్వతి.

"పాపం! తరగని ఆస్తులున్న గారాబాల అమ్మా యిలే ఇలా మాట్లాడతారు."

"ఏమైనా అను. ఇంకొక రెండుమూడేళ్ళు పరుగెత్తే సరికి డాక్టర్ సరోజాదేవి నైపోతావా, లేదా? అది చెప్పు."

"అప్పటికి నువ్వేం అవుతావో చెప్పనా?"

"వద్దు. చెప్పక్కర్లేదు" పార్వతి అంది.

"ఏం?"

"నాకే అయోమయం. అటువంటిది నువ్వు చెప్పినా అబద్ధం అయిపోతుంది."

"చెప్పితీరతాను. మిసెస్ రాజువు కావటమే కాక యువరాజులను కంటావుకూడా అప్పటికి" పెంకిగా అన్నది సరోజ పార్వతిని నవ్వించాలని.

పార్వతి నవ్వలేదు. "నాకు నమ్మకంలేదోయ్! మా పెళ్ళి జరగదనే అనుకుంటున్నాను."

సరోజ ముఖకవళికలు మారాయి "ఎందుకలా అను కోవడం?" అంది కనుబొమలు చిట్లిస్తూ.

"నీకు తెలియనట్టే అడుగుతున్నావు" అంది పార్వతి నవ్వుతూ.

"రాజు ఇంకారాలేదు. పరీక్షలు ఈపాటికి అయిపో వలసిందే! ఉత్తరాలు వస్తున్నాయా అతనిదగ్గరనుంచి?" సరోజ సంభాషణను అతనివైపు మళ్ళించింది.

"ఒకసారి పరీక్షలు కాలేదని వ్రాశాడు. మరొకసారి ఫస్టుక్లా సెలాగూవస్తుంది కాబట్టి మంచి ఉద్యోగంకోసం

ప్రయత్నిస్తున్నానంటూ వ్రాశాడు. దీనికి అంతటికీ అసలు కారణం ఏమిటో తెలుసా ?"

"ఏమిటి?" సరోజచూపులో ఆత్రుత కనిపించింది.

"ఇంటికివస్తే ఎక్కడకూర్చోబెట్టి వెంటనే పెళ్ళిచేసేస్తారో - అని."

"ఏం? అంత భయమా?

"పెళ్ళంటేకాదు నేనంటే"

"నీకేంలోటు? వన్నెతరగని బంగారంలా..."

"సరి. ఆపుఆపు. నువ్వు నన్ను వర్ణించనిదెప్పుడు ? బహుశా నువ్వు రాజువై వుంటే నన్ను ప్రేమించి పెళ్లి చేసుకుని ఉండువు." అంది పార్వతి కోపంనటించి.

"ఆ మాటానిజమే ! నాకు అంత అదృష్టంఉండద్దూ? ఊఁ సరేగాని, పారూ, అసలు సంగతిచెప్పు. నిన్ను చేసుకోవడం ఇష్టంలేదని రాజెప్పుడైనా నీతో చెప్పాడా?"

"ఖచ్చితంగా చెప్పాడు - నేనంటే విసుగనీ, తనకు నచ్చననీకూడా."

"అలాగా ?" అంది సరోజ. ఎడమచేతి వేళ్ళను లెక్కించుకుంటూ.

కొంచెంసేపు మౌనం అనంతరం "నీకు అతనంటే ఇష్టమేనా?" అని అడిగింది సరోజ.

"ఊఁ" అంది పార్వతి, ఏ భావమూ వ్యక్తపరచకుండా.

"ప్రేమిస్తున్నావేమిటి ?" సరోజ ప్రశ్న.

"ప్రేమ, అంటే ఏమిటో నాకు తెలీదు. అతనంటే ఇష్టంమాత్రం ఉంది. ముఖ్యంగా అతన్ని పెళ్ళిచేసుకుని ఎలాఅయినా లొంగదీయాలనే పంతంఉంది." అంది పార్వతి సరోజ ఎటువంటి అభిప్రాయం వెల్లడిచేస్తుందో అని చూస్తూ.

"ఇల్లాంటి విషయాల్లో పంతం ఉండకూడదేమోనే!" అంది సరోజ.

"ఏమోకాని, ఏదైనా అందమైన వస్తువునుచూసి అది మనదై తే బాగుంటుందనుకోవడంలో తప్పులేదుగా? అది ఇక మనదికాబోదని రూఢి అయిపోయినప్పుడు చింతించడంలో తప్పు ఉంది అనుకుంటాను. అన్నిటికంటె అతని పెంకితనానికి శిక్ష వెయ్యాలని వుంది—"

"అదంత సులువై నపనికాదు. అతను మగవాడు.నువ్వు ఆడదానివి. తలుచుకుంటే అతనేమైనా చెయ్యగలడు, నువ్వు చేయలేవు."

"ఎందుకు చేయలేను?" పార్వతికి కోపం వచ్చింది.

"లాభంలేదు, పార్వతీ! పౌరుషం తెచ్చుకుంటే లాభంలేదు. కార్యంసాధించుకుంటే సాధించుకో."

కొంతసేపు ఆగి, పార్వతి అంది : "సరూ? నిన్నొకటి అడుగుతాను, చెబుతావా?"

"ఏమిటి?" కుతూహలంగా చూచింది సరోజ.

"నువ్వు రాజును ప్రేమిస్తున్నావా? నాదగ్గర దాచకుండా చెప్పు" కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించింది.

సరోజ సన్నగా నవ్వుతూ, "ఇంతవరకు స్కాల్పెల్‌తో శరీరాలను కొయ్యటమేగానీ, జీవితాలను ఉత్తరించటం అలవాటు కాలేదు" అంది.

పార్వతి ఆ మాటపట్టించుకోకుండా సరోజనుచూస్తూ. "ఒకవేళ బావ నీదగ్గరికి వచ్చి, నిన్నుతప్ప మరొకరిని పెళ్ళి చేసుకోలే నంటాడనుకో - అప్పుడు ఏమనిచెబుతావు? అతని మాట పూర్తిగా కొట్టిపారెయ్యలేవు కదా ? ఎలా పరిష్కరించుకుంటావు ?" అన్నది.

"నువ్వే చెప్పు, ఏంచెయ్యాలో." సరోజ చూపుడు వేలుతో పేజీలు తిప్పుతూ అంది.

"ఉఁహుఁ. నన్ను చెప్పమనడంకాదు. అతను గనక అలా నిన్నుకోరితే ఆ సంగతి నాకు తెలియజెయ్యి అదే నువ్వు నిర్వర్తించవలసిన అవసరమైన పని."

సరోజ ఆశ్చర్యపడిన ట్టయింది. "మీ బావని నేను పెళ్ళిచేసుకోవాలన్నట్టు మాట్లాడుతున్నా వేమిటి ? మా స్నేహంలో అటువంటి భావప్రదర్శన ఎప్పుడైనా కనిపించిం దేమిటి నీకు ?"

సరోజ ఎటువైపూ దృష్టిలేకుండానే ఆలోచిస్తుండగా పార్వతి అంది: "రాజు నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నట్టు న్నాడు."

సమాధానం రాలేదు. దేనినో గుర్తించాలన్నట్టు సరోజ వదనాన్నే అవలోకిస్తున్న పార్వతికి ఏభావమూ చిక్కలేదు.

ఒక్క-క్షణం తర్వాత సరోజ తగ్గిన ఉత్సాహంతో నిట్టూర్చింది. "పారూ ! చిన్నప్పుడు లేడిపిల్లల్లా లేగదూడల్లా గంతే రోజుల్లో ఇటువంటి సమస్యలు; సంకోచాలు, వాంఛలు మున్ముందు రాబోతాయని ఊహించము. ఆ పసిమనసులకి తెలియదు. అందుకే జీవితాన్ని ఇంకా ఎక్కు-వగా అభిలషిస్తాము. అప్పుడు మనం భ్రమించేసుఖం, తర్వాత శూన్యమే.

పార్వతికి ఆ వేదాంతం అంతుపట్టలేదు మాటల్లోనే చిన్నప్పటి ఆటపాటల స్నేహాస్మృతుల్లోకి తీసుకుపోయింది ఆ అమ్మాయిని సరోజ.

## 12

పద్మా !

ఇక్క-డికి నేనువచ్చిన తర్వాత ప్రయత్నం ఏవిధంగా ఫలోన్ముఖం అవుతుందో అది అంతా కథలా నీకు వ్రాయాలని నువ్వు ఆజ్ఞాపించినందుకు సరిపోయినట్టు కథలాగే జరిగింది. కథను నాటకంగా మార్చి ప్రదర్శించవచ్చుకూడా. ఆశించింది జరగలేదు.

నేననుకున్నట్లే ఇక్క-డికి వచ్చిన వెంటనే పెళ్ళి ప్రయత్నాలకు నడుం బిగించబోయారు అందరూ. కాని దురదృష్ట వశాత్తు ముహూర్తాలు రెండునెలల వరకు సరైనవి కుదర

లేదు. అంతవరకు ఆగక తప్పదన్నారు పురోహితులు. అంతా నా అదృష్టబలం అనుకున్నాను దురదృష్టానికి జానెడు దూరంలోనే ఉన్నానని తెలియక. సరోజ దగ్గర నిస్సందేహంగా, సవ్యంగా నా ఉద్దేశాలను బహిరంగపరచడానికి; చర్చించి, వాదించి ఎలాగో అపరిష్కృత సమస్యను ఒక కొలిక్కి తీసుకురావటానికి చాలా వ్యవధి దొరికిందని ఆనందపడ్డాను.

కాని గీత సరిగ్గాలేకపోతే ఏ ప్రయత్నం ఫలించదనుకో పద్మా! సరోజ మునపటిలా లేదు. ఎందుకనో నాతో మామూలుగా ఉన్నట్టు ఉంటూనే, నవ్వుతూ, నవ్విస్తూనే- తీరా నామనసులో అగ్నిపర్వత శిఖరాగ్రంలా మండిపోయే ఆలోచన సారాంశాన్ని చెప్పేటందుకు ఉరకలు వేస్తున్నప్పుడు చక్కగా తప్పించుకునేది. ఆనేర్పు చూస్తే పార్వతి ఏమైనా గొడవపెట్టిందేమో అని అనుమానం వేసింది.

మిగతా అవకాశాలను పార్వతి చెడగొట్టేది. ఒకనాడు నానుంచి తప్పించుకు పారిపోలేక పోయింది సరోజ.

"సరూ! నేనంటే నీకెటువంటి అభిప్రాయం ఉంది?" అని అడిగాను. అలా అడగటం నా అలవాటు.

"ఏముంది? స్నేహితుడివి." అంది నిర్మొగమాటంగా.

నిగ్రహించుకొని, "నేనంటే ప్రత్యేకమైన ఇష్టమేమీ లేదా?" అన్నాను ఇంచుమించు తగ్గిరపుస్వరంతో. దానికి సమాధానం విను:

"ఉంది. లేకేం? పార్వతీ, నువ్వూ ప్రత్యేకమైన అభిమాన స్థానాన్ని ఆక్రమించుకున్నారు నా హృదయంలో."

"పార్వతిని చేర్చకు ఇక్కడ. నేనంటే ఇష్టమా, కాదా? అది చెప్పు." అన్నాను నిర్బంధిస్తున్నట్లు.

"చెప్పానుగా — నీ ఒక్కడిగురించే నా ఉద్దేశాన్ని గ్రహించడంలో కారణమేమిటో?" అంది ఆశ్చర్యపోతూ.

"కారణం చెప్తాను, కానీ..." అంటూ ఎలా ఆమెకు చెప్పాలో అర్థంకాక చాలాసేపు మాట్లాడకుండా ఉండిపోయాను.

విన్నతర్వాత—అసలే ఆడది, ఎంతెంత మాట లనేస్తుందో అని కంగారు ఒకవైపు ఆఖరికి తెగించాను. "సరూ! ఆ యిష్టాన్ని ప్రేమలోకి మార్చలేవా?"అన్నాను.

అనుకున్నంతా అయింది. గబుక్కునలేచి "నేను వెళ్తాను." అంది.

నేను ఊరుకోనలేదు. "నా సమస్యలు, ఆందోళనలు తీరేదాకా నిన్ను విడిచిపెట్టేది లేదు. అలాకాదంటే మీ ఇంటికే వచ్చేస్తాను పార్వతి నీ దగ్గరున్నా సరే, ఈ ప్రసక్తి తేకుండా మానను." చెయ్యి పట్టుకుని కూర్చోబెట్టి బెదిరించినట్టు అన్నాను.

భయపడిందని చెప్పలేనుగానీ, ముఖం కోపంగా పెట్టుకుని కూర్చుంది. అదంతా పైనటన అని నాకు తెలుసు.

"సరూ, ఇన్నాళ్ళూ నీకు చెప్పలేదు. నువ్వుగా కోరే దాకా చెప్పకూడ దనుకున్నాను. ఇప్పుడు సమయం మించింది. నా కోసమనే నేను కోరుతున్నా నిప్పుడు. నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను సరోజా!" అనేశానోయ్! ఆ మాట అన్న ప్పుడు ప్రపంచమే గడగడ లాడిపోతున్న ట్టనిపించింది నాకు. తరువాత ఆమె నవ్వు చూశాక ధైర్యం వచ్చింది.

"ఏ మొహం పెట్టుకు ప్రేమించావు నన్ను?" అంది నవ్వుతూనే.

"ఏం? నా మొహానికేం?" అన్నాను.

"చంద్రబింబంలా ఉందికదూ?" అంది. "నేను నిన్ను ప్రేమించాలంటావా?" అని ప్రశ్నించింది మళ్ళీ ఆలో చిస్తూ.

"అందుకు ఇప్పు డాలోచిస్తున్నావా?" అన్నాను, ఆమె తత్వానికి విస్తుపోతూ.

"అబ్బే! జరగదు. పార్వతి ఏమనుకుంటుంది నేను నిన్ను ప్రేమిస్తే?" అంది.

ఆమె హాస్యధోరణిని వినిపించుకోనకండా నేను ఖండి తంగా అనేశాను. "ఇక్కడ ఎవరూ ఎవరినీ అనుకోనడంతో పనిలేదు. నా కోసం నువ్వు త్యాగం చెయ్యగలిగితే మన కొక మార్గం ఉంది." అన్నాను.

"ఏమిటది?" అంది కళ్లల్లోకి చూస్తూ.

నేనూ ఆమెనుచూస్తూ, "చెప్పనా?" అన్నాను గుండెలు ఆగిపోయే స్థితిలో.

"ఇద్దరం లేచిపోదాం, పద!" అన్నాను ఎలాగో.

నేను చెప్పబోయేది ఊహిస్తున్నదేమో పకపకా నవ్వడం మొదలుపెట్టింది. నవ్వడమే కాదు. "ఏమన్నారు రాజావారు? లేచి పోవాలా? కావాలంటే ఈ ఊళ్ళోనే రిజిష్టర్ మారేజి చేసుకోనవచ్చుగా?

"రాజూ! నాకు లేచిపోవడమన్నా భయం లేదు. అందరినీ ఎదిరించి పెళ్ళిచేసుకోనడమూ భయంలేదు. పార్వతి నిన్ను వివాహంచేసుకోనడానికి విముఖురాలై ఉంటే నీ గురించి ఆలోచించి ఉండును. కానీ పార్వతి ఈ పెళ్ళికి మహోత్సాహం చూపిస్తూంది ఎందుచేతనో. ఆ వివరాలు నాకు తెలియవు. ఇంతకూ చెప్పేది — నేను ఆ అమ్మాయికి ద్రోహం చెయ్యలేను. ముఖ్యంగా ప్రాణాలను ఒకరినుండి ఒకరం మార్చుకొన్నంతటి స్నేహంమధ్య అగాధం తవ్వలేను. దీన్ని 'గొప్పత్యాగం' అని వెక్కిరిస్తావో, 'నటన' అని ఏవగించుకుంటావో—ఏమైనాసరే. ఎప్పుడో పుస్తకాల్లో చదివాను—స్నేహితులకు ద్రోహంచేస్తే ఆ పాపం మురికికూపంలోకి తోస్తుందని. అమ్మబాబోయ్! తగని భయంనాకు—ఏమైనా అను" అని ఇలాగే నవ్వేస్తూనే ఖరాఖండీగా నాతో వాదించింది. పద్మచరణ్! నేను పొడిగా చెబుతున్నానుగాని, ఆమెగారు పెద్దకవిత్వధోరణిలోనే మాట్లాడిందోయ్! పార్వతి ప్రసక్తి వచ్చినప్పుడు మరీ ఎక్కువగా!

"పార్వతిని నువ్వెందుకు కాదంటున్నావో నాకు తెలియడం లేదు," అంది హఠాత్తుగా.

నాకేం చెప్పాలో తోచలేదు. ఏమంటామన్నా ఆమెగారు ఈమెగారి ప్రియ స్నేహితురాలు అనేసంగతి చటాలున గుర్తువస్తున్నది.

మళ్ళీ ప్రారంభించింది.

"ఆ వినీల నయనాలు, నీ రూపం ప్రతిబింబించగల నీలపుచెక్కిళ్ళు, మేఘ శకలంలో దాగిన అర్ధ శశిబింబం లాంటి నుదురు..." అంటూ ఏవో చెబుతుండగానే ఆపాను. సరోజ పార్వతిని అలా పొడిగినప్పుడంతా నాలో వ్యక్తీకరించ లేని ఉద్రేకం పొంగుతుంది. నన్ను సరూ అర్థం చేసుకోవడం లేదన్న ఆవేదనకూడా పొర్లుతున్నది. అందుకే తగ్గిపోయి ఊరుకోలేదు నేను.

"సరూ! సరిగ్గా ఆలోచించి చెబుతావా?" అన్నాను.

"ఏమి టేమిటి?" అంది మామూలు ధోరణిలో.

"ముందు వాగ్దానం ఇస్తే కానీ లాభంలేదు. లేకపోతే మెల్లగా జారుకుంటావు"

"సరే, చెబుతాను." అంది దృఢంగా.

"అలా అను. ఇప్పుడు చెబుతాను విను. నీ కొక పురుషుడితో పరిచయం అవుతుందనుకో. ఏం? అతను సౌందర్యవంతుడు, విజ్ఞాని, వివేకి కావచ్చు. లేదా కురూపి, విద్యావంతుడు, మంచివాడు అయిఉండవచ్చు. అదీ కాకపోతే అందగాడు, పెంకితనం జాస్తీగా ఉన్నవాడు అయివుంటాడనుకో. అతను ఎటువంటి విభిన్నగుణాలు ఉత్తమ ఆదర్శాలు, ప్రత్యేక అర్హతలు కలిగిఉన్నా నువ్వా వ్యక్తిలో

ప్రత్యేకతను పరిశీలించలేకపోయినప్పుడు, కౌతుకం కనబరచ లేనప్పుడు బలవంతంగానైనా నీ మనసును నెవరైనా ఆ వైపు మళ్ళించగలరా? కాస్త ఆలోచించు సరోజా!" అన్నాను.

కొంతసేపు దీర్ఘంగా ఏదో ఆలోచించింది నామీద దయదలచి.

అకస్మాత్తుగా అంది; "నువ్వన్నదీ నిజమే రాజూ!" నా సంతోషానికి పగ్గాలు లేవు.

"మరిక పార్వతిగురించి నాకుచెప్పడం ఎంత అసంద ర్భంగాఉందో తెలిసిందా?"

"అవును." అంది. ఇంతవరకు బాగానే నడిచింది సంభాషణ. నే నన్నాను - ఆందోళననూ జాప్యాన్నీ సహించ లేక; "ఇకనేమంటావు, సరోజా? ఈ నీ మిత్రుడికోరిక కొన సాగేటట్టు చూడు. మనం ఎక్కడికి వెళ్ళినా నువ్వు ఎమ్. బి. బి. ఎస్. అయ్యే బాధ్యత నాది."

ఇంకా నామాటపూర్తికాలేదు – "అలా వల్ల కాదు రాజూ!" అనేసింది "హరిహరబ్రహ్మాదులు వచ్చి రిజిష్టర్ మారేజ్ చేస్తామని కంకణం కట్టుకున్నాసరే, నేను మన వివా హానికి అంగీకరించను. ముఖ్యంగా పార్వతి స్నేహాన్ని వదులు కోలేను. ప్రపంచంలో స్నేహమే పవిత్రమైనది అనుకుంటాను" అన్నది.

నవనాడులూ క్రుంగిపోయాయి. అల్లాంటి పిల్లను అంతసేపు అర్థించినందుకే సిగ్గువేసింది.

"ఊహూ! నువ్వు కవయిత్రివి కావలసింది; డాక్టర్ వవుతున్నావు." అన్నాను కసిగా.

"నాలాటి కవయిత్రో, రచయిత్రో ఎక్కడో ఉండే ఉంటుంది" అన్నది ఇలాటి కబుర్లెన్నయినా చెబుతుంది ఆవిడ.

"మాటలు మాని ఏదో తేల్చు" అన్నాను.

"చెప్పానుగా!" అంది, నేను రాక్షసుణ్ణయినట్లు అనుమానంతో మరొకవైపు చూస్తూ.

"నువ్వు లేకపోతే నా జీవితం వ్యర్థం !" అన్నాను.

"ఏ అఘాయిత్యమన్నా చేస్తావేమిటి ?" అని ప్రశ్నించింది.

"ఆత్మహత్య చేసుకుంటాను, పార్వతిని పెళ్ళిచేసుకున్న తర్వాత" అన్నాను.

మొదట ఆందోళన కనిపించింది ఆ అమ్మాయి కళ్ళలో. తర్వాత మామూలుగా మారింది.

"అబ్బాయీ! ఆడది ఆత్మహత్యచేసుకుంటే రెండు మూడు రోజులు విచారిస్తారు. జాలిపడతారు. మగవాడు, అందులోనూ అన్నీ అమరి, అనుభవించలేనివాడు ఆత్మహత్య గనక చేసుకుంటే మరుక్షణంలోనే మరిచిపోతారు. తినలేక చచ్చాడని తిడతారు. ఆ మగవాడే, ప్రపంచంలో అడ్డదిడ్డంగా బతికినా అప్పుడప్పుడు అభినందిస్తారు." అన్నది ఆడమగ జాతుల జాతకాలన్నీ పిండికొట్టినట్లు.

"నేను లేనప్పుడు నన్నెవరెలా అనుకుంటే నాకేం ? ప్రేయసి తిట్టినా ఫర్వాలేదు. నేనుచస్తే, ఇంత త్యాగశీలివి, పరోపకారివి - నువ్వు అశాంతితో ఏడవాలని నాకోరిక."

"అయితే నేనే ఒకపని చేస్తాను."

"ఏం పని ?" నిండు ఆత్రుతతో అడిగాను.

"నీకన్నా ముందు నేను ఆత్మహత్య చేసుకుంటాను." అతి సహజంగా అని, తర్వాత నవ్వుతూ, "అప్పుడు నేను ఏడుస్తాననే కోరికకూడా నీలో నశిస్తుంది కాబట్టి, నువ్వు ఆత్మహత్య మానుకుంటావు" అంది.

"వెర్రిరాజూ ! ఆత్మహత్య చేసుకుంటానంటూ నన్నిప్పుడు బెదిరిస్తే ఒప్పుకోను. ఇంక అయిదుసంవత్సరాలు గడిచాక నా దగ్గరికివచ్చి 'ఆత్మహత్య చేసుకోవడానికి నిశ్చయంతో ఉన్నా' నని చెప్పగలిగితే విచారించను. అప్పుడు నన్నూ, పార్వతినీ హత్యచేసి నువ్వు అత్మహత్యచేసుకుంటే ఏ పాపమూ ఉండదు. ఉన్న పాపం పోతుంది."

నాకు ఒళ్ళుమండింది. చిరాకు వేసింది. నువ్వు నన్ను వివాహం చేసుకోనిపక్షంలో నా భవిష్యజ్జీవితంతో నీకు సంబంధంలేదు" అంటూ కోపంగావచ్చేశాను. అది మొదలు మళ్ళీ ప్రయత్నపూర్వకంగా ఆమెను కలుసుకోనలేదు. కనిపించినా మామూలుగా మాట్లాడకుండా తప్పించుకోనలేను. కోపతాపాలేవీ ఉంచుకోదు సరోజ. ఆరోజు మా వాదోపవాదాలన్నీ మరిచి పోయినట్టే మాట్లాడింది అనేక పర్యాయాలు.

పార్వతితో నాపెళ్ళికి ఇంకా పది రోజులు వ్యవధి ఉంది. ఏం వ్రాయమంటావు ఇంకా? ఆరని నిరాశాజ్యోతి ఉజ్జ్వలంగా ఉద్దీపిస్తూఉంది నా హృదయంలో. ఇంతే నోయ్! ఈ వివాహానికి నిన్ను రమ్మని ఆహ్వానించడానికైనా నాకు ఆనందంలేదు.

—రాజు.'

# 13

దశమినాటి చంద్రుడి చుట్టూ స్థావరం ఏర్పరుచుకున్నాయి నక్షత్రాలు - ఆశాదీపంచుట్టూ ముసిరిన అల్పప్రాణుల్లాగ. చుక్కలు తనను వెక్కిరించిన ట్లనిపించింది రాజుకు. చుక్కలు వెక్కిరించ కేం ? ఒక్కొక్కప్పుడు ప్రపంచమే వెక్కిరిస్తుంది అలా అనిపిస్తుంది మానవ చిత్తానికి.

నక్షత్రాలవైపే చూస్తున్నాడు. ఇలాగే మినుకు మినుకు మంటూ మనిషి ఆశలా కనిపిస్తుంది ఒక్కొక్క చుక్కా. తీరా ఒకనాడు పుటుక్కున రాలిపోతుంది. దాని స్థానంలోకి మరొకటి రావచ్చు. భువిలో ఒక ఆశాజీవి, దివిమీదొక ఆశాజ్యోతి.

ఎంత ఆలోచనల్లో వేదాంతం పులుముకున్నా అంత-

రాత్మలో అగ్ని ప్రజ్వలిస్తున్నది. దీనినుంచి తప్పించుకుని బతికిపోవడం సామాన్యంకాదు.

రాజు పార్వతుల వివాహం నరసింహమూర్తిగారి ఇంట్లోనే జరిగింది. పెళ్ళికాగానే ఊరు వెళ్ళిపోవాలని పట్టు పట్టాడు రాజు. కాని అదీ సాగలేదు ఏ మిషవల్లా.

"ఏమిటో ఆలోచనలు దొరగారికి?" పార్వతి నవ్వు; రాజుకు నచ్చని నవ్వు.

కారణం లేకుండా పకపకమని నవ్వుతుంది. గొప్ప కోసమా? ఎప్పుడు వచ్చిందసలు?

ఆమె వేషంవైపు చూశాడు. ఊహుఁ! తక్కువలో తక్కువ అయినా మార్పు లేదు. ఇన్నాళ్ళూ లేని అహంభావం, అధికారం ఇప్పుడు విరగబడ్డాయి మేమూ ఉన్నామంటూ. ఛీ! ఇల్లాంటి స్త్రీతో ఏమిటి జీవితం?—తనకు ఇష్టంలేదని తెలుసుకదా! కనీసం తనకోసమైనా వేషంలో మార్పు చేసుకోకూడదూ? పొడవైన జుత్తు రెండుజడలుగా వేసుకున్నమాత్రాన ఏం ఆకర్షణ కలిగింది ఈవిడలో? ఈమెగారు ఊహించుకున్న అందంలో పదోవంతుకూడా కుదరలేదని తెలియదుకాబోలు. ఈ లిప్‌స్టిక్‌లు, బేక్‌లెస్ జాకెట్లు, హైహీలుసు ఏమగవాడు భరిస్తాడో అని నవ్వుకునేవాడు నిన్నమొన్నటిదాకా. ఇప్పుడా 'మొగుడు' తనే అయ్యాడు.

"నీ అర్ధాంగి నయ్యానుకదా? మనసులో విషయాలిక

నాతో చెప్పినా ఫరవాలేదు.'' కిలకిలా నవ్వుతూ అంది, ఆ నవ్వే కొంపతీస్తున్నదని తెలియక.

''చెప్పవలసినవి ఏనాడో చెప్పాను. ఇంకేం ఉంటాయి? ఉన్నవేవో నీకు తెలిసినవే!'' పట్టుతెరలాంటి గగనంవైపు చూపుతిప్పుకున్నాడు రాజు. గొంతులోనే కోపాన్ని అణచడానికి ప్రయత్నం జరుగుతున్నది.

''ఆ గదిలోకి పద బావా! నీ కోసమని మీఅమ్మ అతిశ్రమతో కాచిపంపిన పాలు చల్లారిపోతున్నాయి.

''అందులో కొంచెం విషం కలిపి తీసుకురా. లేకపోతే నువ్వు తాగు.'' రాజు సమాధానం.

పార్వతి ఆవలించింది. ''మనం కడుపునిండా పాలారగించే వచ్చాము'' సందేహించకుండా చెప్పింది.

రాజులేచి గదిలోకి వెళ్లి కూర్చున్నాడు. అతని పరధ్యానం చూస్తూ పార్వతి అనుసరించి వచ్చి పక్కనే కూర్చుంది. అతనేమీ అనలేదు. విద్యుద్దీపాల కాంతిలో పార్వతి వేషం రాజుకు వెగటు కలిగించింది.

పెదవులుతిప్పుతూ, ''నువ్విలాంటి ముఖంపెట్టి కూర్చుంటావని నాకు ముందే తెలుసు బావా!'' అన్నది. తర్వాత మెల్లగా రాజుచేయి తనచేతుల్లోకి తీసుకోబోయింది అతన్ని గమనిస్తూనే చెంపదెబ్బ కొట్టినట్టయింది ఒక్కసారిగా. విదిలించి కొట్టాడు.

అంత తీవ్రంగా ప్రవర్తిస్తాడనుకోలేదు పార్వతి.

చిన్నబుచ్చుకుని వెంటనే ఏమనాలో తెలియక ముఖం మాడ్చుకుంది.

ఈలోగా మరోకసారి ఆమె అహంభాగా దెబ్బతింది.

"దయచేసి నన్నుముట్టుకోకు పార్వతీ ! ఎందుకో ఎవ రైనా తాకితే కారంపూస్తున్నట్టు ఉంటున్నది. మీ ఊరి నీటి మహిమేమో!" మామూలుగా ఉండాలని ప్రయత్ని స్తున్న అతని ముఖకవళికలు గుర్తించిన పార్వతి ఆవేశంతో ఉక్కిరిబిక్కిరయింది.

పగ పెంచుకునేవాళ్ళమధ్య పచ్చగడ్డి భగ్గుమనక మానదు పార్వతి. అంది "నీ మండేమనస్తత్వానికి ఊళ్ళనూ మనుషు నూ ఆడిపోసుకోవడంలో అర్థలేదు."

"పార్వతీ !" అరిచాడు రాజు.

"మరేం అనాలిబావా ? నేనెంత అభిమానంతో దగ్గ రికి వచ్చినా రెచ్చగొడుతున్నావు నన్ను. ఏం చెయ్యను?"

"నీ సంగతి నాకు వేరే చెప్పనవసరంలేదు. మాట ల్లోనే నీ అభిమానం, అభినయాల్లోనే..."

"ఎలా అనుకున్నావు? ఈ సూటీపోటీ మాటలేమిటి?"

"అదంతా వదులు. నామీద నిజంగా అభిమాన ముంటే ఆవేశం అంతా తీసిపారేసి సాధారణస్త్రీలాగ తయా రుకా. అప్పుడు ఉన్నంతలో మర్యాదగా చూడగలను."

"ఊఁ! మంచి పన్నాగం పన్నావే! నువ్వు చెప్పి నట్టల్లా చెయ్యడానికి నేను సనాతనాచారాలతో మగ్గే పురాతన స్త్రీనికాను. అధునాతన యువతినని నువ్వు గుర్తుంచు

కోవాలి ఈనాటి మగువలు మగవాళ్ళతో సమానహక్కులు కలవాళ్లు. మగవాడివని నువ్వాడించినట్లల్లా ఆడటానికి నేనేం తోలుబొమ్మనుకాను."

"నోర్ముయ్! నేనెలాచెప్తే అలాచేసి పడుండాలి. నువ్వు నా పెళ్ళానివి. భారతీయుల భాషలో దాసి అని దానికి మరో అర్థంవుంది. ముందా టెరిలిన్ చీరవిప్పి. ముతక చీరొకటి కట్టుకురా! ఆ పైన చెయ్యవలసిన అలంకరణ నే చేస్తాను."

అతని అధికారస్వరానికి మండిపడింది పార్వతి" "మనలో ఎవరు ముందర నోరుమూసుకోవాలో వేరే చెప్ప నవసరంలేదు. నేనింతైనాక ఒక్కరూ ఒక్కమాటనడానికి సాహసించలేకపోయారు. నువ్వంటే నేను పడతా ననుకున్నావా? ఇంకా మితిమీరావంటే నలుగురిలో నవ్వులపాలౌతావు. నన్ను క్షణక్షణానికి రేగగొడుతున్నది నువ్వే!"

"ఊట్టినే నోరుపారేసుకోకే పిల్లా! నేను పెట్టే తిండి తిని తిన్నగా పనులుచెయ్యి" ఒక్కొక్క నిముషం గడుస్తున్నకొద్దీ రాజు విచిత్రంగా మారిపోతున్నాడు.

కసి తీరుతున్నప్పటి హాయిలో అతనికేమీ తెలియడం లేదు. కళ్ళు ఎర్రగా మారుతున్నాయి. ఒళ్ళంతా నిప్పులు కక్కుతున్నట్లు చెమటలు. మామూలుగా కనిపిస్తూనే ఉద్వేగంతో మాట్లాడుతున్నాడు.

"రాజూ! ఇంకొకమాట అన్నావంటే మర్యాద కాదు. నువ్వుపెట్టే తిండి తినడానికి కాదు, నేను పెళ్ళి చేసు

కున్నది. నేను చదువుకోలేదా? నాకు గతిలేదా? హుఁ! నువ్వు అధికారిలాగా మాట్లాడితే లొంగిపోతాననుకున్నావు కాబోలు."

"చాలు విపరీత ప్రసంగం! ప్రతిదానికీ వ్యాసాలు చదువుతుంది. ఈసారి రాజూ, గీజూ అన్నావంటే ఊరుకోనేది లేదు. మర్యాదగా 'మీరు' అని సంబోధించు."

"ఛస్తే అనను. అలవాటు ప్రకారం పిలుస్తాను. కావా లంటే పిలవడం మానేస్తాను. 'బావా' అని పిలిపించుకునే అర్హత నీకుంటేగదా, అసలు?"

"పార్వతీ!" అదిరింది గది. ఎవరికైనా వినిపిస్తుందనే జ్ఞానం నశించింది రాజు మెదడుకు.

"ఏం?" అన్నది పార్వతి మరింత ధీమాగా నిలబడి.

"రాస్కెల్! పొగరెక్కినట్లుండడానికి నీకు హక్కు లేదు. ఇల్లాటి చీరలంటే నాకు మంట అని తెలియదూ? తిన్నగా వెళ్ళి మార్చి వస్తావా లేదా? నా పెళ్ళాం కావ డానికి ముచ్చటపడ్డావుగా? అనుభవించు."

రాజు జడిపించబోయినా పార్వతి నిశ్చలంగా ఉంది.

"అందుకే కాబోలు నీపగ నువ్వు పశువ్వికావూ? ఇలాటి మాటలనే మగవాడు రాక్షసుడు తప్ప మరొకడు కాడు. అయినా లోకంలో ఆడవాళ్ళందరూ, ముఖ్యంగా మీ సరోజాదేవి అటువంటి నాజూకు బట్టలు కట్టుకుంటే పొంగిపోతావు కానీ, నేనైతేనే నీకింత అసహనం, చూడ లేనితనం."

"నువ్వు నక్కవై వుండి నాగలోకం గురించి ఆలోచిస్తున్నావు. సరోజకీ, నీకూ సామ్యం ఎక్కడ ?"

హుఁ అంత హీనంగా చూడబడుతున్నానన్న మాట ? నిజానికి సరోజ నాకాలి గోటికికూడా సరిపోలదు.

ఎంత ధైర్యంతో ఆమాట అనగలిగిందో కానీ, రాజు ఒక్కసారి రెచ్చిపోయాడు దానితో.

"ఏదీ, మళ్ళీఅను ఆమాట !" అన్నాడు దగ్గరకు వచ్చేస్తూనే. చాల దినాలనుంచి అలాంటి భీకరాకృతి చూడలేదు పార్వతి. అయినా ధైర్యం నటించింది. చెదరకుండా "నా కాలిఁగోటికికూడా పోల దామె అంటున్నాను" అంది మళ్ళీ.

ఆమె మాట ముగించిందో లేదో ఆమెకే తెలియదు రాజు ఆమె జుత్తు దొరకబుచ్చుకుని రెండు చెంపలమీదా నాలుగు వేశాడు. కుదిపి వదిలాడు.

బాధకు పార్వతికళ్ళు ఎర్రబడి, రెండుచుక్కలు కనుకొలకుల్లోకి వచ్చాయి.

"ఛీ! నీ మొహంచూస్తే ప్రపంచంలో ఉన్న పాపాలన్నీ నాకే చుట్టుకుంటాయి. వెళ్ళు, ఇక్కణ్ణుంచి. వెళ్ళి ఎక్కడో ఏడువు నా ఎదురుగా కాకుండా ! రాజుగొంతు బొంగురుపోయింది. తీక్ష్ణమైన అతని చూపులవేడికి తట్టుకోలేనట్టయింది పార్వతి.

అవమానపు సెగలు ముఖాన్ని కాలుస్తుంటే, కొద్ది ఆగ్రహంతప్ప ఎక్కువమార్పు కనిపించకుండా అతనివైపు

చూస్తూ, "కొట్టినంత మాత్రానికి నేను బానిసనై పోతానా? ఉద్యోగంచేసుకుంటూ నన్ను నేను పోషించుకుంటాను. నువ్వు నన్ను కాదంటే నాకు ఎప్పటికీ నష్టంలేదు. నష్ట మంతా నీదే; అవమానమంతా నీదే. ఇంకో సంగతి నీలాటి కఠినుడూ, రాక్షసుడూ అయిన మనిషిదగ్గర ఎప్పుడూ ఏడ వను. జన్మలో నీ ఎదురుగా కన్నీరు కార్చేగతి నాకు పడు తుందని అనుకోకు" అన్నది పార్వతి తీవ్రంగానే. అని, వెంటనే ద్వారంవైపు రెండడుగులు ఆమె వెయ్యడం, రాజు గొంతు బొంగురుగా ధ్వనించడం ఒక్కసారే జరిగాయి.

"ఆ తలుపులు తియ్యకు. అటువెళ్ళావంటే మళ్ళీ ఎముకలు సున్నం అవుతాయి."

పార్వతి ఆగిపోయింది. నిముషం ఆలోచించింది. ఒక సారి అతన్ని అసహ్యించుకున్నట్లుచూసి, పైగదిలోకి ఉన్న మెట్లెక్కి వెళ్ళిపోయింది.

చెదిరి ఉంగరాలుగా ముందుకు పడి స్వేదంలో హత్తుకు పోయిన జుత్తును సర్దుకోనైనా సర్దుకోకుండా రాజు పక్కమీద వాలాడు. చాలాసేపటివరకు అతనికి నిద్రరాలేదు. అతనివి అంతుతెగని ఆలోచనలు.

ఆలోచనలకు అర్థం ఉండదు కాబట్టే ఎక్కువకాలం వ్యర్థం కావడం జరుగుతుంది మరి.

# 14

'జీవితపోరాటం' అనే వాడుకపదం రాజు, పార్వతి దాంపత్యజీవితానికి సరిగ్గా వర్తించింది. ఎవరిపాటికి వారు పట్టుదలగానూ, గొప్పగానూ ఉంటున్నారు. బింకం చెడటం లేదు ఇద్దరిలో. ఒకరి కొకరు జవాబులిచ్చుకోవడంలో తమనుతాము తక్కువచేసుకోరు. అందులో ఇద్దరూ ప్రవీణులై పోయారు, పెళ్ళయిన తర్వాత. తిట్టుకోవడంలో సరిసమానం.

ఏరోజు ఎటువంటి రంగస్థలనాటకం గృహాంతర్భాగంలో జరుగుతుందో ఎవరూ ఊహించలేరు. ఉన్న ప్రేక్షకులైనా జానకమ్మా, రామనాథంగారూ మాత్రమే. గతిలేక ఏ చుట్టమైనా వచ్చినా, ఆయింట్లో మౌన గాంభీర్యాలమధ్య జరిగిన సన్మానానికి తట్టుకోలేక అపార్థాలు చేసుకుని పారిపోవలసిందే.

రామనాథంగారికి రాజు, పార్వతుల వర్తనలు సాధారణంగా కనిపించేవి. ఆవయసులో కీచులాటలు, జగడాలు అతిసహజం అనుకునే ధోరణి ఆయనది. మిగిలిన దిగులంతా జానకమ్మదే. కొడుకూ, కోడలూ ముచ్చటగా సంసారం సాగిస్తుంటే ఆ నవదంపతులను చూసి మురిసిపోవాలనుకున్న అతిసామాన్యమైన ఆవిడ ఆశ అడియాసై కూచుంది. తన కొడుకు అపరాధో, కోడలు మూర్ఖురాలో నిశ్చయించుకో లేక సతమతమైపోతూంది. 'పార్వతికూడా తనదగ్గరే పెరి

గింది ఆ పిల్లగుణం చిన్నతనంనుంచి తనకు తెలిసినదే. రాజును పెళ్ళిచేసుకోవాలని ఆపిల్లకు ఉబలాటం ఉన్నదంటే అసహజం కాదు; అసమంజసం కాదు. పోనీ అటువంటి అమ్మాయి వాడి కిష్టమైనట్లు నడుచుకొని, ప్రేమ సంపాదించుకో కూడదూ ? అదే అర్థం కావడంలేదు. ఇక రాజు సంగతా? మొదటినుంచి మొత్తుకుంటూనే ఉన్నాడు "దాన్ని అలా చూస్తున్నావేమిటిరా" అనికాని, "దాని పొడగిట్టకుండా ఉంటే ఎలా బాబూ" అని కాని అడగడానికి తనకెంత సాహసం ఉండాలి ? మీాద విరుచుకుపడడూ ?

అందుకే జానకమ్మ నోరు కదపలేకుండా వుంది - 'పీ ళ్ళిద్దరూ వేరింటికాపరం పెడితే బాగుండును' అనుకుంటూ.

రాజు ఏకాగ్రత అంతా పార్వతి అలంకరణమీాదనే. ఆమె ఇష్టపడనివి చెయ్యడం, ఇష్టపడినవి దక్కకుండా చూడడం—ఇదే అతని సాధన. మరొకవిధంగా ఆమె మీాద విద్వేషభావాన్ని ప్రకటించడం చేతకాదు. సాధ్యమైనదల్లా—తిట్టడం, కొట్టడం. కాని అవి విపరీతం అయితే తనెక్కడ పశువుకన్న హీనంగా పరిగణించబడతాడో నన్న భయం. సహజమైన నాగరిక భావపూరిత హృదయం.

పార్వతిని ఉద్యోగం చెయ్యకుండా అడ్డుపెట్టడం సాధ్యంకాలేదు రాజుకు. అతను ఆ ఊళ్ళో లెక్చరర్‌గా

ఉద్యోగం ప్రారంభించిన ఆరునెలలకల్లా ఒక ఆఫీసులో స్టెనో గ్రాఫరుగా చేరింది ఆ అమ్మాయి.

రాజు ఆమెను మాన్పించాలని వ్యర్థప్రయత్నాలు చేశాడు. ఆమెకు చీమకుట్టలేదు.

మగవాళ్ళుండే ఆఫీసులో పనిమాని ఏదైనా ఆడ ఉద్యోగం చూసుకోమన్నాడు. అప్పటినుంచి ఆ మగమనుషు లను ఇంటికి తేవడమే మొదలుపెట్టింది-స్నేహితులుటెమ్మని సమర్థిస్తూ.

ఊరికే ఉన్నప్పుడు తప్ప - ఆఫీసుకు వెళ్ళేటప్పుడు పలచని సిల్కు-బట్టలు కట్టవద్దని ఆజ్ఞ జారీచేశాడు. అది మొదలు ఉల్లిపొరకన్నా సన్నని వన్నెవన్నెల చీరలే కట్టడం ఆరంభించింది. రోడ్డుమీద అణకువగా నడవమన్నాడు. ఠీవిగా నడిచింది. నవ్వవద్దన్నాడు. నవ్వింది ఎదిరించ వద్దన్నవాణ్ణి అదరగొట్టి వదిలిందని వేరే చెప్పనక్కర్లేదు.

రాజు లోలోపల మండిపోయాడు. అతనిలోని ప్రకృతి సిద్ధమైన పురుషత్వం దెబ్బతింది. చివరకు ఒకనాడు సమయం చూసి తల్లిఎదురుగానే పార్వతితో అనేశాడు :

"నీకు విడాకులు పారేస్తేకాని లాభంలేదు." విసిగి వేసారిపోయినవాడిలా మొగం మాడ్చుకుని అన్న అతని మాటలకు పార్వతి నవ్వుకుంది. బాగా వెక్కిరించింది. పైగా ఊరుకోలేదు.

"విడాకులిస్తావో, పెడాకులిస్తావో! నాకేం! నలుగురూ

నిన్నే ఏకుతారు. నేను మరొక మంచిమొగుణ్ణి పెళ్ళిచేసుకుని దర్జాగా నీదగ్గరకంటే హాయిగా బతుకుతాను."

"హుఁ! నోటి కొచ్చినట్టల్లా వాగే ఆడదానికి సిగ్గ క్కడినుంచి వస్తుంది? మగవాడితో సమానం" విసురుగా వెళ్ళిపోతున్న రాజుకు అంతకంటె విసురుగా వెనకనుంచి మాటలు వినిపించాయి.

"అవును! మగవాడు ఆడదానిలా వుంటేనే అసహ్యం. ఆడది పురుషుడిలా ధైర్యసాహసాలు కలిగిఉండటానికి హక్కులున్నాయి మొదటినుంచి."

"పారూ!" జానకమ్మ అదిలించింది. "వా డసలే... మొదట్నుంచి..." మాటలకు తడుముకోవలసి వచ్చింది ఆవిడ.

"ఏమిట త్తయ్యా ?"

జానకమ్మ దానికి సమాధానం చెప్పకుండా, "పోయి నీ పనులు చూసుకో" అనేసింది.

"అత్తయ్యా! నీకు నా మీద కోపంగావుంది కదూ?" పార్వతి అడిగింది

"అదికాదే! విడాకులూ, వేరుపడతాలు మన ఇంటా వంటా లేవుకదా? అలాంటి పనులు రాజు ఎప్పటికీ చెయ్యడు"

"అదే మంచిది అత్తయ్యా! నీకు తెలీదు" అన్నది పార్వతి.

"ముందుఆలోచించకుండా పెళ్ళిచేసుకోవడ మెందుకు

తరవాత సరిపడక విడాకు లిచ్చుకోవడ మెందుకు? ఏడాది కూడా తిరగలేదు పెళ్ళయి" జానకమ్మ అంది నిట్టూర్పుతో.

"అయితే నింద అంతా నామీదనే వేస్తున్నారా ఈ ఇంట్లో అందరూ? బావను పెళ్ళి చేసుకోవడం నాకిష్టం లేదని నేనే అప్పు డనివుంటే మరోక విధమైన నిందలు వేసి ఉండేవారు. 'రాజును చేసుకుంటావా, పార్వతీ?' అని మీరు నన్నడిగితేనే మనఃపూర్వకంగా ఒప్పుకున్నాను. రాజు నాబావ—అని గర్వం ఉండేది నాకు. ఇప్పుడేమో రాజుకు నేనంటే ఈషణ్మాత్రం ఇష్టంలేదని తెలిసి ఆ అన్యాయమేదో నా వల్లనే జరిగినట్లు అనుకుంటున్నా వత్తయ్యా నువ్వు. మా అమ్మఉంటే నాకే అన్యాయం జరిగిందని వాపోయి ఉండును."

జానకమ్మ మనసు చివుక్కుమంది ఇన్నేళ్ళు తన దగ్గర పెరిగిన పార్వతి ఒక్కనాడుకూడా వాళ్ళ అమ్మను గురించి అడగలేదు. ఆ తలపే లేనట్లు అగుపించేది. అల్లాంటి అమ్మాయి ఇవాళ ఇలా అన్నదంటే—ఎంత బాధ పడ్డదో! స్త్రీసొత్తు అయిన జాలి, వాత్సల్యం ఉప్పొంగాయి. మెల్లగా వెళ్ళి పార్వతి చుబుకంపట్టుకు ముఖం చూచింది.

"చిన్నప్పటినుంచి నా దగ్గర కూతురులా పెరిగావు. వాడొకటీ, నువ్వొకటీనా నాకు. పిచ్చిపిల్లవి." అంది జానకమ్మ.

పార్వతి బలవంతంగా నవ్వవలసి వచ్చింది.

ꠂ ꠂ ꠂ

ఆ సాయంత్రం పుట్టినరోజు హడావుడిలో ఉన్నది పార్వతి. ఆడంబరం వద్దు—అంటూనే అతి నాజూకుగాను తయారయింది. ఆఫీసులో బాగా పరిచయస్థులను పిలవడం వల్ల వాళ్ళందరూ వచ్చి పార్టీలో పాల్గొని, అభినందించి వెళ్ళిపోయారు.'

సరోజ చదువుముమ్మరంలో ఉన్నా, పార్వతి కోపం సంగతి గుర్తురాగానే కదిలివచ్చింది.

ఇద్దరుచెలుల ఇష్టాగోష్ఠి చాలాసేపు సాగింది. సరోజ ఏవిషయాన్ని — అది చెప్పదగినదైనా, చెప్పదగనిదైనా ఎక్కువసేపు హృదయంలో దాచుకోలేదు! హితులు, ప్రేమాస్పదులు అయినవాళ్ళదగ్గర అసలు ఆలోచించదు. అందుకే అంది నవ్వుతూ: "మీ రాజుగారు ఏం చేద్దామను కున్నారో తెలుసా?"

"ఏం చెయ్యాలనుకున్నారు?" కుతూహలంగా అడిగింది పార్వతి సరోజకు అభిముఖంగా తిరిగి.

"పక్షులకేకాదు, మనుషులకీ రెక్కలున్నాయి— అన్నాడు." సరోజ వ్యంగ్యంగా చెప్పింది.

"అర్థమైందా?" అన్నది తిరిగి.

"లేదు"

"మీ పెళ్ళి ఇంకా నెలరోజు లుందనగా నా దగ్గర కొచ్చి, 'మనిద్దరం పెళ్ళి చేసుకుందాం; కాకపోతే లేచి పోదాం, పద' మన్నాడు"

పార్వతి తెల్లబోయింది. "ఆఁ! అలా అడిగాడా? నువ్వేమన్నా వప్పుడు?"

"ఏమంటాను? 'రాజాధిరాజా! తమరు పార్వతిని గనక చేసుకున్నారంటే నన్నొక చీమకన్నా అధ్వాన్నంగా చూస్తారు' అని బుద్ధిచెప్పి పంపాను."

"ఎంతపనిచేశావు సరూ! రాజు అలా నిన్నుకోరితే నాతో చెప్పమన్నాను కదా? దొంగలా ఊరుకున్నావా? ఛ! నీ మాటలు నమ్మకూడదు."

"లేకపోతే కొండంత నీ ప్రేమ కొల్లగొట్టి పుట్టగతు లేకుండా చేసుకోమన్నావా? ఆయినా పెళ్ళిచేసుకున్న తర్వాత నేనేం డాక్టరు నౌతానే నా మొహం?"

చాలాసేపు మౌనంగా ఉండిపోయింది పార్వతి.

"ఏమిటే ఆలోచన? రాజూ, నువ్వూ రాజీ అయి ఉంటారిప్పుడు. కదూ? ఇందాక నేను వస్తూంటే నీ నామ భజన చేస్తున్న ట్లగుపించాడు."

పార్వతికి నవ్వు వచ్చింది. "నామభజనకాదది. తిట్ల భజన!" అంది.

"నిజంగానా! ఫరవాలేదు లే. అతనే క్రమంగా మారతాడు. నువ్వు బెంగపెట్టుకునే రకానివి కావుగా?"

"ఏమిటో? స్వేచ్ఛ దొరకడంలేదు. చిరాకుగా ఉంటోంది" అంది పార్వతి.

కొంతసేపాగి పార్వతే మాట్లాడింది." రాజుదగ్గర కోపంలో నీగురించికూడా చెడ్డగా మాట్లాడాను సరూ!"

"ఏమని అన్నావేమిటి?"

"ఏవేవో! చెప్పడమెందుకు? నన్ను క్షమించు."

"క్షమించాలే. నే నెలాటిదాన్నయినా రాజు నిన్ను గుర్తిస్తే చాలు!"

సరోజ వెళ్తానంది. అప్పటికి బాగా చీకటి పడింది. సరోజ వెళ్తుంటే చూస్తూ నిలబడింది పార్వతి అందుకోనలేని ఆనందంలా బాధకలిగించే అనుస్మరణం. ఇప్పుడు సరోజ వచ్చి, ఇద్దరూ మాట్లాడుకుంటున్నా, అప్పటిలా, ఇదివరక టిలా చిన్నతనపు ఆటలు, చిలిపిమాటలు రావడంలేదు. ఎంతలో ఎదిగిపోయారు—తనూ, సరోజా!

ఇంట్లో దీపాలు వెలిగాయి. పార్వతి తనవైపు చూసు కుంది. మెరుస్తున్న దుస్తులు. తటిల్లతలా ఉంది. ఇంద్ర ధనస్సును గుర్తుతెస్తున్న అలంకరణ కాసేపు తృప్తికలి గించింది తర్వాత వ్యక్తీకరించలేని నిరాశ.

తను పైకి ఆడంబరంగా, మంచి వ్యక్తిత్వం కల దానిలా కనిపిస్తుంది. లోపల ఏ గొప్పతనం లేదు. వైశిష్ట్యం లేదు.

సరోజ హృదయంపరిచి అన్నీ చెబుతుంది. తను అలా చెప్పలేకపోయిందే? రాజు ఎదట సరోజను గూర్చి తనే మందో ఆ ప్తస్నేహితురాలైన ఆ పిల్లకే చెప్పలేకపోయింది చివరకు.

రాజు నిజంగా సరోజను అంత గాఢంగా ప్రేమిం చాడా? తండ్రికి అంత భయపడేవాడు, సరోజను తీసుకుని

పారిపో యే ప్రయత్నంచేశాడంటే—ఎంతప్రేమ ! అతను కేవలం తనను తప్పించుకోవడానికే ప్రేమ అనే కారణం సృష్టించి, తన ఎదుట సరోజతో అలా ప్రవర్తిస్తున్నా డనుకుంది. అను మానంగా ఉన్నా తనకు పట్టుదల బాగా పట్టుకుంది. తనేం సుఖపడుతున్నది ఇప్పుడు ? లొంగదీసుకుని దాసాను దాసుణ్ణి చేసుకోవలసి వస్తుందనే భయం వణికించేస్తుంది అప్పుడప్పుడు. పూర్తిగా తప్పించుకుంటుంది అందుకే.

అతని సేవకురా లన్నట్టు స్వయంగా చేసుకోనవలసిన పనులుకూడా తన నెత్తిని పెట్టబోతాడు ఆర్భాటంచేసి ఆఫీసుకనో, సినిమాకనో, అవేవీ కాకపోతే తలనొప్పనో దాటుకుంటుంది తను రోజూ అదే కథ ! ఒక్కరోజూ అతని మాట సాగనివ్వలేదు. తన కర్మకి ఇతనిలా తయారయ్యాడు కానీ, అప్పుడు స్కూల్లో చదివేది—ఆ అవంతి ! భర్త ఎంత ప్రేమగా చూస్తాడని ఆమెను ! పువ్వుల్లో పెట్టడమంటే అదే ! ఆమె ఏమంటే అదే. అతనెంత గంభీరుడో అంత ప్రేమహృదయు డన్నమాట రాజును పెళ్ళిచేసుకోనకుండా ఉంటే బాగుండును. ఒకవేళ సరోజ చెప్పినది కల్పనేమో ? ఉఁహూ. అబ్బబ్బ! తనలో ఒకొ్కక్క-సారి ఎంత నీచమైన, కుత్సితమైన ఆలోచనలు ప్రవేశిస్తాయి ఇష్టంలేకపోయినా!

"అమ్మాయీ ! దిష్టితీస్తా, ఇలారా !" జానకమ్మ పిలుపుతో వాస్తవప్రపంచంలోపడింది పార్వతి. రాజు అప్పుడే వచ్చి మేడమీదకు వెళ్తున్న వాడల్లా ఆగిపోయి, పార్వతి బట్టలవైపు ఒకసారి నిర్లక్ష్యంగా చూశాడు. "ఈవిడ అంద

చందాలకి ముగ్ధులైపోయి, దిష్టిపెట్టేవాళ్ళెవరూ లేరిక్కడ” అని, పరిగెత్తినట్టు వెళ్ళిపోయాడు గదిలోకి.

పార్వతి కోపంగా ఏదో అనబోయింది. అంతలో బూట్లచప్పుడు వినిపించింది వీధిలో. పార్వతి సహోద్యోగి కృష్ణమూర్తి లోపలకువస్తూ, ఆమెనుచూసి విష్ చేసి కూర్చున్నాడు. పార్వతికూడా ప్రతిగా నవ్వి, మాట్లాడింది.

కృష్ణమూర్తితో ముఖపరిచయాన్ని పురస్కరించుకుని రాజు వచ్చి పలకరించాడు.

పార్వతికి అదొకమంచి అవకాశం. తనెంత అధునాతన యువతో, నలుగురిలో తనెలా వాక్చాతుర్యం ఒలికించగలదో రాజుకు తెలియాలన్నట్లు కృష్ణమూర్తితో కిలకిలలూ పకపకలుగానే మాట్లాడింది.

“మీ పుట్టినరోజుకి నా బహుమతి ఇదే” అంటూ జానెడూ పొడవూ, మూడంగుళాల వెడల్పు ఉన్న ఒక అట్టపెట్టె పార్వతిచేతి కందిచ్చి అభినందనలు చెప్పి వెళ్ళిపోయాడతను.

“ఎవరే, అతను?” అంటూ జానకమ్మ వచ్చింది. ఆత్రుతగా పాకింగు చూసేవరకు మరోపని తోచలేదు పార్వతికి. లోపలనుంచి పాతిక మడతలు వేసిఉన్న జరీనక్షత్రాల పలచని చీర ఒకటి బయటపడింది. అది ఏ రకానికి సంబంధించిన చీరో దాని పే రేమైఉంటుందో రాజు గ్రహించలేకపోయాడు.

చీరమీద చెయ్యిరాస్తూ, "ఎన్నాళ్ళనుంచో ఇల్లాం టిది కొనుక్కోవాలనుకుంటున్నాను. నాకిష్టమైనదే తెచ్చావ త్తయ్యా!" అంది పార్వతి.

"బాగానే ఉన్నట్లుంది దూరానికి" అన్నది జానకమ్మ మూల్యం అంచనా వేస్తూ.

"ఏదీ, చూడనీ" అంటూ చీరలాక్కున్నాడు రాజు పార్వతిచేతిలోనుంచి. ఎగాదిగా చూశాడు పావుగంట. ఇంచు మించు నలిగిపోయేటట్లు పట్టుకుని అతను చూస్తుంటే, పార్వతి గుండెలు దడదడా కొట్టుకున్నాయి ఆమధ్య తన మీద కోపం తీర్చుకోనడం సాధ్యంకాక రెండు మూడు చీరలకు కత్తెరపెట్టాడు. నాలుగైదు స్నోసీసాలు, లవండరు బుడ్లు పగలగొట్టాడు. ఇలా చాలాఉన్నాయి కథలు.

"నలిగిపోతుంది, ఇచ్చెయ్యి" పార్వతి మర్యాదగా అడిగింది.

"ఇది కట్టుకుంటావా? వద్దు" అతని ముఖంలో పెంకి తనం కనిపిస్తున్నది.

"ఏం?" అంది పార్వతి.

"ఇలాంటివి సానివాళ్ళు కట్టుకుంటారు. నువ్వు కట్టు కుంటే సిగ్గుతో నేను ఇదైపోవాలి?"

"సానిదాన్ననే అతనిచ్చాడా? ఇంతకీ నేను ఆనందిస్తే నీ కళ్ళు చూడలేవు. ఆ చీర ఇలాపడెయ్యి. ఇది కట్టుకుని నీకు మాత్రం కనుపించనులే!"

"ఊఁహూఁ! వీల్లేదు. దీనిపని నేను పట్టిస్తాను" చీరను పాంటు జేబులోకి పోనిచ్చాడు.

"తీసికెళ్ళి ఏసాని కిస్తావు?" పార్వతి సహేళనగా అంది.

"ఊరికే వాగకు" అన్నాడు రాజు గదిలోకి వెళ్ళబోతూ.

"నీపుణ్యముంటుంది ఇచ్చెయ్యి. అతనెంతో ప్రేమతో ఇస్తే తగలబెట్టడం న్యాయంకాదు." పార్వతికి ఎలా మాట్లాడాలో తెలియలేదు.

"అతన్ని ప్రేమిస్తున్నావా? మీ ఇద్దరికీ నేనొక విలన్‌లా కనిపిస్తుంటానేమో!"

"నువ్వు వట్టి చవటవి. బుద్ధిలేదు నీకు."

జానకమ్మ నిర్ఘాంతపోయింది ఉధృతం చూస్తూ. మాట్లాడటానికి ఆవిడకు అవకాశమెక్కడ?

"ఏమన్నావు?" గర్జించాడు రాజు.

"అందగాడివని అహంకారం ఎక్కువ కాబట్టి అన్నాను. నే నెవ్వరినీ ప్రేమించలేదు. జన్మలో ఎవరినీ ప్రేమించను గాక ప్రేమించను. నీ పాపిష్టి మొహాన్ని అసలు ప్రేమించను."

రాజుకు ఒళ్ళు తెలియలేదు. ఎప్పుడు పార్వతిమీదికి లంఘించాడో అనూహ్యం; ఎడాపెడా బాదుతున్నాడు. ఎంతైనా మృదుత్వానికి సంకేతం - స్త్రీ. చెంపలు కంది పోతున్నాయి. కంట నీళ్ళుమాత్రం చిందలేదు. విడిపించుకోనడం అసాధ్యంగా వుంది.

జానకమ్మ కంగారెత్తి పోయింది. స్థాణువులా ఉన్న దంతా చక్రంలా కదిలిపోయింది.

"రాజూ! మూర్ఖుడా!" అని అడ్డురాబోయింది. అతను వినిపించుకోనేలేదు. చేసేది లేక, చేతులూ, కాళ్ళూ ఆడక రామనాథంగారిని పిలవడానికి వీధిగదిలోకి పరుగెత్తింది. ఆ అదనుకోసమే చూస్తున్నది పార్వతి. ఆమె అటువెళ్ళగానే రాజు చెంపమీద శక్తికొద్దీ ఒక్క దెబ్బకొట్టి వదిలించుకుని, ఏమేమో అని రివ్వున వెళ్లిపోయింది.

రామనాథంగారు వచ్చి "ఏమిటోయ్?" అన్నారు గంభీరంగా చూస్తూ.

తలవంచుకొని వెళ్లిపోయాడు రాజు.

జానకమ్మ ఎన్ని ఓదార్పు మాటలన్నా, ఆమె తన కొడుకు నెంత నిరసించినా ఆ రాత్రి దిగులుగా కూర్చుంది పార్వతి. అందరూ నిద్రపోతున్నప్పటి నిశ్శబ్దత మొదటిసారిగా అనుభవించింది. పక్కన కొంతదూరాన గదిలో రాజు నిద్రపోతున్నాడు. ఆ అమ్మాయి మాత్రం తన మంచాన్ని వదిలి, అర్థంకాని దిగులుతో ఆలోచించుకుంటున్నది. తండ్రిమీదకు మనసు పోయింది 'అక్కడంత ప్రేమగా చూస్తారు తనను! నిజమైన ప్రేమ, వాత్సల్యం అక్కడే ఉన్నాయి,' అక్క అమాయకమైన చూపు, వెన్నవంటి మనసు గుర్తువచ్చి రాగానే పార్వతి మానసం ఆర్ద్రమయింది.

# 15

నలుగురిలో ఉన్నా, ఒక్కరితో ఉన్నా సరస్వతిది ఒంటరి బతుకు. తండ్రి సేవాసౌఖ్యాలకే ఆమె జీవితం అంకిత మైనట్లుగా ఉంది. అతడు నిర్లిప్తంగా కూతురుచేత అన్ని పనులూ చేయించుకొంటాడు. చేయదగినది, చేయగలిగినది ఏదీ ఉండని వయసు కనుక మగత కమ్మే ఆలోచనల్లోనే, మరలిపోయిన అనుభవాల్లోనే మిగతా కాలం జీవిస్తుంటా డాయన.

ఎప్పుడో ఒకనాడు గుర్తువస్తే—పురాతనపు గదులు తెరిచి, ప్రాచీన గ్రంథలహరి అంతా తిరగవేసి గుణిస్తాడు. తన ఆస్తిపాస్తుల్లో సరస్వతికి కొంత ఎక్కువ భాగం చెందే టట్లు వ్రాసి, మిగిలిన ఇద్దరికీ సరిసమానం చెయ్యాలనే సంక ల్పం. అందువల్ల తన పిల్లల్లో ఎటువంటి కలతలూ రావని ఆయనకు అకుంఠిత విశ్వాసం. ధనమే ప్రాణం అనుకునేవారు కాదు.

పార్వతికి డబ్బంటే నిర్లక్ష్యం. ఒక్కొక్క సమయ ములో ప్రేమ. డబ్బు విషయంలో ఆ అక్క చెల్లెళ్ళకు వేర్వేరు భావాలు, కారణాలు ఉన్నాయి

డబ్బుకోసం తాపత్రయ పడేవారిని చూస్తే సరస్వతికి విస్మయం. దీనివల్ల వీళ్ళేం సౌఖ్యాలు కొనుక్కుంటారు ? అని

ఆశ్చర్యపోతుంది. లక్ష్మి అలా ఊహించదు. పుట్టిన తర్వాత మనిషికి డబ్బు అవసరం ఎంతైనా ఉంటుంది దానికి నిదర్శ నాలు కొల్లలు. కాని మనుషుల హృదయాలతో ఆడుకో నంతవరకే దాని విలువ. లక్ష్మి అటువంటి సహృదయిని. ఆమెకు తండ్రిలాగే సరస్వతి జీవితం విషయంలో ఆరాటం ఉంది.

సరస్వతి అమాయకంగా కనిపించినా ఆమె కూడా వివిధ విశేషాలను తెలుసుకోవాలని ఆకాంక్షిస్తుంది. ముఖ్య ముగా ఆమె ఆలోచనల్లో విశ్వమానవ ప్రేమ ఎటువంటిది ? అనే తర్కమే ఎక్కువ. ప్రధానమైన ప్రేమ సూత్రమే ఆమె పట్ల అన్యాయంగా తెగిపోయి, చీకటి కుహరాల్లోకి నిష్క్ర మించింది. విస్మృతి పథంలో పడిన బంధానుబంధాలు వెన కకు తిరిగి చూస్తే జన్మకు, ప్రకృతికి సంబంధించిన వాంఛలు ఆకట్టుకోలేక, అయిష్టమైనా మనసు మూర్ఖంగా వెర్రితలలు వేస్తే ఆమె కళ్ళు ఎవరికీ తెలియని చోట, ఆంతర్యానికి అర్థమయిన చోట అశ్రుపూర్ణాలౌతాయి. ఏకాంతం ఆమెను మరింత ఏడిపిస్తుంది.

ఆ పల్లెటూళ్ళో పట్టుతప్పని ఆచారాల పడతులు, ముత్తయిదువులు ఈమె అగుపిస్తే పమిట సవరించుకొని మూడుమార్లు ముక్కుతిప్పి వెళ్ళిపోతారు. అందుకు సరస్వతి బెదరదు. సరస్వతి వంటి నిర్భాగ్యురాలికి అంత అందం ఉన్నం దుకు మొదట వాపోయి, పోనీలే ఆమెకు సౌభాగ్యం లేదు —అని తృప్తిపడి, వానినే విచారంగా నటించే అసూయా

హృదయాలు ఉన్నాయి. సరస్వతి మీద నిజమైన సాను భూతి—ఆమెను నూతనంగా చూసిన ప్రతి యువకుడికి కల్గుతుంది. 'వితంతువులా వుందే ! ఎంత దురదృష్టవంతురాలు' అనుకొని సాగిపోతాడు.

ఇటువంటి వెన్ని జరిగినా అశేష జనాకీర్ణ చేతనమయమయి ఉండి, నిరంతర నిరవధి కాకర్షణలతో మెరుపులు మెరిసే ప్రపంచం సరస్వతి దృష్టిలో తరుచుగా జడత్వాన్ని పొందుతుంది. అచేతనంగా మారిపోతుంది.ఒక్క తండ్రి, తను నిలుస్తారు. 'ఈ తండ్రితో తన కెంత గట్టి అనుబంధం ఉన్నదో ఇది ఎన్ని జన్మలనుంచి తరలివస్తున్నదో !'

కర్మ సిద్ధాంతం నమ్ముతుంది సరస్వతి. అలా ఆలోచించిన వన్నీ భగవంతుని చింతనలోకి దారితీస్తాయి కొసకు. అప్పు డనుకుంటుంది. 'నాకంటె అదృష్టవంతు లెవరుంటారు? ఎక్కడుంటారు ? నా కిటువంటి జీవితాన్ని ఇచ్చాడంటే— నేను పూర్తిగా తననే స్మరించాలని పరమాత్ముని కోరిక కాబోలు. చీమల బారుల్లా కిటకిటలాడే ప్రజానీకాన్ని సృష్టించుతున్నాడు పరాత్పరుడు. అందులో ఏ ఒక్కరిమీదనైనా అతనికి తక్కువభావం ఉండదు. కానీ నేనంటే భగవంతుడికి ఎక్కువ ఇష్టం ఉంది. అది నిజం !' ఇలా ఊహించినప్పుడు సరస్వతి హృదయానందానికి అవధులు ఉండవు. తన మనసు కళంక రహితంగానూ, భగవల్లీలా చింతనతోనూ, నిండి ఉన్నప్పుడు హాయి అనుభవిస్తుంది. ఇప్పుడా యింట్లో దేవీ ఆరాధనలతోపాటు విష్ణు పూజలు జరుగుతూంటాయి.

స్నానాదులు, జపతపాలు పూర్తిచేసుకొని ముంగిట నిలబడి భగవంతుడి ప్రతిరూపాలైన పసిపిల్లల ఆటపాటలు చూస్తున్నది. సర్వం మరిచి ప్రేమపూర్వకంగా వారివైపే చూస్తున్న సరస్వతి పార్వతి రాకను గమనించనేలేదు

తనకళ్ళను వెనుకనుంచి వచ్చి మూసిన వారెవరు చెప్మా! అని మొదట కంగారుపడి, చేతుల మృదుత్వం తెలుసుకొన్నతర్వాత, తనకు ఒక్క స్నేహితురాలూ లేదే! అని విస్తుపోయింది

పార్వతి చప్పున కళ్ళమీదచేతులు తీసి సరస్వతి బుగ్గ మీద గట్టిగా ముద్దుపెట్టేసుకొంది. అసలే మోటుపిల్ల పార్వతి, పచ్చచేమంతుల్లాంటి సరస్వతి బుగ్గలు ఎర్రగులాబీ లయ్యాయి.

పార్వతిని చూసి ఆశ్చర్యపోయింది. "ఏమిటే ఈ రావడం? హఠాత్తుగా వచ్చేశా వేమిటి?"

"ఏం? రాకూడదా? నేనేం రానని నీకు ఉత్తరం వ్రాశానా?" బుంగమూతి పెట్టి గబుక్కున నవ్వింది పార్వతి.

"అదికాదు. సంగ తేమిటని?"

"సంగతులు తర్వాత చెబుతాను కానీ నాకుముందు అన్నంపెట్టు. ఆకలితో మాడుతున్నానన్న జ్ఞానమైనా లేదు అమ్మాయిగారికి."

"అవును. ఈ లోగా స్నానం చెయ్యి. వంటవాడిని లేపివస్తాను." అంది సరస్వతి తొందరగా లోపలికి నడుస్తూ.

ఆ రోజు పార్వతి ఏ సంగతులూ చెప్పలేదు. తండ్రికి కనిపించి, ముఖ్యవిషయాలు పొడిగా మాట్లాడింది. అంతే. అదే తొలిసారిగా పార్వతి కా పల్లెటూరు అందంగానూ, ఆనందమయంగానూ కనిపించింది. అక్క మాటల్లోని అమృతత్వాన్ని గ్రహించింది అత్యవసర మని చెప్పి పదిహేను రోజులు సెలవు తీసుకుని వచ్చిన పార్వతి, ప్రేమనిండిన ఆమె మాటల్లో సంపూర్ణంగా లీనంకావడమే కాకుండా—తనమీద తండ్రికి, సోదరికి ఉన్న అనురాగానికి గర్వంతో మైమరచిన స్థితికి వచ్చింది.

ప్రతిరోజూ తండ్రిదగ్గర గారాబం ఒలకపొయ్యటమే పని; అనుక్షణం అక్కయ్యతో ఊసులాడటమే ఉద్యోగం.

"అక్కా! నీ చీర—పెద్ద అకుపచ్చ అంచున్నది—ఒక మాటియ్యి, ఇలా" అని ఓ ఉదయం పార్వతి అడిగితే తెల్లబోతూ తనచెల్లెలు పొడవుగా వేసుకున్న ఒక్క జడవైపూ, తలనిండా పెట్టుకున్న బుట్టెడు పువ్వులవైపూ చూసింది సరస్వతి. 'ఈవిడ కివాళ ఇదేంకోరిక?' అని లోపల అనుకుని "ఆ మోటు చీరలు నువ్వెలా కట్టుకొంటావే?" అంది సంశయంగా.

"మోటు చీరలో, గోటుచీరలో! ఇయ్యమన్నానా?" విసుగ్గా భ్రుకుటి బిగించి జడ ముందుకు లాక్కుంది సాభినయ ప్రబంధనాయికలా.

"అదికాదే! ఊఁ. పోనీ... తాళాలు ఇవిగో. భోషాణంలో ఉంటుంది తీసుకో!"

చెల్లెలు ఒక్కజడతో వయ్యారాలు నటిస్తూ వెళ్తుంటే సరస్వతి నవ్వుకొంటూ ఆమె వెనకనే వెళ్ళింది.

'ఇలా ముస్తాబైతే చాలా బాగున్నట్లున్నానే?' అనుకొంది పార్వతి, అంతా తయారై అద్దంలో చూసుకొంటూ.

ఒకరోజు రాజు నిద్రపోతుంటే తనులోపలికి వెళ్ళింది. అతని గుండెలమీద ఒకపుస్తకం, దానిమీద ఒక చిన్న ఫోటో కనిపించాయి చప్పుడు చెయ్యకుండా వెళ్ళి, ఆఫోటో తీసి చూసింది తను సరోజఫోటో అని గుర్తించగానే విస్మితురాలై పోయింది.అది రాజు చేతి కెలావచ్చిందో తెలియదు కానీ, అందులోని సరోజ ప్రతిరూపం తనకళ్ళకిప్పటికీ కట్టినట్టుంది. అసలు సరోజకన్న, అందులోని సరోజ అందం అనన్యం. పక్కవాటుగా తీయించుకొన్న ఫోటో అది. కొంతవరకు కనిపిస్తున్న జడనిండా పువ్వులు; నుదుటిమీద గుండ్రని తీర్చిదిద్దిన బొట్టు; పెద్దఅంచున్న ఏదోరంగు చీర; దానికి తగిన చోళీ—అంతే. అదే ఆకర్షించింది. అప్పటికప్పుడే ఆవిధంగా అలంకరించుకొని చూసుకోవాలన్నంత ఉత్సాహం పుట్టింది. కానీ, రాజు చూస్తాడ; అతనికి ఇష్టమైనట్లు ఉండేటం తనకు ఇష్టంలేనిదైంది. అది ఇప్పుడు మరీ పెరిగింది. ఏదేమైనా తనకోరిక తీరింది ఇక్కడ. సరోజ అందం తనకు లేకపోయినా ఈ అలంకరణలో అందంగా ఉంది తను.

"ఈ నెక్లెస్ కూడా పెట్టుకోవే! ఇక్కడ పడేసి వెళ్లి పోయావు పెళ్ళిలో." సరస్వతి అందిచ్చింది. "సరోజ పెట్టుకోదే నగలు" గోణిగింది. "సరోజ పెట్టుకోనకపోతే నువ్వా పెట్టుకోనకూడదా? ఎక్కడైనా వ్రాసిఉందేమిటి?" సరస్వతి ప్రశ్న.

దాన్ని సర్దుతూ, "సరోజకీ నాకూ నగలంటే ఇష్టం లేదక్కా!" అంది నెక్లెస్ మెడలో పెట్టుకొని.

"లక్ష్మిలా ఉన్నావు!" అంది సరస్వతి.

# 16

బావిముందున్న దానిమ్మచెట్టుక్రింద కూర్చొని కృష్ణ లీలా తరంగిణి చదువుతున్న సరస్వతి దగ్గరకు పార్వతి పరుగెత్తుకొంటూ వచ్చింది.

చిన్నపిల్లలా ఆమె ఒళ్ళో తలపెట్టుకొని వెల్లకిలా పడుకొంది బట్టలు పాడవుతాయని అక్కగారు గోలపెడుతున్నా. ఆ అమ్మాయికి ఏ సందర్భంలోనూ ఎవరిమాటా లక్ష్యంలేదు. మళ్ళీ చదవడంలో లగ్నమయింది సరస్వతి.

"అక్కా, నీ కెంచక్కా మొగుడు లేడే! ఈ అదృష్టానికి ఎంత నోచుకొని పుట్టావో! ఊం... ఊం!" హఠాత్తుగా పార్వతి అంది.

సరస్వతికి ఆలస్యంగా అర్థమయింది. ఉలిక్కిపడి "ఛీ! ఛీ! ఏమిటా వెధవ మాటలు? లెంపలు వేసుకో!" అంది తర్వాత.

పార్వతి నవ్వడం ప్రారంభించింది. సరస్వతి చెల్లెలి ముక్కు నులిమింది.

"నే నొక టడుగుతా చెప్తావా?" కాసేపుండి అర్థించింది సరూ.

"ఏమి టది?"

"నువ్వూ, రాజూ ఇప్పుడు చాలా సఖ్యంగా ఉంటున్నారటగా? మరి నువ్విక్కడికి వచ్చేస్తే అతనెలా ఊరుకున్నాడు పారూ!"

పార్వతికళ్ళు పెద్దవయ్యాయి. "ఆహా! ఆహా! అద్భుతం? నీ కింకా తెలీదా? అతని హృదయంలో నేను, నా హృదయంలో అతను స్థిరనివాసం ఏర్పరుచుకున్నాం. ఎక్కడికెళ్ళినా మాకు వియోగంలేదు. ఎప్పుడూ తలుచుకుంటూ ఉంటాం. ప్రతిక్షణమూ తిట్టుకుంటూ ఉంటాం!" పార్వతి అన్నది మొహంలో అట్టేమార్పు రప్పించకుండా.

"అదేమిటదీ?" కళ్ళల్లో కళ్ళు పెట్టబోయింది సరస్వతి. "అదొక వింత ప్రేమలే. నీ కర్థం కాదు, నా చిట్టితల్లీ! అవన్నీ కట్టిపెట్టి వేరే కబుర్లు చెప్పు - బుద్ధిగా వింటాను"

"అదికాదు. పారూ! నీపట్ల అతనింకా అప్పటికీ ఇప్పటికీ, ఒక్కమాదిరిగానే ఉన్నాడా అని!"

"మేం ఆగర్భశత్రువుల మని నాకిప్పుడు తెలుస్తోంది. పోనియ్-ఆ ఊసెత్త కింక."

ఇంకెంత ప్రశ్నించీ లాభంలేదనుకుంది సరస్వతి.

"ఇదేం పుస్తకమక్కా?"

"కృష్ణ లీలా తరంగిణి."

"రామలీలా స్రోతస్విని కూడా ఉందా? ఇదుగో, ఇల్లాటివి చదివే నువ్వు పాడవున్నావు"

"ఏం? ఏమయిం దేమిటిప్పుడు?"

"అస్తమానం వ్రతాలు, మడులు, ఉపవాసాలు - ఇంత చిన్నవయసులో ఇవన్నీ ఏమిటి నీకు?"

"చిన్నవయసులో ఇవన్నీ ఆచరించకూడదని నిబంధన ఎక్కడైనా ఉందా? వెర్రిపిల్లా! ఇందులోని ఆనందం నీకింకా తెలియదు. తెలియవలసిన అవసరమూ ఇప్పుడు లేదు. నేనేమో- నేనేమో మరి, వితంతువు నాయె! ఏనాటికేబుద్ధి పుట్టినా ఈ నియమాలు నన్ను కాపాడతాయి ఈ శ్రమంతా అందుకే."

"అబ్బబ్బ! అలా మాట్లాడకు-నాకెందుకో కష్టంగా ఉంటుంది. నువ్వు వితంతువి, కావే! నీకు నేను పెళ్ళిచేస్తాను ఎల్లాగైనా!"

"అదేమిటీ! ఇందాకంతా మొగుడు లేనందుకు నా అదృష్టాన్ని పొగిడి - ఇప్పుడిలా..." నవ్వింది సర్వస్వతి.

"అదికాదే, అక్కా! నీకు మంచి మొగుణ్ణి స్వయంగా వెదికి తెస్తాను."

"చాల్లే! తెల్లవార్లూ ముగుడు మొగుడంటూ అస హ్యంగా..."

"పోనీలే, భర్తఅంటాను...నీకు మంచి భర్తని - అహఁ కాదు కాదు - మంచివరుణ్ణి సాధించి తెస్తాను. నీ మాట జవదాటనివాడు, నువ్వాజ్ఞాపిస్తేగాని కదలనివాడు, నువ్వు ఏమైనా కోరితే పొరపాటునైనా కాదననివాడు..." పార్వతి గంభీరతను పోషిస్తూ చెప్పుకు పోతున్నది.

సరస్వతికి నవ్వాగలేదు. చెల్లెలికి దాంపత్యజీవిత సౌఖ్యం దూరంగా ఉందని తెలుసుకుంది.

ఎప్పుడూ లేనిది పల్లెటూరువిడిచి వెళ్ళటం అనిర్వచ నీయ బాధాకరంగా పరిణమించింది పార్వతికి.

సెలవలైనాయి. ఈసారి సరస్వతికూడా పార్వతిని వదలి ఉండటం కష్టాతికష్టంగా తోచింది. ఇదివరకు తనే బాధ్యత తీసుకునేది. కాని ఆ పిల్ల ఎప్పుడూ తనకింత సన్ని హితంగా తిరగలేదు.

పార్వతి వెళ్ళేటప్పుడు సరస్వతి కళ్ళు నీళ్ళతో నిండి పోతే - పార్వతి సరస్వతి భుజాలమీద వాలిపోతూ, "ఈసారి వచ్చినప్పుడు నీకుమంచి..." అని దీర్ఘం తీసింది. "ఛీ - నోర్ముయ్యి!" అంటూనే కళ్ళొత్తుకుని నవ్వింది సరస్వతి. "నాకన్న పెద్దదైపోయింద ఇది!" అంది చెల్లెలి చెక్కిళ్ళు నొక్కుతూ.

పూర్ణసుధాంశునిలా వెన్నెల్లు కురిపించే సరస్వతి

ముఖబింబం సుదూర మేఘావృత చిహ్నాలుచూసి వెలవెల పోతున్నది మళ్ళీ.

అడుగడుగునా ఎంత ఆశఉందో, అంగుళం అంగుళం మేరకు అంత నిరాశ ఉంది. మానవుడు ఆశాజీవి మాత్రమే కాడు. సిసలైన నిరాశాజీవి కూడా. అందువల్ల సరిసమాన మైన ఆశ నిరాశలమధ్యనే జీవించగలుగుతున్నాడు. ఏ దెక్కువైనా ప్రమాదం.

పార్వతి ఇంటికి రాగానే ఆమె చెవిలో ఒక వింతవార్త పడేసింది జానకమ్మ. ప్రయత్నపూర్వకంగా రాజు పక్క ఊరైన చందనపూర్ హైస్కూలుకు టీచరుగా మార్పించుకున్నాడట ఉద్యోగాన్ని. కాలేజీలో తనంత వయసున్న విద్యార్థులకు బోధకుడుగా ఉండటమే అతనికి విసుగు కలిగించిన విషయమట.

పార్వతి మనసులోనే మథనపడ్డది. 'దర్జాగా లెక్చరర్ హోదాలో ఉండకుండా - ఇతని కిదేం బుద్ధి? బతకలేక బడి పంతులంటారు ఈసారి మరీ ఇదిగా!' అని తలపోసింది.

అంతేకాని, నిలదీసి వేరే కారణాలు అడగగల సాహసం ఆ యింట్లో ఆడవాళ్ళ రాదు. అటువంటి అవసరం ఆ యింటి మగవారికి లేదు.

మొత్తంమీద ఒక పెద్ద సీసంగుండులాంటి రామే పార్వతి గుండెల్లోకి హఠాత్తుగా జారిపడింది. ఆ భారం ఇంకా తగ్గక మునుపే రాజు టీచరుగా పై వూరికి వెళ్ళిపోవడంకూడా జరిగింది. తననుకూడా ఎక్కడ వెళ్ళమంటారో అని పార్వతి

గుండె ఏ క్షణాని కా క్షణం గుబగుబమంటూనే వుంది. అక్కడ చావగొట్టి సేవచేయించుకుంటాడేమో నన్న భయం తప్ప మరొకటేంకాదు. కాగా, చేస్తున్న ఉద్యోగాన్ని అడ్డు పెట్టుకొనబోయింది. జానకమ్మ ఈ విషయంలో తగ్గలేదు. భర్తదగ్గరఉండటమే స్త్రీఉద్యోగం అని ఉపన్యాసం ఇచ్చింది ఆమె.

అయినా మూడు నాలుగు నెలలవరకు ఎలాగో తప్పించుకుంది పార్వతి. ఈలోగా ఒకసారి రాజువచ్చి మళ్ళీ వెళ్ళిపోయాడు. తర్వాత పదిరోజుల కొక ఉత్తరంవచ్చింది. తనకు మంచిఇల్లు దొరికినట్టు, వస్తుసామగ్రులన్నీ ఏర్పడే వరకు ఎవరూ తొందరపడి రావద్దని వ్రాశాడు. తిన్నగా ఆ ఉత్తరాన్ని తీసికెళ్ళి పోపుల డబ్బాలో పడేసింది జానకమ్మ.

పార్వతిని పిలిని ఒక పెద్ద ఆబద్ధం ఆడి ప్రయాణం కమ్మంది.

పాపం జానకమ్మకు ఎంతసేపూ ఒకేవేదన. తప్పించుకోలేని అవసరాల వల్లనైనా తన కొడుకూ కోడళ్ళమధ్య సఖ్యత ఏర్పడితే చాలనే కోరికే ఆమెలో.

ఆవిడ పోరు పడలేకనే పార్వతి ఉద్యోగానికి తిలోదకాలిచ్చి బయల్దేరింది రాజుదగ్గరికి. ఉత్తరం వ్రాసినా స్టేషనుకు రాడని తెలిసి ఆ ప్రయత్నం చెయ్యలేదు. అదే మంచిదనుకొంది జానకమ్మ. ఒంటరిగా వెళ్ళగలిగే సాహసవంతురాలే పార్వతి—అన్న ధైర్యం ఆవిడకుంది.

సాయంత్రం దర్జాగా ఈజీ చెయిర్‌లో కూర్చుని సిగ

రెట్ కాలుస్తున్న రాజు, ఠీవిగా సామానుతో దిగిన పార్వతిని చూడగానే చివ్వున లోపలికి వెళ్ళిపోయాడు.

ఏ ముహూర్తంలో ఆ యింట్లో అడుగుపెట్టిందో కాని నిమిషాలమీద నిప్పువర్షం కురిసిందక్కడ.

“నిన్నెవరు రమ్మన్నా రిప్పుడు?” పార్వతికి జరిగిన సన్మానం అది.

“నువ్వే వ్రాశావటగా రావలసిందని!” ఆశ్చర్యమిళితమైన ఆగ్రహంతోనే అంది సమానంగా.

“ఎవరు చెప్పారు?”

“మీ అమ్మగారే!”

“కల్పించు అబద్ధాలు!”

“కల్పించడానికి నేనేం కథకురాల్ని కాను. అబద్ధాలకోరు నంతకంటే కాను...”

“షటప్! సిగ్గులేకుంటే అవతలికెళ్ళి అరుచుకో! ఇక్కడ కాదు—ఇది నా యిల్లు!”

“నువ్వు విడాకు లిచ్చేవరకు ఇది నా యిల్లుకూడాను. నా కధికారం ఉంది.”

“విడాకులు పుచ్చుకోవడానికే గాబోలు పెళ్ళి చేసు చేసుకున్నావు!” వికటంగా నవ్వాడు.

“నువ్విలా పిశాచివని నా కప్పుడు తెలీదు.”

“నువ్వు శూర్పణఖవని నాకుముందే తెలుసు. అందుకే వద్దు బాబోయ్ అన్నాను.”

"నీ ఇష్టంవచ్చినట్టల్లా తిట్టు. తృప్తిదీరా ఇంగ్లీషు లోనూ, తెలుగులోనూ, అరవంలోనూ తిట్టు. నీలాంటి కాక్ తిట్టినా, కొట్టినా నాకు లెక్కలేదు."

"మళ్ళీ నా చేతి మహాత్యం చూడా లనిపిస్తున్న దేమిటి ?"

"నా చేతి రుచి నువ్వూ చూసేవుగా ?" వెక్కిరించి నట్టుగా అని, అతివేగంగా వెళ్ళిపోయింది అక్కడినుండి.

"ఇక్కడికీ తయారయ్యావు. రాక్షసివి—నా ప్రాణాలు తోడడానికి. ఈ ఇల్లుకూడా తగలబెట్టు !" కోపంగా వీధి లోకి నడిచాడు రాజు.

ప్రజ్వరిల్లుతున్న కోపంలో ఒకఉత్తరం వ్రాసి పడే సింది పార్వతి. అటువంటి దేదో రాక తప్పదన్నట్టు ఎదురు చూస్తున్న జానకమ్మ మర్నాడే ఆఘమేఘాలమీద పరు గెత్తుకొచ్చింది.

ఆమె రాగానే విరుచుకుపడింది పార్వతి—"ఇంత అబద్ధ మాడతావా, అత్తా ?" అని.

"అబద్ధమేమిఉందే ? ముందుగా వస్తే సద్దుకుంటా వనీ !" అంటూ నసిగి వాళ్ళకు ఇంటి పరికరాలు, సదు పాయాలు సమకూర్చి పెట్టింది. ఇద్దరు నౌకర్లనుకూడా కుదిర్చి—

"నేనే ఇక్కడ కొన్నాళ్ళపాటు ఉందునుగాని, ఆయ నకి బోలెడు చిరాకూ, పరాకూను" అంది. లోలోపల 'పాడు పిల్లలు నా చేత అబద్ధాలాడిస్తున్నారు' అనుకుంటూ.

పార్వతి తన ధోరణిలోనే ఉంది. "ఏమో ! వెళ్తే వెళ్ళావు కానీ మళ్ళీ నన్ను చూస్తావో చూడవో ?" అన్నది.

"ఏం ?" భయంగా ప్రశ్నించింది జానకమ్మ.

"నీకొడుకు నన్ను బతకనిచ్చేటట్టులేడు; ఎప్పుడో ఒక నాడు హత్యచేసి తగల బెడతాడేమో నన్ను !"

జానకమ్మకు కష్టమనిపించింది కొడుకునలా అంటూ వుంటే.

"నువ్వుచేసిందే అంతా !" అనేద్దా మనుకుంది. కాని పార్వతిని చూస్తూ చూస్తూ అటువంటి మాటలనడమూ చేత కాదు.

"ఛీ ! అలాంటివాడా నా తండ్రి !" అన్నది ఎలాగో.

పార్వతి ఉలిక్కిపడి, అప్పుడు నాలుక కరుచుకుంది జారిన పొరపాటుకు.

"అది కాద త్తయ్యా !" అని మాటను మలుపు తిప్పింది—"ఈ ఊళ్ళో నాకేం తోచదు, ఏదైనా ఉద్యోగం దొరికేదాకా. ఇన్నాళ్ళూ ఆ పని చేశానన్న మాటేగాని— తలనొప్పి పుట్టింది అట్లాంటి ఉద్యోగాలు చెయ్యలేను నేను."

"ఫరవాలేదు. ఏదో ఒకటి సంపాదిస్తావు కాని ముందు నామాటొకటి వినవే, పార్వతీ !" అర్థించింది జానకమ్మ.

"శ్రద్ధగా ఆలకించి ఆలోచించు. రాజుకి తనెలాచెప్తే అలా నువ్వు చెయ్యాలనే ఉద్దేశమే ఉందనుకుంటాను. నా

మాట విని వాడికెలా సదుపాయాలు జరగాలో కనిపెడు తుండమ్మా. నన్ను విడిచి ఉండటమే వాడికి కష్టం—అందు కని చెప్తున్నా. నీ కిష్టంలేనివి చెయ్యనక్కర్లేదు; ఇందులో నువ్వు చిన్నబుచ్చుకోవలసిందీ లేదు. మీ మీద మీకు అభిమానాలైనా కలుగుతాయేమో..."

పార్వతి మౌనంగా విన్నది. అంతే!

## 17

'అవును. అత్తయ్య కోరికలో అత్యాశ లేదు. స్వార్థం కాదు. అసమంజసంగా మాట్లాడలేదావిడ. ఆమె చెప్పి నట్టుగా రాజుదగ్గర ప్రవర్తించినా తన వ్యక్తిత్వం దెబ్బ తినదు స్త్రీ కనుకనే తను లొంగిపోయినట్లుగా ఎవరూ అను కోవడానికి ఆస్కారం లేదు. ఏదైనా నా స్వతంత్రతే!' ఆరు నెలల అనంతరం అనుకుంం దొకనాడు పార్వతి.

అప్పుడప్పుడే పరిసరాలు అలవాటు పడుతున్నాయి. నిజానికి రాఘవపూర్, చందనపూర్‌లు జంటనగరాల్లాగా ఒకే పోలికల్లో ఉంటాయి కానైతే నగరాలు కావు" చిన్నసైజు పట్నాలనవచ్చు.

ఆ ఊళ్ళో చాలారోజులు పార్వతికి ఎల్లాటి ఉద్యోగం దొరకలేదు. ఊరికేఉండ 'క లెక్చరర్ ట్రెయినింగ్‌కి వెళ్ళింది. తర్వాత ఎంతో ప్రయత్నా నంతరం గ్రాడ్యుయేట్ గనుక -

ఎవరో తెలిసిన పెద్దవాళ్ళు రికమెండ్ చెయ్యగా ఉమెన్సు ఆర్ట్సు కాలేజీలో పని దొరికింది. ఒక సబ్జెక్టుకి ఇద్దరు లెక్చరర్లు కావలసివచ్చి తాత్కాలికంగా పార్వతిని వేసుకున్నారు. ఆమె రెండు జూనియర్ క్లాసుల తాలూకు కొన్ని విభాగాల్లో పని చేయవలసి ఉంటుంది.

సెలవురోజు ఇంట్లో కూర్చున్న పార్వతి మెదడులో ఆలోచనలూ, సమస్యలూ అంతూపొంతూ లేకుండా పుట్టి తలోదారీ పడుతున్నాయి.

కొసను— 'అవును! అలాచేస్తాను' అని కృతనిశ్చయంతో చెంగున లేచింది. మురిపాలు జాలువారినట్టుగా ముస్తాబుచేసుకుంది.

సెలవురోజైతే మాత్రమేం? ఆ రోజంతా రాజు మిద్దెమీదనుంచి ఇంచుమించు దిగకుండానే గడిపెయ్యడం పార్వతికి ఆశ్చర్యం కలిగించింది. అత్తయ్యమాటలు నెమరు వేసుకుంది.

ఏం చెయ్యాలనుకుందో - వంటింట్లోకి సరాసరి వెళ్ళి "బాబుగారికి కాఫీ ఇచ్చావా?" అనడిగింది వంటవాణ్ని.

"లేదండీ! ఆయన పొద్దున్న 'నాకేం అక్కర్లా ఫో' అంటూ కసిరారండీ!" అన్నాడు వాడు నవ్వుతూ పార్వతి వైపు చూసి.

"ఏడ్చావ్! వద్దంటే మాత్రం - టైము ప్రకారం అన్నీ తీసుకెళ్ళి ఆయన కివ్వవూ? నౌఖరు కా మాత్రం తెలియద్దూ?" కోపంగా అరిచింది.

ముఖం మాడ్చుకొంటూ "నౌఖర్లయితే మాత్రం - మాకూ మానం, అవమానం అన్నీ ఉన్నాయండీ ! ఆయ నలా కసురుకుంటే మళ్ళా ఎందుకెళ్లాలట?"

"నోర్మూసుకుని కాఫీ తయారుచేసి ఇలా ఇయ్యి."

వంటవాడు గొణుక్కుంటూచేసి పార్వతిచేతికిచ్చాడు.

పార్వతి మెల్లగా మెట్లెక్కి రాజు గదిలోకి వెళ్ళింది.

ఒకవైపు తిరిగి వాడినమొగంతో నిద్రపోతున్న రాజు ఆమెకళ్ళకు అందంగా కనిపించడమే కాకుండా అపరిమిత మైన జాలిని పుట్టించింది ఆ దృశ్యం.

పాపం - అత్తయ్య ప్రాణసమంగా చూసుకునేది ఇతన్ని. ఆమెను విడిచి ఇతనుండలేడు. అందుకే ఇలా అసౌఖ్యంగా ఉంటున్నాడు.

సరోజను పెళ్ళిచేసుకుంటేఇలాంటి కష్టాలు పడేవాడు కాడా ? - రాజు - తనే బాధలపాలు చేసిందా? రాజు ఇలా ఉద్యోగం మార్పించుకోవడమేం ?

ఉలికిపాటుతో కళ్ళు తెరిచాడు రాజు. తన భుజాన్ని పట్టుకు కుదిపినది పార్వతి అని తెలీగానే క్షణం దిగ్భ్రాంతి చుట్టింది అతన్ని.

తెలివి తెచ్చుకుని "ఎందుకు?" అన్నాడు తీవ్రంగానే.

"ఒళ్ళువెచ్చగా ఉన్నట్టుంది ?" అన్నది పార్వతి అవ నతంగా.

రాజు కాశ్చర్యం ఎక్కువయింది. లేచికూర్చున్నాడు.

"కొంచం జ్వరం తగిలిందిలే ! నువ్వెందు కిక్కడికి?" చిత్రమైన ఫక్కీలో అన్నాడు

"ఏం ? రాకూడదా?" అనబోయేదల్లా తమాయించు కుని – "కాఫీ తీసుకుంటావేమో ?" అంది.

"నిన్ను తెమ్మని ఎవరు చెప్పారు; వాడు తేలేడూ?"

"నే తెస్తే ఏమైందిప్పుడు ?" అః హాసం కొద్దికొద్దిగా బయటపడుతున్నది.

"అక్కర్లేదు; తీసికెళ్ళు."

"వంటవాడు తెస్తే తీసుకుంటావా ?"

"అదంతా నీ కనవసరం. ముందవతలికి వెళ్లు"

"నేనేమీ అంటరానిదాన్ని కాను"

"అంతకన్నా అన్యాయం. వాళ్ళమొహాలు చూస్తే అసహ్యం కలగదు. నిన్ను చూసినా, నీతో మాట్లాడినా, నువ్వు తాకిన వస్తువులు తాకినా రకరకాల పాపాలు చుట్టు కుంటాయి. వేషాలు వెయ్యక వెళ్లు."

"నేను వేషాలు వెయ్యడానికి రాలేదు."

వెంటనే అందుకున్నాడు; "మరెందుకో ఈ దయ చెయ్యడం ? ఈ షోకుల పదర్శనం?"

"ఇష్ట మొచ్చినట్లల్లా మాటాడకు, రాజూ ! మీ అమ్మగారు నీ సౌకర్యాలు చూడమంటే అభిమానాన్నికూడా చంపుకొని వచ్చాను." పార్వతి మొహం ఎర్రబడింది.

"ఆహాహా! ఇప్పుడనుభవిస్తున్న సౌఖ్యాలు చాలవూ? దయచేసి నన్నుతిన్నగా స్వర్గానికే తీసికెళ్లిపోకు. ఈ ఎత్తులు

మానెయ్యి. నా ఆస్తిపాస్తులు చూసి అమ్మకీ, నాన్నకీ మందుపెట్టావు ఇప్పుడు నాకేదో మత్తుప్రయోగం చెయ్యాలని చూస్తున్నావ్! అంతేగా? అంతక్కోరికైతే అక్కడికే వెళ్ళి ఆ డబ్బుతో కులుకుగానీ ఇంకెప్పుడూ నాదగ్గరకిరాకు మర్యాద దక్కదు."

"ఇప్పుడింత మర్యాద దక్కించావు - ఛీ! నీ దగ్గరకి వచ్చినందుకు ఇదే నా మొదటి పాపం!" పార్వతి కందిన మొహంతో విసవిస నడిచింది. మెట్లదగ్గర పైగుడ్డ అడ్డు చేసుకు నవ్వుతున్న వంటవాణ్ణి చూసేసరికి కోపాగ్ని ద్విగుణీకృతమై జ్వలించింది ఆ అమ్మాయిలో.

## 18

"వై ఆర్ యూ లాఫింగ్? వాట్ హేపెన్‌డ్?" పార్వతి గంభీరమైన ప్రశ్నతో క్లాసులో కలకలం, గుసగుసలు సద్దుమణిగాయి.

విద్యార్థిను లందరికీ పార్వతి తత్వం చిత్రంగా కనిపిస్తుంది. ఆమె కట్టుకునే నైలాన్ కలరూ్సు, రాసుకునే లిప్ స్టిక్ ఖరీదులూ వాళ్ళకు ముఖస్థం ఇంత ఫాషనబుల్ లేడీ లెక్చరర్ ఎందుకంత ముభావంగా, గంభీరంగా ఉంటుంది? పొరపాటునైనా నవ్వదేం? సాధారణంగా యువలెక్చరర్సు ఎంత నవ్వుతూ, కేరుతూ రామచిలుకల్లా తిరుగుతుంటారు.

ఈవిడ అలా కాకుండా తన పనేదో తనదిగా ఉంటుంది. అలా వైరాగ్యం ఉన్నట్టు తోచదు. ఈ సమస్యలే ఆ విద్యార్థినులకు క్లాసులో పాఠాలకన్నా ఎక్కువగా మెదడును వేధిస్తున్నాయి. ఒకరిద్దరమ్మాయిలు సాహసంచేసి పార్వతితో మాట్లాడినా, ఆ మెదగ్గర చనువును మాత్రం సంపాదించలేక పోయారు.

అటెండెన్సు వేసినాక క్లాసుతీసుకోకుండానే ఆఫీసు రూమ్‌లోకి వెళ్ళి ఏదోచెప్పి ఇంటికి వచ్చేది పార్వతి.

ఇంట్లోఅడుగు పెట్టేసరికి పదిన్నర చూపిస్తున్నది గడియారం. రాజు స్కూలుకు వెళ్ళినట్టులేదు.

ఉత్తరం కాలికి తగలగానే తీసి చూసింది. సరోజ దగ్గరనుంచి వచ్చింది. యూనివర్శిటికి వెళ్ళవలసిన అవసరాలు, ఇంకేవో ఇబ్బందుల గురించి క్లుప్తంగా వ్రాసిన ఉత్తరం.

చదివిపడేసి నిశ్శబ్దంగా తలపట్టుకు కుర్చీలో కూచుంది తనగదిలో. మెదడు పరిపరివిధాల పనిచేస్తూంది.

తనెందుకు ఇంకా చదవలేదు? అన్న ఆలోచన గడియ గడియకూ ముందుకొస్తున్నది.

'ఇంకా చదువులో ఉంటే ఆ పాటికి జ్ఞానోదయం కలిగి తర్కించుకొని రాజును వివాహం చేసుకోనటానికి అనంగీకారం తేలిపేది తను—'అనే చేజారిన దాని గూర్చి స్మరణ.

తల దిమ్ముగా ఉంది. కాఫీ చేయించుకోవాలి అను కొంది.

"కాఫీ తీసుకోండి !" ఎప్పుడు లోపలికి వచ్చాడో వంటవాడు కాఫీ ఇచ్చి దగ్గరే నిలబడ్డాడు. వాడి సానుభూతి చూపులు పార్వతి గమనించలేదు

"సమయానికి తెచ్చావు—థాంక్స్యూ !" అంది.

పొంగిపోయాడు వాడు.

"మీకోసమని ప్రత్యేకం - స్ట్రాంగుగా చేశానండి !" అన్నాడు. కాఫీతాగి గ్లాసు అతనికి కివ్వబోయేలోగా తెల్లని పువ్వులు కనిపించాయి టేబిల్ పైన. పార్వతి ఆశ్చర్యంగా అతని మొహం చూసింది. మహా విశ్వాసంగా చూస్తున్నాడు.

"ఇవేమిటి ?" అన్నది ప్రశ్నార్థకంగా.

"పాత జమీందారుగారి తోటలోవండీ ! మీకోసం తెచ్చాను" అన్నాడు తన మిడిమిడి జ్ఞానానికి తబ్బిబ్బవుతూ.

'ఉద్ధరించావ్ !' అనుకొని — "నాకు పువ్వులంటే డోకు. తీసుకుపో" అంది.

వాడి మొహం చిన్నబోయింది. "అదేంటండీ ! అలాగంటారు—వీటిని లిల్లీ పువ్వులంటారు ఎంతో కష్టపడి తెచ్చానండీ ?" అన్నాడు.

"ఏ పువ్వులైతే నేమిటోయ్ ! నా కిష్టంలేదని చెప్తున్నా. తీసుకుపోయి నీ పెళ్ళాని కిద్దువుగాని."

"నా పెళ్ళాని కేంటండి! మీలాంటోళ్ళ జుత్తులోనే ఈ పువ్వు లందంగా ఉంటయండీ! పెట్టుకోనండి" అన్నాడు కులుకుతూ.

వదిలేటట్టు లేదు అనుకుంటూ రెండుపువ్వులు తీసి ఒక జడలో దోపుకో బోయేలోగా ఒక పువ్వు కిందపడింది. ఇద్దరూ ఒక్కసారే వంగారు అసంకల్పితంగా. తలలు రెండూ ఛేషుగ్గా ఢీకొన్నాయి.

వంటవాడు చిత్రమైన నవ్వొకటి నవ్వుతూ, పార్వతి నుదురు తన చేత్తో నిమిరాడు. క్షణంలోజరిగిపోయిన దానికి పార్వతి ఒళ్ళు కంపరమెత్తి పోయింది.

"జగ్గూ! ఇక్కణ్ణుంచి ఫో!" బలంకొద్దీ కుర్చీ వెనక్కు తోసి నిలబడింది ఆవిడ ఉగ్రరూపం చూచి స్థంభించి పోయాడు జగ్గు అనబడే వంటవాడు.

"బ్రూట్! పొమ్మంటుంటే గుడ్లగూబలా చూస్తా వేం?"

ఈసారి తేరుకున్నాడు జగ్గు.

"ఏంటండీ! అంతకోపగిస్తారు? తమరు – తిట్టడానికి మేం పడున్నామా? మీరు గాకపోతే మీ తాత ల్దొరుకు తారు!"

"గాడిదా? మాటకి జవాబిస్తావా?" ఇక్కణ్ణుంచి నడుస్తావా? బాబుగార్కి కేకెయ్య మన్నావా?" తీక్ష్ణంగా చూసింది.

"పిల్చుకోండి ! నాకేం భయంలేదు. మీ సఖ్యం సంగతి నాకు తెలీదనుకున్నారా? హె... హె..."

"స్కౌండ్రల్ !" అని ఎఱ్ఱబడిన కనుగుడ్లతో ఇవతలి గదిలోకి వచ్చింది పార్వతి. అప్పుడే రాజు సైకిల్ తీసుకుని స్కూలుకు వెళ్తున్నాడు.

"రాజూ ! జగ్గుచూడు—నెత్తిమీద కళ్ళు పెట్టుకుని మాట్లాడుతున్నాడు. వాణ్ణిప్పుడే గెంటించెయ్యి. నాగదిలో ఉన్నాడు" అంది ఉద్రిక్తకోపంలో. రాజు పార్వతివైపు విచిత్రంగా ఒకమారు చూసి ఏమీ అనకుండా వెళ్ళిపోయాడు.

అవమానంతో తలెత్తలేకపోయింది క్షణంపాటు పార్వతి. అక్కడికి వచ్చిన జగ్గు గర్వంగా చూస్తూ, "అయ్యగారు వెళ్ళమంటే వెళ్తాను. మీ పెత్తన మేమిటమ్మోయ్ ! ఆడ పెత్తనవంటూ రందుకే" అన్నాడు.

"అలాగా ! ఉండు నీ పనిచెప్తాను" అంటూ, మరో గది కిటికీ దగ్గరకి గబగబా వెళ్ళి, "పుల్లమ్మగారూ ! కమలగారూ ! శారదా !" అని కేకలు పెట్టింది పార్వతి. అది విన్న జగ్గు భయపడి జారుకొంటూ—

"తదుపరి మా పాదాలకడకే వస్తార్లెండి." అని గట్టిగా అని, పైగుడ్డ జాడించి వెళ్ళాడు.

పార్వతికి నిజమైన ధైర్యం వచ్చింది.

'అందంగా నిండుగా ఉంటాడు; విద్యావంతుడు, విజ్ఞాని అయివుంటే ఎలా ఉండునో అని ఆలోచించాను. అఖరికి నీచపు బుద్ధి చూపించాడు' అనుకొంది. తర్వాత

సిగ్గుతో అనంతరం అయింది. వాణ్ణి నీచుడు అంటూంది తను. మరి తమ ఇద్దరి నీచత్వం ఎలాంటిది? వాడెంత సంకుచితంగా ప్రవర్తించినా అది అమాయకత్వం, అజ్ఞానం అనుకోవటానికి వీలుంది. మరి?

"ఏమమ్మోయ్! పిలిచావు కేకెట్టి?" అన్నారు పుల్లమ్మగారు భుజాలమీదనుంచి పైటతీసి దోపుకుంటూ, ఆ వెనువెంటనే కమలగారూ వచ్చింది. అంతవరకు ఒకరొకరి పేర్లు తెలుసుకున్నారే కాని పరిచయంలేదు ఆ పొరుగిళ్ళ వాళ్ళు మాత్రం పార్వతిమీద దృష్టి దృఢంగా వేసేఉంచారు అందుకే ఇదే అదనని పరుగెత్తి రావటం.

పార్వతి సంకోచంతో నవ్వుతూ "ఏంలేదండీ! వంటవాడు పొగరుగా మాట్లాడితే భయపెట్టాలని మిమ్మల్ని పిలిచాను. పోయాడు" అంది తర్వాత వెంటనే పుల్లమ్మగారికి సారాంశాలు లాగడానికి అవకాశమివ్వకుండా "వంకాయకూర ఎలా చెయ్యాలో చెప్పివెళ్ళండి, పుల్లమ్మగారూ!" అంది పార్వతి వినయంగా.

"దానికేం బంగారం! అయితే, మీకు వంటలు అలవాటు లేదా? ఆడజన్మం ఎత్తాక వంటలురాకుండా ఉండవులెండి. హుఁ—మా రాధా ఇలాగే వంటలు రావేమోనని భయపడేది..."

కమల, పిల్లలకు వడ్డనచేస్తూ వచ్చానని చెప్పి తొందరగా వెళ్ళిపోయింది.

పుల్లమ్మగారు ఒకగంటసేపు ఉండి వంటలూ, వాటి పద్ధతులూ, కొలతలూ వివరంగా బోధించింది పార్వతికి.

"ఒకరిద్దర్ని చంపితేకాని వైద్యుడు కాడమ్మాయ్ !" అంది. సరోజ జ్ఞాపకం రాగానే నవ్వొచ్చింది పార్వతికి.

వంటవాడు సగం తగలేసి వదిలిన వంకాయను పూర్తి తయారులోకి తెచ్చివెళ్ళుతూ, "అమ్మాయ్ ! మేమంతా చుట్టుపక్కలఉన్నాం. అంతా తోడుపడుతుంటాం. నువ్వు భయపడక్కర్లా. కానీ, ఒహ రహస్యం !" అని వెనక్కు లాగింది పార్వతిని పుల్లమ్మ.

పార్వతి ఆమెవైపు కొత్తచూపు చూసింది.

"ఈ యింటికి కుడివైపుచివర ఒక ఇల్లుంది చూశావ్ ? చూపుకి బంగళాలా ఉంటుంది. ఎప్పుడూ ఆయింటికిమాత్రం వెళ్ళకమ్మాయ్ ! ఆ యింటావిడ మంచిదికాదు. విపరీతం బుద్ధులూను. మొగుడున్నాడా ! వాడొక మొద్దే అనుకో, పిల్లా ! ఆవిడ ఇష్టారాజ్యం. రకరకాల మగవాళ్ళనీ చేరుస్తుంది. మగాళ్ళతో మగాడిలాగే మాట్లాడుతుంది ! ఆవిడ తాలూకు కథే ఎల్లాటి దనుకున్నావమ్మా ! అవన్నీ వింటే మీలాటి పిల్లలు చెడిపోతారు. కానీ – అకెప్పుడూ వెళ్ళకమ్మాయ్. అదే నే చెప్పేది." అలా సుదీర్ఘోపన్యాసాన్ని చదివి వెళ్ళింది పుల్లమ్మ.

# 19

రాజు మనఃస్థితి, ప్రవర్తన మరొకరకంగా మారిపో తున్నాయి. ఇప్పుడతను చాలావరకు మౌనం వహిస్తున్నాడు. గృహకార్యకలాపాలు అతని కిష్టంలేదు. ఇంట్లో ఎవ రున్నారో లేదో తెలుసుకో నవసరం లేనంత మౌనం అతన్ని ఆవరించింది.

బయట స్నేహితులెవరైనా గట్టిగా మాట్లాడిస్తే నవ్వు తాడు. మాట్లాడతాడు. ఇంట్లో అతని గంభీరత మితి మీరింది. ఎంతో కోపంవస్తే తప్ప పెదవి కదపటం మానే శాడు.

పార్వతితో తన కేంపని ? అదేపనిగా నోరెత్తకూడదు— అని నిశ్చయించుకున్నాడు. తన కేం ? మగవాడు ! తనే మైనా చేసుకుంటాడు అంతా తనచేతుల్లో ఉన్నది. ఒక ఆడదానితో అస్తమానం పోట్లాడుతూ గడపవలసిన ఖర్మ ఏమిటి తనకు ?

ఈ మనస్సంకల్పాలు అతన్ని నిర్లక్ష్యంగాను, గంభీరం గాను ఉండేలా కట్టుదిట్టం చేశాయి. అదీగాక అందరూ అనుభవించే సౌఖ్యం అందకుండా పోతున్నదని, తన జీవితం దుర్భరం అయిపోయిందని అతని మనసులో ఆవేదన రోజు రోజుకు రగులుకుంటూంది తల్లి జ్ఞాపకం వస్తే పార్వతిని ఒంటరిగా వదిలి చెప్పకుండా ప్రయాణమై చూసి వస్తాడు.

అది అనేక పర్యాయాలు గమనించింది పార్వతి. 'నేనే అలా మాయింటికి పోతే ఏం చేస్తాడో ?' అనుకుంది. కాని ఎదురు అడగలేదు నిజానికి పార్వతిలోనే నిగ్రహశక్తి ఏర్పడుతున్నది. స్త్రీ పరిస్థితుల కనుగుణంగా నడవటానికి ప్రయత్నిస్తుంది మూడు వంతులు.

కాఫీ, టిఫిన్ పట్టుకుని పైకివచ్చిన పార్వతిని చికాకుగా చూశాడు రాజు. ఏదో ప్రశ్న ఉంది ఆ చూపులో.

పార్వతి గ్రహించి, "జగ్గుమానేశాడు" అన్నది వినయ విధేయతలకు చోటివ్వకుండా.

"గోపాలుడున్నాడుగా ?"

"సరే ! రేపటినుంచి వాడిచేతే పంపిస్తాను."

"ఊం."

చెప్పవలసినది చెప్పికూడా కదల్లేదు పార్వతి ఇంకా. రాజు ఇంగ్లీష్ కాంపోజిషన్ పుస్తకాలు చూస్తూ గమనించనట్టు అటుచూడలేదు.

"నాకొక ఏభై రూపాయలు కావాలి. ఇయ్యి—తర్వాత ఇచ్చేస్తాను" చివరికి పార్వతి అడిగింది అతన్ని సూటిగా చూడకుండా.

"ఎందుకు ?"

"సరస్వతిని చూడాలని ఉంది, వెళ్తాను."

"సంపాదిస్తున్నది ఉండగా నన్నెందుకు, అడగడం ?"

"ఎక్కడ ఉంది ? నువ్విచ్చేదీ, నేను తెచ్చేది ఇంటి ఖర్చులకే అయిపోతుంటే నా డబ్బని ఎక్కడుంటుంది ?"

"ఈసారి నీ డబ్బు నాయింటికోసం ఖర్చు చెయ్యాను."

"అలాగే! ముందు నాకు ఏభై ఇయ్యి."

"నాదగ్గర చిల్లిగవ్వ లేదు. వెళ్ళొచ్చు ఇక!"

"అబద్ధం! ఉన్నది నీదగ్గర. నేనేం మింగెయ్యను. ముప్ఫయ్ అయినా ఇయ్యి రాజూ! జీతాలందగానే తిరిగి ఇచ్చేస్తాను" ప్రాధేయంగానే అడిగినట్టు అడిగింది.

"లేదని చెప్తే నీక్కా—మా? దొంగలా అందరి జేబులు తనిఖీ చెయ్యటం వచ్చుగా? ఇక విసిగించకుండా దయ చెయ్యి."

పార్వతి మరొకమాట అనకుండా కిందికి నడిచింది. రాజుకు అనిర్వచనీయంగా హృదయం స్పందించింది. ఆమె తనను తిట్టినప్పుడు, తనందుకు ప్రతిఫలంగా కొట్టినప్పుడు తన తప్పులేదనే తృప్తికలిగేది. అలాజరగక పోగా తనదే దోషం అని మనసు ఎత్తిపొడుస్తుంటే బాధగా ఉంది.

అతని దగ్గర డబ్బు ఆశించినవారు ఏ కొద్దిమందో ఉంటారు. ఎవరినీ ఇంతవరకు నిరాశపరచలేదు. అలాంటివాడు కనకనే బాధపడ్డాడు. పార్వతి అంటే ఎంత ఇష్టంలేకపోయినా, ఇంచుమించు శత్రువైనా అప్పటికతని ప్రవర్తన అతనికే అసహ్యమనిపించింది.

పనేమీలేక జరిగిన పరాభవాన్ని పునః స్మరించుకుంటూ నించుంది పార్వతి.

ఆ వాతావరణం విరక్తి కలిగిస్తున్నా, తన తత్త్వానికి ఆపరిసరాలు సరిపడకపోయినా ఆమె చేయగలిగిందిలేదు. అత్తయ్య దగ్గరికి వెళ్తే ఆవిడ ఇక్కడికే తోలుతుంది. సరస్వతితో కలిసి తమ గ్రామంలోనే హాయిగా కొన్నాళ్ళుందామంటే-రాజు విషయమై ప్రోద్బలంతో పంపించేస్తుంది ఆ పిల్ల. ఇలా ఎటువెళ్ళడానికీ దారిలేని, వీలుకాని అడవి అయింది తన జీవితం.

సున్నితంగా అత్తయ్య పోషణలో, జాగ్రత్తలలో గారాబంగా పెరిగిన పార్వతికి వదులుకోలేని ఇంటి బాధ్యతలు కాదనుకున్నా చుట్టుకొని చిరాకు కలిగిస్తున్నాయి. రాజుతో ఏమైనా అంటే ఆ మాటలే తిప్పికొడతాడు.

దూరమౌతున్న ఆశాస్వప్నాలు కరిగిపోకుండా బలవంతంగా తలుచుకుంటూ, మధుర జీవితం ఇంక అసంభవం అనిపిస్తున్నా దాన్నే ఊహించుకో ప్రయత్నిస్తూ స్తంభాని కానుకుని శూన్యంలోకి చూస్తున్నది.

గంధపురంగు జార్జెట్ చీరపై తీక్షణమైన సూర్యకిరణాలుపడి అంచులకు మెరుగుపెడుతున్నాయి. ఆ ఎండ సుఖకరంగానే ఉంది. ఆ అమ్మాయికి, నుదుటిమీద స్వేదబిందువులు జారాయి. కంటి కాటుక కొసలు తడికి కరిగాయి. లిప్‌స్టిక్ రూపులేకుండా చెదిరింది. జుత్తుసంగతి చెప్పనే అక్కర్లేదు. కాగా నిడుపాటి ఆ రెండుజడలు కాస్త బిగింపుగానే ఉన్నాయి.

హఠాత్తుగా పార్వతి కళ్ళు వీధి చివర అందమైన గేటుతో ఆకర్షణగా ఉన్న ఇంటిని చూశాయి. తెల్లని గోడలు - రంగురంగుల కర్టెన్‌లు - ముందర పూలచెట్లు - వాటికి పువ్వులు. అరుగుమీద ఆరేళ్ల అమ్మాయి ఆడు కుంటూంది.

పుల్లమ్మగారి హెచ్చరిక చటుక్కున గుర్తువచ్చింది. 'ఏ టో ఆ రహస్యం ?' అనుకుంది అస్పష్టంగా.

'కాశీమజిలీకథల్లో రాజకుమారుడి తత్వం. ఏడవ గది లోకిమాత్రం వెళ్ళద్దుఅంటే అటువైపే లాగుతుంది మనసు.' పుల్లమ్మగారి మాటలకేంలే! నిజానికి పుల్లమ్మగారి మాటల బట్టిచూస్తే - అవి డెవరో అరమరికల్లేని సరదామనిషి అయ్యుండాలి. వెళ్తాను.' పార్వతి ఉన్నది ఉన్నట్లుగానే జోళ్ళుతొడుక్కుని బయల్దేరింది. ఎండ మండుతున్నా కౌతుకం ఎంత దూరమున్నా నడిపించటానికి సిద్ధంగా ఉంది.

గేటుతీసి అరుగెక్కింది పార్వతి, చప్పుడుచెయ్యకుండా. అంతవరకు ఆడుకుంటున్న పాపాయి అక్కడ లేదు. పార్వతి గుమ్మందగ్గరే నిలిచిపోయింది, తనకు కనిపిస్తున్న దృశ్యాన్ని చూస్తూ.

ముందుగదిలో తివాసీమీద ఒక స్త్రీ కూర్చుని అతి దీక్షగా ఏదో గ్రంథం చదువుతున్నది. నిశ్శబ్దం తాండవిస్తు న్నది ఆ గదిలో. ఆమె వయసులో చిన్నదేమీ కాదు. ముప్పైఅయిదు, నలభై పరిసరాలు చూసేఉంటుంది.

ఆమె ఏకాగ్రత, పఠనాసక్తి చూస్తే పార్వతికి

ఆశ్చర్యం వేసింది. ఇటువంటి స్త్రీ వాస్తవానికి పుల్లమ్మగారి వంటివారిని ఆకర్షించాలి. అలా జరగలేదే ? ఈమెలో లోపా లేమిటి ? దుష్టగుణా లేమిటి ?

అలికిడి అయిందేమో - పార్వతినిచూచి ఆమె నిల బడింది.

"ఎవరికోసమండీ?" అన్న దామె పార్వతిని పరిశీలిస్తూ. పార్వతి కేం చెప్పాలో తోచలేదు. మూలను త్రికోణాకారపు బల్లమీద అందంగా నవ్వే కృష్ణ విగ్రహాన్ని చూస్తూ నిలబడింది తనొక ప్రతిమలా. పైన గోడమీద బోసినవ్వుల బాపూజీ ఫొటో.

"ఇలా కూర్చోండి!" చిరునవ్వుతో ఆహ్వానించింది. ఆమె నిరాడంబరంగా తివాచీ చూపిస్తూ.

కూర్చున్నది పార్వతి. అప్పటికీ ఏమని మాట్లాడాలో తెలియలేదు.

"అలిసిపోయినట్టు కనిపిస్తున్నారు. టీ తెస్తా నుండండి!" అన్న దామె లేస్తూ.

"అబ్బే, వద్దండీ!" అంది పార్వతి అప్రయత్నంగా గబుక్కున.

"ఊఁహు - అలాకాదు." నవ్వుతూ లోపలికి వెళ్లింది ఆవిడ.

నాలుగువైపులా కుతూహలంతో చూచింది పార్వతి. మంచి అమరికలోనే ఉంది ఇల్లు. ముందవద్వారంలోనుంచి

చిన్న అమ్మాయి మెల్లగా బయటికివచ్చి పార్వతిని చూచి నిలబడిపోయింది.

ఆ చిన్నపిల్ల తన నంత పరీక్షగా చూస్తూంటే పార్వతికే సిగ్గువేసింది.

"ఇలా దా!" అని పిలిచింది.

"మీరెవరూ?" అన్న దా అమ్మాయి కళ్ళు పెద్దవి చేస్తూ.

"నేనే!" కొంటెగా నవ్వింది పార్వతి.

"అంటే?" అలవోకగా తలతిప్పింది అమ్మాయి.

"అంటే - చెప్తాను. దగ్గరగా దా!" సంకోచిస్తూ దగ్గరికివచ్చిన పాపను ఒళ్ళోపెట్టుకొని బుగ్గలు నొక్కింది. పాపవి అచ్చు సరస్వతిచూపులే. అమాయకమైన మొహంలో అప్పుడప్పుడు కొంటెతనం.

"నే నెవరో చెప్పనా? నేను మీ అక్కని... మరి నీ పేరో?" అంది పార్వతి ముద్దుపెట్టుకుంటూ.

అప్పుడు సిగ్గొచ్చింది అమ్మాయికి. వేలు కొరుక్కుంటూ, "నా పేరేమో - రాధ -" అంది. అన్న వెంటనే ఏం తోచిందో - పార్వతి ఒడిలోనుంచి లేచికూర్చుని మొహంచూస్తూ, "మరేమో... అక్కా... ఎంచక్కా నీకు పాటలు వచ్చా?" అని అడిగింది ఆత్రుతగా.

"అబ్బే! నా కెక్కడవచ్చు? నీకు వచ్చా? ఏదీ, ఒక పాట పాడమ్మా రాధా!"

"పాడితే నవ్వకేం?"

"ఎందుకు నవ్వడం?"

"అమ్మ నవ్వుతుంది."

"అమ్మ నవ్వితే అక్క నవ్వుతుందేమిటి? భయం లేదు, పాడు."

పాప పార్వతివైపు సిగ్గు చిరునవ్వుతో చూస్తూ పాట మొదలు పెట్టింది.

"కృష్ణయ్య చేతిలో వేణువును నేనే
రాధమ్మ సిగలోని పువ్వునూ నేనే..."

ఇంతలో వాళ్ళమ్మ టీ తీసుకువస్తూ "ఏముంటుందండీ ఇది? రాజకీయాలు మాట్లాడుతోందా?" అన్నది నవ్వి.

పార్వతికూడా నవ్వి టీ తీసుకుంది. పాటపాడి బుద్ధిగా కూర్చున్న రాధను దగ్గరికితీసుకుంటూ, "ఎవరు నేర్పారమ్మా ఈ పాట?" అంది పార్వతి.

"మాష్టారు" అంది పాప.

"దీని మాస్టారూ మా యింట్లోనే అద్దెకుంటున్నారు. ఆయన ప్రాణాలు తోడేస్తుంది ఈవిడగారు." ఆమె చెప్పింది.

"అలాగా! పెంకిపిల్లా!" పాప ముంగురులు సవరించి, ఇక వెళ్తానండీ!" అని లేచింది పార్వతి.

"అప్పుడేనా?" అన్నదా ఇంటామె.

"ఈవేళ పరిచయ మయ్యాముగా! వస్తూ పోతూ ఉండచ్చు. మాయిలు మీకు తెలుసా?"

"ఆ మేడయిల్లు కదూ? మీ పేరు చెప్పారుకూరు..." ఆవిడ నవ్వుతూ అంది.

నాలుక కొరుక్కొని, "పార్వతి నా పేరు. మీ పేరు కూడా..." అన్నది పార్వతి.

"సుభద్రఅలెండి" అన్నదామె.

"నేను మీకన్నా చిన్నదాన్ని నన్ను పార్వతీ అని పిలవండి."

సుభద్ర మొహం వికసించింది.

"అలాగే పార్వతీ! ఇదుగో నన్నల్లరిపెడుతుంది - కూడ తీసుకుపోయి కబుర్లుచెప్పు." రాధను ముందుకు తోస్తూ అంది సుభద్ర.

"నే వస్తా!" అంటూ పార్వతికొంగు పట్టుకుంది పాప.

ముగ్గురూ గేటుదగ్గిరకి వచ్చేలోగా ఒక యువకుడు మందగమనంతోనే లోపలికి వచ్చాడు. పార్వతిని అక్కడ కొత్తగా చూసి తలవంచుకుని తనగదివైపు నడిచాడు. ఎర్రగా, పొడవుగా, తగినంత పొరుగా కనిపిస్తూ, నిరాడంబరత్వం అతిగా లేకపోయినా నిర్వికారమైన నడతతో గది తాళంతీస్తున్న కొత్తవ్యక్తిని రెప్పవాల్చకుండా రెండు నిమిషాలు చూచింది పార్వతి. తర్వాత సుభద్రవైపు చూచింది. ప్రశ్నార్థకంగా.

ఆ అమ్మాయి చూపును అర్థంచేసుకుంది సుభద్ర. దీర్ఘమైన నిశ్వాసంతోపాటుగా, "ఈ అబ్బాయి గురించి కథలాగానే చెప్పాలి అమ్మాయీ!" అంది బాధ స్ఫురించే స్వరంతో.

"అలాగా!" అన్నది పార్వతి నేలను చూస్తూ.

"ఎవరైనా ఉన్నారా మీకు - అనడిగితే చెప్పడానికి ఇష్టపడడు. ఆస్తి ఉన్నదని అంటాడు. ఎక్కడఉందో ఏమో అంతూపంతూ అంటూ తెలియదు. పాపకి చదువు చెప్పుంటాడు. ఎప్పుడూ ఏదో వ్రాస్తుంటాడమ్మా! అతను వ్రాసినవి పత్రికల్లోవస్తే నా కిచ్చి చదవమంటాడు. అ దతని సరదా."

కుతూహలంగా చూసి, "బాగుంటాయా? చదివా రేమో మీరు?" అన్నది పార్వతి. అతన్నిగురించి తెలుసుకోవాలన్న ఆసక్తి మరికొంత ఎక్కువైంది ఆ అమ్మాయిలో.

"చాలా బాగా వ్రాస్తాడమ్మా! భావాలు బాగా గుప్పిస్తాడు. మొదట్లో అటువంటివాటిమీద నా దృష్టే ఉండేదికాదు. గాని రానురాను ఏదిచదివినా అందులో అమూల్య భావసహితమైన వాక్యాలే నచ్చుతున్నాయి. అర్థంచేసుకోవడానికే అవస్థపడతాంకదా - వ్రాయడానికి ఇంకెంత పాటుపడాలో ఆ వ్రాసేవారు! అన్నట్టు మరో సంగతి పార్వతీ! ఈయన ఒంటరివాడు. రెండేళ్ళక్రిందట ఒకేడు కాపరంచేసిన భార్య పోయిందట. మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. ఎందుకో ఏమో అర్థం కాదు. అందులో నాలాంటి వాళ్ళకు మరీ వింతగా కనిపిస్తారు ఇటువంటివాళ్ళు."

పార్వతి మొదటినుంచి ఉత్సాహం చూపిస్తూనే ఉంది అతని విషయంలో. "ఎన్నాళ్ళయిందేమిటి ఇక్కడి కీయన వచ్చి!" ప్రశ్నించింది.

"ఏడాదిక్రిందట వచ్చాడు. నలుగురిలోఉంటే తెలివైనవాడని ఇట్టే తెలుసుకోవచ్చు. బి. ఎస్. సి. కాబోలు - చదువుకున్నా హెల్తుడిపార్టుమెంటుకుచెందిన ఏదో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. ఇదేమిటా అని నేను, మీ అన్న గారూ ఆశ్చర్యపోయాము. తర్వాత-మంచి హోదా ఇచ్చే ఉద్యోగప్రయత్నం చెయ్యమని సలహాకూడా ఇచ్చాము. కానీ అబ్బాయిది ఉత్తమలక్ష్యాలు సాధించాలనే ఏకాగ్ర చిత్తం అనుకుంటాను. అతనువ్రాసే రచనలబట్టికూడా అర్థమౌతుంది. తన ఒక్కడికోసం ఈ ఉద్యోగం చాలునంటాడు. ఏ పనీ చెయ్యలేనివాడిని, మొద్దుగేదెలా కునికేవాణ్ని నిందించవచ్చు, దేశ సౌభాగ్యరక్షణకు హెచ్చరించవచ్చు. కాని జీవనాధారంకోసం కల్పించేమనిషి ఉద్యోగాన్ని, అదెటువంటిదైనా సరే గౌరవించలేకపోవడం బుద్ధిహీనతతప్ప మరొకటి కాదని వాదిస్తాడు. అతనికి పెళ్ళివిషయంలోకూడా ఇలాంటి అభిప్రాయా లేమైనా ఉన్నాయేమోనని కదిపి చూశాను. కాని ఆ సంగతులు వచ్చినప్పుడు జవాబు చెప్ప కుండానే దాగిపోతున్నాడు. అయినా బుద్ధిమంతుడు కాబట్టి మా యింట్లో ఒకమనిషిలా కలిసిపోయాం పార్వతీ!" చెబుతుంటే వింటూ చుట్టూ ఆవరణలోని పూలమొక్కల సౌందర్య సౌగంధ్యాలను ఆస్వాదిస్తూ మైమరచిన అతివగా మారింది పార్వతి.

ఎర్రగా కందిపోయిన సూర్యుణ్ని చూచి నీలాకాశం

ఫక్కున నవ్వితే పువ్వులురాలినట్టు మబ్బుపింజలు నలుమూలలకు చెదురుతున్నాయి. కందగడ్డగా అయిపోయిన భాస్కరుడి తీక్ష్ణ వదనధోరణి మరికొంత తీవ్రం కాకనూపోలేదు. అయినా అతని అరుణారుణ కిరణజాలాలు దయావీక్షణాలతో అభాగ్య అనాధ జీవులపాలిట చల్లగా మారిపోతున్నవి. అప్పుడప్పుడే తెరలుగా వచ్చే చల్లని సమీరస్పర్శ దేహాన్ని ఊహాలోకాల్లోకి తీసుకుపోవడమే కాకుండా ఉన్నట్టుండి తిరగదోస్తున్నదికూడా. స్వర్గానికి, నరకానికి బెత్తెడుదూరం మాత్రమే నని అక్కడే అర్థమౌతుంది చిత్రంకాదూ మరి!

బకెట్ నిండుగా నీళ్ళు తెచ్చి అరుగుక్రిందనున్న గులాబీ మొక్క మొదట్లో ఒంపుతున్న యువకుణ్ని అవ్యక్తానుబంధ స్ఫూర్తితో చూచింది పార్వతి

"రాధాకృష్ణగారిని పరిచయంచేస్తాను రా పార్వతీ !" అంటూ గులాబీచెట్టుదగ్గరకు లాక్కువెళ్ళింది సుభద్ర ఆ అమ్మాయిని.

ఇరువురూ పరస్పరం తెలుసుకున్నారు.

"ఆయనపేరు వి. ఎస్. రాజుకదండీ! లెక్చరర్ గా కొన్నాళ్ళు పనిచేసినట్టు విన్నాను. ఎందుకు మానుకున్నారాయన?" పరిచయమయ్యాక పార్వతిని ప్రశ్నించాడు రాధాకృష్ణ.

పార్వతి నవ్వుతూ "రాజుకు కూడా మీవంటి ఉద్రేకమే, రాధాకృష్ణగారూ! అయితే మీఅంత మంచివారు మాత్రంకారు" అన్నది.

రాధాకృష్ణ కేవలం నవ్వి ఊరుకోలేకపోయాడు. "నేను మంచివాడినని ఎలా అనుకుంటున్నారు?" అన్నాడు దరహాసం చెదరకుండా. నవ్వినంతమాత్రానికే అతని తెల్లని మొహం ఎర్రబడుతున్నది మాటల్లో చురుకుదనం ఎంత ఉందో వ్యక్తిలో వినయం అంతగా నిబిడీకృతమై ఉంది. ఒకరకపు జీరతో పలికే కంఠస్వరానికీ, అతని నిరర్గళ వాగ్ధోరణికీ బంధితులౌతారు ఇతరులు. ఒక్కొక్క వ్యక్తిలో ఆకర్షణ అతి సూక్ష్మంగాఉండి తెలియకుండానే ఎదటివారిని వశపరుచుకుంటుందంటే అతిశయోక్తి కాదు.

అతని ప్రశ్నకు పార్వతి తడుముకోవలసి వచ్చింది అప్పటికి.

"అలా అనకండి! ఎంత అభిమానంగా ప్రేమతో ఆ గులాబీమొక్కకు నీళ్ళుపోస్తున్నారో ఈ కళ్ళతోనే చూశానుగా!" అంది నవ్వుతూ హాస్యం ధ్వనించేటట్టుగా.

"నా మంచితనం అంచనా వెయ్యడానికి అంటున్నారు గాని నిజంగా తెలిసికాదు. ఆ గులాబీచెట్టు పువ్వులు పూస్తుందని దాన్ని పోషిస్తున్నాను. అక్కడ స్వార్థమే ఉన్నప్పుడు మంచికి తా వెక్కడఉందండీ?" అన్నాడు రాధాకృష్ణ ఆకులకుపట్టిన చీడను వదిలిస్తూ

"మీరు పువ్వులు పెట్టుకోరుకదా! మీ ఇంట్లో ఎవరూ లేరు. స్వార్థ మెలా ఉందంటారు?" పార్వతి ప్రశ్న వినగానే ఆపుకుందామన్నా ఆగలేదతనికి చిరునవ్వు.

నిటారుగా నిలబడిపోయాడు

"బలేగా మాట్లాడుతున్నారు, పార్వతిగారూ ! చూసి ఆనందించడంలోనైనాసరే స్వార్థం ఉంటుందని మీకు తెలీదా? పోనీ, నే నంత సౌందర్యారాధకుడిని కాననుకోండి కనీసం మీ వంటివారి ప్రోగ్ద్తకైనా నేను శ్రమిస్తుండాలి! అది స్వార్థం కాదంటారా? పుట్టుకే స్వార్థం మరొకమనిషి పుట్టాడు అనేకంటే స్వార్థం మరికాస్త పెరిగిందిఅంటే బాగుం టుందనుకుంటాను. భగవద్విలాసం అనండి, మరొక టనండి- నేను అంగీకరించగలను. కాని స్వార్థరూపంతో పుట్టినమనిషి త్యాగకల్పనతో రూపుదిద్దుకోగలితే అవధుల్లేని అతని ఆనందానుభవం వర్ణనకు అతీతంగా నిలుస్తుంది."

పార్వతికి అతని అంతఃకరణను వింటున్నట్టుగా ఉంది. రాధాకృష్ణ వాదనలోకి చొచ్చుకుపోయాడంటే మరొకరు మేలుకొలుపు పాడకపోతే లాభం ఉండదు.

"మీరు రచయితలు కనక ఇలా తర్కిస్తారు ప్రతి దాన్నీ" అంది చివరకు పార్వతి.

ఆశ్చర్యపోతూ, "ఏదో వ్రాస్తానుకాని - నా రచనల మీద నాకంతగా విశ్వాసంలేదు. భావవిశృంఖలంగా వ్రాసినా వాటి పై శిష్ట్యాన్నినమ్మలేను. మీ కెలా తెలుసు!" అన్నాడు రాధాకృష్ణ.

"తెలిసింది మీ మంచితనంగురించి సుభద్రగారు చెప్పారు

"ఓహో! ఆమె అలానేచెప్తారు అందరికీ. మీకుగులాబీ లంటే ఇష్టంలాఉంది-ఒక మొక్క తీసుకెళ్లి మీ ఇంటిముందు

వెయ్యండి." రాధాకృష్ణ అంటుకట్టితీసిన ఒకమొక్క పార్వతికి ఇచ్చాడు.

"నేను పట్టుకుంటా, మాస్టారూ!" అంటూ తీసుకుంది పాప. "రాజు కోప్పడతారేమో! కోపంలోఉంటే ఇటువంటి వాటికి వ్యతిరేకంగా వాదిస్తారు" అన్నది పార్వతి మొక్కను పాపచేతుల్లో చూస్తూ.

రాధాకృష్ణ ఏదోఆలోచిస్తున్నాడు. అప్పుడే మాటలు వింటూ లోపలినుంచి వస్తున్న సుభద్ర నవ్వుతూ, "పేరు తోనే పిలుస్తావా మీ ఆయన్ని? మరేం ఫర్వాలేదు. అన్నిటికీ సుఖమైన మార్గం" అన్నది.

పార్వతికి ఏమైనా అనాలని అనిపించినా సంకోచం వదల్లేదు.

* * *

సుభద్ర ఇంటినుంచి పాపను తోడుతీసుకు మరీవస్తున్న పార్వతిని ఆవగింజైపోయిన మొహంతో తాటికాయలంత కళ్ళుచేసుకుని వాళ్ళవసారాలోనుంచి తొంగి తొంగి చూస్తున్నది పుల్లమ్మ. అది గమనించకపోలేదు పార్వతి.

స్థలనిర్ణయం చెయ్యకుండానే ముంగిట్లో గొయ్యి తవ్వనారంభించింది పాప.

పార్వతి ఆ పిల్లనాపుతూ "ఉండమ్మా, రాధా! చెట్టు పాతడంతో సరేనా? ఎండ తగినంత పడుతుందో లేదో చూడొద్దా? పిచ్చిపిల్లా! ఇదుగో ఈ పక్కన మంచి

పదునైన చోటు-ఇక్కడే ఆ పనేదో చెయ్యి !" అంది ఒక వైపు చిన్నపరిశ్రమకే స్వేదబిందువులు జాలువారే ముద్దు మొగాన్ని చేరదీస్తూ.

పార్వతిని వదిలించుకుని గెంతుతూ వెళ్ళి ఆజ్ఞ పాలించింది పాప

సానుకూలమైన స్థలంలో పాతిన మొక్కకు నీళ్ళు పోస్తూ ఆనందించిన పార్వతికి ఆ సమయంలో పాపే ఉన్న ఒక్క చెలికత్తే.

"ఎప్పుడు పూస్తుందో పూలు ?" సాలోచనగా నిలిచిన పాపకళ్ళు చూసి భుజాలవరకు ఎత్తేసింది పార్వతి ఆ పిల్లను.

కిరుసు గేటుచప్పుడుతో రాజు లోపలికిరావడం చలించనీయకపోయినా, రాజుతోపాటు పుల్లమ్మగారు గదిలోకి అడుగుపెట్టడం ఆశ్చర్యంలో ముంచింది.

పార్వతిని నిలబడినచోటుకు రాజు కనిపిస్తున్నాడు. ఆమె చెప్పేది వింటున్నాడు ఉదాసీనంగా. పుల్లమ్మగారు ఎందుకైనా మంచిదని అదృశ్యంగానే ఉన్నారు. మాటలు మాత్రం నిబంధనలను పాటించేస్థితిలో రావడంలేదు. జోరుగా సాగివస్తున్న ఆమె గొంతుకలో పార్వతి వినాలనే ఉద్దేశం ప్రబలంగా ఉన్నది.

"అబ్బాయీ ! నే నెటువంటిదాన్నో నీకుగాని, మీ ఆవిడకుగాని తెలియదు. ఎవరికైనా మంచిజరుగుతుందంటే నా ప్రాణాలుకూడా వాళ్ళదగ్గర విడిచివస్తాను నేను. అంత

నిస్వార్థబుద్ధి నాది! ఇంక ఎవళ్ళయినా నశించిపోతున్నారా! నా జీవం గిజగిజ కొట్టుకుపోతుం దనుకో, బాబూ! వాళ్ళ బాధలన్నీ నావే అన్నట్టు గింజులాడిపోతాను—అలాంటి నా మాట తీసిపెట్టి ఇవాళ మీ ఆవిడ, నేను 'వద్దు చెడిపోతా' వన్న వాళ్ళింటిగడప తొక్కింది. చిన్నపిల్ల నే నేమీ నొచ్చుకోను గానీ నువ్వే మందలించి దారికితీసుకురా! వాళ్ళేం పగవాళ్ళానాకు? ఆవిడబుద్ధులు నాకు నచ్చవు. ఆడదంటే ఎలా పడుండాలో ఆవిడకి తెలియదు. గొప్ప అహంకారమయ్యా! అడ్డమైనవాళ్లనూ చేరుస్తుంది. అందు కనే మన పార్వతిలాంటి లేతపిల్లలు చెడిపోతారనే ఆరా టంతో పనిగట్టుకు వచ్చాను. ఇంకవస్తాను—పులుసుముక్కలు పొయ్యిమీద వేసొచ్చాను నాయనా!"

పుల్లమ్మగారి మాటలు వింటున్న పార్వతికైతే నవ్వు వచ్చింది. కాని, రాజు తనవైపు చూస్తానే నమ్మకంతో నవ్వు పెదాలమీదకైనా రాకుండా కాపాడుకుంది.

అయినప్పటికీ గురితప్పకుండా వచ్చిన రాజు దృగ్బా ణాలు పార్వతి వినీల నయనాలను తాకనే తాకాయి. విది లింపుగా అడుగులేస్తూ, సహేళనగా చూస్తూ నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు నిముషంలో.

హంసలా నడుస్తూ వెళ్తున్న పుల్లమ్మగారిని చూస్తూ నిలబడ్డది పార్వతి—పోట్లాడా లనిపించని పెద్దతనం కనిపిస్తున్న పుల్లమ్మగారిని.

పాప తనచెయ్యి పట్టుకు లాగేవరకు ప్రస్తుతంలోకి రాలేదు ఆ అమ్మాయి.

"ఎవరు ?" అంది పాప. ఆ అమ్మాయికళ్ళు గది గుమ్మంలోకి చూస్తున్నాయి.

పార్వతి పరాధీనంగా ఉందేమో—"రాజు !"అనే సమాధానం అర్థశూన్యంగా బయటపడింది

"రాజా ?" పాప పలుకులోని పసితనం పార్వతిని లోకంలోకి తెచ్చింది.

"నువ్వు సరిగ్గా నాలాగ పలకలేవు ? ఏదీ—ఇలా అను; రాజు !"

"ఊఁ ?"

"రాజు !"

"రాజు"

"ఆఁ... అలా"

"నేను వెళ్తా రాజుదగ్గరకి అక్కా."

"వెళ్లు." నవ్వుతూ చూచింది పార్వతి

ఒక్కనిమిషం ఆగకుండా రామచిలుకలా రివ్వుమంది పాప.

## 20

కుర్చీలో కూర్చుని అరగంటనుండి ఏదో అడగాలనే గుంజాటనలోనే తపించిపోతున్నది పార్వతి. ఎదురుగా చాప మీద సుభద్ర కూర్చుని చేతిలోని భాగవత గ్రంథాన్ని దీక్షగా చదువుతున్నది.

అలసటవల్ల పార్వతి చెంపలు, కనురెప్పలు తడిశాయే కానీ అడగాలని ప్రయత్నించినదేదో అడగలేకనే పోయింది.

ఈమధ్య సెలవదొరికితే పార్వతి కాలు ఇంట్లో నిలవడంలేదు ఎప్పుడూ సుభద్రతోనో, రాధాకృష్ణతోనో మాట్లాడాలన్న తపనే.

బరువుబాధ్యతలు నెమ్మదినెమ్మదిగా భుజాలమీదకు పాకుతున్నప్పటి అవిరామశ్రమ వాళ్ళను ఆత్మీయులుగా మారుస్తూ ఉంది—పార్వతి అవ్యక్తాంతర్యపు మేరకు.

ఆదినుంచి చేస్తున్న ప్రయత్నమంతా అడవిదారి పట్టింది

సుభద్ర మెల్లగా రాగధోరణిలో పార్వతికి భాగవత పద్యాలు వినిపించడానికి సంసిద్ధురాలైంది

పార్వతి మౌనంగా ఉన్నదనే సంశయంతో "నువ్వెప్పుడైనా భాగవతం చదివావా పార్వతీ?" అన్నది మెల్లగా ఆవిడ.

"ఇంకా ఆ జోలికి వెళ్ళలేదండీ ఎప్పుడూ. జీవితంలోనే నిలవని సౌఖ్యాలు, ఆశలు ఈ పురాణ గ్రంథాల్లోనూ, ఇతిహాసాల్లోనూ ఉంటాయంటే నమ్మలేను. ఎందుకంటున్నానంటే—ఇంటర్ క్లాసులో ఇప్పుడు మీరు చదువుతున్న గ్రంథంలోని కొన్నిఘట్టాలు మాకు పాఠ్యభాగాలుగాఉండేవి. అవి చదివేటప్పుడు నా కెల్లాంటి ఆనందమూ కలగలేదు. సౌఖ్యాలు అందలేదు. అందరూ అనుకునేవి వట్టిమాటలు అనిపించింది నాకు."

పార్వతి సామాన్యదృష్టికి బాధపడినట్లు సుభద్ర ముఖకవళికలు కొద్దిగా మారాయి. ప్రతివాదనకోసం తాపత్రయం లేకపోయింది. అందుకు కారణం వారిద్దరికీ వయసుభేదం ఎక్కువగానే ఉండటం.

ఇద్దరిఇళ్ళకూ రాకపోకలవల్ల పార్వతిస్థితి కొంత అర్థం చేసుకుంది సుభద్ర. ఆవిడకు తెలివితేటలూ ఉన్నాయి, అనుభవమూ ఉంది.

"పొరబడుతున్నావు, పార్వతీ! ఏ స్వల్పవస్తువునైనా, విషయాన్నయినా బాగా పరిశీలిస్తేకానీ దాని ప్రమాణమూ, లక్ష్యమూ అర్థంకానట్లు జీవితపోరాటంలో అలిసిపోయి బాగా గాయపడితేగానీ దైవాన్నిగూర్చి ఆలోచించం. అలా ఆలోచించనంతవరకూ ఆ జగదీశ్వరుడు అర్థంకాకపోవడంలో వింతలేదు" అందామె. అనుభవమూర్తి అయిన స్త్రీ కనక నిశ్చలంగా అంది.

"అయితే భగవంతుడొకడు తప్పక ఉన్నాడంటారు

మీారు? అతన్ని నమ్మితీరాలంటారు! అంతేకదూ? పోనీ, మీారే చెప్పండి, ఏ దేవుడిగురించయినా. శ్రేణుల ప్రకారం చెప్పుకురండి. ఏ దేవుడు ఎక్కువహోదాలో ఉంటే అతగాణ్నే నమ్ముకుంటాను" అంది పార్వతి—అలక్ష్యమైన పెద్ద నిట్టూర్పుతో, సుభద్రగారిమీాదికే భారమంతా నెట్టుతూ.

ఆమె మందలించింది. "ఇల్లాంటి పవిత్ర సద్వాక్కులు హాస్యం పట్టించకమ్మా! 'పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' అన్న వాక్కు ఆధారంగా ఆ నాటినుండి, ఈ నాటివరకూ అందరూ నమ్మేఉన్నారు. కొట్టిపారెయ్యడం ఎంతకష్టం!"

"అదికాదండీ, మరి? మీారొక దేవుణ్ణి నమ్మారు కదా! ఎప్పుడూ పూజలు చేస్తున్నారుకదా! ఆ పరమ పురుషుణ్ణే నాకూ డా పరిచయం చెయ్యండి నా శక్తికొలదీ ధ్యానిస్తాను."

సుభద్రమ్మకు నవ్వువచ్చింది. "బలేపిల్లవు! నేను పరిచయం చేసే దేమిటమ్మాయ్, వెర్రిగానీ! కావలిస్తే నా దగ్గరున్న పురాణాలు, గ్రంథాలు ఇస్తాను. విశ్వవ్యాపిఅయిన సర్వేశ్వరుడు ఒక్కడైనాసరే, పదిమంది అయినాసరే నీకు నచ్చిన దివ్యస్వరూపాన్ని నమ్ముకో. అన్నీ అర్పించుకో. ఇంతకంటే భగవానుడిగూర్చి నాకుమాత్రం ఏంతెలుసు? ఏం చెప్పగలను?" అన్నదామె కొసకు నిర్లిప్తంగా.

పార్వతి ఊరుకోకుండా, "అబ్బే, లాభంలేదత్తయ్యా!

తప్పించుకోవాలని చూడకండి. ఉదారగుణ సంపన్నులు కాబట్టి మీరు భగవంతుడి కెంతో ప్రియమైనవారని నా ఉద్దేశం. మీ కెంతో పరిచయమై ఉంటాడు. నాకూ కాస్తా ఆయన్ని పరిచయం చెయ్యండి! తర్వాత ఆ దేవుడి కాళ్ళా వేళ్ళా పడి, 'సుభద్రగారిమూలకంగానైనా నాతో మాట్లాడు స్వామీ' అని ప్రార్థించుకుంటాను" అన్నది.

ఎదుటివ్యక్తి భగవంతుని ప్రస్తావనలో తనకు అంత విలువ ఇవ్వగానే సుభద్ర ముఖంలో ఆనందరేఖలు, వెలుగు రేఖలు కలిసి సౌదామినీలత లయ్యాయి. సుభద్ర అయినా జీవితంలో సంపూర్ణ ప్రశాంతతను పొందని మనిషే. చరా చరాఖిల జగత్త్రాణ విభుణ్ణి పరిపూర్తిగా విశ్వసించిన స్త్రీ.

"పోనీ. మీ కే దేవుడు ఇష్టమో చెప్పండి—మిమ్మ ల్నెక్కువ శ్రమపెట్టడ మెందుకు నేను?"

"చెప్పనా? నా ఆరాధ్య దైవం కృష్ణుడు." చెప్పి తృప్తిగా నవ్వింది సుభద్ర.

"కృష్ణుడా?" పెదాలు చప్పరించింది పార్వతి.

"ఏం?" సుభద్ర తత్తరపడుతూ నిలవేసింది.

నవ్వి "ఏంలేదండీ! మా కాలేజీలో ఒకరిద్దరు పురు షోత్తములుండేవారు పూర్వం. తిరుగులేని ఆ రొమాంటిక్ హీరోలను చూసిన దగ్గరనుంచి కృష్ణపాత్రలోని ఉదాత్తత ఏమిటో, గంభీరత ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించడం మానుకున్నాను. తర్వాత దానికి ప్రాధాన్యం ఇచ్చే ఓపికా, నశించాయి లెండి! ఏమైనాసరే, సుభద్రత్తయ్యా! మీరు

చెప్పారు. అంతేచాలు. ఇకనుంచి కృష్ణుణ్ణే పూజిస్తాను. ఎవ రైనా అడిగితే ఆ గోపాలకృష్ణుడు మా సుభద్రగారి దైవం. అందుకే నా దైవంకూడా అయ్యాడని చెప్పి తప్పించు కుంటాను" అంది పార్వతి.

ఈసారి సుభద్ర ముఖంలో ఏ భావాలూ ద్యోతకం కాకపోయినా ధోరణి గంభీరంగా ఉంది. పార్వతి అన్న మొదటి వాక్యాలే పనిచేస్తున్నాయి ఆవిడలో.

"అపార్థం చేసుకుని అంటున్నావు పారూ! నీ మాటలు వినదగ్గవికావు. భగవంతుని సంకల్పసిద్ధాంతాలు అర్థం కాన ప్పుడు నీచంగా, అనుభవహీనంగా మాటాడటం మనిషికి సహజం. నీలా చదువుకున్నవాళ్ళు నాస్తికులైనా అభ్యంతరం ఉండదు కానీ, హృదయాల్లోనిలుపుకున్న భగవత్స్వరూపాన్ని అధఃకరించి మాట్లాడటం అసహనీయ మైనది."

ఉద్రిక్తభావసంచలితంగా సాగిన సుభద్ర అభిప్రాయ విపులీకరణ వింటూ పార్వతి తల వంచుకుంది.

పశ్చాత్తాపపడుతున్న దనిపించింది సుభద్రకు. అను నయంగా ఆ పిల్లవైపు చూస్తూ, ప్రేమతత్వవేత్త, ప్రేమాధి కారి ఐన జగద్విభు డెక్కడ! కామక్రోధాలకే చలించి లొంగిపోయే సామాన్యమానవు డెక్కడ! పోనీ, పార్వతీ! కృష్ణుడిగురించి నీ కేంతెలుసో చెప్పు చూద్దాం" అన్నది సుభద్ర

పార్వతి ఎక్కువసేపు మౌనం వహించలేదు ఉత్సాహాన్వి తంగా ఆ అమ్మాయి కళ్లు సుభద్రవైపు చూశాయి.

"అయితే భగవంతుడొకడు ఉన్నాడని తప్పకుండా మనసా, వాచా నమ్ముకుంటూ ఉండాలంటారా ?" జీర పోయిన పార్వతి హీనస్వరాన్ని విని సుభద్ర ఆశ్చర్యపడి, చటుక్కున ఆ అమ్మాయివైపు చూసింది. పార్వతి కను రెప్పలు ఆలోచనాతరంగాల్లో పద్మదళాల్లా చలిస్తున్నాయి. ఆమెకు తనేమున్నదో తెలియని బాహ్యస్మృతి.

"అంతా విని మళ్ళీ మొదటికొచ్చినట్టు, ఏమిటీ పిచ్చి ప్రశ్న ?" అన్నది సుభద్ర.

పార్వతి తేరుకుంది ఆసరికి.

"ఇంతసేపూ నాతో మాట్లాడిందంతా తమాషా కేనా ?"

"ఊఁ!"

పార్వతి అంగీకార సూచన వినగానే సుభద్రగారి ముఖమండలాన తిరిగి గంభీర మేఘా లలుముకున్నాయి.

"అయితే ఇక నే చెప్పే దేమీ లేదు పార్వతీ! కానీ, ఒక్కటి నిజం. ఎప్పుడో ఒకనాడు మనిషిలో సంచ లనం బయలుదేరుతుంది. రక్తమాంసాల రూపంతో, ఊపిరి అనే ప్రాణంతో జీవిస్తున్న ప్రతిమనిషీ తనను తాను చూసు కునేందుకు అంతర్ముఖుడైనప్పుడు; అంతేకాకుండా మానవ ప్రాణులకోసం సర్వానుకూల సంకలితమైఉన్న ప్రపంచం విచిత్రపెట్టి, మర్మవేదనలతో తపించి, నశించిపోయే నిరాశా జీవులు కళ్ళకు తోరణాలై ఖేదపెట్టినప్పుడు – అప్పుడు ఆ వ్యక్తి అంతర్యం తనకు తెలియని శక్తి అన్వేషణలో నిర్విరా

మంగా శ్రమిస్తుంది. అలిసిపోతుంది. ఫలితంగా మిగిలిన భక్తిభావం కరిగిపోని నవనీతంగా హృదయంలో సుస్థిరస్థానం సంపాదించుకుంటుంది."

సుభద్రమాటలు పార్వతిని చలింపజేశాయి. ప్రయత్న పూర్వకంగా నవ్వుతూ, "మీ రలా గంభీరంగా మాట్లాడు తుంటే నాకు కష్టంగా ఉంది అత్తయ్యా! మీరు చెప్పినట్లు కృష్ణుణ్ణే పూజిస్తానుగా! సరదాగా ఇంకేమైనా కబుర్లు చెప్పుకుందాం" అంది నల్లని మేఘాలమధ్యకు నిండు చంద్రుడు అకస్మాత్తుగా ప్రవేశించినట్లు, సుభద్రకూడా నవ్వుతూ—

"నిన్ను ఒదిలిపెట్ట నివాళ! కృష్ణుడిగురించి నీకేం తెలుసు? ముందు చెప్పు. ఆయన కేది అత్యంత ప్రియ మైనది?" అంది.

చివరివాక్యంలోని ప్రశ్న సులువుగాతోచింది పార్వతికి.

"రాధ అంటేనే కృష్ణుడికి అత్యంత ప్రేమ" అంది చటుక్కున.

"ఊఁహూ! అంతేకాదు. ఇంకేమైనాఉంటుంది చూడు"

"అయితే... వేణువు."

"ఇంకా ఆలోచించాలి"

"ఆఁ మరిచిపోయాను. గోపికలు."

"అంతేనా?" సుభద్ర ప్రశ్న.

"అంతేమరి! ముఖ్యంగా ఆ మూడింటిలో ఏదోఒకటి అయుండాలి". సందేహంతోకూడిన సమాధానం.

"పిచ్చిపిల్లా! జగత్తు ప్రియమైందికాదా, ఆ పరమ పురుషుడికి? అతడు జగన్నాథుడని నీకు తెలియదా ?

పార్వతి బారెడునాలుక తీసింది. "నిజమే సుమండీ ! ఆ ఊహే తట్టలేదు నాకు మీలాంటి భక్తులకి తెలిసినట్లు నాలాంటి మూర్ఖశిఖామణుల కేం తెలుస్తాయి, ఈ పరమార్థాలు? ప్చ !"

"దుష్టజన నిగ్రహంబును,
శిష్టజ నానుగ్రహంబు సేయుటకొరకై
అష్టమ గర్భమున గుణో
త్కృష్టుడు దేవకికి విష్ణుదేవుడు పుట్టెన్."

చదువుతూ నవ్వింది సుభద్ర—

"విష్ణు డుదితుడైన వెనుక నా దేవకి
భద్రమూర్తియగు సుభద్ర గనియె."

"చూశారా! కృష్ణుడితోపాటు నన్నుద్ధరించడానికని మీరుకూడా అలాగే పుట్టిఉంటారు."

సుభద్ర ఎప్పుడూ లేనిది విపరీతంగా నవ్వి, "పెంకి పిల్లవి" అనేసి లేచింది, పనులు చేసుకోవడానికి.

రెండు మూడు క్షణాల్లో ఇద్దరూ సాధారణ ప్రసంగాల్లో లీనమయ్యారు.

అతి సహజధోరణిలోనే ఉండి పార్వతిచెప్పిన వృత్తాంతంలాటి విషయం వినగానే నివ్వెరపోయింది సుభద్ర. ముఖంలో ఆవేగంతోపాటు సిగ్గుపడినట్లు — ఆ వయసులో

కూడా – తనకంటె చాలా చిన్నదైన ఒక అమ్మాయివైపు ఆమెకళ్ళు సూటిగా చూడలేకపోయాయి.

పుల్లమ్మగారు అన్నమాటలు చెబుతూ "మీలాంటి సహృదయులను అర్థంచేసుకోకుండా అలా ఎందుకు ప్రచారం చేస్తుందో ఆవిడ !" అన్నది పార్వతి.

తర్వాత ఆ అమ్మాయీ సుభద్ర ముఖవర్ణాలను గమనిస్తూనే ఉండటంవల్ల ఉపశమనంగా, "అయినా పుల్లమ్మగారిమాట తోసివచ్చినందుకు మీవంటి మంచి స్నేహితులు దొరికారు. నాది అదృష్టమేనండీ!" అంది.

ఆ అమ్మాయిముఖం చూడకుండా పనులేవో చేసుకుంటున్న సుభద్ర తెచ్చిపెట్టుకున్న నవ్వుతో "ఏమో! నాగురించి తెలిసినతర్వాత నీకూడా నేనంటే అయిష్టమౌతుందేమో పార్వతీ!" అన్నది. అలా అని పార్వతివైపు చూచింది ఆవిడ.

"ఛా! అదేమిటి! మీరంటే నాకెంత ఇష్టమో మీకు తెలియదు." నేలమీద కూర్చున్న పార్వతి చూపుడు వేలితో కనిపించని గీతలుగీస్తూ అంది.

"నా కథ వింటావా, పార్వతీ!" అంది సుభద్ర చేతులు తుడుచుకుంటూ.

"మీకు కష్టమైతే ఎందుకు!" అంది పార్వతి నేల చూపులు చూస్తూ – లోపల వినాలనే కుతూహలం హద్దులు మీరుతున్నా.

సుభద్ర నవ్వింది. "అంతమట్టుకు కష్టపెట్టుకోవలసిన అవసరం ఉండదులే నాచరిత్రలో. అక్కడ కూర్చుందాము రా!" అంది ఆమె.

అప్పుడే వీధిలో ఆడుకొనివచ్చిన పాపచేతిలో లడ్డు ఉంచి రాజుదగ్గరికి పొమ్మంది సుభద్ర.

అది కొంతసేపు గునిసి వెళ్ళాక అటుచూస్తూ, ఇప్పటి పిల్లలు ఇలాటికథలు విన్నా ఫరవాలేదులే. వింటేనే మంచి దేమో - అయోమయపు తెరల్లో ఉండి మానసికానందాన్ని నాశనం చేసుకోకుండా" అంది.

"నే నొక డాక్టరుగారి అమ్మాయిని పార్వతీ! సనాతన భావాలు సడలీ సడలని రోజులైనా నాన్నగారు నాకు కావలసి నంత స్వేచ్ఛ ఇచ్చారు. ఏదో చదువుకునేదాన్ని. పద్దెనిమి దేళ్లు వచ్చాయి. చదువు ఒకభాగం పూర్తయింది. మా ఊరిస్కూల్లో సంస్కృతభాషకు గౌరవం ఉండటాన ధారా ళంగా వచ్చాయి సంస్కృత తాంత్రాలు. అవసరానికి పని కొచ్చేటంత ఆంగ్లభాష వచ్చింది.

"మానవజీవితంలో మార్పు లెంత చిత్ర విచిత్రమై నవో - దేహం, అంతర్యాల వైచిత్ర్యంకూడా అంతటిది. ఇతరులకు అనుగుణంగా నిలవలేనప్పుడూ, వారి హితభాషణ లతో అవసరం తీరిపోయిన ట్లనిపించినప్పుడూ ఈ శరీరం, మనసూ వేర్వేరు రూపాలు ధరిస్తాయి. మనస్సు ఒప్పుకో మన్నదాన్ని శరీరం భగ్గునమండి మరీ ప్రతిఘటిస్తుంది. శరీరం ఆజ్ఞాపించినదాన్ని వినన ట్లే దాటుకుంటుంది మనసు.

లోలోపల రెండూ ఆతపాగ్నిలో అలమటిస్తుంటాయి. దేహానికి వి|శ్రాంతి, మనసుకు |ప్రశాంతి శూన్యం.

"ఇదంతా ఎందుకంటే-పద్ధెనిమిదేళ్ళ నాలో మార్పు వచ్చింది ఒకవ్యక్తికి సర్వం అర్పణచేసెయ్యాలన్న తీ|వ్ర పరిస్థితిలో కొట్టుమిట్టాడిపోయాను. అతనితో పరిచయాన్ని, |ప్రేమనుగురించి ఇంకెప్పుడైనా చెప్పుకోవచ్చు. అతను బి. ఎల్. చదివి, ఒక లాయరుగారిదగ్గర అ ప్రెంటిస్‌గా ఉండేవాడు అప్పట్లో. ముఖ్యంగా చెప్పవలసింది - అతను శాఖాంతరుడు. అదే మా ఇద్దరి వైవాహికబంధానికి అడ్డుపడింది. మా ఉద్దేశాలు సిగ్గువదిలి చెప్పుకున్నా, ఇరుపక్షాలవాళ్ళు |ప్రతిహతం చెయ్యలేని వాగ్బాణాలతో బాధించారు. అసలైనది, లోకమంతా చీకటిగా కనిపించేటట్లు చేసింది. నాన్నగారి తృణీకారమే. ఫలితంగా మా ఇద్దరికీ మా కుటుంబాలమీదనే అసహ్యం కలిగింది. అతని సూచన|ప్రకారం ఇద్దరం కలిసి వెళ్ళిపోయి పెళ్ళిచేసుకున్నాము. అదే కథ !" అన్నది సుభ|ద్ర ముగించి.

"అదా?" అన్నది పార్వతి.

"పుల్లమ్మగారికి మేము లేచివచ్చినవాళ్ళ మనే కబురు గాలిలో తేలివచ్చి తెలిసినా ఆశ్చర్యంలేదు. అంతేకాదు - ఈ |ప్రాంతాలవాళ్లకి నామీద ఇంకెన్నో దురభి|ప్రాయాలున్నాయి. ఎన్ని దు|ష్ప్రథలు వ్యాపించినా నన్ను బాధపెట్టలేదు. కానీ, పార్వతీ..." ఆగిపోయిం దామె చెప్పబోయేవాక్యం అర్ధాంతంగా ఉంచి.

"ఏమైందండీ?" అంది పార్వతి.

సుభద్ర గొంతు సర్దుకుంది. "రావటమైతే వచ్చే శాను కానీ పార్వతీ, తర్వాత కొన్నాళ్ళకు - హృదయం యథాస్థితికి వచ్చిన తర్వాత-నా ఉద్దేశ నిర్దేశాల ప్రమేయం లేకుండానే మనసు అనుకోనివిధంగా ఆవేదనపడటం ప్రారం భించింది ఎవ్వరూ ఎవ్వరి తల్లితండ్రులపట్లా చెయ్యలేని అప రాధం నేను నా తల్లిదండ్రుల విషయంతో చేశాను - అనే వేదన కొన్నిసంవత్సరాలు పట్టి పీడించింది ఇప్పటికైనా నా జీవితంలో ఏదైనా బాధ ఉన్నదంటే అదొక్కటే!"

పార్వతి సుభద్ర కన్నుల్లో నీరు ఊహించుకొని చూచింది అటు కానీ కన్నీరు కనిపించలేదు. ఆర్ద్రంగా ఉన్నాయేమో బహుశః? ఒక నిముషంవరకు శూన్యంలోకి చూస్తూ ఆమెకళ్ళు పరిసరాలను పరికించలేదు.

"అయితే మీరు ఆదర్శవంతులు!" అంది పార్వతి చిరునవ్వు నవ్వి.

"ఒక ఆనందాన్ని పొందాలంటే మరొక ఆనందాన్ని విడుచుకోవాలి కాబోలండీ!" అన్నది మళ్ళీ ఆమె హృద యావేదన పోగొట్టే ఉద్దేశంతో.

"అంతేనమ్మా!" అంది సుభద్ర ఒక నిట్టూర్పు విడిచి.

"వెళ్ళొస్తాను అత్తయ్యగారూ! ఇంకా వంట చెయ్యాలి. ఇంట్లో పనులు చేస్తుంటే నా ఉద్యోగాని కొక

సలాం కొట్టి ఊరుకోవాలనిపిస్తోంది ” లేచి ఒళ్లువిరుచుకుంటూ అంది పార్వతి.

"వంటమనిషిని పెట్టుకోవమ్మా! నీ వంటి ఉద్యోగినులకు ఇదే సదుపాయంగా ఉంటుంది." అంది సుభద్ర.

పార్వతి ఏదో అనబోయి ఊరుకుంది మొదట.

"పనివాళ్ళు చేసేవి పనికిరాని పనులే అత్తయ్యా! వృధాఖర్చులుచేసి, ఇల్లు పాడుచేస్తారు." అన్నది జాగ్రత్త కలిగిన గృహిణిని అభినయిస్తూ

"అవునమ్మా! నువ్వన్నదీ నిజమే. నౌకర్లు కావాలని గింజుకోవడమేకానీ, వాళ్ళుంటే మనసుకి ప్రశాంతతే ఉండదు. ఎప్పుడూ వాళ్ళను వెంబడిస్తూ ఉండాలి."

'సుభద్రగారు ప్రతివిషయంలో నాతో ఏకీభవిస్తారు ఎందుకో!' అనుకుని నవ్వుకుంది పార్వతి, ఇంటికి బయలు దేరుతూ.

'ఈమధ్య ఎలాగైతేనేం, చమత్కారంగా మాట్లాడుతున్నాను' అనుకుందిమరొకసారి, ఫుట్‌పాత్ మీద నడుస్తూ.

"హలో, 'రతీ!"

చప్పున తలెత్తి చూసింది మరిచిన మగగొంతు కావటాన ఆశ్చర్యభంగిమతో సహా.

సరైన ఒడ్డూ, పొడుగూతో ఉన్న ఒకవ్యక్తి తన ఎదుట కనిపించాడు. నవ్వుతూ పార్వతి కళ్లల్లోకి సూటిగా చూస్తున్నాడతను.

పార్వతికి గుర్తువచ్చింది. శేఖరం అతను. ఇంటర్‌లో తన వెంటే ఎప్పుడూ తిరుగుతూ, ఇంటికి కూడా వస్తుండే శేఖరం. ఇప్పుడు వెంటనే పోల్చుకో లేక పోవడానికి కారణం-అతను మునుపటికంటె నిండుగాను, బందోబస్తుగాను కనిపించడమే. అప్పుడు బక్క-పలచగా, చప్పన చూసేవారికి దేబి మొగంతో కనిపించేవాడు. ఇప్పుడుమనిషి చురుకుగాను, ఒళ్ళుగాను అగుపిస్తున్నాడు.

"నువ్వా, శేఖరం?" అంది.

"బాగున్నావా?" అతని ప్రశ్న.

"ఏదో నీదయవల్ల ఇలా—"

"రాజేం చేస్తున్నాడు? ఏమిటి సంగతి?"

"టీచర్" పార్వతి పేలవంగా అన్నది.

శేఖరం కుతూహలంగా, "ఇలా చేశాడేం?" అన్నాడు, అంతా విని.

"అతని కదొక రకమైన తిక్క" అంది సరైన సమాధానం చెప్పాలన్న ఉత్సాహంలేని పార్వతి

"మీ ఇద్దరిమధ్య ఏవో పొరపొచ్చా లున్నాయట ? కథ లున్నాయట ?" శేఖరం పార్వతిని పరీక్షగా చూస్తూనే అడిగాడు.

పార్వతి బయటపడలేదు. "ఎవరుచెప్పారు ?" అంది.

"ఎలానో తెలిసిందిలే !"

పార్వతిమాట తప్పిస్తూ, "నా సంగతికేం గాని, నువ్వేం చేస్తున్నట్లు ?" అన్నది.

"మన నలా అడగకు. ఎక్కడపడితే అక్కడ మన సమర్థత నిరూపించుకుని మెప్పించగలం అందరినీ. మీా ఆయనలా నేనూ చవటననుకున్నా వేమిటి ?" అని నవ్వేశాడు.

పార్వతికి అతని భావంలో ఏదో అహం కనిపించింది. కానీ అదెందుకో తెలుసుకోలేక పోయింది అప్పటికి.

"నేను వెళ్తాను, పారూ! నువ్వు చాలా మారావు. ఎంత చలాకీగా ఉండే దానివి! ఇలా తయారయావేం ?"

"మనుషులు మారకుండా ఉంటారా ? నువ్వు మారలేదూ ?"

"నేనుకూడా మారానంటావా ?"

పార్వతి నవ్వింది. "నిజం చెబితే కోపంరాదు కదా! దుక్కలా అయ్యావు" బుగ్గలు పూరించి అభినయించే లోగా, "ఊఁ..." అంటూ నవ్వేశాడు శేఖరం.

"వెళ్తానిక! నీ అడ్రసు ఇవ్వు — నేను రాస్తూ నుంటే..."

"అక్కడికి నేనెప్పుడో రావద్దని అన్నట్లు! అడ్రస్ ఎంతో దూరంలేదు. అదిగో, ఎత్తు ప్రహరీ వెనక మేడ మాయిల్లు. వస్తావా ?"

"అర్జంటుగా ఒకచోటికి వెళ్ళాలి ఇప్పుడు. మళ్ళీ వారంరోజుల వరకు రానేమో! వచ్చాక వెంటనే మీా యింటికి వస్తాలే — కాఫీ తాగి మరి"

"ఏం ? నువ్వు కాఫీ తాగకుండావస్తే మేం చేయించి ఇవ్వవేమనా నీ అభిప్రాయం ? నేనూ ఉద్యోగం చేస్తున్నా నబ్బాయ్, ఏమనుకున్నావో !" అంది పార్వతి నవ్వు తాలుకు

"కాదని ఎవరన్నారమ్మాయ్ ? గొప్పలు చెప్పు కుంటావు బాగా !"

"నువ్వా, నేనా ?"

అలా సంభాషణతో పాటుగా శేఖరం ముందుకు సాగాడు. పార్వతి తిన్నగా ఇంటికివచ్చి, వంటింట్లో దీపం వెలిగించింది.

పొయ్యిమీద ఏదోపెట్టి కూర్చోగానే సుభద్రగారి కృష్ణుడు జ్ఞాపకంవచ్చాడు ఆమెకు. నవ్వుకొని, 'కృష్ణయ్య చేతిలో వేణువును నేనే; రాధమ్మ సిగలోని పువ్వునూ' అని పాడుకుంది చిన్నపిల్లలా

'ఉఁహూఁ! నేనూ బాగా పాడఁతున్నానే!' అనుకుంది, గిన్నెలోనుంచి బయల్వెడలుతున్న ఆవిరిలోకి తదేకంగా చూస్తూ

## 21

హఠాత్తుగా చిన్ననాటిమిత్రుడు—అదివరకు ప్రాణానికి ప్రాణమైన మిత్రుడే అగుగాక—జీవితపు మార్గాలన్నింటా తిరిగి

తిరిగి కలుసుకొని, "అదేమిటోయ్, ఇంత మారిపోయావు?" అని అడిగితే వెర్రినవ్వు నవ్వాలి. "ఈచెట్టు ఎందుకింత పెద్ద దయింది? ఇంతలా ఒరిగిపోయిందేం? గొడ్డుపోయినట్లు ఒక్క చివురూ, ఒక్క పువ్వూ కనిపించదేం?" అని అడిగినట్టే. ఈ మధ్యలో ఎన్ని సుడిగాలులు? ఎన్నెన్ని వడదెబ్బలు? ఆ మాటకొస్తే అడిగిన మిత్రుడికీ అలాటివన్నీ అనుభవంలో ఉండనే ఉంటాయి. అలాంటప్పుడు ఈ అడగడం ఒకరకం సాంప్రదాయికగుణం అనుకోవాలి.

కొన్నిదినాలుగా తనపట్ల తనెలా ఉంటున్నదీ ఆలోచించని పార్వతికి శేఖరం తనలోమార్పును సూచింగానే బాధకలిగింది. తనెందుకు మారాలి? ఎవరికోసం మారాలి? ఎప్పటికీ మారదు అలా కాకూడదు. ఓడిపోకూడదు— ముఖ్యంగా రాజు ఎదుట.

తను ఏవిధంగా మారి కనిపించింది? అదొక్కటి చెప్పలేదు శేఖరం. కానీ మనసుకు తెలుస్తున్నది—తనెందుకో నిరాశపడిపోతున్నది ఎదిరించి వాదించే స్థైర్యం, ఇష్టానుసారం నడుచుకొన గలిగే ధైర్యం సన్నగిల్లిపోతున్నాయి. ఎందుకలా అయిపోతున్నది తను?

ఎంత ఆలోచించినా ఊహామాత్రపు విషయం అస్పష్టగా కనిపించడంలేదు పార్వతికి. రాజునుగురించి ఏమనుకోవాలనుకున్నా ముందుకు వెళ్ళలేక పోతున్నది అది బలహీనత

అనుకోవటానికి ఆస్కారం లేదు. పిరికితనం అనుకోవటానికి అసలు వీలులేదు.

నాలుగురోజులూ ఎవరికోసం ఆగాలన్నట్లు ముందుకు పోయాయి. ఎన్నిరోజులు గడుస్తున్నా ఇవే ఆలోచనలు.

పార్వతి తనను చూసుకుంది. తనలో ఏంలోటు? లోటు అని చెప్పలేని లోటుఉందా? అదెవరికీ తెలియ నవసరం లేదే? నిర్లక్ష్యంగా బ్రతకాలి. అంతే. ఎవరికోసం బ్రతకాలి? తనకోసం.

ఒకవిధమైన గర్వరేఖతో ఆ అమ్మాయి పెదాలు నవ్వుకున్నాయి.

కానీ అన్నిటికంటే ప్రథమంగా గుర్తించ వలసింది పార్వతి పట్టించుకోలేదు.

ఆమెహృదయపు అరలో ఏమూలనుండో మబ్బులా వ్యాపిస్తున్న నైరాశ్యానికి ఎదురు తిరగాలనుకుంది.

* * *

ఆరోజు కాలేజీలో చదువుకుంటున్న ఒక అమ్మాయి ఎక్కడో ప్రమాదవశాత్తు ప్రాణాలు కోల్పోగా పార్వతికి సెలవు దొరికింది అందరితోపాటు.

మధ్యాహ్నం రాజు ఇంట్లోనే ఉన్నాడు. అంతా గమనిస్తున్నాడు.

పార్వతి ఎప్పుడూ లేనంత అందంగా అలంకరించు

కుంది. నాగరికమైన అలంకరణకోసం ఆమె పడే అవస్థ అంతా చూస్తూనే ఉన్నాడు.

ఏదో అజ్ఞాతకారణంవల్ల చాలా నెలలుగా పార్వతి అదోక మాదిరిగా ఉండటం చూసి, తగిన శాస్తి అవుతున్న దనుకున్నాడు.

అనుకోకుండా హఠాత్తుగా పార్వతిలో వచ్చిన సంచలనానికి కారణం ఊహించుకోవటం కష్టమైం దతనికి.

సరిగ్గా మునపటి పార్వతిలాగే కనిపించింది. ఆమెలోని జడత్వమంతా ఒక్క-క్షణంలో వదిలినట్లు కళ్ళు కొంటెగా, చంచలంగా తిరుగుతున్నాయి. పెదాలు మరీ పెంకితనంగా ఉన్నాయి.

"ఎక్కడికి !" అన్నాడు పట్టలేక.

"అలా వెళ్ళాలి" అంది, కాశ్మీరు సిల్కు-చీర అంచు అందంగా ఉందో, లేదో చూసుకుంటూ. పార్వతి ఎవరికెలా ఉన్నా తనకు తాను అప్సరసలా కనిపించింది అద్దంలో.

"సుభద్రగా రింటికేగా ?"

"అవును."

రాజు అధికారం చూపించక మాన డెప్పుడూ. "వెళ్ళొద్దు నువ్వెక్కడికి !" అన్నాడు.

ఎత్తుమడమల జోళ్ళు ఎక్కించుకొంటూ, "పుల్లమ్మ గారి మాటలే ఇంకా నమ్ముతున్నావా రాజూ ? సుభద్ర గారు చాలా మంచివ్యక్తి. ఇక్కడి కొచ్చినప్పుడు చూశా

వుగా ?" అని, అతనివైపు చూడకుండానే వెళ్ళిపోయింది పార్వతి.

నిజానికి సుభద్రను చూడటమే కాదు; ఆమెతో మాట్లాడాడుకూడా రాజు. మాట్లాడటమే కాదు; ఆమెలోని ఆత్మీయతా భావాన్ని స్పష్టంగా చదివాడు.

కానీ పార్వతి ఆనందాన్ని చూస్తూ సహించేశక్తి అతని కెప్పుడూ లేదు ఆమె ఒక్కొక్కసారి సంతోషంగా ఎందుకు కనిపిస్తుందో, అమితోత్సాహంగా ఎందుకుంటుందో అర్థం కాదు. తను అందనివ్వకుండా చెయ్యాలనుకున్న ఆనందం-తనకు లేనిది—ఆమెకు ఆమాత్రమైనా ఎందుకండాలి ? ఎలా పొందుతున్నదని ? అదీ అతని సమస్య. నిరంతరం పీడించే సమస్యే. దానితో మనో వికలత.

రాజు చాలాసేపు శూన్యంలోకి పరీక్షిస్తూ కూర్చుండి పోయాడు. ఎవ్వరూ లేనప్పుడు—ముఖ్యంగా పార్వతి లేనప్పుడు-రాజుముఖం స్వాభావికమైన మంచి తనంతోనూ, సహజమైన అందంతోనూ ఉంటుంది. పార్వతి ఎదుట అయిష్టంగా, విసుగ్గా ముఖం మారుస్తాడు. నటిస్తాడు. ఆమె తననుంచి ఆశించిన దేదైనా—చివరకు అందమైనాసరే—లభించేటట్లు చెయ్యకూడదని కోరిక. అలాగే పార్వతికి రాజులోని అందాలు కనిపించడంలేదు. ఏ ప్రలోభంతో ముందు వెనకలు ఆలోచించకుండా పట్టుపట్టిందో, అదే రాజునుంచి మరింతదూరం చేసింది. తను దేన్ని, ఎందుకోసం చేస్తున్నదో తెలియని

ఉద్రేకంతప్ప మరొకటిలేదు అప్పుడు పార్వతిలో. ఇప్పుడు పార్వతిని అయోమయంలో పడేసే విషయం అదే.

ఏకాంతంలో ఉన్నప్పుడు రాజుకు అప్పుడప్పుడు నవ్వు వస్తుంది. ఏమిటి ఈ నాటకం? అనిపిస్తుంది. దేవుడు పార్వతిని తనకోసం పుట్టించి బలవంతంగా కట్టబెట్టినట్లున్నాడు. చిన్నప్పటినుంచీ ఆమె అంటే తనకిష్టమనేది లేదు. 'ఇష్టం ఉంటే కదా, తర్వాత ప్రేమ సంగతంటూ రావడం' అలా అనుకుని రాజు నిట్టూరుస్తుంటాడు.

నుదుటిమీద వేలుతీసి టేబిల్ దగ్గరికి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. స్కూలుపుస్తకాలు, పేపర్లు చూసుకోవడంలో మునిగిపోయిందతని మనసు కొద్దిసేపట్లో.

హైస్కూల్లో రాజుకు మంచిగౌరవ స్థానంఉంది. విద్యార్థులు మొదలు సహోద్యోగుల వరకు అంతా అభిమానిస్తారు.

రాజు అదంతా అవసరంలేనట్టే ముభావంగా తనపని తను సాఫీగా చేసుకుంటూ పోతాడు. కాలేజీలో పార్వతి ఎంత నిర్లిప్తంగా ఉంటుందో, స్కూల్లో రాజు అంత గంభీరంగా ఉంటాడు. ఒకరిద్దరు కిట్టనివాళ్లు—కంటకాల్లాటివాళ్లు—ఉన్నా లేకపోయినా ఉద్యోగ నిర్వహణ రాజువిషయంలో పెద్ద బరువుకాకుండా హాయిని కలిగిస్తూంది.

రీసెస్ వేళ మాస్టర్లగదిలో కూర్చుని, సీతాకోకచిలకలలాగా తిరిగే ఆడపిల్లలను చూస్తుంటాడు కిటికీలోనుంచి అప్పుడప్పుడు. అప్పుడతనికి ముందుగా సరోజ గుర్తువస్తుంది.

తర్వాత చిన్నప్పటిమిత్రులందరితో గెంతడాలు. సరోజ పార్వతులతో జగడాలు పెట్టుకుంటూ చదువుకోవడాలు ఒకటి రెండుక్షణాలలో, మూడునాలుగు నిమిషాలలో మనోయవనిక మీద సుమనోహర చిత్రాలు అవుతాయి.

సరోజ చిలిపిచూపులూ, ఒక్కొక్కసారి హాస్యంతో మాట్లాడే మాటలూ జ్ఞప్తికొస్తే రాజు అదోకలా బాధపడేవాడు.

ఇప్పుడా అందాలు తనవి కావు-అనుకోవటానికి మనసు కూడా ఎదురుతిరుగుతుంది. 'అంతమటుకు సరోజ ఎవరినీ ప్రేమించలేదు' అనుకుంటాడు ఉన్నట్లుండి రాజు, అదో మహాభాగ్యంలా.

సరోజ చదువు పూర్తికావటానికి ఏడాదిపైన ఉంది. ఆ తర్వాతనే ఆ పిల్ల చిరకాల వాంఛితం నెరవేరేది. నెల్లాళ్ళ క్రితం ఒకరోజు సరోజ ఊడిపడింది హఠాత్తుగా. రాజుకు ఆనందం కలిగిందంటే అదెటువంటిదో చెప్పడం అసాధ్యం. కానీ, పార్వతిసంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఒక్క-గుక్క-లో ప్రపంచంలోని యావద్విషయాలు స్నేహితురాలితో మాట్లాడేసింది.

పసిపిల్లలాటి పార్వతి మనస్తత్వం ఇంకా పోనందుకు ఆశ్చర్యపడింది సరోజ. పార్వతిని ఆపాటికి అణకువైన గృహిణిగా ఊహించుకుని వచ్చింది మరి-చిన్నవయసులోనే ఒక విధమైన అనుభవం సంపాదించుకున్న సరోజ. ఆమె భావన తారుమారైంది.

రాజు, పార్వతుల నడత స్పష్టంగా చూసింది, వాళ్ళ అతిథిగా ఉంటూనే.

అయినా ఒక్క విషయంలో పార్వతి మారిందన్న సంగతి తెలుసుకుంది సరోజ.

మొదట్లోలాగా సరోజ దగ్గరైనా తన విషయాలేవీ పైకి రానివ్వడం లేదు పార్వతి. సరోజ గట్టిగా అడిగినా, రాజునే కోపగించు కుంటున్నట్టు నటించినాకూడా ఆ విష యంలో తను చాలా నిర్లక్ష్యంగా ఉన్నట్టు మాటలు తప్పించి ఊరుకునేది.

సరోజ అంతతో ఆగకుండా మితిమీరిన చనువువల్ల అడగరానివని అనుకోదగినవి కూడా అడిగింది.

"నవ్వుతూ, అతని కేం! అతనొక రాజు. నువ్వొప్పుడో అన్నట్టు నేనొక రాణిని. కావలిస్తే నువ్వు ఆస్థాన వైద్యు రాలుగా ఉండిపో ఇక్కడే! ఓ కవిని కూడా ఎక్కడైనా సంపాదిస్తాను." అంది పకపకమని పార్వతి.

పార్వతి అలా నవ్వడం చాలా అరుదైంది. ఆత్మీ యులు, ఆదరించేవారు దగ్గరుంటే ఆనందానికి లోటు ఉండదు.

జానకమ్మకు, కొడుకు దగ్గరకు రావటానికి అసలు తీరడంలేదు. ఒకసారి ఆమెవచ్చి ఒకరో జున్నప్పుడు రాజు, పార్వతి తమ ఏర్పాట్లు ఎలా మార్చుకోవాలో తెలియక తికమకపడిపోయారు. ఆ ఒక్కనాటికోసం "నిన్ను వదల్లే నత్తయ్యా!" అంటూ పార్వతి జానకమ్మ పక్కలో నక్కి

పోవలసి వచ్చింది. అప్పటినుంచి ఆవిడరాకపోతేనే మంచి దనిపిస్తూంది పార్వతికి.

సరోజ వచ్చినప్పుడు తెగించి ఆ అమ్మాయి పక్కను పడుకుంటూ, "ఇక నాకు తెలియని కొత్త సంగతులు చెప్పు సరూ!" అంది పార్వతి, మిత్రురాలిమీద చెయ్యివేసి.

"చిన్నప్పటి సంగతులు మరిచిపోలేదే పారూ! నేను చెపితే విన్నావూ?" అంది సరోజ పార్వతి మాట వినిపించు కోకుండా. ఆ మసకవెలుగులో, 'పార్వతి బాధపడుతున్న దేమో తనమాటలకు' అనిపించిందా అమ్మాయికి.

"నేను హాయిగా ఉన్నాను, సరూ! రాజు ప్రయత్న పూర్వకంగా నన్నెప్పటికీ కష్టపెట్టలేదు. అతనే జీవితాన్ని పాడుచేసుకుంటున్నాడు. తనే నష్టపోతాడు నేనేం ఆర్థికంగా ఒకరి అవసరం కోరవలసినదాన్ని కాను. నావల్ల పొరపాటు జరిగిందనిపిస్తుంది. నీమాటలు గుర్తొస్తాయి అయినా అంత చిన్నచూపుచూసే మనిషి కాళ్ళమీదపడి ప్రాధేయపడ మంటావా? నన్ను నేనంత హీనస్థితిలో చూసుకునేకన్నా మరో అన్యాయం లేదు. నువ్వూ నా స్థితి చూడలేవప్పుడు. అసలు నేనెలా చెయ్యలేనెప్పటికీ. కాని..."

"కానీ?" ఆత్రుతగానే చూచింది సరోజ.

పార్వతి స్నేహితురాలి చేతిని స్పృశించింది. "కానీ... ఇంకొక విధంగా అతను సుఖించాలనుకుంటే నేనెప్పటికీ అడ్డురాకూడదని ఈ మధ్యనే నిశ్చయించుకున్నాను, సరూ!

మేము విడాకు లిచ్చుకున్నాక నువ్వు రాజును పెళ్ళిచేసుకుంటావా?" అంది చివరకు కాస్త కొంటెతనంతో.

అపిల్ల తలమీద ఒక మొట్టికాయవేసి, "రాజు అలా ఎప్పటికీ చెయ్యడు; ఒప్పుకోడు. పెంకిపిల్లలా మాట్లాడటం మానెయ్యి. నేను చెప్పినట్టు వినాలి ముందు" అంది.

"ఏమిటి?" అంది పార్వతి పరధ్యానంగా. ఆమె ఆలోచిస్తున్న విషయం - 'రాజుపై వీళ్ళ కింత నమ్మక మెలా ఉన్నదా?' అని.

"నీకు పొరపాటని అనిపిస్తున్నట్లయితే రాజు అభిప్రాయాల కనుగుణంగా మారడానికి ప్రయత్నించు మరి." సంశయిస్తూనే సరోజ అంది.

"ఎందుకో నేనందరి ఉద్దేశంలో పరమ గయ్యాళినీ, శుద్ధమూర్ఖులినీ అయిపోయాను" అంది పార్వతి నొచ్చుకుంటున్నట్లు

సరోజ బాధపడి "కాదే!" అన్నది.

"అదికాదు. కొన్నాళ్ళ క్రితం ఒకరితృప్తికోసం వారి సలహాతోనే ఇప్పుడు నువ్వుచెప్పినట్లు చేసి చూడబోయి, పప్పులో అడుగేశాను. అయినా నన్ను మారమంటారు అదెంత అసంభవమైనదో ఆలోచించకుండానే. పుట్టుకతో వచ్చేబుద్ధి పుడకలతోగాని పోదన్నారేమరి ఎవరో మహానుభావులు! ఇంకా ఆ పుడకలతోపని ఎన్నాళ్ళ కొస్తుందో కానీ..."

సరోజ నివ్వెరపోయింది. "ఛ! ఆ మాట లేమిటి ?" అంది. ఇదివరలో పార్వతెప్పుడూ ఇంతలా భరించలేనట్టు మాట్లాడలేదు ప్రియస్నేహితురాలి దగ్గర. కోపంవచ్చినా, ఇంత తొణకని కంఠస్వరంతో అనలేకపోయిది. ఎప్పుడూ సెలయేటి శబ్దంలా గలగలమని నవ్వే కంఠం.

నిశ్శబ్దాన్ని విడగొడుతూ మళ్ళీ పార్వతి అంది: "నువ్వింత తియ్యగా మాట్లాడతావే సరూ! నిన్నలా మాట్లాడవద్దంటే మానుకోగలవా ? నేనూ అంతే! ఒక మూర్ఖురాలిని. పతిభక్తిలేని - ప్రతివ్రతా శిరోమణిని కాని పశువుని!" ఏదో కసి ఉంది పార్వతి గొంతులో.

సరోజ వినలేకపోయింది. "పొరపాటయింది తల్లీ! క్షమించు. పెద్దదానివో, చిన్నదానివో కానీ శతకోటి నమస్కారాలు. ముందు ఊరుకుంటేచాలు" అన్నది గాభరాగా.

"సరేగానీ. నువ్విలా ఎప్పుడూ కన్యగా ఉండిపోతావేమిటే?"

"ఊఁ" అంది సరోజ ఆ అమ్మాయి మాట పట్టించుకోకుండా ఆలోచిస్తూ.

పార్వతి నవ్వి, సరోజకు దగ్గరగా జరిగింది ఆరోజు అలా.

ꣻ ꣻ ꣻ

ఎండ ముఖానికి ఛెళ్ళని తగులుతూంది. ఒళ్ళంతా చిరుచెమట. ఇంట్లోంచి ఇవతల పడగానే పార్వతిలో చిలిపితనం మాయమై మనసు యథాస్థితికి వచ్చింది.

సాయంత్రం అలా ఎక్కడికైనా షికారు వెళ్దామన్నా పాడుఊర్లో ఒక్క వినోదమూ, విశేషమూ లేదు స్త్రీల కళాశాల అయితే ఉంది కానీ స్త్రీలకొక క్లబ్బు కనిపించలేదు పార్వతికి. చదువుకున్న స్త్రీలు కొద్దిమంది ఉన్నా, తీరిక దొరికితే మగతగా నిద్రపోతుంటారు. అదివాళ్ళ తప్పు కానే కాదు — ఊరిగాలి అటువంటిదేమో! చల్లగాఉండి జోకొడుతుంది మనిషిని.

ఆచల్లదనాల్చూ, జోలపాటలూ - ఏవీ పార్వతి దగ్గర పనికి రాలేదు. అమిత చేతనంగా ఉండే ఆ పిల్ల శరీరం ఎప్పుడూ ఏదో చేస్తుండాలని కోరుతుంది. అయినా ఇప్పుడిప్పుడు పార్వతికీ కునుకువస్తున్నది

పార్వతి విసుక్కుంది. మెల్లగా మెట్లు ఎక్కింది, సుభద్ర గారింటికి తాళంపెట్టిఉండటం ఆశాభంగం కలిగించింది. అరుగుమీాద ఒకనౌకరు నిద్రపోతున్నాడు. అలాగే నిలిచిపోయింది, ఏంచెయ్యాలో తోచక. వెనక్కి వెడితే రాజు ఆనందిస్తాడు.

రాధాకృష్ణ గదితలుపు తీసిఉంది. రెండడుగులు ముందుకువేసి, అతని పేరుతో మర్యాదగా పిలిచింది. ఎవ్వరూ పలకకపోగా తొంగిచూచింది లోపలికి. మూలనున్న మంచమూ, రేడియో ముందున్న పేముకుర్చీ ఆహ్వానించాయి.

పార్వతి రాధాకృష్ణస్వభావం బాగా ఎరిగిఉన్నది. అతను సామాన్యమైన బుద్ధిచూపించడు - మాటల్లోగానీ

మనసులోగాని అందుకే సాహసంగా లోపలికివెళ్ళి కూర్చుని రేడియో పెట్టింది.

రాధాకృష్ణ సాహిత్యలోకంలో చిన్నరచయితైనా, వాస్తవిక సమాజంలో పెద్దబుద్ధిగలవాడు. ఆ వ్యక్తి సుహృద్భావాలు, సదాచరణలు ప్రతి కళాకారుడికి ఉండగలవని నిర్ధారణచేసుకోవడం కష్టం. అలా నిర్ధారించుకోగలిగిననాడు 'దేశసౌభాగ్యం ఎన్నటికీ కొల్లగొట్టబడదు' అని అపరిమితమైన విశ్వాసం కలుగుతుంది రాధాకృష్ణ చాలా కొద్దిరచనలే చేశాడు. అయితేనేం? వాటినిండా ఆదర్శభావాలు ఔన్నత్యపథాలు, శిష్టా సంస్కరణలు. వాటిలో విధినిషేధాలంటూ ఎక్కువ కనిపించవు.

రేడియో నెమ్మదిగా వినిపించేటట్లు పెట్టి వింటూ కూర్చుంది. గోపికాగీతం వినవస్తున్నది. ఎన్నడూకలగని, ఏనాడూ ఎరగని దివ్యానుభూతిని పార్వతి దేహంలోని అణువణువూ అనుభవించింది. పాట ఆగి, తాత్కాలికంగా ఇంకేవో వినిపిస్తున్నాయి. సాంతం వినలేకపోయింది. భావాలేవో మెదడులోని సరిహద్దుల్లో సంచరిస్తున్నాయి.

ఎంత మధురంగా ఉంది! అలా పాడుకో గలిగితేనా? పాడలేదుమరి తను. కానీ, తన మనసే పాడుతుంది.

ఎందుకో తెలియదు—చాలా రోజులుగా ఈ 'కృష్ణ' శబ్దం ఎక్కడైనా వినిపిస్తేచాలు, ఏదో అవ్యక్తమైన హాయి హృదయాన్ని చల్లగా స్పృశిస్తున్నది. ఎందుకు?

ఉలిక్కిపడింది—"రేడియో వింటున్నారా?" అన్న పలకరింపులాంటి ప్రశ్న విని.

వెంటనే నమస్కరించి "ఇప్పుడే వచ్చాను." అంది పార్వతి నవ్వుతూ అడిగిన రాధాకృష్ణను చూసి.

అతను ముఖంకడుక్కుని వచ్చినట్టున్నాడు-తుండుతో తుడుచుకుంటూ మాట్లాడుతున్నాడు.

పార్వతి సుభద్రగారిగురించి అడిగేలోగా అతను మళ్ళీ నవ్వుతూ, "నా చీకటిగదిలో మీ రెలా కూర్చోగలిగారు పార్వతిగారూ!" అన్నాడు.

కిటికీతలుపులన్నీ తెరిచి, మంచంమీద కూచున్నాడు. వెలుగువచ్చి అతనిపైనే పడింది. అప్పుడే ప్రక్షాళితమైన ముఖం కాంతివంతంగానూ, నిర్మలంగానూ ఉంది. అతడు తనవైపు చూడకుండాఉంటే రెప్పవాల్చకుండా కొద్దిసేపా ముఖాన్ని చూడాలనిపించింది పార్వతికి.

"సుభద్రగారు కోవెలకు వెళ్లారు—పాపతోకూడా" అన్నాడు.

"అలాగా! ప్లీడరుగారుకూడా లేనట్లున్నారు?" అంది, ఆఫీసుగదివైపు చూస్తూ.

ఇంతలో మాట్లాడకుండా ఒక తెలుగుమాసపత్రిక తెచ్చి చేతిలోపెట్టాడు రాధాకృష్ణ.

పేజీలుతిప్పుతూ ఆశ్చర్యపోయింది పార్వతి. "అరె! మీకు ప్రథమబహుమతి వచ్చిందే! ఇంకా చెప్పరేం ?"

రాధాకృష్ణ నవ్వాడు. "వ్యాసమండీ! 'సాంఘిక సమ

స్యలూ – నివృత్తిసూచనలు' అని పోటీపెట్టారులెండి ఈ పత్రికలో. చదువుతారా? ఇంటికి తీసుకెళ్లండి!"

"ఇంత నేర్పుగా ఎలా వ్రాయగలరండీ మీరు?" అప్రయత్నంగా అనేసింది.

మంచంమీద కూర్చున్నవాడంతా కాస్త ముందుకు ఒరిగి, "ఏం?"అన్నాడు రాధాకృష్ణ. "మీరు చదవలేదేమో గాని, నాకన్నా అద్భుతంగా వ్రాసేవాళ్ళు మనభాషలో ఉన్నారు. ఆ పుస్తకాల్లో మంచివి వెదికి ఇస్తాను. పుస్తకాలే నిజమైన మిత్రులు పార్వతిగారూ! అసూయ, ఆడంబరం లేని స్నేహితులు. అయితే పార్టీలకు, పిక్నిక్కులకు పిలుచు కొనే అలవాటులేదు ఈ స్నేహితులకు. మీరు ఆంగ్ల సాహిత్యం ఏమైనా చదివారా?"

"ఏదో కొంత చదివాను. షేక్స్పియర్ నాటకాలు, టాల్స్టాయ్, టర్జెనీవ్ వంటివారి నవలలు; టెన్నిసన్, బైరన్ మొదలైనవారి కవితలు చదివాను. అవైనా నచ్చలేదు. ఏమిటో? తెలుగువాటితో నాకసలు పరిచయమేలేదు. మీ వల్లే తెలుస్తున్న దిప్పుడు."

"అలా అంటే కాదండీ! ముందుగా మణిపూసల్లాటి నవలలు – ఏ భాషలోనైనాసరే — ఎంచుకొని చదవాలి. తర్వాత భయపడ నక్కర్లేకుండా పద్యకావ్యాలు క్రమంగా ఒంటపడతాయి. బెంగాలీరచయితల పుస్తకాలనేకం ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్నాయి. అవి చదవండి. శరత్ బాబుపేరు మీరు వినుంటా రనుకుంటాను..."

"ఆ విన్నాను. ఆయనరచనలు నాకుకొంచెం విసుగు" పార్వతి పెదవి విరిచింది.

రాధాకృష్ణ ఒప్పుకోలేదు. "విసుగు అనుకోకండి పార్వతీగారూ! అది స్వల్పంగా నిరాశ. ఏదో అనుకుంటాం గానీ, జీవితం ముదురుతున్నకొద్దీ అటువంటి సాహిత్యమే హృదయంలో పీఠం వేసుకుంటుంది."

"ఏమో బాబూ! మీమాటలు నాకర్థంకావు. మీరు రచయితలు మీ రదృష్టవంతులు."

ఆలోచిస్తూ. "ఇందులో అదృష్టాని కేముంది?" అన్నాడు వినీ వినిపించనట్టుగా నిట్టూర్చి.

నల్లని మేఘమాలిక ఒకటి అతని మొగంమీద తారాట్టం చూచింది పార్వతి. ఆమెలోనూ ఏవో కొత్త ఊహాలు కదిలాయి 'ఉన్నట్లుండి ఎందు కితని కీ నైరాశ్యం?' అనిపించింది. తెలుసుకోవాలని తహతహ.

"మీ రెందుకో బాధపడుతుంటారు?" అంది.

"లోకంలో నాకన్నా ఎక్కువ దౌర్భాగ్యులు, నిరాశా జీవులు ఉన్నారు. కానీ, దురదృష్టవంతుల్లో నేనొకణ్ణి..." అతని గొంతులో నిస్పృహ ధ్వనించింది

"ఎందు కలా అనుకుంటారు? మీ జీవితాన్ని స్వర్గంగా మార్చుకొనేశక్తి మీ చేతుల్లోనే ఉందేమో?"

ఈసారి రాధాకృష్ణ పార్వతి కళ్ళవైపు చోద్యంగా చూశాడు. ఆమె మాటల్లో సలహాగానీ ఉందేమో అని అనుమానం తోచింది.

ఏమీ చెప్పలేక పోయాడు.

"మీరు మళ్ళీ పెళ్ళిచేసుకోలే దెందుచేత? రాధా కృష్ణగారూ?" ప్రశ్నించింది "పోనీ, మీరెవరిని మరిచిపో లేక ఇంకొక పెళ్ళి మానుకున్నారో ఆ అదృష్టవంతురాలి గురించి అయినా చెప్పండి నాకు"

పేలవంగా నవ్వాడు రాధాకృష్ణ. "నా దెంత అదృష్టమో ఆమెదీ అంతే! ఇద్దరికీ సమానంగా వియోగ బాధ లభ్యమైంది. ఆత్మఅనేది నిజమైతే ఆవిడ ఎక్కడున్నా ఈ దూరానికి బాధపడుతుంది."

అతని ధోరణి జాలిగొలిపినా అసలు విషయాలు అడగాలని వుంది పార్వతికి

అప్పుడే నాలుగుంపావయింది.

"సుభద్రగారు వచ్చారు" అన్నాడు వీధివాకిలివైపు చూస్తున్న రాధాకృష్ణ.

"ఇంత అన్యాయం ఎక్కడాచూడలేదు అత్తయ్యగారూ! చెప్పాపెట్టకుండా వెళ్ళిపోవడమే?" దెప్పింది పార్వతి.

"నీకు బడి ఉంటుందనుకున్నా నమ్మాయ్! ఇప్పుడైనా ఏమైంది? ఇద్దరం కలిసివెళ్దాం పద" అన్నది సుభద్ర.

రాధాకృష్ణ నవ్వుతూ, "సుభద్రగారికి సినిమాలంటే ఇసుమంత విసుగుగానీ దేవాలయాలకైనా, దేవీ నిలయాలకైనా తక్షణం బయల్దేరతారు" అన్నాడు.

"సుభద్రగారిలాంటి భక్తితత్పరుల గురించి... మీరం

సామాన్యంగా తెలుసుకోలేము, కృష్ణగారూ!" అంది పార్వతి, సుభద్ర చూడకుండా రాధాకృష్ణవైపుచూసి నవ్వి.

పార్వతికి సుభద్రఅంటే కొద్దిగా తేలికభావం ఈ మధ్యలో ఏర్పడింది. తనమనసులో ఎక్కడో గూఢంగా స్థిరపడిన ఆ భావాన్ని పార్వతే తెలుసుకోలేదు. ఈమె లేచి వచ్చినస్త్రీ. తను కాస్త గౌరవనీయురాలు అందరివద్దా. కానీ ఈమె జీవితంలో పరిపూర్ణత తన బతుకులో లేదు.

ఆ సంగతి కొన్ని సమయాల్లో లీలగా పీడిస్తుంది. అప్పుడాసంగతి మరిచిపోవాలనే ప్రయత్నం ప్రారంభం.

"ఎందుకండీ! మళ్ళీ మీకుశ్రమ" అంది పార్వతి.

"ఇందులో శ్రమేమున్నదీ!" అందావిడ ముందుకు దారి తీస్తూ

"దగ్గరే గుడి. ఎంతశ్రమైనా అక్కడ తీరిపోతుంది."

"నన్నెత్తుకో!" పాప పార్వతి దగ్గరకు వచ్చి చేతు లందించింది.

పాప నెత్తుకుని ముద్దుపెట్టుకుంటూ, "కాళ్ళు లాగే శాయా రాధికారాణీ!" అంది పార్వతి.

పాప అంటే పార్వతి కెందుకో అమితమైన ఇష్టం. సహజంగా చిన్నప్పటినుంచి ఆడపిల్లలకు తీపి మిఠాయితో పాటు పాపలంటేకూడా మోజు ఉండాలి. ఆ మాట ఎలా ఉన్నా పార్వతికి ఇంతవరకు పిల్లలపట్ల ఒక వాత్సల్యం,

ముద్దువంటి గుణాలేవీ లేవు. అవన్నీ పాపమీద కురుస్తున్నాయి ఇప్పుడు.

పాప పార్వతితోనే ఉంటుంది. వాళ్ళ ఇంట్లోనే ఆడుకుంటుంది. తోటలో తిరుగుతుంది. రాజు కా పిల్లతో ఒక అవస్థ అయిపోతున్నది. గుండెల మీదకెక్కి కూర్చుని, కబుర్లు చెప్పేవరకు వదలదుమరి. సమయా సమయాల గుర్తింపు అనావశ్యకం పాపకు.

సుభద్ర బలవంతంగా పాపను కిందకు దింపించింది. "పిల్లికూనవా ఏమిటి? ఎంతసేపని ఎత్తుకుంటుంది! మరీ గారాబాలు పోకు! నడువు!" అందావిడ, పాపను చిరుకోపంతో చూసి.

"అలా అనకండీ! మా అత్తయ్య నన్నెంతో గారాబంగా పెంచింది. ఏడేళ్ళొచ్చేవరకు కాలుకింద పెట్టనివ్వలేదు కూడాను!" నవ్వింది పార్వతి.

పాప పార్వతి చీరకుచ్చెళ్ళు పట్టుకొని, ఆపసోపాలు పడుతూ, పొట్టిపరికిణీ ఎత్తుకుంటూ నడవసాగింది.

పశ్చిమంగా ఉన్న కోవెలలోకి ఒక వెలుగు ఉత్తరం వైపునుంచి వచ్చిపడుతున్నది. పారిజాతం, నందివర్ధనం పూల చెట్ల గుబురులమధ్య, ముడుచుకున్న మందారాల రక్తవర్ణాల వెనక తెల్లనిగోడల దేవాలయం చిత్రకారుడి చేతికి పని కల్పించే సుందర దృశ్యానికి తీసిపోదు.

అందాలకు అధికారివైన అవతారపురుషుణ్ణే చూస్తూ తెలియని భావాలమధ్య నలిగింది పార్వతి.

ఎవరీ భగవానుడు? ఎవరీ కృష్ణుడు? ఇంత అందగాడా? కేవలం అతని రూపాన్ని ఊహించుకోవడానికి ప్రతిష్ఠించిన ఒక బొమ్మలోనే ఇంత అందంగా అగుపిస్తున్నాడే—నిజమైనవాడు ఇంకెంత అందంగా ఉండాలో? బహుశా అతని అందంముందు తనఅందం, సరోజఅందం, రాజుఅందం, రాధాకృష్ణఅందం—అన్నీ వెలవెలబోతాయేమో? ఈ అందానికీ, ఇతగాడి గానానికీ లొంగిపోయే గోపికలు వెంటపడ్డారని ఆ లీలలన్నీ తనకు చదివి వినిపించారు సుభద్రగారు. అప్పుడా గోపికలతోపాటు తన మనసూ అతన్ని వెంబడిస్తూ వెతకటానికి పోయిందని ఆవిడ కేం తెలుసు? విశ్వసించలేని క్షణాల్లోనే 'ఉన్నా' నంటూ నమ్మించాడు చిత్రంగా. ఒకరోజు 'లేడులేడు' అనుకుంది గట్టిగా. ఉన్నట్లే వచ్చి, చేతుల్లో వాలాడు బహుమతి రూపంలో. మట్టిబొమ్మలా వచ్చి మనసులో నిలిచిపోయాడు ధనికురాలైన ఒక కాలేజీ అమ్మాయి ఆమె పుట్టినరోజు సందర్భాన లెక్చరర్లందరికీ బహూమతులు తెచ్చిపెట్టింది ఎందుకో! తనకు వచ్చింది కృష్ణ విగ్రహం.

"నువ్వంటే నాకిలాటి రక్తిరహితమైన జీవితాన్నెందుకు లభింపచేశావు స్వామీ!" అని ప్రశ్నిస్తే జవాబు ఎక్కడ? అదాయన లీలేకాబోలు—కనిపించినట్లు కనిపించీ, వినిపించినట్లు వినిపించీ మాయంకావటం! 'గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః'

పార్వతి తనవైపు చూసుకుంది. కొద్దిగా లోపలికి

ప్రసరిస్తున్న సంధ్యాసమయపు సౌవర్ణకాంతిలో సుకుమారంగా కనిపించింది శరీరభాగం.

'తానొక గోపికై ఉంటే?' అనుకుని నవ్వుకుంది పార్వతి. 'ఈ కృష్ణుడప్పుడు ఏమనుకొంటాడో తననుగురించి? అంత అదృష్టమా! అతని పాద పరాగంలో ఒక రేణు వయ్యే అర్హత అయినా లేకనే నేమో తనీ లోకంలో పుట్టింది!'

ఏమైనా రానురాను కొత్తగా ఆలోచించడం అలవడు తున్నది పార్వతికి.

## 22

సెలవులముందు రాధాకృష్ణను కలుసుకోలేకపోయింది పార్వతి. కలుసుకున్నా ఎక్కువసేపు మాట్లాడుకునే అవకాశం దొరకలేదు. అత నేదో ఆరోగ్యశాఖ మంత్రిగారు వస్తున్నా రన్న సందడిలో పడిపోయాడు.

ఒకనాడతని గదికివెళ్ళితే ఏదో పత్రిక శ్రద్ధగా చదువు తున్నాడు.

"రచయితగారూ! ఏమిటంత దీక్షగా చదివేస్తు న్నారు?" అంది పార్వతి.

"మీరా? రండి" అని ఆహ్వానిస్తూ, "ఈ కథ

బాగున్నదని చదువుతున్నాను. 'కవిత' అనేవారి రచనలు మీరు చదివారా, ఎప్పుడైనా? ఉత్సాహవంతమైన కథనంతో సాగుతూనే పాఠకులను ఆకట్టుకొనే నైపుణ్యం కనిపిస్తుంది. ఒక్కొక్కసారి సంఘజీవన సంకుచితత్వాలను గంభీరంగా వ్రాస్తారు" అన్నాడు తన ధోరణిలోనే.

పెద్ద నిట్టూర్పు విడిచి, "పేరేమిటన్నారూ—కవితా? కవితో, సవితో కానీ మీ రేమిటి, కనిపించడం మానేశారు?" అంది పార్వతి.

"మంత్రిగారు వస్తారుగా! అందుకే ఈ అవస్థలన్నీ, ఆఫీసులో డాక్టరు సరైనవాడు కాడు. అతన్నేమీ అనలేక ఆఫీసరు తక్కిన బృందంమీద విరుచుకు పడుతుంటాడు ఈ పరిస్థితుల్లో శాస్త జాగ్రత్తలోనే ఉండటం మంచిదని మా బాధ."

రాధాకృష్ణ ఆరోజు ఇంకా ఎవరో కవుల కవితలు, కవిత రచనలు పార్వతి చేతికిచ్చి చదవమన్నాడు. ఆమె అవన్నీ తెచ్చి ఇంట్లో పడేసింది.

శేఖరం చాలా సార్లు కలుసుకొని బాతాఖానీ వేసేవాడు పార్వతితో. ఆ తంతు రాజూ చూశాడు. పార్వతివల్ల రాజుకు స్నేహితులుకాని స్నేహితులు ఎక్కువై పోతున్నారు. ఏం చేస్తాడు తప్పనిసరిగా భరించక? రాధాకృష్ణతో పరిచయం అతనికి కష్టమనిపించలేదు. మీదుమిక్కిలి ఆ రచయితతో సన్నిహితంగా ఉన్నంతసేపూ ఏదో హాయి అనిపించేది కూడాను.

బాగా తెలిసిన శేఖరంతో ఎలా మాట్లాడాలనుకున్నా సాధ్యంకాదు రాజుకు పైకి నవ్వుతూ నిగర్విలాగానే కని పించే శేఖరంలో, కల్మషం సూచనకైనా అగుపించని ముఖంలో, ఆ కళ్ళల్లో—అహంకారం రాజుకు మాత్రం గోచరిస్తుంది సూక్ష్మంగా. చిరునవ్వు నవ్వే పెదవులు, వాటి వెనక హేయబుద్ధి, నిర్మలమైన నీటికింద నాచు కనిపించినట్లు వికారంపుట్టి రాజు, శేఖరం ఎదురుగా నిలువలేడు.

తప్పులు చేసేవాళ్ళకుకూడా తప్పులు ఇష్టంఉండవు. ఎందుచేతనంటే ఆ తప్పుడు పనుల్లో భాషకూ, భావానికీ అందని సూక్ష్మమైన వైవిధ్యం ఉండబట్టి. స్థూలంగా చూస్తే అర్థంకానిసంగతి.

పార్వతికి సెలవులయ్యేముందు శేఖరంకూడా కొన్ని దినాలు ఆమెకు కనిపించలేదు. శేఖరం తన ఇంటికి ఎన్నో సార్లు రమ్మని కోరాడు పార్వతిని. ఆటంకాలు వచ్చాయో, లేదో చెప్పడంకష్టం. కొన్నిసార్లు ప్రయత్నపూర్వకంగానే పార్వతి వెళ్ళకుండా ఆగిపోయింది. శేఖరానికి ఒక పల్లెటూరి పెళ్ళాం ఉంది. ఆమె ఏమనుకొని రచ్చకీడుస్తుందో అని పార్వతికి భయం శేఖరం అందుకే చదువుకున్న అమ్మాయి లంటే గింజుకుంటాడు. పెళ్ళయి పెద్దమనిషి తరహావచ్చిన వారిలా సూటిగా మాట్లాడలేక పోవటమేకాక, పకల చూపుతో కనిపెడుతుండటం అతన్ని పూర్తిగా వదల్లేదు.

కాని శేఖరంతో కాసేపు ఊసుపోయేది పార్వతికి,

కొన్ని నీరసక్షణాల్లో. ఒక్క సందర్భంలో అతడి రాకకోసం వేచిందికూడా.

తరుముతున్నట్టు సెలవులు వచ్చేశాయి. రాజు ఇంకా పరీక్షల గడబిడలోనుంచి తేలనే లేదు.

ఒంటరిగా, హఠాత్తుగా వచ్చిపడిన పార్వతిని చూసి సగం క్రుంగిపోయింది జానకమ్మ. "వాడేడీ?" అంది— వీధిమొగాన్నీ, పార్వతి మొహాన్నీ మార్చి మార్చి చూస్తూ.

"వస్తుంటే నీ కొడుకుని కాకెత్తుకు పోయింద త్తయ్యా!" అంది నవ్వి పార్వతి.

"సరిగ్గా చెప్పు, తల్లీ!"

ఆవిడ ఆత్రుతకు లోపల ఆశ్చర్యపోయింది పార్వతి. "అతని పిల్లలకింకా పరీక్షలు కాలేదు. నా పిల్లల కయిపోయాయి." అన్నది హాస్యంగా, సామాను గదిలోపలకు చేరుస్తూ.

"ఏమిటో! ఈ ఎండల్లో సరిగ్గా తిండితిని నిద్రన్నా పోతున్నా డో లేదో! ఈ నాలుగురోజులూ హోటలు కూడే తెప్పించుకుంటాడు గావును." స్వగతంలా అం దావిడ పెట్టెలో నుంచి బట్టలు తీసుకుంటున్న పార్వతిని శూన్యదృష్టితో చూస్తూ.

పార్వతి నడుంమీద రెండుచేతులూ వేసుకుని, "చూశావా, చూశావా! ఇంత ఎండలోపడి చెమటలు కక్కుకుంటూ నేనొస్తే నామీద జాలిలేదటగానీ ఎక్కడో తనకొడుకు ఎండల్లో ఎండిపోతున్నాడని, వానల్లో తడిసి

పోతున్నాడని, చలిలో చలించిపోతున్నాడని—అదే ధ్యాస." అంది ఎవరితోనో చెబుతున్నట్టు నిలబడి.

"మరీ మీరుతున్నావులే! స్నానం చేద్దువుగాని, పద."

"అవునుమరి. నాకో అమ్మఉంటే ఎంతైనా..." అక్కడికి ఆపింది పార్వతి, జానకమ్మను పక్కనుంచి గమనిస్తూ.

జానకమ్మ చటుక్కున వెనక్కుతిరిగి వెళ్ళిపోతూ, "నాప్రాణాలు తోడేస్తున్నారే మీరిద్దరూ" అన్నది, విసుగులోనే బాధ మిళితంకాగా.

ఆమె వెంటే స్నానానికి వెళ్లుతూ పార్వతి బాధపడింది. 'నేనామెను కష్టపెడుతున్నాను' అనుకుంది. ఈ మధ్యను ఒకొక్కప్పు డనిపిస్తున్నది - జానకమ్మ తృప్తికోసమూ, సరస్వతి ఆనందంకోసమూ రాజుకు బానిసైపోతే సరి—అని.

'కేవలం తన నిశ్చయంతో సరిపోదు. ఇప్పుడు రాజు అల్లాటివాటికికూడా విముఖుడుగా కనిపిస్తున్నాడు. అతనలా ఉంటుంటే తనేం చేస్తుంది? అదేమో వెనకపాటుగా ఇంత సంఘర్షణ ఉచితానుచితాల ఆలోచనాను. తీరా అత నెదురుగా కనిపించేసరికి నిద్రపోతున్న వైరిపౌరుషం లేచిరావటం తప్పదు. తన ఆవేశం ఎందుకని ప్రశ్నిస్తే అతని నిస్సారకారపు మాటలవల్లే. ఆ అనవసరపు అహంకారం ఎందుకో, అదె న్నాళ్ళో చూడాలనిఉంది — వీళ్లంతా అడ్డురానట్టయితే.

'అయినా కొన్నాళ్లయి రాజెందుకో సాధ్యమైనంత

మౌనాన్ని పాటిస్తున్నాడు. చిన్నవిషయాల్లో జోక్యం కలగ జేసుకోక పోవడం మాటుంచి కన్నెత్తయినా చూడటంలేదు. అతనికీ బుద్ధిమంతుడనిపించుకోవా లనుంటుంది మరి!'

ఆ భావనరాగానే నవ్వొచ్చింది పార్వతికి. రాజు ఎంత గంభీరంగా ఇతర మక్కర్లేనట్టు ఉంటున్నాడో లోలోపల అతనికి అంత కసి, కోపం ఉన్నాయి - అనుకుంది మనసులో తను అతన్ని హింసిస్తున్నదా? అతడు తనని ఏడిపించలే? లొంగిబతకలేదు తను - ఎక్కడైనా సరే, ఎవరి దగ్గరైనాసరే. తను కొంత తప్పు చేసిఉండవచ్చు. అతనంతకంటే క్రూరంగా ప్రవర్తించాక తర్వాత తనుకాస్తతక్కువై, ఒక రకపువిలువ దొరుకుతుందేమోనని ఆశిస్తే అదికూడా భంగమైంది. ఎందుకని తను ఒదిగిపోవాలి? అంత కోరవలసిన దేమీ లేదు అతనిలో.

రాజు వచ్చిననాటికి పార్వతి ఇంట్లో కనిపించలేదు.

“ఏది?” అన్నాడు గోడ నడుగుతున్నట్లు.

ఎవరు అని జానకమ్మ తిరిగి ప్రశ్నించలేదు. “వాళ్ళ ఊరికివెళ్ళింది మొన్న పద్దెనిమిదో తారీఖున” అని అతడు ప్రశ్నించిన గోడ తనే అనుకొని సమాధానం చెప్పింది. “నువ్వూ వెళ్లకూడదటరా? సరస్వతికాస్త సరదాగా కాలక్షేపమౌతుంది పాపం!”

“వద్దమ్మా! అన్నట్టు సరస్వతిఉత్తరాలువ్రాస్తోందా?”

“ఆఁ. ఏదో వ్రాస్తూంటుంది. గానీ - నేనైనా ఒక

మాటు వెళ్ళిరావాలి.నిక్షేపంలాంటి పిల్లజన్మ అలాఅయింది. ముసలి బ్రహ్మకి మతిచెడిందేమో – అందరి బతుకులూ వల్లకాటి కీడుస్తున్నాడు!"

ఫక్కున నవ్వాడు రాజు. అతనలా నవ్వటంచూసి చాలా రోజులైందేమో – జానకమ్మకు తన ఇంట్లో కోటి వరహాలు రాలిన ట్లనిపించింది. అసలే అందంగా నవ్వుతాడు. రాజు ఇంతమొనగాడు కాకపోయిఉంటే దిష్టితీసి పారేసేదే!

హఠాత్తుగా అన్నది జానకమ్మ "రాజూ! పార్వతి కొంచెం మారినట్లు నా కగుపించిందిరా!"

"ఏడవనీ! మారిందని దా న్నెవ డేలుకుంటా డిప్పుడు?" చటుక్కునఅనేసి నాలుక కరుచుకున్నాడు

"అదికాదమ్మా..." నసిగాడు.

"నిజమే. నే నెన్ని పాపాలుచేశానో! కష్టపడిపెంచానే కానీ మీ సంతోషాన్ని చూస్తూ సుఖించలేకపోయాను పాడుజన్మ!" పైటచెంగుతో కళ్ళొత్తుకొని అంది జానకమ్మ.

తనకు తెలిసేలా తల్లి ఎప్పుడూ కన్నీళ్లు పెట్టుకోలేదేమో ఇలా – 'ఈ అమాయకురాలిని కష్టపెడుతున్నాను.' అనుకున్నాడు రాజు. తల్లి ఆనందం చూడడంకోసమన్నా పార్వతికి దాసానుదాసు డైపోవా లనిపిస్తుంది ఒక్కొక్క సారి. కానీ, ఆవిణ్ణి చూసేటప్పటికి ఈ సహనం నిలవదే? నిగ్రహాం పటాపంచ లైపోక తప్పదు. 'నిర్లక్ష్యమైన నవ్వు, ఆ మొహంలోని ఉదాసీనపాటు కానికెందుకో! సందర్భం,

అవకాశం రావాలిగానీ, ఆ చెంపలమీద శక్తికొద్దీ కొట్టి, తన పాదాల మీద పడేటట్టుచెయ్యాలని కోరిక.

'మరి అమ్మను ఆనందపెట్టడమెలా? అసంభవమే తన ఊహలో. కాకపోతే - న్చ!'

ఆమాటా ఈమాటా చెప్పి, ఆవిడ దుఃఖం బాగా చల్లారాక, "అమ్మా! కాశీ వెళ్దామా?" అన్నాడు రాజు.

"ఎందుకూ, గంగలోపడి చావడానికా?" అన్నది జానకమ్మ.

"నువ్వే చూడాలన్నావుగా ఒకసారి!"

"అవును. అలా మేం పోతేనైనా దిక్కెవ్వరూలేక తిన్నగా బ్రతుకుతారు."

ఇక లాభం లేదనుకున్నాడు రాజు. ఆవిడ పెట్టిం దేదో తిని అవతలకునడిచాడు బరువుగా.

సావిట్లో రామనాథంగారు అతన్ని నిలేశారు.

"ఏమోయ్! ఆ బడిలో ఉద్యోగం మాని - ఈ ఊళ్ళోనే ఏదైనా వ్యాపారం పెట్టకూడదూ?

"నా కిష్టంలేదు, నాన్నా! అనేశాడు సవినయంగా. అందులోకి దిగితే అనేక కష్టనష్టాలు" అనబోయాడు గాని గొంతురాక మెల్లగా తప్పుకున్నాడు అక్కడినుంచి.

రామనాథంగారు ఆలోచించారు కొంతసేపు. కొడుకు ఆర్జించి ఆస్తిలో కలుపుతున్న దేం లేదు. ప్రతినెలా ఉత్త రాలు వ్రాసి దర్జాగా డబ్బు తీసుకుంటున్నాడు 'కలిసిమెలిసి

ఇక్కడుండకుండా ప్రత్యేకంగాఉండటమేమిటి, అనవసరంగా?'
అనిపించిం దాయనకు.

౹ ౹ ౹

పార్వతి వాడినమొగ్గలా కూర్చుంది. అలాఉంటే సర
స్వతి చూసి ఊరుకోలేదని తెలుసు.

సరస్వతి రానే వచ్చింది. "అదేమే, అలాఉన్నావు ?"
అన్నది అతిదగ్గరగా వెళ్ళి.

"ఎల్లుండి వెళ్ళిపోవాలిగా నిన్నొదిలి?" దిగులుగా
నవ్వింది పార్వతి.

"పాడు ఉద్యోగం మానెయ్యకూడదూ?" అంది సర
స్వతి విసుక్కొని.

చేత్తో పార్వతిజడలు సర్దింది. పోనీ, రెండునెలలు
వెళ్ళకుండా ఇక్కడే ఉండిపోతే వాళ్ళే డిస్మిస్ చేస్తారు."

పార్వతి అక్కభుజంమీద తల ఆన్చుకుంది "సస్పెండ్
చేస్తే మరీ బాగుంటుందేమోనే అక్కా!" అంది.

కుడిచేతిమీదపడిన నీటిబొట్టుకు ఉలికిపడి ఆత్రంగా
పార్వతిని చూసి మరింత దగ్గరకు చేర్చుకుంది ఆ అమ్మా
యిని సరస్వతి.

"ఏమిటే, పారూ! ఇదంతా?"

"ఏమీ లేదు"

పార్వతిముఖం మామూలుగానే ఉంది. సరస్వతి తనను
లాలనచేసినప్పుడంతా పార్వతికి పాప గుర్తుకు వస్తున్నది.

"ఏమైనా సరే-నేను బతికివుండగా నీకు పెళ్ళిచేసేస్తాను." కొంతసేపటికి పార్వతి అన్నది.

"ఏడిసినట్లే ఉంది, ఇప్పుడు నాకు పెళ్ళేమిటి!" అంది సరస్వతి మొహంచిట్లించి.

"ఏం? నీ కెన్నేళ్ళేం మహా ! ఇరవై ఆరు వెళ్ళి ఇరవ య్యేడేనా?"

"అయితే?"

"అంతే! నీకు పెళ్ళి చేసేస్తాను. అదే ముఖ్యం నాకు."

పార్వతి ఇదివర కెన్నోసార్లు ఇదేమాటను సరస్వతి దగ్గర అన్నది. కొన్నిసంగతులు ప్రత్యేకంగా మాట్లాడాలని ఉంది ఆపిల్లకు. ఎదురుగా అడిగితే చిన్నపిల్ల ప్రశ్నలకింద తీసిపారేస్తుందేమో అన్న సందిగ్ధమూ ఉంది.

సరస్వతి ఆలోచిస్తూ కూర్చుంది.

"కులం చూడను; మతం చూడను; ఆస్తి చూడను. ఉద్యోగం చూస్తే చూస్తాను గుణం చూస్తాను. అందం చూడమంటావా ?"

ఫక్కున నవ్వువచ్చింది సరస్వతికి ఆప్రశ్నలు విని. "ఏమిటే, పిచ్చిమొద్దూ ?" అంది నవ్వుతూ ఎర్రబడి.

"నిన్నుచూస్తే పెళ్ళిచెయ్యాలనిపిస్తుంది"

"ఎందుకూ? కొందరు పెళ్ళిచేసుకుని సంసారాలు చేస్తున్నవాళ్ళకంటే నేను సుఖంగా ఉన్నాను. అన్నట్టు, రాజు ఇప్పుడు ఎలా ఉంటున్నాడు పారూ!"

"ఆ సంగతి అడక్కు. అందుకే నీకాబోయే వరుడికి గుణం చూస్తానన్నాను."

"రాజుగుణానికేం"

"బంగారం లాంటిదికదూ ?"

సరస్వతి తలవంచుకుంది "నువ్వన్న మాటకి చెప్తున్నాను. నేను పెళ్ళిచేసుకుంటే నాన్న నెవరుచూస్తారే' అసలు నాన్న గారి ఆరోగ్యం బాగుండటంలేదు. మొన్న మొన్న జ్వరం వచ్చి నాలుగురోజులు విడవకపోతే వల్లభశాస్త్రిగారు వచ్చి మీఊరు వెళ్ళమన్నారు. అక్కడిగాలి చల్లగా ఉండి ఆరోగ్య వంతమైనదన్నారు."

"అది నిజమే - చల్లగా ఉండటం. ఆరోగ్యవంతమా అనేదే సందేహం. సరే—"

"నాన్నగారితత్వం నీకు తెలుసుగా! ఎన్ని కష్టా లొచ్చినా, ఆఖరికి శరీర కష్టంవచ్చినా ఈ ఊరు వదల నంటారు. అదే చౌదరిగారితో అన్నారుకూడాను. ఇల్లాటి అమాయకపు మనిషిని ఒంటరిగావదలి ఎక్కడికైనా వెళ్ళి పోవడమే! నావల్లకాదు" చీరఅంచుతో కళ్ళకొసలు తుడుచు కుంది సరస్వతి.

"నువ్వలా బాధపడకూడదు. నేను నీకోసం ప్రయ త్నించేది సహృదయుణ్ణేగానీ, రాక్షసుణ్ణికాదుకదా ? పైగా వితంతు వివాహం చేసుకోవడానికి ఒప్పుకునే వ్యక్తి ఎల్లాటి ఉన్నత హృదయం, వివేచనకలిగి ఉంటాడో ఊహించుకో. అతను నిన్ను బాగా అర్థంచేసుకుని ఇక్కడే నీతో కలిసి

జీవించడానికి ఒప్పుకునేటట్టు చేస్తాను ముప్పాతికవంతు. ఒక వేళ అతడంగీకరించకపోతే..."

"ఊఁ... అదే కావాలి, ముఖ్యంగా చెప్పు."

"నేనే నాన్నదగ్గర ఇక్కడ ఉండిపోతాను."

"బాగానే ఉంది. మరి రాజెక్కడికి పోతాడు? అతడి కిలాటిస్థలాలు నచ్చవేమో..."

"అతని సంగతెందుకు? విడాకులిచ్చి, వచ్చేస్తాను. నాకిక్కడ ఎంతో హాయిగా ఉంటోందక్కా-?"

సరస్వతి తెల్లబోయింది. "ఇది మరీ బాగుంది; నాకు పెళ్ళిచేసి నువ్వు విడాకులిచ్చుకోవడ మేమిటీ? ఇన్నినీతులూ చెప్పి ఇదా? ఇంతకీ రాజేమన్నా అన్నాడా?"

"ఎవరు చెప్పేనీతులు వాళ్ళసొంతానికి వర్తించవు లేవే!"

"అలా అయితే నాకు పెళ్ళీవద్దూ పాడూవద్దు"

"ఆహా! ఎలాచేసుకోవో చూస్తాగా!"

పార్వతి మొటమొటా, విసవిసా తండ్రిదగ్గరకు వెళ్ళి పోయింది.

ఒక చిన్నగది నరసింహమూర్తిగారిగది. అక్కడున్న వస్తువుల్లో నిశ్శబ్దంకూడా ఒకటి.

ఆయన చుట్టకాలుస్తూ మంచంమీద చేరగిలి ఉన్నారు. పార్వతివెళ్ళి తండ్రి పలకరిస్తున్నా నిశ్శబ్దంగా కూర్చున్నది.

కొంతసేపుండి, "నాన్నా! నాన్నా!" అంది అప్పుడే మేలుకున్నట్టు.

నరసింహమూర్తిగారికి ముక్కునా, గొంతునా పొగ కమ్మి ఉక్కిరి బిక్కిరైంది కూతురి పలవరానికి.

"అదేమిటే?" అన్నాడాయన.

"అదికాదు, నాన్నా!"

"ఏదికాదు!" నవ్వి అన్నాడు. నీరసానికి కళ్ళల్లో నీళ్ళు చిమ్మాయి.

బలహీనంగాఉన్న తండ్రి దేహంవైపు ప్రేమగా చూచి, "అదికాదు, నాన్నా! అక్కయ్యకీ..." అంది.

"అక్కయ్య కేమైందమ్మా?" ఆయన కళ్లల్లో మళ్ళీ కంగారు ద్యోతకమైంది. లేచికూర్చున్నాడొక్కసారిగా.

"అబ్బే. ఏంలేదునాన్నా నువ్విలాగే కూర్చోమరీ... అక్కయ్యకి పెళ్ళిచెయ్యవా నాన్నా?"

నరసింహమూర్తిగారు సున్నితంగా నవ్వడం, వెనక్కు జరగడం జరిగాయి.

"చేద్దాంలే అమ్మా!" అన్నాడు

"ఎప్పుడు నాన్నా? మళ్ళీ అది ముసలిదైపోతుందేమో!" పార్వతి గారాంగానే అంది.

"తగినవాణ్ణి ముందు చూడాలి కదమ్మా?"

"నాన్నా, ఒక్కమాట! దానికి వరుణ్ణి నన్ను చూడమంటావా?"

ఆయన తేలిగ్గానవ్వి, "తప్పకుండా చూడు!"అన్నాడు. అప్పుడా నవ్వులో ఆయన మనసు తేలలేదు.

తలుపుపక్కన నిలబడి వింటున్నసరస్వతి నవ్వుకుంది పార్వతి కొంటెతనానికి. తండ్రికి తను పునర్వివాహం చేసుకోవటం ఇష్టంలేదేమోనన్న అనుమానం సరస్వతి మనసులో మొదటినుంచి ఏర్పడింది ఎందుకో.

## 23

అప్పుడే చదివిన అధ్యాయాన్ని తిరిగి చదవనారంభించినట్లున్న మానసికానుభవమే. అనుభవంలేని రచయిత, చెప్పిన సంగతే తిరిగి తిరిగి చెబుతుంటే కలిగేవిసుగే! ఎంతటి మమతాబద్ధుడైనా మనిషి మార్పు కోరతాడు. ఆంతర్యపు విధి నీరవంగా, నిస్తబ్దంగా పోతున్నరోజులలో పార్వతి బొత్తిగా విసిగిపోయింది. విసిగీ ఏమీ చెయ్యలేదు.

వాన ఒక్కజల్లే కురిసింది ఆరోజు కొత్తగా ఒక్క పువ్వే విరిసింది రోజా ఆ జల్లుకే దాని రేకుపెదవులు చంచలించాయి. అప్పుడే కన్నువిచ్చిన పువ్వు తన జీవితమ్మంతా వానే కాబోలు ననుకుంది పువ్వుగనక దానికి ఒక్కరోజో, ఒక్కగంటో, ఒక్కక్షణమో లోక సంబంధం. మనిషి కలా

కాదు. ఒక్క-క్షణం జీవించినా అతన్ని అన్నిబంధనాలూ చుట్టినట్లే లెక్క.

సరస్వతికి ఉత్తరం వ్రాద్దామని పూనుకుందేకానీ, ఎలా ప్రారంభించాలో తెలియటంలేదు పార్వతికి ఆదినుంచి అదేసమస్యగా, కలం కదలకుండా నిలబడింది కిటికీలోనుంచి బల్లదగ్గరకు ఆకాశం చక్క-గా కనిపిస్తున్నది. పంచరంగుల ఏరు ప్రవహిస్తున్నట్లు రమణిస్తున్న పశ్చిమాకాశం.

చేతిలో కలంవదిలి ఆమే చూస్తూ కూర్చున్నది. నోట తిరగని ఏవో బరువైనభావాలు. కళ్లు మూసుకుంటే రాధా కృష్ణ, మరొకసారి సరస్వతి కనిపిస్తున్నారు.

కొన్నాళ్ళకిందట ఒకరోజున రాధాకృష్ణ, పార్వతి దీర్ఘంగా సంభాషణలోకి దిగిపోయారు.

సుభద్రగారితో కొంత సత్కా-లక్షేపం జరిగిపోయాక రాధాకృష్ణ దగ్గరికి వెళ్ళింది పార్వతి

ఆమె లోపలికి అడుగుపెట్టగానే ఏదో వ్రాస్తున్న రాధాకృష్ణ—

"కవితరచన చదివారా, పార్వతీ? మార్చిసంచిక ఇచ్చాను-అందులో" అన్నాడు కూర్చోమంటూ.

నవ్వి కవిత, కవిత అని పట్టించారేమిటండోయ్? ప్రేమిస్తున్నారేమిటి?" అన్నది పార్వతి నోరుజారి. తర్వాత అంతలా ఎందుకన్నదా తను ?—అని విమర్శించుకుంది.

అతనికి కోపం వచ్చిందేమోనని చూసింది.

తల ఎత్తకుండా వ్రాస్తూనే అన్నాడు! "నా జీవితా

నికీ, ప్రేమకూ మధ్య ఆధారంగా ఉన్నసూత్రం ఎన్నాళ్ళ క్రిందటో తెగిపోకుండా ఉంటే—ఈ 'కవిత' మగవాడైనా, ఆడదైనా తప్పక ప్రేమించి ఉండును."

"కవిత ఆడపేరులా ఉందికదండీ ?" పార్వతి వింతగా చూసింది.

"మా రచయితలు సరదాకి పేర్లు మార్చుకుంటారన్న సంగతి మీకు తెలియదా ?"

"ఓహో ! అదా !"

కొంతసేపు మౌనం తర్వాత—"మీ మీద నాకుకోపం వస్తోంది" అన్నది పార్వతి.

"ఎందుకు, పార్వతీ ?" అన్నాడు రాధాకృష్ణ ఆశ్చ ర్యంగా.

"మీ రిలా జీవితాన్నంతా పాడుచేసుకోవడం నాకు నచ్చలేదు."

"మీకు తెలియదు, పార్వతీ !" ఇప్పటికి నాకు నా ఏకాంత జీవితంలో ఏలోటూ తెలియడంలేదు. నిశ్చింతగా ఉంది.

"అనుకోని కష్టాలువస్తే ఏంచేస్తారు ?"

"నేను దైవాన్ని నమ్ముతాను. అతను నిర్ణయించిన దాన్ని నమ్ముతాను. అతను నిర్ణయించిన దాన్ని అనుభవించ డానికి సిద్ధంగా ఉన్నాను.

"పరిపూర్ణత లేని జీవితం అయిపోదా మీది ?"

"ఏది పరిపూర్ణత పార్వతిగారూ ? అమలినమూ, పరిశుద్ధమూ అయిన భావమేదైనా హృదయంలో నిండిఉన్నంత వరకూ ఏది పరిపూర్ణతే. అందరికీ సముచితమైన దానికన్నా తనకు ఉన్నంతగా తోచిన దాన్ని త్రికరణశుద్ధిగా నమ్మి, అన్య ప్రాబల్యానికి లొంగిపోకుండా చివరివరకూ నిలవగలిగితే ఆత్మకు పరిపూర్ణత కలుగుతుంది

"ఇహానికి చెందినవాటి నన్నింటినీ అనుభవిస్తేకాని మానవుడి జీవితానికి పరిపూర్ణత కలగదంటారు. అదేమిటో నా కర్థంకా లేదు. చెప్పండి."

"మిమ్మల్ని మీరు విశ్వసించలేనంతవరకు అల్లాటివన్నీ నమ్ముతుంటారు. కానీ ఇవాళ ఇటువంటి ప్రసంగం ప్రారంభించారేమిటి ?"

"మీరు పెళ్ళిచేసుకోండి, కృష్ణగారూ !"

రాధాకృష్ణ కొద్దిగా నవ్వాడు. అంతలో అతనిముఖం మారింది. "ఇంతవరకు ఇక్కడివా ళ్ళెవరితోనూ జరిగిన నా జీవిత విశేషాలేవీ సరిగ్గా చెప్పలేదు. మాది బ్రాహ్మణ కుటుంబం పార్వతీ! తల్లిలేకపోవడంవల్ల పినతండ్రి ఇంట్లో పెరిగాను. మా వాళ్ళు సంకుచిత స్వభావంకలవాళ్ళు. నాకు వాళ్ళతో సరిపోక, వాళ్ళ ఉద్దేశాలతో ఏకీభవించలేకపోయే వాణ్ని. ఎప్పుడూకూడా, ఆఖరికి మేనమామకూతుర్ని పెళ్ళి చేసుకోమన్నప్పుడుకూడా అంగీకరించలేక పోయాను.

పార్వతి చటుక్కున అందుకుంది.

"మేనమామ కూతురంటే చులకనకదా, మరి ?"

అప్పుడు గుర్తు వచ్చింది రాధాకృష్ణకు — రాజూ, పార్వతీ ఒకరికొకరు లేమాతారో. నవ్వుతూ, "పెళ్ళయిన తర్వాత మేనమామ కొడుకూ చులకనై పోతాడు లెండి!" అన్నాడు.

వ్రాసిన కాగితాలపైపై చూస్తూ తాపీగా ప్రారంభించాడు రాధాకృష్ణ. "నేను కోరికోరి లలితను పెళ్లి చేసుకున్నాను. అప్పటినుంచి మరీకాస్త ఎడం అయ్యాను మా వాళ్ల దృష్టిలో. తర్వాత ఏడాదికే చనిపోయిన ఆమెను గురించి ఎవరైనా విచారించారో లేదోగానీ నా విషయంలో మాత్రం చాలా సానుభూతి చూపించి వెర్రెత్తించారు. అప్పటి కింకా మామయ్య కూతురు నళిని కాలేజీలో చదువుకుంటోంది ఆమెని నాకిచ్చి చేస్తానన్నారు. అవసరం లేదన్నాను. మొదట కాదని తర్వాత నా అవసరానికి ఆ అమ్మాయిని చేసుకుని అవమానించే బుద్ధిహీనుణ్ణి కానన్నాను. ఆ మాట నేనన్న మీదట — నళినికూడా ఒప్పుకుంటున్నదన్నారు పట్టుపట్టి మావాళ్ళు. ఆ బాధపడలేక వినకుండా వచ్చేశాను. ఇప్పుడు ప్రశాంతంగా ఉంది. ఇంకా ఒకటి రెండు కథలు ఎక్కువ వ్రాయగలుగుతున్నాను.

"వరసకి మా అక్కగారు ఒకావిడ ఉంది. ఆమె విశాలదృక్పథం కలమనిషి. ఉత్తరాల్లో నా యోగక్షేమాలు విచారిస్తూ పెళ్లిచేసుకోవడానికి ప్రయత్నించమంటుంది. నళినికూడా ఉత్తరాలు వ్రాసివ్రాసి కోపంవచ్చి మానేసింది.

ఆ పిల్లకీ పెళ్లయిందట. ఇదీ నా కథ. ఇంతకీ ఈ ప్రసక్తి ఎందుకు తెచ్చారు, పార్వతీ మీరు?"

సున్నితంగా నిశ్వసించింది పార్వతి. "ఈ మధ్య పెళ్ళిళ్లు చేసేబరువు నెత్తిన వేసుకుంటున్నాలెండి!" నవ్వింది.

"ఎవరికైనా పెళ్లి చేశారా-మాటలేనా?"

"ఇంకా ఎక్కడ, రచయితగారూ! ఒక అమ్మాయికి పెళ్ళిచెయ్యాలి. ఇంకా వరుడెక్కడ దొరుకుతాడో కూడా ఊహ కందడంలేదు."

"సరే! మీ ప్రణాళిక ప్రారంభానికి దొరికిన రెండో వ్యక్తిని నేనని తెలుస్తూనేఉంది. సులువుకోసం ఒక్క-ముహూర్తానికే ఇద్దరి పెళ్ళీ చేసెయ్యరుకదా?" ఛలోక్తి విసిరాడు రాధాకృష్ణ.

అర్థమయ్యాక - "అబ్బే! అదెలా అవుతుందండీ! కులభేదాలు ఉన్నాయి. లేకపోతే అలానే చేద్దును." అంది తెప్పరిల్లి.

"ఎవరా అమ్మాయి?" అన్నాడు రాధాకృష్ణ తెల్ల కాగితంమీద కలాన్ని ఆనుస్తూ.

"ముందు మీ సంగతి చెప్పండి. మీకు మరి పెళ్ళి చేసుకునే ఉద్దేశమేలేదా? - మగవారై ఉండి ఇలాటి పట్టు పట్టడంలో అర్థమేమిటో తెలియడంలేదు."

"మగవాడైనా, ఆడదైనా అంతరంగాల ఆవేదన ఒక్కటే. దుఃఖసంఘటనలు ఎదురైనప్పుడు రెండు మన

సులూ ఒక్కవిధంగా బాధపడతాయి. మగవాడు మనః స్థయిర్యం కలవాడు కనక తాత్కాలికంగా బయటపడడు."

"మీరు చెప్పేదెందుకో..." పార్వతి నసిగింది.

"నేను మగవాణ్ణని మీరు ప్రత్యేకించి అంటుంటే నాకీ ఊహ కలిగింది. భర్తను కోల్పోయిన స్త్రీ విపరీతంగా దుఃఖపడుతుంది భార్యను పోగొట్టుకున్న భర్తకూడా అంతగానూ బాధపడతాడు. అలాంటప్పుడు స్త్రీ జీవితాంతమూ అనుభవించే దుఃఖమూ, శిక్షా పురుషుడుమాత్రం ఎందుకు అనుభవించకూడదు? ఆ నియమాలు ఎందుకు విధించలేదని అంటాను అతను కష్టాలు విస్మరించే ప్రయత్నాలు ఎందుకు చెయ్యాలి?" అన్నాడు రాధాకృష్ణ. ఎంత కనిపించనీయకుండా ఉన్నా కళ్లలోనే అతని ఉద్రిక్తత వ్యక్తమౌతున్నది.

పార్వతి గడ్డంకింద చెయ్యి పెట్టుకుంది. "మీవంటి వారిని పువ్వులతో పూజించినా వింతలేదు. కానీ నాకు చాలా కష్టంగా ఉంది. మీరు జీవితమంతా ఇలాగే ఉండి పోతారా సన్యసించినట్లు?"

"కాదు, పార్వతీ! ఎక్కడైనా నాలాటి అభాగ్యురాలే తటస్థపడితే పెళ్లి చేసుకుంటాను."

"అంటే?" పార్వతి కళ్లు విప్పారి అతన్ని చూశాయి.

"నేను భార్యావియోగాన్ని అనుభవిస్తున్నట్లే, భర్తృ వియోగానికి పరితపిస్తున్న స్త్రీని పెళ్ళి చేసుకుంటాను-ఆమె అంగీకరించినట్లయితే. అప్పుడామె బాధను నేను, నా

బాధను ఆమె తెలుసుకోని ఒకరికొకరం తోడునీడగా అపో
హాలూ, అరమరికలూ లేకుండా కలిసి జీవిస్తాము."

"ఇవన్నీ కలలేమో అనిపిస్తోంది నాకు. అపోహాలూ, ఎత్తిపొడుపులూ లేని సంసారం ఉంటుందా ఎక్కడైనా -ఎంత ఆదర్శ దాంపత్యమైతేమటుకు!"

"అలా చెప్పలేమండీ! భార్యా భర్తల్లో ఒక వ్యక్తి అజ్ఞానంతోనో, మరెందుచేతనో అనుకూలం కాకపోతే మరొకవ్యక్తి తనకు తెలిసినంతలో అనుకూల పరిణామాన్నే వాంఛించి కృషిచేస్తేచాలు. ఇక ఇద్దరూ మూర్ఖులైతే వేరే నరక దర్శనం అనవసరం."

పార్వతి ఎవరో కొట్టినట్టు చూసింది. బాధ అనిపించింది. కానీ రాధాకృష్ణతో వాదించగల ధైర్యంలేదు.

చాలాసేపు ఏదో ఆలోచించిన తర్వాత చెప్పనారంభించింది పార్వతి.

"మా అక్క వితంతువు. దానికి పునర్వివాహం చెయ్యాలని నా ఆకాంక్ష" అంది.

"మీ అక్కగారా!" రాధాకృష్ణ ఆశ్చర్యంగా అడిగాడు. అంతవరకు తెలియక.

"అవును. మా అక్క చాలా అందగత్తె, అందుకే దానిస్థితి చూసినప్పుడు నా మనసును నిలవరించుకోలేను. దానిభర్త అంత రూపసికాడు. అక్క వట్టి అమాయకురాలు అతగాడిపాదాలైనా సరిగ్గా చూసిందో లేదో—తర్వాత మూడు నెలల్లోనే ఆయన ఇహలోకయాత్ర చలించాడు. అక్కడికి అది

అయిందా! ఇప్పుడు దానికి తిరిగి వివాహం చెయ్యడానికి మా నాన్నగారు తటస్థంగా ఉన్నారు. నేనడిగితే ఇష్టమేనని చెప్పారు. అక్కని ఒప్పించడం కష్టంకాదు. అప్పటికి చాలా వరకు ఒప్పుకున్నట్టే! ఇంక నా అన్వేషణ అంతా మీ వంటి ఆదర్శపురుషుల జాడనేవుంది" అన్నది నిట్టూర్చి పార్వతి.

"మీ అక్కయ్య కెన్నేళ్ళు?" అడిగాడు రాధాకృష్ణ కాగితాల్లో ఏదో వ్రాస్తూ.

"ఇరవై ఏడు అనుకుంటా."

"మీ అక్కయ్యనడగండి—ఆమెకిష్టమైతే నేను చేసుకుంటాను." పేపరుమీద ఒకగీత గీశాడు అతను.

విభ్రాంతితో పార్వతి స్తంభించింది. 'ఇతనొక మోసగాడు కాడుకదా?' అనిపించింది క్షణంలో. 'భార్యాపిల్లలు ఉన్నారేమో ఇతడికి? ఎంత తేలికగా, మామూలుగా చెప్పేశాడు!'

ఆకస్మికంగా తనలో కలిగిన అనుమానానికి ఆశ్చర్యపోయింది వెనువెంటనే. తన ఎదురుగా ఉన్నవాడు పవిత్ర ఆదర్శాలబాటలో నడవాలని ప్రయత్నించే వ్యక్తి.

నవ్వినట్టు నటించి, "అబ్బే! అదెలా అవుతుందండీ? మీరు బ్రాహ్మణులు; మేముకాము. అలాంటప్పు..." అన్నది సంకోచిస్తూ.

"ఎలాగూ వితంతువుని వివాహం చేసుకోవటానికి పూనుకున్నవాణ్ని—జాత్యంతరానికి జడిసిపోతానని ఎలా

అనుకున్నారు పార్వతిగారూ ?" ఒక్క మాటతో పార్వతి నోరు కట్టుబడిపోయింది.

పార్వతి ఆశ్చర్యపోతున్నది. లీలగా తనలో ఏదైనా విపరీతభావం ఉన్నదేమోకానీ, రాధాకృష్ణ ఇలా తానై అంగీకరించ ప్రయత్నిస్తాడని గట్టిగా ఊహించలేకపోయింది. 'బొత్తిగా ఇంత రాగద్వేషరహితుడైన మనిషితో అక్క సుఖపడుతుందా ? చిత్రం ! ఇదీ ఒక సమస్యేనా ? అది అదృష్టవంతురాలు.'

"నన్ను మావాళ్ళెవరూ అడ్డుపెట్టలేరు. నాకథ మీరు ఇందాకే విన్నారు." అన్నాడు రాధాకృష్ణ కాయితాలు కట్ట కట్టి అరలో పెట్టి లేచి.

"మీరు చేసుకుంటే అక్క ధన్యురాలు !" అంది పార్వతి నమ్రతతో.

రాధాకృష్ణ నవ్వాడు మెల్లగా.

పార్వతి ఆనందంగా ఇంటికి వచ్చింది. ఏదో పెద బరువు తలనుండి దింపినట్లయింది ఆరోజు.

ఆ సంభాషణ అంతా వేసవి సెలవలకు ముందే జరిగినా సరస్వతిదగ్గర ఆ ప్రస్తావన తేవడానికి అశక్తురాలైంది పార్వతి. ఆమె ఏమని తీసిపారేస్తుందో అన్నభయంచేత చెప్ప లేకపోయింది. అదీకాక ఉత్తరంలో వివరించి వ్రాసినంత సులభంగా ఆ అమ్మాయి ఎదుట చెప్పలేకనూ పోవచ్చు. అవన్నీ ఆలోచించి తిరిగివచ్చిన రెండునెలలకు ప్రారంభిం చింది అక్కకు ఉత్తరం వ్రాయడం. రాధాకృష్ణనుగురించి

కాస్త వ్రాయగలిగింది కానీ, అసలువిషయాన్ని వ్యక్తం చెయ్యడం సాధ్యంకాలేదు సరస్వతి నవ్వుతుందేమో!

అరగంట గింజుకుని, తననుతాను తిట్టుకుని. 'ఉఁహు! ఇప్పుడే వ్రాయకూడదు' అనుకుంది స్వగతంగా. 'రాధాకృష్ణతో మరొకసారి మాట్లాడి అక్కడకు సూటిగా వ్రాయాలి.'

ఆ నిశ్చయంతో కాగితంమడిచి కవర్లో పెట్టింది. "లచ్చి! లచ్చీ! ఇలారా!" పనిమనిషిని కేకవేసింది.

"అమ్మా? అమ్మాయిగారూ! కాఫీ నీళ్ళన్నీ పొయ్యిలో తగలబడి పోతున్నాయి." అంది లచ్చి గాబరాగా వచ్చి.

"ఫరవాలేదులే! చూస్తాను—పోస్టు చేసిరా దీన్ని ముందు."

"నాకేం? ఇలా ఎన్నిసార్లో అయింది. ధనవంతులై తేమాత్రం! ప్రతివస్తువూ ప్రియంగా ఉన్నరోజులని చెప్తుంటేని గాని..."

లచ్చి వయ్యారం చూస్తూ పార్వతి విసుక్కుంది. "అబ్బబ్బ! నీ వాగుడు కట్టిపెడుదూ! ఇది కాస్త పోస్టు డబ్బాలో పడేసిరా!"

"ఏమిటీ? ఉత్తరమా? నావల్లగాదమ్మో! నీ ఉత్తరం ముక్క పట్టుకుని అంతదూరం నే వెళ్ళలేను. నాలుగువీధుల పనుంది—సిద్ధప్ప వీధికెళ్ళాలా... ఇంకా బజారు వీధికూడా వెళ్ళాలి. అల్లదిగో హాస్పిటలుకాడ..."

ఓపిక నశించింది. "బంగారు తల్లివికదూ! చచ్చి నీకడుపున పుడతాను-విసిగించక వెళ్ళు" అంది పార్వతి.

"మొగుడొదిలీసేడు కదా, ఎలా పుడతావ్ పిల్లా?" లచ్చి బుంగమూతి పెట్టింది అదొక ఎవరికీ తెలియని వేదాంతిని. దానికి ముప్ఫయ్యేళ్ళు ఉంటాయి.

"పోనీ, వచ్చేజన్మలో." నవ్వు వచ్చింది పార్వతికి.

"వచ్చేజన్మలో కూడా మొగుడొదిలిస్తే?"

"అబ్బ! ఎలాగో పుడతాను లేవే! ఇప్పుడు నువ్వు వెళ్తావా, వెళ్ళవా? అది చెప్పు. కాదంటే నేనే వెళ్తాను చచ్చినట్టు. నామాట మీద కొంచెమన్నా గౌరవం ఉంటే కదూ!"

"అలా అనకండమ్మా! మీరు నాకు గురువులు."

"మరైతే నేను చెప్పిన పని చేసిపెట్టు."

"మీరు నాకడుపున పుట్టక్క-ర్లేదుగానీ, నాకో పాత చీర తీసివ్వండి బుల్లెమ్మా! బొత్తిగా లేవు కట్టుకుందుకు."

"నాకే లేవు. నీకేమిస్తానే? ఉన్ననాలుగూ సిల్కు-వేను." గొణుక్కు-ంది పార్వతి.

"పెళ్ళయిన కొత్తలో నాకూ సిలుకు చీరగట్టే అలవాటుండేది. ఎదవ సచ్చినోడెక్క-డ కులుకుతున్నాడో—ఆ గుడ్లగూబ దొరికిందాడికి—" సిగ్గుగా, కోపంగా తిట్టింది లచ్చి.

"వాడెలా ఉంటాడు?" అంది కుతూహలంగా పార్వతి.

"ఎవడూ? మావోడా? వాడిమొహం! కోతిలా

గుంటాడు. వాడి కర్మానికి నన్నొదిలీసేడు – అదృష్టంలేక, పాపిష్టోడు.”

“సరి! నీకు సిల్కు–చీర అచ్చిరాలేదన్నమాట?” అనాలోచితంగా వెనక్కు– వాలుతూ అనేసింది పార్వతి.

“నాకేం పట్టింది? నాకాడ ఉండటానికి వాడికే అదృష్టంలేదు. నాకొకటి తెలిసిందిలెండి! మీకు సిల్కు–చీర అచ్చొచ్చిందన్నమాట!” అమాయకంగా, కొంటెగా చూస్తూ అడిగింది లచ్చి.

పార్వతి గతుక్కు–మంది. ముందుకులేచి, “టైము దాటు తోంది. కదలవేం?” అంది కోపం నటిస్తూ.

“ఇదిగో వెళ్తాను. రేపు నాకు కప్పు కాఫీ ఇస్తారా?” అంది లచ్చి రెండడుగులువేసి.

“అలాగే! నీకు వెయ్యిదణ్ణాలు. వెళ్ళుముందర!”

లచ్చి వెళ్లిన తర్వాత రెండుక్షణాలు కళ్ళు మూసు కుని వెనక్కు– వాలింది. అటుతర్వాత ఏవో పిచ్చి ఆలోచన ల్లోనే కాఫీ తయారు చేసింది గోపాలుడు రాలేదు. సాహసం చెయ్యక తప్పలేదు.

మంచంమీద ఇష్టానుసారం పడుకొని ఉన్నాడు రాజు.

కప్పు బల్లమీదపెట్టి చూచింది పార్వతి. నిద్రపోతు న్నాడు. వర్ణనాతీతమైన అందంఉన్నదతనిలో. ఆ భంగిమలో నిద్రపోతున్నప్పటి నైర్మల్యంలో విశేషమైన అందం అగు పిస్తున్న దనుకుంది ఒక్క–అడుగు ముందుకు వేసింది. ఏ ప్రేరే పణో–కళ్ళు చలించకుండా చూడాలని ప్రయత్నిస్తున్నాయి.

తను సౌందర్యోపాసకురాలైందో, లేదోగానీ, ఇప్పుడు తనకు తటస్థపడి తనచుట్టూ ఉంటున్న మగవాళ్ళలో చాలా మంది అందగాళ్ళే. తాత్కాలికంగా చైతన్యం కలిగిస్తుంటారు. రాధాకృష్ణ అందానికి అర్థం అతనిలో తేజస్సూ, ఆకర్షణా. శేఖరం అందం ఎటువంటిదో చెప్పడానికి అనువైనదికాదు. అది వేరు. కానీ, రాజు? అందగాడు - అంటే దానికి సరైన అర్థం ఇతని రూపంలో ఉన్న దనిపిస్తుంది. వ్యక్తిలోని అందం అనేకవిధాలు. ఒక్కొక్కరి సౌందర్యం నిలిచిపోయి ఆరాధించబడుతుం దంటారు. అదెంత నిజమో తనకు తరిచి చూడవలసిన అవసర మేం వచ్చింది? ఏదో రోజులు వెళ్ళగొట్టడమే చాలు, చాలు!

రాజు కళ్ళు విప్పాడు. ఎదురుగా పార్వతి ఉన్నది. అతనేమీ అనలేదు. ఒకసారి ఆమెకేసి చూసి, తిరిగి కాఫీ కప్పును చూశాడు.

ఐనా పార్వతి హడలిపోయింది. అతనేమైనా అనేస్తే? ఒక్కక్షణం చాలును!

తడబడుతూ అతనిముందు కాఫీఉంచి, ఇవతలకు వచ్చేసింది గబగబా. అతనేమీ అనకపోవడంవల్ల కాళ్ళు మరింతగా వణుకుతున్నాయి.

పార్వతి ఆ స్థితిలో ఉండగా శేఖరం ఎక్కడినుంచో ఊడిపడ్డాడు. గదిలోకి "హల్లో" అంటూ చొరవగా వచ్చేశాడు.

"ఇదేమిటి? చండికలా కూర్చున్నావు? వాగ్దానం

మాట మరిచిపోయుంటా వనుకున్నానులే! సినిమాకి రెడీగా లేవా ?

"క్షమించు శేఖర్ ! తప్పకుండా వస్తాను. ఇవాళ్టికి వదిలెయ్యి!" పార్వతి ప్రాధేయంగా అడిగినా శేఖరం ఒప్పుకో లేదు. ఆమెను అప్పటికప్పుడు కంగారుపెట్టి ఈడ్చుకు వెళ్ళి నంత పనిచేశాడు.

రాజు ఇంట్లో ఉన్నాడు. అతని ఎదురుగా శేఖర్ మాట కాదంటే తనే లోకువేమో! ఇష్టంలేకపోయినా వెళ్ళింది పార్వతి.

తెరమీద బొమ్మలు పాటలు పాడుతున్నప్పుడూ, శేఖరం చెయ్యి అప్పుడప్పుడూ తన అరిచేతిమీద పడుతున్న ప్పుడూ పార్వతి మెదడు అవిరామంగా అర్థంకాని వాటిని అలోచించి వేసారింది.

## 24

శ్రావణమాసం. మీద - ఆకసాన మేఘాల అందం ఎవరు చూస్తున్నారు? కింద ఒక పల్టీకొట్టినా ఫరవాలేదనే ధీమా ఉన్నవాళ్ళే కాస్త తలపైకెత్తి ఆ మేఘ సౌంద ర్యాన్ని తిలకిస్తున్నారేమో!

కాలేజీనుంచి వేగంగా నడుస్తున్న పార్వతి తాలూకు

జోడులేని పాదాలు రెండుసార్లు మృదువుగా జారాయి. ఆ లసలసల్లోనే ఆవిడ రాధాకృష్ణ గదికి తిన్నగా వెళ్ళింది.

రాధాకృష్ణ తనగది గోడకు ఒక సుందరమైన రాధాకృష్ణుల చిత్రపటాన్ని తగిలిస్తున్నాడు పార్వతి వెళ్ళేసరికి. అదిచూచి ముగ్ధురాలైంది.

ఆమె వెళ్ళినప్పుడంతా అతను ఏదో ఒక కళాత్మకమైనపని చెయ్యడమే చూచింది. ఆ చిత్రం ఎంత బాగున్నదని! తనకు చిత్రకళా ప్రవేశంలేనందుకు తిట్టుకుందేమో కూడా ఆ సమయంలో.

రాధాకృష్ణ చూచాడామెను. "అరె! మీరెప్పుడొచ్చారు? కూర్చోండి, కూర్చోండి! సుభద్రగారి కోసమేనా? ప్లీడరుగార్ని స్నేహితు లెవరో స్టేషనుకు రమ్మన్నారట. ఆవిడా వెళ్లారు ఆయనవెంట. పాపమాత్రం ఇప్పుడే బడినుంచివచ్చి అడుక్కోవడానికి వెళ్ళింది అలా."

"అలాగా?" అన్నది పార్వతి మైకపుగొంతుతో.

పాపకోసం వీధివైపుచూసిన రాధాకృష్ణ ఇటు తిరిగి ఆశ్చర్యపడ్డాడు.

పరవశంగా చిత్రాన్ని చూస్తున్న దామె. మళ్ళీ రాధాకృష్ణ పలకరించగా మేలుకుంది.

"ఎంత అందంగా ఉన్నదండీ, ఈ చిత్రం! ఒకనాడు కృష్ణుణ్ని, రాధని చూసినట్లుగా చిత్రించాడీ చిత్రలేఖకుడు" అని నిట్టూర్చి, కూర్చుంటూ, "నేను మీతోనే పనుండి వచ్చాను." అన్నది.

ఆపనేమై ఉంటుందీ? అనుకున్నాడు రాధాకృష్ణ.

టేబిల్ మీద చిన్న ఫోటో ఉంచుతూ నవ్వి. "ఇదిగో! మా అక్కను చూడండి!" అంది

రాధాకృష్ణ పెదాలమీదకు చిన్న నవ్వు వచ్చింది.

ఫోటోను చేతిలోకి తీసుకుంటూ, "ఈ ప్రపంచంలో ఏ మగవాడూ మీ అక్కకి తగినవాడు కాడనిపిస్తోంది. నన్నెలా ఎంచారు మీరు ?" అన్నాడు.

"ఆ మాట నిజమే! అందమనే పదానికి రూపండుంటే అది మా అక్కనిచూసి తలవంచేసుకుంటుంది."

"మరి నేను ఇన్నాళ్ళూ స్వేచ్ఛాజీవిని. ఇక ముందు మీ అక్క నా స్వేచ్ఛని సమూలంగా హరించేలా ఉంది" అన్నాడు నవ్వుతూ.

"ఇక నే వెళ్ళొస్తాను కృష్ణగారూ! రాజు అదేదో ఊరు... ఆఁ... కాకినాడ వెళ్లారు. రెండురోజులైంది" పార్వతి లేచింది.

"ఆగండాగండి! దీన్నికూడా తీసుకెళ్లండి" అన్నాడు రాధాకృష్ణ గోడనున్న చిత్రపటం తీస్తూ.

"అదేమిటది? బావుందని అన్నమాత్రానికే ఎవరైనా ఇచ్చేస్తారా? మీ దాతృత్వం మెచ్చుకోదగ్గది." అంది పార్వతి వద్దని వారిస్తూ.

"మీ దగ్గరే ఉండనివ్వండి! ఇల్లాటివాటిని ఇష్టపడే వాళ్ళంటేనే నా కిష్టం." రాధాకృష్ణ అందిస్తూ అన్నాడు.

చివరకు తీసుకుంటూ, "సరే! ఎక్కడున్నా మీ జ్ఞాపక చిహ్నంగా ఉంచుతాను దీన్ని. మా సరస్వతి తిడితే మీకే ఇచ్చేస్తాను" అన్నది నవ్వి.

చీకటి పడింది.

ఇంటి మెట్లెక్కుతూ వరండాలో కూర్చొని ఉన్న శేఖరాన్ని చూసి పార్వతి గుండెలో రాయివేసుకుంది.

'ఇతనెప్పుడొచ్చాడు?' ఒక్కసారి రాజు ఊళ్ళో లేని సంగతి, పని మనుషులు అటువంటివేళ ఉండరన్న సంగతి గుర్తువచ్చి గిర్రునతిరిగాయి మెదడులో.

"నీ కోసం పడిగాపులు పడి చస్తున్నాను! ఆ సానుభూతైనా ఉందా?" అన్నాడు శేఖరం కోపంగా చూస్తూ.

"క్షమించుమరి! ఆలస్యమైంది. ఇంతకూ—అడక్కూడదుగానీ—నువ్వెందు కింత శ్రమపడవలసి వచ్చిందో?" పార్వతి తలుపుతీసిలోపలికి నడుస్తూ అన్నది.

"పొమ్మనగూడదూ, అలా అడక్కపోతే?"

"నువ్వలాగే అపార్థంచేసుకుంటావు! ఉండు కాఫీ తెస్తాను." చేతిలో చిత్రాన్ని అక్కడ ఉంచి వెళ్ళబోతున్న పార్వతి చెయ్యి పట్టుకుని ఒక్కలాగు లాగి, "అక్కర్లేదు" అన్నాడు శేఖరం.

ఆ ధాటికి అతనిభుజంమీదకు తూలిపోయింది పార్వతి. వెంటనే వెనక్కుతగ్గి, "నువ్వు తాగకపోతే నన్నూ వద్దంటా వేమిటి?" అంది మొహం చిట్లించి మరో గదిలోకి వెళ్ళుతూ.

శేఖరం తియ్యగా నవ్వాడు ఆమె కళ్ళలోకి చూసి. ఫ్లాస్కులోని కాఫీ, కప్పులోకి వంపుతుంటే తొణికి కొంచెం కొంచెంగా కిందపడింది. పార్వతి తలపులో ఏదో సందేహం, మనసులో అధైర్యం. నిబ్బరంగా మాట్లాడుతున్నదే కానీ, శేఖరం ధైర్యమూ, చనువూ చూసి లోలోపల తడబడు తున్నది.

'ఎందుకో తనలో బలహీనత ఎక్కువౌతున్నది. ఎప్పుడో ఒకనాడు ఏదో ఒక అఘాయిత్యం జరుగుతుందన్న భ్రమకలుగుతున్నది ఉండిఉండి. ఈ శేఖర్ ప్రవర్తనచూస్తున్నప్పటినుంచే ఈ అలసత్వం. తెలియనిగోల కనుక అలా అనిపిస్తున్నది కానీ, పూర్వపు స్నేహంతో మాట్లాడుతూ ఉన్న వ్యక్తిని సందేహిస్తున్నది తను. ఛీ! తనలో ఉత్సాహమూ, స్వేచ్ఛా ఏమైపోయాయో? రాజు చేశాడు తనను ఇలా. లేదు! తనేనా, చేసుకుంది స్వయంగా?

అతనికి కాఫీ ఇస్తూ, వీధితలుపులు చేరవేసి ఉండటం గుర్తించింది.

"నీతో మాట్లాడాలని వచ్చాను. శేఖరం సహజంగా అనగానే ఆ వేగం అణిగి, స్నేహపు అభిమానం కలిగింది.

"ఏమిటో ఆ గొప్ప విషయాలు?" అంది తనధోరణి మార్చకుండా. అతను కూర్చోమన్నాడు, పార్వతి వినలేదు.

"రాజులాంటి పిగ్‌తో ఎలా బతుకుతున్నావో ఊహించలేక పోతున్నాను." అన్నాడు శేఖరం.

"ఏం? అందంలో రాజు నీకన్నా నయమే అను కుంటాను" అంది నవ్వుతూ.

"ఓస్! అందాన్ని కొరుక్కుతింటామా?" తీసి పారేశాడు.

"ఏమో—నేనంతపనీ చేస్తున్నాను! అందం ఆ రకమైతే మీా సతీ మణితో ఇంత ఇబ్బంది లేకపోయేది నీకు. పాపం! ప్చ్!"

"ఆఁ! అదొ౾క డర్టీక్రీచర్! రాజులాంటి మనిషికది తగును. దానికేంగానీ—ఈ దేవుడి దొ౾క మట్టిబుఱ్ర అనుకో!"

"కాకపోతే నీ వంటి బురద బుఱ్రల నెందుకు పుట్టిస్తాడు?"

"ష్! హాస్యం చాలించి నెమ్మదిగా విను పారూ! ఒకసంగతి చెబుతాను నావంటి వ్యక్తికి నీవంటిభార్య ఉంటే ఆ సంసారం ఎంత హాయిగా సాగుతుందో తలుచుకో! అదే నేను ఊహించుకొని ఆనందిస్తుంటాను ఎప్పుడూ."

"అవును. నా పెళ్ళి ముందురోజుల్లోనైనా అగుపించావు కావు - నా మనసు మారునేమో? ఏం చేస్తాం? మరిచిపో మిత్రమా!" హాస్యంగానే అన్నది.

శేఖరం చటుక్కున చెయ్యిపట్టుకున్నాడు పార్వతి నిలదొక్కుకుంది.

"ఏం చేస్తామంటావేమిటి పార్వతీ? కావాలంటే మరో చక్కనిమార్గం ఉంది"

"ఏమిటా మార్గం?" అంది అతని చేతిని విడిపించు కుంటూ.

"ఆ మార్గంలో నువ్వు నాకు తోడు వచ్చావంటే నీకు స్వర్గం చూపించగలను పారూ నేను! ఆ విషయంలో సందేహించనక్కర్లేదు. ఈ నరకజీవితాన్ని నువ్వొప్పుకోవటం సహించలేను."

"ఫరవాలేదు ఈ నరకంలోనే ఉండనియ్యి. దీన్ని వదులుకొని కొన్నాళ్లు స్వర్గాన్ని చవిచూసినా, తిరిగి నరకం లోకే పోవాలేమో! ఈ నరకాన్ని పూర్తిగా అనుభవిం చేస్తే అప్పుడెలాగూ స్వర్గానికే కదా వెళ్ళేది?"

మెరుపులా శేఖరంలేచి నిలబడి, పార్వతి భుజాలను పట్టుకున్నాడు ఉద్రేకంగా.

"నువ్విలా నైరాశ్యంగా మాట్లాడినప్పుడే నీకు స్వర్గ మేమిటో చూపించా లనిపిస్తుంది పార్వతీ! ఈ పీనుగుల కోసం మనం బెంగపెట్టుకోకూడదు. రా, నా వెంట. పూల బాటల్లో తీసుకెళ్తాను"

పార్వతి మౌనం వహించింది. ముఖాన్ని స్వేదం కమ్ముకొంటున్నది. కానీ భయాన్ని తెలియనివ్వడంలేదు.

"అంతెందుకు? మీ సుభద్రగారి సంగతి నీకు తెలుసు. వారు ఉత్తమమార్గం అవలంబించారు మనం అంతకన్నా ఒక మెట్టుపైకి పోగలగాలి. నీ సుఖం లోకానికి అక్కర్లేదు. దానికి కాలక్షేపం చాలు ఏమంటావ్ పారూ?" శేఖరం పార్వతిని కుదిపాడు.

'రాజుమీద పగతీర్చుకోవటానికి తనకు దొరికిన అవకాశమా ఇది? అతనికి అవమానం కలుగుతుంది. కానీ, అత్తయ్య? ఆమె తలెత్తుకోలేదు. మామయ్య ఏమనుకుంటాడో? నాన్న పరువేపోతుంది. సరోజకు తను పూర్వపు పార్వతి కాలేదు. సరస్వతి బావిలో దూకవచ్చు. తన ఆత్మకు? ఉఁహు. తనను భగవంతుడు క్షమించడు!'

శేఖర్ ఉక్కుచేతుల్లో పార్వతి మృదువైన అరిచేతులు నలిగిపోతున్నాయి.

"నన్ను తొందర పెట్టవద్దు, శేఖర్! నేనింకా ఆలోచించుకుంటాను." అంది బిగుసుకుపోయే కంఠంతో.

కానీ అతను పార్వతిని విడిచిపెట్టలేదు. పార్వతికి అప్పటి ఆ స్పర్శ కొన్నిక్షణాలు వింతగా ఉంది. ఒక్కొక్కసారి అతనిచేతుల్లోని మృదుత్వం సర్పస్పర్శలా భయం పుట్టిస్తున్నది. కాలం క్షణాల్లోనే ఉన్నా పార్వతికి ఎలా తప్పించుకోవాలో తెలియడంలేదు. అతన్నేమీ అనకుండా ఉంది. మరోక్షణం ఆగితే ఏమైపోతుందో తను-అని భయపడింది. గుండెవేగానికి పోటీగా మెదడు గిర్రున తిరిగిపోతున్నది.

మోహపు మాటలంటూ అతను పట్టుకున్న తన చేతులు విదిలించుకోబోతున్నంతలో ఎవరో తలుపు తెరిచిన శబ్దం పెద్దగా వినిపించింది ఇద్దరికీ స్పష్టంగా.

'రాజు! రాజే అయి ఉంటాడు! ఇక్కడ-తను, శేఖర్

ఏకాంతంగా! అంతే! పార్వతి ఏమైపోయిందో ఆమెకు తెలియదు. స్వప్నంలో ఉన్నదో, కలలో ఉందో!

౨ ౨ ౨

సొమ్మసిల్లి సోఫాలో వాలిపోయిన పార్వతి కళ్ళు తెరిచేసరికి సుభద్రఉంది ఎదురుగా—మొహంమీద నీళ్ళుచల్లి విసురుతూ. అప్పటికీ పార్వతి గుండెబరువు వదలలేదు.

సుభద్రను మామూలుగా చూడలేకపోయింది. ఆమెతో మాట్లాడటానికి సాహసంగా కంఠం పెగిలిరాలేదు.

రెండు కళ్ళూ పైకెత్తింది. ఐనా విపరీతమైన సిగ్గుతో పెదాలు కదలడంలేదు ఈమె వచ్చి ఆదుకున్నదా? లేక తను శేఖర్‌కు అనువైపోయిందా? అంతా కలతలా ఉంది.

సుభద్రగారు తన ముఖంలో ఏ భావాన్నీ స్పష్టంగా వ్యక్తం చెయ్యలేదు. "ఇప్పుడే స్టేషన్‌నుంచి వస్తున్నాము. కాఫీగుండ కొంచెం తీసుకెళ్దామని వచ్చానమ్మాయ్! నువ్వు కళ్ళుతిరిగి పడిపోతే అతనెందుకలా కంగారుగా పారిపోయాడు? ఇదేనా స్నేహధర్మం?" అన్నదావిడ.

ఆమెను పంపించి తలుపువేసుకుంది. విద్యుద్దీపాల వెలుగులో కృష్ణుడి చిత్రపటం అందాలు చిందిస్తున్నది వివిధ కాంతులతో.

టేబిల్‌పైన తల ఆనించుకుకూర్చుంది పార్వతి. శేఖర్ ఇంత పశువులాంటివా డనుకోలేదు అటువంటివాడితో స్నేహం కలిగిఉన్నందుకు సిగ్గుపడవలసిందే.'

పార్వతి తలఎత్తింది నిర్విశేషంగా.

చిత్రపటంలోని కృష్ణరూపం మనోహరంగా హృదయాంతర్భాగాన హత్తుకుంటున్నది. అర్థంగాని మనఃపరితాపం భగవంతుణ్ణే ప్రశ్నలు వేస్తున్నది.

'నిస్సారజీవితాన్నిలా కొందరికిస్తావేం భగవాన్ ? నీ నవ్వులేమిటో — అర్థాలు నాకు తెలియటంలేదు. నిన్ను గురించి నాకేమీ తెలియనిమాట నిజమేగానీ, నన్నెందుకిలా అనవసరంగా సృష్టించావో అది చెప్పు ముందు. నువ్వు నా కళ్ళ కగుపిస్తే నీ వెంట ఎక్కడికి రావడానికైనా అభ్యంతరం ఉండదు నాకు. అలా సులభంగా కనిపించవుగా! రాధాలోలుడివై ఎక్కడో దాగి ఉన్నా నీ సృష్టిలో ఒకమనిషి నిన్నుగురించే ఆలోచిస్తున్నదని నీకు తెలిసిఉండదా ? నీ కన్నీ తెలిసిఉన్నట్లే నాకు అనుమానం. ఇదివరకులేని ఏదో భావబంధనం నన్ను నీ ఎదటికి తెచ్చి నిలబెడుతున్నది. అనుదినం నీ ఆరాధన చేస్తున్నట్లేఉంది. ఏనాటికైనా ఆదరంతో నన్ను స్వీకరించేవాడివి నువ్వే ననిపిస్తున్నది స్వామీ?'

గోడనున్న మరో చిత్రపటంమీది పువ్వు పార్వతి తలదగ్గరపడింది. ఈ ఆలోచనలవల్ల పార్వతికి అవ్యక్తమైన తృప్తి కలిగింది. ఆమెలో ఆధ్యాత్మికభావాలు చెలరేగుతున్నాయి కొద్ది రోజులుగా. భగవానుని తలిచినప్పుడంతా తనలో ఒక ప్రత్యేకత గోచరిస్తున్నది పార్వతికి. ఆ సుఖం ఆమెచేత మౌనాన్ని, నిశ్శబ్దతను వాంఛింప చేస్తున్నది. అవి లభ్యంకావడం లేదు.

పార్వతి లేచి అల్మారాలోని బిస్కట్లు తిని మంచి

నీళ్ళుతాగి పడుకుంది. ఆ రాత్రికి వండుకోవడం శ్రమ అని పించిం దా అమ్మాయికి

పడుకుందేకానీ నిద్ర రాలేదు. ఆలోచనల వాడి కత్తులు నిద్రాదేవతను బెదిరించి తరుముతున్నాయి గమ్మ త్తుగా. శేఖరంసంగతి, అతని మూర్ఖత్వంమాట అలా ఉండగా – రాధాకృష్ణ, సరస్వతి – ఇద్దరూ పార్వతి మనః పథంలోకి వస్తున్నారు మాటమాటకీ.

'వారి జీవితాలు బాగుపడతాయి. సరస్వతి అదృష్ట వంతురాలు. మరి తన జీవితం?' అనుకుంది పార్వతి. నిద్ర కమ్ముకురాగా పక్కకుతిరిగి పడుకున్నది పదిగంటలకు.

## 25

లలిత లవఙ్గలతా పరిశీలన
కోమల మలయ సమీరే
మధుకర నికర కరమ్బిత కోకిల
కూజిత కుంజ కుటీరే
విహరతి హరిరిహ సరసవసన్తే
నృత్యతి బృంద వనాంతే
యువతి జనేన సమంసఖి
విరహి జనస్య దురన్తే!

వీధిలో బూట్లచప్పుడుకు కుర్చీఎక్కి చిత్రపటానికి పువ్వులు పెడుతున్న పార్వతి, వెనక్కితిరిగిచూచి వెంటనే దిగింది కిందికి.

గుమ్మందగ్గరున్న వ్యక్తిని ఆమె ఎఱగదు.

"రాజు ఉన్నాడాఅండీ ఇంట్లో?" అన్నాడా ఆగంతుకుడు.

"ఉన్నారు. ఈ కుర్చీలో కూర్చోండి—పిలుస్తాను." ఆహ్వానించి గబగబా లోపలికి వెళ్ళింది. పార్వతి.

వెళ్ళుతున్న ఆ అమ్మాయిని ఆశ్చర్యంగా చూశాడు పద్మచరణ్. అతనుగుమ్మంలో అడుగుపెట్టగానే కనిపించినవి పార్వతి రెండుజడలూను.

"రెండుజడలు, చెవులకి రింగులు, బొట్టులేని మొహమూ, ఫాషనబుల్‌చీరా... మరి రాజు?" గొణుక్కున్నాడతను.

ఇంతలో రాజు చిరునవ్వు నవ్వుతూ ప్రత్యక్షమైనాడు. పద్మచరణ్ రాజు పలకరింపులు పట్టించుకోకుండా అతడిని నఖశిఖ పర్యంతం పరీక్షచేయ నారంభించాడు. పూర్వపు ఉత్సాహమూ, సిండుతనమూ ఏమైనట్టో కానీ చిక్కిపోయినట్టు అగుపించాడు రాజు పద్మచరణ్ కళ్ళకు.

పద్మచరణ్ రాజుమీద అభిమానం ఏర్పరుచుకున్నాడు. అతడు దేనికైనా మనసులోనే బాధపడతాడు. అందుకే కనిపించకుండా నిట్టూర్చి రాజువెంట అతని గదిలోకి వెళ్ళాడు.

చాలా విషయాలు దొర్లిపోయాక, "నువ్వెందు కిటు వంటి పని కోరి చేపట్టావో తెలియటంలేదు" అన్నాడు పద్మ చరణ్.

"కొన్నాళ్ళు లెక్చరర్ చేశానుగా! ఇదికూడా చవి చూడాలనిపించింది." నవ్వేశాడు రాజు. "మళ్ళీ లెక్చరర్ కావాలేమో?" అన్నాడు.

"ఆ ఉద్దేశ్యం ఉందా? ఐతే బతికి పోయాం!"

"నా ఉద్దేశాని కేముంది? ఉద్యోగమన్న దే దైతే నేమిటిగానీ—ఆంధ్రాలో నాకు తెలిసిన ప్రిన్సిపాలొకాయన ఉన్నా . ఈ మధ్యను కాకినాడకి పిలిపించి ఈ విషయమే ప్రస్తావించాడు. నన్నతను ఏదో ప్రత్యేకంగా చూస్తాడు... నాన్నేమో బిజినెస్ పెట్టమంటున్నాడు." ఆలోచనగా అన్న రాజును చూస్తూ, "నువ్వు లెక్చరర్‌గానే అందంగా ఉంటా వోయ్!" అని తుదినిర్ణయంలా తేల్చేశాడు పద్మచరణ్.

పార్వతి కాఫీలు తెచ్చి వాళ్ళిద్దరి ఎదురుగాపెట్టి మౌనంగా వెళ్ళిపోయింది.

"చూస్తే : నువ్వు వట్టి సెన్సులెస్ జంటిల్‌మన్‌లా ఉన్నావోయ్! కవులు ఈ అమ్మాయిని చూస్తే, 'ఏం అంద మైన స్త్రీ!' అంటూ వర్ణనల్లోకి దిగిపోరూ? నువ్వావేళ అంత అసహ్యించుకుంటే ఎంత కురూపో, ఎంత దు ర్వాచార పరాయణురాలో అనుకున్నాను. నువ్వేమీ అనుకోకుంటే నిజం చెబుతాను—గత రెండేళ్ళుగా ఇల్లాటి చార్మింగ్ లేడీ

కోసమే నేను వెదికి తిప్పలు పడుతున్నాను" అన్నాడు పద్మచరణ్.

పార్వతిని బాగా మెచ్చుకున్నాడు. రాజు కదిలేటట్టు కనిపించక తననుతనే పార్వతికి పరిచయం చేసుకుని, హాస్యం మాటలతో ఆమెను కొంతసేపు కవ్వించి వెళ్ళాడు. ఆ కాస్సేపూ పార్వతి నవ్వింది.

రాజు ఆలోచనలో పడ్డాడు. పద్మచరణ్ ప్రసంగమే అతనిలో పనిచేస్తున్నది. పైగా తను కాకినాడనుంచి వచ్చే టప్పటికి పార్వతి ఉద్యోగాన్ని ఉద్దేశ పూర్వకంగా ఎందుకు వదులుకుందో అదీ అర్థం కాలేదు.

పార్వతి తనను ఎదిరించి ఒక్క మాట కూడా పైకి అనటంలేదు. ఆమె ఇష్టప్రకారం ఆమె ఉదాసీనంగా నడుచుకు పోతున్నదంతే! నిర్లక్ష్యమూ, నిర్లిప్తతా ఆమె నడతలోనే వ్యక్తమౌతున్నాయికానీ, మాటలుగా పైకి రావడం లేదు.

## 26

పార్వతి సుభద్రను, రాధాకృష్ణను అరుదుగా కలుసు కొంటున్నది. ఆ అమ్మాయి వెళ్ళకపోయినా వాళ్ళే వచ్చి మాట్లాడి వెళ్ళిపోయేవారు ఆ కొద్ది సమయం ఉత్సాహం

గానే గడుస్తుంది. పార్వతికి ఇంట్లోనే ఇరవై నాలుగు గంటలు వుండిపోవటం ఒక అ[illegible]వాటుగా పరిణమించింది. ఆమెకు ఇష్ట మనేది దేనిమీదయినా ఏర్పడితే దానినుంచి ఆమెను మళ్లించడం ఎవరితరమూ కాదు.

నిరాశ కారణంగా కలిగే ఆలోచనలు వైరాగ్య సంబంధమైన భావాలను తీసుకు వస్తున్నాయి. ఏదో పట్టుదల వంటిది బాహ్యంగా ఉ[illegible]డిపోయినా ఆంతరంగికంగా పార్వతి రోజు రోజుకూ మారిపోతున్నది.

నిరంతరం భగవంతుడి అస్తిత్వాన్నిగురించే సంఘర్షణ ఆంతర్యంలో. ఆ భగవంతుడే కనక నిజంగా ఉంటే తనను తాను సమర్పించుకుంటా ననుకుంది.

ఎన్నివిధాల చూచినా, ఏకోణంలోనుంచి తర్కించు కున్నా పార్వతికి భగవానుడి ఉనికే కనిపించింది.

పువ్వుల్లోని సౌందర్యసౌరభాలు,. ఆకాశంలోని చిత్ర విచిత్ర వర్ణికలు కొత్తగా కనిపించి విచిత్రమైన భావాలు రేపు తున్నాయి.

అల్ప హృదయాల్లో ప్రజ్వలించే ఆవేదనాగ్ని తెలుసు కున్నప్పుడు, వున్నతమానవుల్లోని సౌహార్ద సౌజన్యాలు తెలిసి నప్పుడు మనసు అంతర్గర్భితంగా వున్న అతీత శక్తివైపు పోతున్నది ఏ నూతనానుభవం కలుగుతున్నా, ఏ భావాను భూతిని పొందుతున్నా అందులో భక్తిభావం మిళితమౌతూ వుందామె ఆంతర్యంలో, ప్రాచీన ధర్మాలలోని పవిత్రత అర్థాన్ని ఆలోచించింది పార్వతి.

ఆధ్యాత్మికమైన ఆరాటం మొదలైనప్పటినుంచి పార్వతికి ప్రాచీనంగా వస్తున్న భక్తిచరిత్ర యావత్తూ పెద్ద ప్రయత్నం లేకుండానే అవగతం అయింది. అయితేనేం-ఆమెకు తనపట్ల తనకేదో అసంతృప్తి వుంది.

"అమ్మగారూ !"

పార్వతి తలెత్తి చూచింది. ఎదురుగా ఒకరైతు తరహా మనిషి సవినయంగా నిలబడి వున్నాడు.

"ఏమిటి ?" అంది పార్వతి.

"రాజు బాబుగారు వున్నారా అమ్మా ?"

"ఇంట్లో లేరు. ఏం ?"

"ఏమీ లేదమ్మా ! నేనో కోడెగిత్తా, నాగలి కొనుక్కుంటానంటే రెండొందలదాకా సహాయం చేశారు మూడు మాసాలకిందట. అది తిరిగి ఇచ్చేస్తుండాను. ఈ సొమ్ము మీ కాడనే భద్రంగావుంచి ఆయనొచ్చాక ఇవ్వండమ్మా ! ఆయన్లాటి ధర్మబుద్ధి ఎవరికోగాని వుండదు తల్లీ!..." గొణుక్కుంటూ డబ్బు బల్లమీదవుంచి వెళ్ళిపోతున్న రైతు వైపు నుంచి శూన్యంలోకి దృష్టిమార్చి అలా కూర్చున్నది పార్వతి.

లచ్చి ఒకసారి తను పెంచుకుంటున్న అక్కకూతురికి జబ్బుగా ఉందనిచెప్పి పార్వతి దగ్గర కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఒక యాభైరూపాయలు సహాయంచేస్తే జీతంలో కట్టుకుంటానన్నది. పార్వతి దగ్గర అప్పుడు ఇరవైకంటే ఎక్కువ లేవు. ఉన్నవి ఇచ్చి, తక్కినడబ్బు రాజునడిగి చూడమంది.

అతడు ఇవ్వడనే పార్వతి ఉద్దేశం. లచ్చి ఆనందంతో అత డిచ్చిన డబ్బు తెచ్చుకోవడంచూచి ఆశ్చర్య పడింది లోలో పల. పైగా మరి ఇవ్వక్కర్లే దన్నాడని లచ్చి చెప్పింది.

తాను ఇచ్చిందనే పంతానికి అతనూ ఇచ్చిఉంటాడు- అనుకుంది అప్పటికి తను.

అదంతా గుర్తు వచ్చింది పార్వతికి దీన్నిబట్టి చూస్తే రాజు తనపట్లతప్ప ఇతరుల విషయంలో సౌజన్యంతో ప్రవ ర్తించగలడన్నమాట! 'పోనీ. అందుకైనా గర్వపడవల సిందే' అనుకుంది పార్వతి తనలో.

## 27

పెరట్లో అరుగుమీద నిలబడి ఉత్తరాన్ని చదువు కుంటున్నది-సరస్వతి.

పెరటిపంచలో చిన్నపిచ్చికలు గడబిడ చేస్తున్నాయి. తండ్రి అప్పుడప్పుడు దగ్గుతున్నాడు లోపల గదిలో.

పదిహేనురోజులుగా నరసింహంగారి ఒంట్లో బాగుండ లేదు. రెండురోజులై నెమ్మదించినా ఇంకా పూర్తిగా తగ్గ లేదు. వైద్యుడు వచ్చి మందు ఇచ్చి వెళ్ళుతున్నాడు. తనకు ఏమాత్రం జబ్బు చేసినట్టు తోచినా సరస్వతి గురించి బెంగ పెట్టుకొంటా డాయన. మానసికంగా నీరసించిపోతున్నాడు.

ఆయనకు జ్వరం వచ్చినది లగాయతు సరస్వతికి నిద్రలోపిం
చింది. కాచుకొని ఉండడం, సేవచెయ్యడంతోనే రోజు
రోజూ గడుస్తున్నది.

పార్వతి వ్రాసిన ఉత్తరాన్ని ఆమూలాగ్రం చదివి
నవ్వుకుని దాన్ని మడిచింది.

పడమటి కొండలమీద వింత తేజస్సు కనిపిస్తున్నది.
మానులకు అల్లుకున్న తీవెలు వేడిగాలికి వాడిపోతున్నాయి.
ఇళ్ళవరసలకు దూరంగా చిన్నచిన్న గుట్టల్లాగా గుడిసె లగు
పిస్తున్నాయి.

కొద్దిసేపా సుందర దృశ్యాన్ని చూచి తండ్రిదగ్గరకు
వెళ్ళి ఆయన దుప్పటి సరిచేసి పక్కను కూర్చుంది. తండ్రి
జ్వరం ఇంకా తగ్గలేదన్న బెంగ మనసులో పీడిస్తున్నది.
పట్నంనుంచి డాక్టర్‌ను తీసుకువచ్చే ప్రయత్నం కూడా
చేసింది సరస్వతి. ఒకసారి వచ్చి మందిచ్చి మళ్ళీ రెండు
రోజుల్లో వస్తాననిచెప్పి వెళ్లాడా డాక్టరు.

"డాక్టర్ని మళ్ళీ ఎల్లాగైనా తీసుకురమ్మని చౌదరి
గారితో చెప్పాను నాన్నా!" అన్నది సరస్వతి.

"డాక్టరెందుకమ్మా ఇంకా? పోయేప్రాణం అత
గాణ్ణి చూసి నిలుస్తుందా?"

"అలా అనకండి, నాన్నా!" అన్నది సరస్వతి గద్గద
కంఠంగా.

"పార్వతి ఉత్తరంలో ఏం వ్రాసిందమ్మా!" అని
అడిగిన తండ్రి మాటకు వులిక్కిపడింది. "క్షేమంగా వున్న

దట. నన్నూ వుత్తరం వ్రాయమందీ" అని జవాబిచ్చి తండ్రి కాళ్ళుపట్టుతూ పార్వతి వ్రాసిన వుత్తరాన్ని నెమరు వేసుకుంది.

రాధాకృష్ణ తనను పెళ్ళిచేసుకుంటా నన్నాడట! సరస్వతి గుండెలు రెండు క్షణాలు గబగబా కొట్టుకున్నాయి.

పైగా అతడే మొదట తన అభిప్రాయాన్ని చెప్పాడట. ఐతే ఈ కొంటెపిల్ల తన ఫోటో ఇచ్చింది! దానికి బావగారు కెమేరా కొనివ్వటమే వచ్చింది.

మొదట పార్వతి రాధాకృష్ణను గురించి వుత్తరంలో వ్రాసినప్పుడే సరస్వతికి అతనిపై సదభిప్రాయం కలిగింది. ఆనక అడపా తడపా పార్వతి వ్రాసే వుత్తరాల్లో అతని ప్రసక్తి తప్పకుండా వుండితీరుతుంటే ఆమె అనుమానించింది కూడా-చెల్లి వుద్దేశ్యం ఏమైవుంటుందా? అని. ఆఖరికి ఇందులో సారాంశం తేల్చింది.

'రాధాకృష్ణ కోరినా, పార్వతి ఎంతపట్టుబట్టినా అతనితో పెళ్ళికి తనంగీకరించగలదా? కాని - ఎంతో పుణ్యం చేసుకున్న స్త్రీ అతన్ని భర్తగా పొందగలదు' అనుకుంది సరస్వతి.

గుడ్డిగా వెలుగుతున్న ఆశాజ్యోతి శక్తి పుంజుకుంది— ఏ ధర్మహృదయులు ఆ జ్యోతికి ఆధారంగా తైలం పోశారో కాని!

# 28

రోజులు నిస్సారంగా, ఉత్సాహరహితంగా వున్నాగానీ కాలచక్రం అమితవేగంగా పరుగెడుతున్నట్టు అనిపిస్తూంది పార్వతికి.

చేతిలోని పుస్తకం చదువుతున్నదల్లా ఒక క్షణం కనురెప్పలు మూసుకుంది ఆ అమ్మాయి. తర్వాత తిరిగి చదవనారంభించింది.

కవిత రచనలు పార్వతి అంతర్యంలో నూతన భావాలను విరజిమ్ముతున్నాయి. ఆ మైన శిష్ట భాషాప్రయోగం కలిగిన ఆమె ఆధునిక ధోరణి అప్రయత్నంగానే పార్వతిని సాహిత్యాభిముఖురాలుగా చేసింది.

రాధాకృష్ణ బలవంతపెట్టగా, సుభద్రగారూ ఒక మాదిరిగా మెచ్చుకోవటంవల్ల - జాప్యం చేసిచేసి ఒకరోజు చదవటానికి పూనుకుంది కవితసాహిత్యాన్ని. అప్పటినుంచి కాదనుకున్నా అప్రయత్నంగా చదువుతూ వుంది.

'తనలో రేగే పరితాప నిర్వేదాలకు ప్రతిబింబాల్లా వుంటాయి ఈమె రచనలు' అనుకుంది పార్వతి. తన ఆలోచన ఫలితంగా మిగిలేవి ప్రశ్నలు మాత్రమే. కవితభావాల్లో అన్వేషణ వుంటుంది. అదే ప్రశ్నలుగా, సమాధానాలుగా కూడా తోస్తుంది.

రాజు బయటికెక్కడికో వెళ్ళాడు. పాప తోటలో నులివెచ్చని ఎండలో తిరిగి తిరిగి వాడిపోయివచ్చి ఇల్లంతా కలయతిరుగుతున్నది. ఆటవస్తువులకోసం.

పార్వతి కవిత వ్రాసిన కథను చదువుతున్నది. అందులో సున్నితమైన జీవితసత్యం ఇమిడివుంది. సాహిత్యం ఏకాగ్రంగా చదువుతుంటే ఉత్సాహం ఇనుమడించడం సహజం.

పాప ఏవో వచ్చీరాని పాటలు పాడుతూ ఆడుకుంటున్నది.

"వైర్ సార్" అన్న కేకతో కంగారుగా లేచింది పార్వతి. మెదడులో కైళ్ళు పరుగెత్తసాగాయి.

సంతకంచేసి తీసుకుందేగాని, చూడడానికి గుండె అదిరిపోతున్నది. నాలుగునెలల క్రిందట సరస్వతి ఒక ఉత్తరంలో నాన్నగారికి సుస్తీగా ఉందని వ్రాసింది.

నిబ్బరించుకుని తెరిచి చూసింది.

పార్వతిలోని దృఢత్వమంతా ఒక్కక్షణంలో క్షీణించిపోయింది. "నాన్నా" అని గట్టిగా అరిచి తలగోడకేసి కొట్టుకుంది శక్తిహీనంగా అక్కడే కూలబడిపోయి ఏడ్చింది.

హఠాత్తుగా జరిగిన సంఘటనకు పాప హడిలిపోయింది. బిక్కమొగంతో మెల్లగా దగ్గరికి వచ్చి, కిందపడి పొర్లుతూ ఏడుస్తున్న పార్వతిని ఏదో అడగబోయింది. అంతలో ఏమనుకుందో—వీథిలోకి పరుగెత్తింది.

ఇంతలో లోపల పనిచేసుకుంటున్న లచ్చికూడా గాభరాగా వచ్చి, దృశ్యం చూసి విస్తుపోయింది.

పార్వతి ముఖం పూర్తిగా కందిపోయి చెక్కిళ్ళు తడిసిపోయాయి. లచ్చిని చూచి లేచినిలబడింది. తెల్లబోయిన లచ్చిచేతిలో తాళాలు ఉంచుతూ ఇల్లుచూస్తుండమంది. మరేం అనలేదు. లచ్చి స్థాణువై నిలుచుండిపోయింది.

పార్వతి తనపెట్టె తెరిచి, అందులో తన తలూాకు బంగారపు ఉంగరాన్ని తీసుకుని లచ్చి చూస్తుండగానే తిన్నగా స్టేషన్ వైపు నడిచింది.

ఎలాటివలా వదిలి ఒక్క దుఃఖభారంతోనే వాయువేగంగా నడుస్తున్న పార్వతిలో ఒక్కమాట పనిచేస్తున్నది. అందుకే—"నాన్న చనిపోయారా? నాన్న చనిపోయారా!" అని మధ్యమధ్య అనుకుంటూనే వుంది. వ్యాకులంగా ఉంది హృదయంలో.

హఠాత్తుగా, అనుకోని విధంగా జరిగేకొన్ని హృదయవిదారక సంఘటనలు నిజమని తెలుస్తున్నా అపనమ్మకాన్ని కలిగిస్తాయి.

౽ ౽ ౽

రెండుచోట్ల రైలెందుకో గంటలతరబడి నిలిచిపోయింది.

పార్వతి వెళ్ళేసరికి నరసింహమూర్తిగారి దేహాన్ని అప్పుడే దహన సంస్కారం నిమిత్తం తీసుకు వెళ్ళిపోయారు. రాత్రి మూడుగంటల సమయంలో పోయారాయన. పార్వతి కోసం చూసి ఇంకాసేపు అలాగే వుంచితే, సరస్వతి దుఃఖంతో వెర్రెత్తిపోతుందని తొందరపడి తీసుకువెళ్ళారు.

సన్నని వాన తుప్పర పడుతున్నది.

దుఃఖమో, ఆవేదనో—కంటనీరుమాత్రం లేదు. సంగతి తెలియగానే చప్పున వెనక్కి తిరిగింది పార్వతి. శ్మశానంవైపుగా నడిచిపోతున్న ఆ అమ్మాయిని చూచి ఆశ్చర్యపోయా రందరూ. పల్లెటూరి ఆడవాళ్ళు నలుగురూ పార్వతిని ఒడిసి పట్టుకుని ఇంటికి లాక్కువచ్చారు.

ఘనీభవించిన కన్నీటితో పార్వతి బాధపడుతున్నదని గ్రహించిన హృదయాలు జాలిపడ్డాయి.

వసారాలో ఆ పల్లెటూరి పెద్దలుకొందరు ఆడవాళ్లకు తోడుగా నిలబడివున్నారు.

సరస్వతిని చూడగానే పార్వతికి తననెవరో ఒంటరి దాన్ని చేసినట్టనిపించింది.

కొందరు స్త్రీలు స్తంభాల్లా నిలబడి అనేక భంగిమల్లో చూస్తున్నారు. వసారా అంతా మగవాళ్ళు ఆక్రమించారు.

అంతటా మౌనం. తనను కొందరు ఆడవాళ్ళు ఓదార్చ ప్రయత్నించి ఏవో వైరాగ్యపుమాటలు అంటున్నా, అక్కడ అంతా మృత్యుగాంభీర్యం అలుముకున్నట్టు తోచింది పార్వతికి.

ఆ నిశ్శబ్దతను ఎవరూ సడలించలేరు కొన్నాళ్లవరకు. తన మనోవేదన ప్రతివస్తువులోకీ జారి, అవన్నీ దిగులుగా కనిపిస్తున్నాయి. బయట వర్షం-అనంత దుఃఖబాష్పాలకు ఉపమానంలా కురుస్తూవుంది.

పార్వతి విషాదమూర్తిలాఉన్న సరస్వతి భుజంమీదకు వాలింది. కళ్ళలోనీళ్ళు సుళ్లు తిరిగాయి.

సరస్వతి నవారుమంచంమీద గోడవైపు తిరిగి పడుకొని వుంది. చెల్లెలి కంఠం గుర్తించి కళ్లు విప్పినా, మాట్లాడలేదు. దృష్టిగోడమీద వున్నది. ఆ అమాయకురాలిచూపు ఎక్కడ సంచరిస్తున్నదో తెలుసుకోవడం కష్టం. అభిముఖంగా లేక పోవడంవల్ల ఆమె కళ్ళలోతులు అక్కడ ఎవరికీ కనిపించడం లేదు.

సరస్వతి కాళ్ళదగ్గర జానకమ్మ కూర్చొని వుంది. అదృష్టవశాత్తు ఆమె అన్నగారి రూపాన్నొకసారి చూసుకొన గలిగింది.

"మామూలు జ్వరంవచ్చి తగ్గుతూ హఠాత్తుగా ముమ్మరించిందటమ్మా! వాడు పోయేవేళకి సరస్వతి వున్న దింట్లో." జానకమ్మ కన్నీరు తుడుచుకుంటూ పార్వతి తల నిమిరి దగ్గరికి తీసుకుంది.

అకస్మాత్తుగా పార్వతిచేతిని తనచెక్కిలిమీదికి లాక్కొని, సరస్వతి, తలను తలగడలో దూర్చి గుండెలు పగిలిపోయేలా ఏడ్వనారంభించింది.

అత్రుతగా వచ్చిపడిన రాజు ఇంట్లోని దృశ్యం చూసి నిశ్చేష్టుడైపోయాడు. స్నానంచేసి వచ్చిన రామనాథంగారు రాజును స్నానం చేయమని లోపలికి తీసుకువెళ్ళి ఏదో కతి కించారు.

రాత్రి ఏడుగంటలవేళ. ధారాపాతంగా కురుస్తున్న

వర్షాన్ని కననివ్వడంలేదు బయటి అంధకారం. పురుగుడు పిట్టల అరుపులకు కప్పలు పోటీపడుతున్నాయి.

అటువంటి సమయాన భర్తతో, పిల్లలతో దిగింది-లక్ష్మి. వీధివసారాలో మంచంమీద కూర్చున్న రాజు కంగారుగా లేచాడు.

లక్ష్మి దుఃఖానికి అవధిలేదు. బయట వర్షధారను, నిరర్గళంగా కురిసే లక్ష్మి కన్నీటి ధారలకు భేదం లేదు. వాళ్లు కొంతదూరం విమానంలో ప్రయాణంచేసి, తర్వాత రైలెక్కి-వచ్చారు.

చాలాసేపటికిగానీ లక్ష్మి దుఃఖం ఉపశమించలేదు. నిద్రపట్టే పర్యంతం తనను తను నిందించుకుంటూ, కుములుతూనే ఉంది లక్ష్మి. తండ్రికి తను దూరంగా ఉండి మరిచిపోవడంవల్లనే ఆయన్ను మళ్ళీ చూడలేక పోయిందని ఆమె అంతర్గత వేదన.

అందరూ ఊరట చెందేసరికి చాలా రాత్రి గడిచింది.

'ముగ్గురు బిడ్డల సంపూర్ణ ప్రేమనుపొంది వెళ్ళిపోయిన నరసింహం ధన్యుడు' అనుకుంటూ మేను వాల్చారు రామనాథంగారు.

బయట వర్షం కాస్త వెలిసింది. కానీ మళ్ళీ ఉద్ధృతంగా పడబోతున్నదనడానికి నిదర్శనంగా మబ్బులు దట్టంగా వ్యాపించి ఉన్నాయి ఆకాశమంతా.

భయంకరమైన కాళరాత్రి. మృత్యు నిశ్శబ్దానికీ, కాళరాత్రికీ, ఉద్ధృత వర్షానికీ ఏదో దగ్గర సంబంధం ఉంది.

అందరూ నిద్రపోయినా, రాజుకు ఆ రాత్రి చాలా సేపు నిద్రరాలేదు. పక్కమీద చేరగిలి కిటికీలోనుంచి లోపలికి చూశాడు. పార్వతి పడుకున్న మంచం కనిపిస్తున్న దక్కడికి.

అలసటకు వేగంగా నిద్రపోయింది ఆ పిల్ల. జాలివంటి ఏదో పరిణామానుభవం రాజు నిలువెల్లా వ్యాపించింది ఒక క్షణం.

ఆ రోజు పొద్దున్న రాజు స్కూలు టైమింకా కాలేదని అలా బజార్లోకి వెళ్ళాడు. తిరిగి వచ్చేసరికి సుభద్రగారు ఇంట్లో కనిపిస్తే ఆశ్చర్యపోయాడు.

ఆవిడ టెలిగ్రామ్ చూపించి, "నువ్వు కూడా వెళ్ళు, రాజూ! పార్వతి ఒంటరిగా వెళ్ళిందనే భయంగా ఉంది" అన్నది.

అతను దీపస్తంభంలా నిలబడిపోయి, ఏమీ తోచక చుట్టూ చూశాడు. లచ్చి తాళం అతనికి ఇచ్చేస్తూ, పార్వతి వార్త వినగానే ఎలా పడిపోయిందో కళ్ళతో చూసినట్టే చెప్పింది. నేలమీద గాజుల ముక్కలు కనిపించాయి అతనికి.

తిన్నగా స్కూలుకు వెళ్ళి సెలవు పెట్టాడు. నేరుగా టాక్సీ మాట్లాడుకొని బయలుదేరి వచ్చేశాడు.

క్షణాల్లో, నిమిషాల్లో జరిగిందంతా గుర్తువచ్చి రాజు రెండునిమిషాలు సొమ్మసిల్లి నిద్రపోతున్న పార్వతివైపే చూసి, ఆ వెనక సరిగ్గా పడుకొని నిద్రపోయాడు.

* * *

తెల్లవారింది. ఉలిక్కిపడుతూ లేచి కూర్చుంది పార్వతి. ఆమెకు ఒక కల వచ్చింది. త్రిమూర్తులు అతి పవిత్రమైన ఆకాశంలో వరసగా నిలబడి తన నాశీర్వదిస్తు న్నారు. అదీ కల.

'నాన్న పోయాడు కదా ? ఇక ఈ ఆశీస్సుకు అర్థ మేమిటి ?' తర్కించుకుంటూ కిటికీ తలుపులు తెరిచి ఆకాశం లోకి చూచింది. అక్కడి నీలిమ అంతా నీటిరూపంలో కరిగి పోతున్నట్టు వర్షధారలమధ్య ఆకసం తెల్లబారి అగుపించింది. ప్రళయ శబ్దాన్ని భీకరంగా చేస్తున్న వర్షానికి కప్పలు పాడు తున్న ఆహ్వాన గీతిక మనుషులను బెదరగొడుతున్నది. ఆ ఉదయం ఎందరికి శుభోదయమోకానీ - ఆ ఇంట్లో, మెలు కువ వచ్చిన వ్యక్తుల్లో తిరిగి దుఃఖోదయమైంది.

తన అక్కలు, జానకమ్మ నిద్రపోతున్న గదివైపుగా వెళ్ళింది పార్వతి. సరస్వతి కళాశూన్యమైన ముఖం గుర్తు వస్తుంటే పార్వతి గుండె కరుణతో నీరైపోతున్నది.

లక్ష్మి - రాత్రి సరైన నిద్రలేక కాబోలు – పక్క అంతా వదిలి నేలమీద పడుకుని నిద్రపోతున్నది. జానకమ్మ కూడా నిద్రలో ఉంది కానీ, సరస్వతి?

పార్వతి ఆపక్కగదిలో చూచింది. అక్కడా కనిపించ లేదు. గుండె లొక్కసారి గుభిల్లుమన్నాయి.

సరస్వతి పక్కవైపు చూచే ధైర్యం లేకపోయింది. కురుస్తున్న వర్షంలోనే పెరడంతా తిరిగి వచ్చింది.

ఎక్కడా లేదు సరస్వతి. అక్కా! అని అంతరాళానికి దూసుకుపోయేటట్టు పిలవా లనిపించింది పార్వతికి. వెంటనే ఆ వేగాన్ని అణుచుకుంటూ వచ్చి సరస్వతి పడుకున్నచోట తలగడ ఎత్తి చూచింది.

ఆమె ఊహించినది దొరికింది — ఒక కాగితంముక్క — దాన్ని పూర్తిగా చదవకుండానే పార్వతి ఒక్క అరుపు అరిచింది. ఆ కాగితం రెపరెపలు పార్వతి హృదయంమీద సుత్తిదెబ్బ లైనాయి. ఒక్కొక్క సుత్తి దెబ్బకు ప్రతిధ్వనిగా అక్కా! అక్కా! అనే పిలుపులు లోనుండి పుట్టి లోపలే అణిగిపోతున్నాయి.

పార్వతి పిలుపుతో అదిరిపడి లేచిన లక్ష్మి, జానకమ్మ—పార్వతినీ, ఆమె చేతిలో కాగితాన్నీ చూచి గుండెలు బాదుకున్నారు.

ఏడుపులు విని కాస్త మందలిద్దామని వచ్చిన రామనాథంగారూ, ఆయన్ను వెన్నంటి వచ్చినరాజూ ఆ దృశ్యం చూసి స్తంభించిపోయారు. తెలివిలేనట్టు బిగ్గరగా ఏడుస్తున్న లక్ష్మి, తెలివి తప్పిపోయిన పార్వతి - ఇద్దరినీ చూచి గుండె లవిసిపోయాయి. ఏడుస్తూనే పార్వతికి తెలివి తెప్పించ ప్రయత్నిస్తున్న జానకమ్మ కాగితాన్ని వాళ్ళ కందించింది.

ఉత్తరం చూచిన మరుక్షణంలోనే రామనాథంగారు దాన్ని రాజు చేతిలో పెట్టి పంచెతో కళ్ళు ఒత్తుకుంటూ వీథికేసి నడిచారు—తొందరగా తడబడే కాళ్ళతో.

రాజు చూచాడా ఉత్తరాన్ని.

"పార్వతికి—

నా పార్వతీ! నేనుకూడా చచ్చిపోయానని నువ్వు దిగులు పెట్టుకోకమ్మా! నాన్నతోపాటు నాకీ భూమిమీద ఋణం తీరిపోయిం దనిపించింది. ఆయన సేవకోసమే నే నీ లోకంలో పుట్టాను. నీ జీవితం భారత ధర్మానుసారంగా సాగుతున్నది. అందుచేత ఆ విలువైన బతుకును నిష్ఫలం చేసుకోకు, నేను బావిలో పడిపోతున్నాను. నిన్ను విడిచిపోయానని బెంగపెట్టుకోకే పారూ! చచ్చిపోయి నీ కంటికి కనుపించకపోయినా నీ అక్క నీ దగ్గర ఉంటుంది.

నీ ప్రియమైన అక్క

సరస్వతి."

రాజు కళ్లు బైర్లు కమ్మాయి. వ్యథాపూరితమైన నిట్టూర్పు గుండెలు చీల్చుకు వచ్చింది.

ఈ లోగా తెలివి వచ్చిన పార్వతి చెంగున లేచి పెరట్లోకి పరుగెత్తింది. జానకమ్మ గోలపెట్టేసింది. ఆందోళనతో బరువెక్కిన గుండెతో రాజుకూడా పార్వతి వెంటే వెళ్ళాడు.

వర్షం సన్నగా పడుతూనే ఉంది. ఇంటివెనక కొద్ది దూరంలో ఉన్న బావిచుట్టూ జనం మూగారు. పల్లెటూరి ఈతగాళ్ళు ఇద్దరు ముగ్గురు సరస్వతి శవాన్ని తీసి ఇవతల పడేశారు.

అందరూ ఆ వర్షంలోనే నిలబడి కళ్ళనీరు కారుస్తున్నారు.

ఎక్కడ చూసినా నీరు. ఆఖరికి హృదయాలుకూడా నీరై పోతుంటే నీటి అవసర మింకెందుకు మనిషికి ? బతకడానికి భగవంతుడేర్పరచిన పరికరాలను చావడానికి వుపయోగించు కుంటున్నారు కొందరు.

చీరను వెనక్కు విరిచి కట్టుకుని నూతిలోకి దూకింది కాబోలు సరస్వతి–పై బట్టలు చెక్కుచెదర లేదు. పార్వతి ఆ కళేబరం మీదపడి కొంతసేపు ఏడ్చింది. కానీ, మరి కాసేప టికి పిచ్చెత్తినట్టయింది. మెదడు మొద్దుబారి కన్నీటికి ఆన కట్ట కట్టింది.

సరస్వతి పచ్చని పాదాలూ, అరిచేతులూ తడుముతూ ఏ సుఖానికీ నోచుకోని ఆ అమాయకపు ముఖాన్ని చూస్తూ సచేతన విగ్రహంలా శూన్యమనస్కగా కూచున్న పార్వతిని చూచాడు రాజు.

నీళ్ళు పైకి ఉండటం, నూతిలోపలికి మెట్లు ఉండటం–దూకినప్పుడు శబ్దం వినిపించకపోవడానికి కారణాలని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు.

దుఃఖమేఘాన్వితమై కళ తప్పిపోయిన పార్వతి వదనాన్ని చూడలేకపోయాడు రాజు వికలమైన మనసుతో.

క్రియలన్నీ అయ్యాయి. మనసులూ గట్టిపడి పోయాయి.

అందరూ కొద్ది కొద్దిగా మరుపున పడుతున్నారు. పార్వతి దుఃఖం లోలోపల పచ్చిగా ఉంది. ఒక క్షణకాలమైనా నిశ్శబ్దాన్ని భరించలేకపోతున్నది. ఏ విషాద ఘోర

వార్త అయినా భీకరంగా వినిపిస్తున్నది. ఉన్నట్టుండి శరీరం అణువణువులో కాగే నీటివాగులు ప్రవహిస్తున్నాయి.

సరస్వతి తాలూకుపెట్టె తెరిచిచూచింది పార్వతి. అందులో పైనే కృష్ణుని చిత్రం ఒకటి కనిపించి ముగ్ధురాలై చేతిలోకి తీసుకుబోయింది ఆపిల్ల. నిర్మలశాంతి వీచికలు హృదయానికి చల్లగా తగిలాయి షెల్లీ. కానీ, ఆ చిత్రంతో పాటే వచ్చి జారిపడిన కవరుచూసి దిగ్భ్రాంతురాలైపోయింది.

సరస్వతి చేతివ్రాతతో దానిపైన 'పార్వతికి' అని పెద్ద అక్షరాలు స్పష్టంగా కనిపించాయి.

చప్పున తలుపులువేసి, కవరు చించి ద్రవించి, స్రవించి పోతున్న హృదయంతోనే చదవసాగిందా అమ్మాయి ఆ లేఖను.

"పార్వతీ!

నేను ఒక విషయాన్ని నీకు వ్రాస్తున్నానే పారూ! నువ్వెవరినీ తప్పుదృష్టితో చూచి ఎట్టెదట తప్పులెంచవు. అందుకే నీ దగ్గర ఎటువంటి విషయాన్నిగురించి మాట్లాడటానికైనా నాకు చెప్పలేనంత ధైర్యం.

నువ్వు రాధాకృష్ణనుగురించివ్రాసిన నాటినుంచి నీ ఉద్దేశానికి నేను లొంగిపోయాను. అదే నీ అభిప్రాయమై ఉంటుందని అను కున్నాను. రాధాకృష్ణను పెళ్ళిచేసుకోవాలని కోరికకూడా కలిగింది. అప్పుడు తెలిసింది నాకు—మనిషి కోరికలకు అడ్డూ ఆపూ ఉండదని. నువ్వతని సుగుణాలూ, ఆదర్శాలూ, రకరకాలుగా ప్రత్యేకంగా నా మనసుకు తెచ్చి

నప్పుడు నాకు తెలియకుండానే ఆనందించేదాన్ని తర్వాత– అనుకోకూడనివన్నీ అనుకుంటున్నానేమో అని నన్ను నేను నిందించుకున్నాను. ఏపాపఫలమో – ఈ జన్మకు సంపూర్ణత సిద్ధించలేదు. స్త్రీధర్మ విరుద్ధంగా – నాలో కలుగుతున్న ఆలోచనలవల్ల నాగతి ఏమౌతుందో అని దిగులు పీడించింది అన్నివేళలా.

ఏమైనాసరే – నాన్న ఉంటే, ఆయన ఒప్పుకుంటే రాధాకృష్ణను పెళ్ళిచేసుకుందును. నాకు జన్మనిచ్చిన తండ్రి అంగీకారం లేకుండా ఇటువంటి పని చెయ్యడానికి నాకు సాహసం లేదే పార్వతీ! ఏం చెయ్యను ? నాది పిరికిగుండె. ఏదో భీతి అహర్నిశలూ వేధించింది నన్ను. నాన్నపోయాక నా ప్రాణం ఎందుకూ పనికిరానిదనిపించింది. తెలియరాని వ్యాకులాన్ని అనుభవించాను రోజంతా.

నేను శాశ్వతంగా వెళ్ళిపోయే ముందు రాధాకృష్ణగారికి ఈ మాటలు చెప్పమన్నానని చెప్పు. ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకోవడమే ఉత్తమం. భవిష్యత్తులోనే అతడు అనుభవించవలసినదెంతో ఉంది. పునర్వివాహ పద్ధతిలో స్త్రీ పురుషులకు భేదం ఉంది స్త్రీ తన ఇష్టాన్ని అనుసరించి తిరిగిపెళ్ళి చేసుకోవచ్చు పురుషుడు యువకుడై ఉండి భార్యను కోల్పోతే, తప్పక పునర్వివాహం చేసుకొని జీవితాన్ని పరిపూర్ణం చేసుకోవాలి. ఆ అధికారమూ, హక్కూ మొదటినుంచి మగవాడికి ఉన్నాయి సంఘంలో. ఎందుకేర్పడినా అందులో కొంత తెలివరితనం లేకపోలేదు. రాధాకృష్ణగారు తిరిగి పెళ్ళిచేసు

కుంటే ఎక్కడఉన్నా నా ఆత్మ సంతోషిస్తుందని చెప్పు. నా కోసం విచారించకుండా అతని మనసు మరలించే భారం నీదే.

అన్నట్టు—నువ్వీమధ్యను నీ సంసారం సంగతులు బొత్తిగా చెప్పడం మానేశావు నువ్వూ, రాజూ ఆనందంగా జీవితం గడపడంకన్నా నాకు కావలసిందేముంది? రాజును 'నువ్వు' అంటూ సంభోధించే అలవాటు మానుకో. అతని కటువంటివి ఇష్టం ఉండవని అనుకుంటాను. అనుకూలంగా నడిచిపోవడంలోనే శాంతి దొరుకుతుంది. చచ్చిపోతూ నీ అక్క కోరినవాటిని కాదన కూడదే చిట్టీ! నా కోసం అట్టే దుఃఖ పడకు."

నీ అక్క,
సరస్వతి.

పార్వతి ఆ ఉత్తరాన్ని హృదయానికి హత్తుకుంది. రెండు కన్నీటిబొట్లు చెక్కిళ్ళమీదికి జారాయి.

'రాధాకృష్ణతో ఏమని చెప్పగలను, అక్కా?' అనుకుంది వ్యథతో. ఆ ఉత్తరాన్ని చూచిన తర్వాతనే రాధాకృష్ణ బాగా గుర్తువచ్చాడు పార్వతికి. ఫోటో చూచినతర్వాత అతను పొందిన ఉత్సాహానందాలు జ్ఞాపకంవచ్చి సన్నని నిట్టూర్పు విడిచింది.

సరస్వతి వ్రాసిన ఉత్తరంలో తన సంసార విషయాలకు చెందిన భాగాన్ని పార్వతి వేరుచేసి వుంచింది.

సాయంవేళ అవుతున్నది. అప్పుడే ఒక్కొక్కరూ

ఇళ్ళలో దీపాలు వెలిగించుకొంటున్నారు. వర్షాకాలపు చివరి రోజులవి. వర్షచ్ఛాయలు పూర్తిగాపోయి చిరుచలి ప్రారంభమైంది. దట్టంగా చీకటిదారాలు అల్లుకుంటున్నాయి. అస్తాద్రి వైపునమాత్రం భయంకరమైన ఎరుపు.

వీధిలో కూర్చునివున్న రాజు దగ్గరికి లక్ష్మి వచ్చి, పార్వతికి జ్వరం తగిలినట్టుంది బాబూ! చూద్దుగాని, ఇలారా" అంది. రాజు వైమనస్యంగా ఉన్నాడేమో – ఇది వినగానే అతని కా పల్లెటూరు భయంకరంగా కనిపించింది.

లేచి లోపలికి వెళ్ళాడు. రాజును చూచి అన్యమనస్కంగా కూర్చునిఉన్న పార్వతి కళ్ళు దించుకుంది. లక్ష్మి వచ్చి పార్వతి పక్కన కూర్చుంది.

రాజు పార్వతి నుదుటిమీద చెయ్యిపెట్టి చూచి కుర్చీలో కూర్చుంటూ, "వర్షంలో తడిసింది కదండీ! అందుకే జ్వరం వచ్చిఉంటుంది" అని నసిగాడు లక్ష్మివైపు తిరిగి మొహమాటపడుతూ. అతని కామెతో అంత చనువు లేదు.

"ఏమో, బాబూ! నువ్వు ముందుగా పార్వతిని తీసుకు వెళ్ళిపో. ఈ పల్లెటూళ్ళో ఒక్క సదుపాయమూ లేదు. తర్వాత నేనుకూడా మీ ఊరు వచ్చి అక్కడినుంచే వెళ్ళిపోతాను" అంది లక్ష్మి.

ఎవ్వరికీ తెలియకుండా అందుకే భయపడుతున్న రాజు, వెంటనే – "రేపే పొద్దుటి బండిలో వెళ్తాము" అన్నాడు.

పార్వతికి విచిత్ర మనిపించింది.

"ఇక పార్వతితప్ప నా కెవరున్నారు ?" అని కంటనీరు పెట్టుకుంది లక్ష్మి.

ఆ సమయానికే వచ్చిన రామనాథంగారు కొడుకును చూచి, "నువ్వు ముందుగా వెళ్ళిపోవోయ్, మీ ఊరు. నేనూ, జానకీ, లక్ష్మి - అందరం ఇక్కడి వ్యవహారాలన్నీ చక్కబెట్టుకొని మీ దగ్గరికి వచ్చివెళ్తాము. అన్నట్టు పార్వతి కులాసాగా లేనట్టుంది - జాగ్రత్తగా డాక్టరుకు చూపించు అక్కడ" అన్నారు.

"అలాగే, నాన్నా !" అన్నాడు రాజు.

జానకమ్మ "నేనుకూడా వెళ్తాను. దీనికి ఒంట్లో బాగు లేదు. వీడేం చూస్తాడు ? ఎవరు వండుతారు ?" అంది.

ఊపిరి పీల్చుకున్నాడు రాజు.

## 29

మహానిశ్శబ్దంగా ఉంది ఇల్లు. నిశారాణి ధర్మపాలన నాలుగుపాదాలా చేస్తున్నదనవచ్చు. కాటుక చీకటిలో బెడ్ లైటు వెలుగు పోరాడి ఓడిపోతున్న తరుణంలా కాంతి ప్రసారం. కెవ్వున కేకవేసి నిద్రపోతున్నదల్లా లేచి కూర్చుంది

పార్వతి. అదివిని అదిరిపోయిన రాజు తొందరగా వచ్చాడు పార్వతిగదిలోకి—ఏం వుపద్రవమో అనే కంగారుతో.

గది గోడలు నాలుగూ బిక్కుబిక్కు మంటున్నాయి. మోకాళ్ళమీద తలపెట్టుకొని ఏడుస్తున్నది పార్వతి. రాజు రాకతో బిగబట్టుకుంది దుఃఖాన్ని

"ఎందుకు, పార్వతీ?" అన్నాడు రాజు.

"ఏం లేదు" అంది పార్వతి బొంగురుగా.

"కల వచ్చిందా?"

తలాడించి ఊరుకుంది.

"నేను మేలుకునే ఉంటాను. నిద్రపో." వెళ్ళబోయి అంతలో వెనుదిరిగి, "మందు తాగావా?" అని ప్రశ్నించాడు రాజు.

"తాగలేదు... తాగాను..." తడబడింది పార్వతి.

రాజు స్వయంగా ఔన్సు గ్లాసులోపోసి మందు ఇస్తుంటే అందుకోవడానికి అనేక విధమైన శ్రమపడింది.

నిద్రలోకి ప్రవేశిస్తూ, 'కాకినాడ వెళ్ళిపోవాలి. ఈ సంవత్సరం పూర్తికావచ్చింది కదా' అనుకున్నాడు రాజు. అటువంటి చోట్లఅయితే పార్వతి సుఖపడుతుందన్న సాను భూతితో కూడిన భావన అంతర్గతంగా అతని రక్తంలో ప్రవహించ నారంభించిందేమో, ఆ సంగతి అతనికే సుస్పష్టంగా తెలియడంలేదు. అయినా రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవా అన్న లోకోక్తి అతని పేరుకూ, మనస్తత్వానికీ చక్కగా కుదిరింది.

నరసింహమూర్తిగారి పొలాల్ని కౌలుకిచ్చి, తోటలు గుత్తదారుల రక్షణకు వదిలిపెట్టి ఇంటికి తాళం బిగించేశారు రామనాథంగారు. చందనపూర్‌లో పార్వతి ఆరోగ్యం సరిగా ఉందో లేదో చూసి తెలుసుకొని, జానకమ్మతో రాఘవపురం వెళ్ళిపోయారు తర్వాత.

లక్ష్మి చందనపూర్ వచ్చి రెండు నెలలున్నది పార్వతి దగ్గర. ఆఖరికి చెల్లెలిని విడవలేక తపించిపోతూ విధిని తప్పలేక, ధర్మానికి ఎదురు చెప్పలేక వెళ్ళిపోయింది. పార్వతి మనస్సూ అగాధం.

పార్వతి తన అంతరంగంలోనే ఏర్పడిపోయిన ఆ నిబిడ నిశ్శబ్దతకు తట్టుకోలేక విలవిల్లాడింది. సుభద్రగారు పార్వతిని వదిలిపెట్టలేదు. టానిక్కులు, బలకరమైన ఆహార విషయాలలో జోక్యం కల్పించుకుంది. ఆ అమ్మాయిలో అంతర్లీనమై రగులుతూ ఉన్న దుఃఖాగ్నిని గమనించింది.

ఆవిడ సంరక్షణలో పార్వతి ఆరోగ్యం చెడే పరిస్థితి రాలేదు

రాధాకృష్ణ రావడమైతే చాలాసార్లు వచ్చాడు కానీ, పెదవి విప్పి ఒక్క మాట మాట్లాడ లేకపోయాడు. అదీకాక పార్వతి ఒంటరిగా అతనికి కనిపించలేదు. తీవ్రమైన నిర్వేదం అతనిలోనూ ఉంది.

నెలలు తరలిపోతున్నా రాధాకృష్ణతో మాట్లాడేందుకు శక్తిని కూడగట్టుకోలేకపోయింది పార్వతి.

యథాప్రకారం రోజులు గడుస్తున్నాయి. ఎక్కడి కైనా కదిలే ఉత్సాహం లేదు పార్వతికి. రాజు తనపట్ల జాలి పడుతున్నాడని ఆమెకు అనిపించింది.

# 30

రాధాకృష్ణ చదివాడు ఆ ఉత్తరాన్ని. తిరిగి చదివాడు ఆద్యంతమూ చూచాడు. ఎంత పరిశోధిస్తే ఏం ప్రయోజనం? అతను ఆశించినదీ, వెదికి వెదికి అందుకున్నదీ అయిన ఆదర్శపు మెట్టుమీదికి అధిరోహణ జరగనేలేదు. విలుప్తమై పోయినట్టయింది తన సుధా పాత్ర.

'ఏది జరగాలో అది జరిగింది' నిగ్రహించుకున్నాడు ఆఖరికి రాధాకృష్ణ.

పార్వతి తలుపును ఆనుకొని నించుంది. ఎంతసేపో అయింది అలా ఉండి. కన్నీరు లేకపోయినా ఏక్షణానికి ఆ కళ్లు నిండిపోతాయో ఊహించడం అసాధ్యం. సుభద్రగారి వల్ల పార్వతి శారీరక మానసిక స్థితులు తెలిసిఉన్న రాధాకృష్ణ ఆ అమ్మాయి దుఃఖావస్థలో ఉన్నదని తెలుసుకున్నాడు. మెల్లగా నడిచివెళ్ళి తలపై మృదువుగా చెయ్యివేసి, "పార్వతీ! నిష్కారణంగా ఆరోగ్యం పాడుచేసుకోకండి, ఇలా సర్వవేళలా దుఃఖిస్తూ కూర్చోవడం మంచిది

కాదు. దురదృష్టవంతులను బాగుచెయ్యడం ఎవరితరమూ కాదన్న వాక్యం కేవలం పొల్లుకాదు" అన్నాడు.

అతని చిరునవ్వులో ఎంత వ్యథ నిండిఉందో పార్వతి అతన్ని పరీక్షిస్తే తెలిసేది.

"మీ అక్క తొందర పడ్డారు. కానీ, ఎంత పవిత్ర మూర్తి మీ అక్క! పవిత్రత నిండిన హృదయంలో కాస్త కళంకం ప్రవేశించినా చిత్రహింస ఔతుందా బ్రతుకు. అన్నిటినీ పవిత్ర దృష్టితో చూడలేరు మీ అక్క. మనంకూడా పొరపాటుచేశాం పార్వతిగారూ! పోనివ్వండి, మీ అక్కగారు వ్రాసినమాటలు నేనెప్పటికీ మరిచిపోను. సువర్ణాక్షరాలైపోయాయి అవి నా హృదయంమీద. ఆదర్శాన్ని నిలుపుకోలేకపోతే చంపుకొని అయినా - ఆమె చెప్పినట్టు వివాహం చేసుకుంటాను. మీరు విచారించకండి అదే ధ్యాసతో"

పార్వతి గొంతు సర్దుకుంది. "అంతే, కృష్ణగారూ! అక్క కోరిక ప్రకారం మీరు వివాహం చేసుకోండి. మీలో ఆశలు రేకెత్తించిన నాకు కూడా అదే శాంతి నిస్తుంది."

తిరిగి పార్వతి అంది; "మేము ఇంక నెలరోజుల్లో కాకినాడ వెళ్ళిపోతున్నాము."

"అదేమిటి?" అదోక విధంగా చలించాడు రాధాకృష్ణ.

"రాజు మళ్ళీ లెక్చరర్ ఉద్యోగానికి అప్లయిచేసినట్టున్నారు. ఆ గొడవ అంతా నాకు తెలియదు. వెళ్ళాలని

అంటున్నారు. ఏమైనా మీలాంటి మంచిస్నేహితులు దొరుకు తారో లేదో నా కిక? ఇంతవరకూ మీ స్నేహం లభ్యం కావటమే నా అదృష్టంగా భావిస్తూ వచ్చాను."

రాధాకృష్ణ కొట్టిపారేస్తూ - "అలా ఎప్పుడూ అను కోవద్దు. నేనే పృథ్విలో ఏకైక సహృదయుణ్నని భావిస్తు న్నట్టున్నారు మీరు. విషకుంభాల్లాటి హృదయాలెన్ని ఉన్నాయో అన్ని అమృత కలశాలవంటి మనసులు ఉంటా యని దృఢంగా చెప్పలేను. కానీ, ఆ సంఖ్యకు కాస్తయినా సామీప్యంలో లేకపోతే ఈ ప్రపంచం ఇలా నిలుస్తుందన్న నమ్మకం లేదు నాకు. మీకేం ? మీకు మంచి స్నేహితులు దొరుకుతారు. దొరకాలనే నా కాంక్ష. మంచిని కోరి వెదికే వారికి అది అలభ్యవస్తువు కాదు. మధ్య మధ్య చెడుకు లొంగిపోనివ్వని నిగ్రహం మాత్రం అవసరం. ఎటొచ్చీ మీరు వెళ్ళిపోతే ఇబ్బందిగా ఉంటుంది నాకు. ఇన్నాళ్ళూ ఎన్నెన్ని విషయాలు చర్చించుకున్నాము! విమర్శలుచేస్తూ ఎన్ని వివా దాలు పడ్డాము!" అన్నాడు నిట్టూర్పులోనే చిరునవ్వు కలిపి.

"అందుకే మీవంటి మిత్రులకి దూరంగా వెళ్లవలసి వచ్చిందని బాధపడుతున్నాను. మీరు చెప్పినట్టు ఎందరో మంచివాళ్ళు తారసపడతారు, స్నేహితులవుతారు. అది జరగవచ్చు ననుకోండి. దేనిలోనైనా విభిన్నత ఉంది చూడండి! నాకిష్టమైన మంచితనపు తీరు మీలో రేఖా మాత్రంగా ఉంది. నా హృదయం వాంఛిస్తుంది ఒకరకం

స్నేహాన్ని. అటువంటివాళ్లు సన్నిహితులైతే వాళ్లు నన్నర్థం చేసుకోగలరు. సరిగ్గా అందుకే నేనూ వాళ్ళతో అతికిపోగలను. ఏమంటారు దీనికి?" పార్వతి రాధాకృష్ణను చూచింది.

అతని జుత్తు రేగిఉంది. ఎప్పుడూ నీటుగా ఉండే మనిషి నిర్లక్ష్యంగా అగుపించాడు. కళ్లు ఎర్రజీర చూపిస్తున్నాయి. అతను సరస్వతిని గూర్చి ఎక్కువ విచారించినట్టున్నాడు.

"అవును. మనం కోరే మన స్తత్వాలే మన స్నేహితులు" అని, బలవంతంగా నవ్వాడు రాధాకృష్ణ.

అతని రూపం చూచిన పార్వతి తేలికగా నవ్వలేకపోయింది.

* * *

వీడ్కోలు తీసుకుంటూ, సుభద్ర దగ్గర దుఃఖాన్ని అణిచిపెట్టడం కష్టమైంది. పార్వతి కళ్ళవెంట ఆవేదన స్రవంతిగామారి జారుతున్నది. పాప ఫ్రాకు అంతా పార్వతి కన్నీటితో తడిచి ముద్ద అయింది. సుభద్ర పార్వతిని ఉపశమింపచేస్తూ, "మళ్ళీ కలుసుకోకుండా ఉంటామా? ఎందుకింత బాధపడతావు?" అన్నది మందలించి.

రాజు స్తంభంలా నిలబడి కిటికీలోనుంచి చెట్టుపుట్టల మీదికి దృష్టిపోనిచ్చాడు. 'పార్వతి రానురాను మరీ సెంటిమెంటల్‌గా అయిపోతున్నది' అనుకున్నాడు.

సరిగ్గా ఆ మాటలే రాధాకృష్ణ అన్నాడు. "పార్వతీ! మీరిలా ప్రతిచిన్న పరిస్థితికీ, అనుభవానికీ లొంగిపోయి దిగ

జారిపోకూడదు. స్థయిర్యాన్ని అలవరుచుకోవాలి. మీ రెంతో సాహసం కలవా రనుకున్నాను." స్నేహంతో కూడిన మంద లింపుతో పార్వతి కాస్త నిలదొక్కుకుంది.

సుభద్రగారికి ఐన తర్వాత రాధాకృష్ణకు పాదాభి వందనం చేసింది పార్వతి. ఆమె మనసులో అతను చాలా మంచి స్నేహితుడు అతనిమీద భక్తి కూడా ఉంది.

"మిమ్మల్నీ, మీ అక్కగారి వుద్బోధననీ మరిచి పోను పార్వతీ! తప్పకుండా ఆమె ఆజ్ఞ ప్రకారం పెళ్ళి చేసు కుంటాను" అన్నాడు.

రాజు, సుభద్ర ఒక్కసారే వింతగా చూచారు రాధా కృష్ణను. రాజు మరీ ఆశ్చర్య పడ్డాడు - సరస్వతితో ఎలా జోక్యం కలిగిందా? అని.

ప్లీడరుగారు లోనికివస్తూ "రాజుగారూ! ఇవాళేగా ప్రయాణం ? పార్వతి కూడా వస్తుందా ?" అన్నాడు.

"ఔనండీ!" అన్నాడు రాజు తలవంచుకుని

"అమ్మగారినైనా తోడు రమ్మని వ్రాయలేక పోయారా? ఇల్లుకు ఇబ్బందిపడా లేమోనే! ముందర హోటల్లో దిగుతారా?" ఆయన సాలోచనగా అన్నారు.

"మా అమ్మకు రావడానికి వీలుపడదట. అక్కడ నాకు తెలిసిన ప్రిన్సిపాల్‌గా రొకరు వున్నారులెండి. ఆయన మాకోసం ఇల్లు చూచి వుంచినట్టు వ్రాశారు."

"అయితే ఇంకేం! నాకు కోర్టుపనుంది. నేను వెళ్ళొస్తా

నమస్కారయ్, పార్వతీ! రాధాకృష్ణా ! స్టేషన్‌కి వెళ్తున్నావా? సుభద్రకూడా వస్తుందేమో తీసుకెళ్ళు."

"ఎందుకు శ్రమ – వెళ్ళిపోయేవాళ్ళకోసం?" అంది పార్వతి. "నేనూ వస్తాను" అని కాళ్ళకు చుట్టుకున్న పాప నెత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు రాజు రాధాకృష్ణతో పాటు అందరూ వెళ్ళుతుంటే, వీధి వాకిట్లో నవ్వుతూ నిలబడి కను చూపు మేరదాటేవరకు చూచింది సుభద్ర. తర్వాత తన కళ్లలో నీళ్ళునిండి వుండటం గుర్తించి తుడుచుకుంటూ, 'భగవంతుడు సృష్టించిన ఎడబాటు చిత్రమైనది' అనుకుంది.

## 31

కాకినాడకు వచ్చి పదిరోజు లవుతున్నది. ప్రిన్సిపాల్ గారు కుదిర్చిన ఇంట్లోకి ప్రవేశిస్తూనే – 'ఇద్దరికోసం ఇంత ఇల్లేమిటి ?" అనుకుంది పార్వతి. ఆయనగారి కేమన్నా తిక్క వుందేమో అనుకుంది అయితేనేం- అందమైన ప్రహరీగోడ, రకరకాల పూలమొక్కలు – బలేమోజు పుట్టించే ఇల్లు

సామాన్లు సర్దుకునే ఒత్తిడి అంతా రెండురోజులకు సరిపోయింది. ఆ తర్వాత ఏం చెయ్యాలో తెలియలేదు పార్వతికి. ఉద్యోగం చెయ్యాలనే వాంఛ బలవంతంగానో,

వుద్దేశపూర్వకంగానో అరికట్టుకుంది. ఉద్యోగం నిర్వహించి తను పొందిన ప్రశంసలు ఇక్కడకు చాలు ననిపించింది.

దగ్గరలోవున్న లేడీస్ క్లబ్ లో సభ్యురాలయింది పార్వతి. అందరూ కొత్త వ్యక్తులు. ప్రదేశాలన్నీ అపరిచితంగా వున్నాయి. ఎప్పుడూ ఆ పరిసరాల్లో కాలుపెట్టి ఎరగదు. పట్టణ వాతావరణమైవుండీ దిగులు కల్పించిన కారణం ఇదే ముఖ్యంగా.

పుల్లమ్మగారి వంటి ప్రముఖులను తెలుసుకున్నాక, పొరుగింటి స్నేహాలపై మోజు తీరిపోవడం సహజమే. ఒక రోజు అడ్డుగోడల్లేని పెరటి ఆవరణలో దూరంగా ఎవరో పెద్దావిడతో మాట్లాడుతూ ఒక అమ్మాయి కనిపించింది. ఆమెతో పరిచయం చేసుకుంటే బాగుండు ననుకుంది. అను కూలం కాలేదు అప్పట్లో.

ఏదేమైనా దట్టమైన మేఘాల్లాంటి ఆలోచనలు పనులు వున్నప్పుడూ, లేనప్పుడూ కూడా మానసాకాశంలో సంచరిస్తూ వున్నాయి.

రాజు ఏదో ఆత్రుత చెందుతున్నాడు పార్వతిని గురించి. కాని ఆ అమ్మాయి ముఖంలోని గంభీరత నైరాశ్యంవల్ల ఏర్పడిందో, అమిత దుఃఖంవల్ల అలవాటైందో తెలుసుకోవాలని ప్రయత్నించి, ధైర్యం సన్నగిల్లి ఊరుకున్నాడు.

ఆ మధ్యాహ్నవేళ సంధ్యలోకి అడుగులో అడుగు వేస్తూ జారిపోయింది. ఉదయమూ, మధ్యాహ్నమూ, సంధ్య!

తిరిగి ఉదయ మధ్యాహ్న సంధ్యలు. ఈ భ్రమణ ధ్వని గీతానికి ఏనాడూ లయ తప్పినట్టు తోచదు.

ఇదే అసుర సంధ్యను కొన్నాళ్ళక్రితం పార్వతి భరించలేకపోయేది. హఠాత్తుగా జరిగిపోయిన విషాద సంఘటనల ఛాయలు పార్వతిలో నిగూఢంగా దాగి, అప్పుడప్పుడు రేగి, బాధపెడుతున్నాయి. అవన్నీ విడిపోతున్నట్టు సడలిపోని నిబ్బరమేదో గుండెలను ఆవరించింది. ఈ సంధ్యలో గొప్ప పరమార్థముంది. వృద్ధాప్యానికి బెదిరిపోయేవారికి కూడా ఒక్కొక్కసారి ఈ సంధ్య అందంగా కనిపిస్తుంది. ఎందుచేత? దాన్ని తర్కించుకోవాలి. ఆ రహస్యాన్ని ముందే ఛేదించినవారు ఆ దశకే తహతహ పడతారు. బాల్యయౌవన వృద్ధాప్యాలు; ఉదయ మధ్యాహ్న సంధ్యలు. చివరకు అనంత తమఃశక్తిలోకి, అంధకారంలోకి అగుపించకుండా పోవడం.

కాల గమన వేగంలోనే మానవ జీవితరహస్యం ఇమిడి ఉంది.

గొల్లున ఏడ్పులు వినిపించి నివ్వెరపోయి అటుకేసి చూచింది. ఎవరో రైలుకింద పడ్డారని గడబిడ, ఆ ఇంటివాళ్ళ ఏడుపు రొదలతో గొడవ గొడవగా ఉంది. దుఃఖితుల ప్రతిస్వరూపంలాగా - నడిచివస్తున్న యామినీకాంత వదనం బాగా ఎర్రబడి పోయింది ఆకాశంలో.

పార్వతి ఎందుకో త్వరత్వరగా ఉద్రిక్తస్థితిలోకి వచ్చింది. ఇటీవల 'చావు' అనే పదం వినిపించడమే తడవు—

పార్వతిలోకి నిర్విశేషంగా అశేషమైన ఆలోచనలు వచ్చిపడి పోతున్నాయి వాటికి అంతొకటి ఉన్నదని ఆశలేదు.

మొదట సరస్వతి. తర్వాత తండ్రి. అంతర్నేత్రంలో కనిపిస్తారు. ఇక అక్కడినుంచి చిత్రవిచిత్ర రీతుల్లో భిన్న విభిన్న మార్గాల్లో మనసు సర్వావయవాల్లోకీ ప్రవహిస్తుంది, పరీక్షిస్తుంది. పరిశోధిస్తుంది. దేనికోసమో, ఎందుకో తెలియదు. ఆంతర్యంలో జరిగే సంఘర్షణ పైకి ఎవ్వరికీ తెలియదు

హఠాత్తుగా పార్వతి అంతరాళంలో ఒక మెరుపు మెరిసింది. ఈ ఆవేదన నంతా, నిర్వచన శూన్యమైన ఈ ఆరాటాన్నంతా ఎంత కష్టపడి అయినా వచన రూపంలో బహిర్గతం చేస్తే ?

మరొక విధమైన స్పందన మొదలైంది పార్వతిలో. కనిపించే ప్రతివస్తువును, ప్రతి దృశ్యాన్ని, ప్రతి వ్యక్తిని పరిశీలనాత్మకంగా చూచాయి కళ్ళు.

ఏభావాన్నయినా పరిగ్రహించి దానికి అనుసంధానంగా తను కల్పనచెయ్యాలి. తాను చూస్తున్న వర్ణికలే, పొందుతున్న అనుభూతులే మస్తిష్కంలో అవిరామంగా రచనలై పోసాగాయి తన ఎదట కనిపించే దృశ్యాలే అస్పష్టంగా కనిపించే కలలై పోయాయి.

ఆత్రుతనుంచి తప్పించుకోవటానికి శక్యంకాలేదు. బీరువాలో కాగితాలు కొన్ని సంగ్రహించి వ్రాసే ప్రయత్నం

చేసింది పార్వతి. కొన్ని కాగితాలు తగలబడిన తర్వాత మాటల పొందిక కుదిరింది.

అంతవరకు గుండెలమీద ఉన్న బరువును ఎవరో తీసి నట్టయింది. ఎన్నుకున్న వస్తువు ఎంత విషాదవంతమైనదైనా అంతా వ్రాసి తన సృష్టిని ఒకసారి తిరగేసి చూడగానే పార్వ తికి అప్రయత్నంగా నవ్వు వచ్చింది.

## 32

గడియారం సరిగ్గా మూడుగంటలుకొట్టి ఆగింది. 'క్లబ్బుకు వెళుతుంది కాబోలు' అనుకున్నాడు పార్వతిని గమ నిస్తూ రాజు. కొత్తగా చెవులకు ఆమెగారు పెట్టుకున్న బంగారు రింగుల కాంతికిరణాలు సూటిగా రాజు కళ్ళను తాకాయి కళ్లు చికిలించుకున్నాడు. చేతికి వాచ్ బిగించు కుంటూ మెట్లెక్కబోతున్నది పార్వతి. రాజు వెంటనే వెనక్కు వచ్చి ఎంతో అవసరమైన పనులేవో చూస్తున్నట్టు నిలబడ్డాడు బల్లముందు.

"నేను క్లబ్బుకి వెళ్తున్నాను. మీరు ఇంట్లో ఉంటారు కదూ ? రెండుగంటల్లోగా వచ్చేస్తాను"

ఆ సంబోధనకు ఉలిక్కిపడి రాజు తన వ్యక్తిత్వాన్ని, మనస్తత్వాన్ని మరిచిపోయాడు పార్వతి ముఖంచూస్తూ.

ఈ లోగా ఆమె ఏ విధంగా ప్రశ్నించిందో, తను దానికి సమాధానంగా ఔననాలో, అలాగే ననాలో అన్న సంగతి మెదడులోంచి దాటిపోయింది.

"ఏం ?" అని, తమాయించుకొని, "అలాగే" అనే శాటు చూపు తప్పిస్తూ.

ఎందుకట్లా పిలిచిందా ? అన్న సంశయం అన్నంత తేలిగ్గా వదల్లేదు. సిగ్గునో, గర్వాన్నో పుట్టించి వదిలింది.

మెట్లు దిగుతూ సన్నగా, పేలవంగా నవ్వుకొని చర చరా తటిల్లతలా వీధిలోకి నడిచిపోయింది పార్వతి నిరాటంకంగా.

ı ı ı

క్లబ్బు భవనం ఎదుటిగేటులోంచి చాలామంది లోపలికి వస్తున్నారు. రంగురంగుల చీరలు కట్టుకున్న అంగనామణులు ఎక్కడుంటే అక్కడ సందడి.

విచిత్రశోభను సంప్రోక్షిస్తూ తోటలో తిరుగుతున్నారందరూ.

పార్వతి స్తంభాన్నానుకొని చూస్తున్నది.

అక్కడ ఆఫీసర్ల భార్యలు, కాలేజీ అమ్మాయిలు, సామాన్య స్త్రీలు అంతా కలిసిఉన్నారు.

వరండా అంచులచుట్టూ రకరకాల పూలచెట్లు అమర్చి ఉన్నాయి. లాల్ కమల్, స్థల కమల్ మొదలైన పూలు, గులాబీ పసుపుపచ్చరంగుల్లో, దాలియాలు విరజిమ్మినట్టు విరబూసి కళ్ళను చెదరగొడుతున్నాయి.

గేటుపైన అమరికకోసం ఏర్పాటుచేసిన ఇనుపతీగకు అల్లుకున్న లేతజాజితీగె ఎండలో మెరుస్తూ చిరుగాలికి చలిస్తుంటే దాన్నే తదేకంగా చూస్తూంది పార్వతి. ఆర్థికంగా పురుషుడిపై ఆధారపడి భయపడే స్త్రీ మాదిరి కంపిస్తున్నదా అనిపించింది.

'స్త్రీగా పుట్టింది కనుక పురుషుణ్ణి గురించి తర్కించుకోవలసిన అవసరం లేదు తనకు. కానీ, స్త్రీ అంటే ఏమిటి? ఏ యే పదార్థాలను ఆకర్షణీయంగా సమీకరించి, ఎటువంటి సున్నిత భావనల్ని సమన్వయపరిచి స్త్రీ స్వభావ రూపాల్ని తయారు చేశాడు సృష్టికర్త? కాని ఒక్కటి నిజం!' అనుకుంది పార్వతి. 'అనాదిగా స్త్రీ, పురుషుడిపై ఆధారపడుతున్నది. అతని ఆలంబన లేకపోతే పడిపోయే ప్రమాదస్థితిని కూడా ఒక సమయంలో స్త్రీ అనుభవించిందని అనుకోవచ్చు. స్త్రీ పురుషుడిపై ఆధారపడి ఉండాలన్నదే సృష్టికర్త ఉద్దేశంగా తోస్తుంది. దీన్ని అవలోకించగా కొన్ని విషయాల్లో మాత్రం తన జీవితం అందుకు విరుద్ధంగా ఉంది...

'అందుకే తన హృదయార్పణ ఇంకో విధంగా జరగకూడదా?' గాలికి పూలరెమ్మలు ఊగులాడాయి పార్వతి ఊహల్లాగే.

'అమూల్యమైన ఈ స్త్రీ హృదయం ఎవరికో ఒక్కరికే అంకితం కావాలి. అదే భగవంతుడికైతే? హృదయ రంజకమైన భావనే! కాని ఎలా సమర్పించుకోవడం? ఆధునిక సామాన్య మానవమాత్రురాలికి అది ఎల్లా సాధ్యమవ

గలదు? నేటి సాంఘిక, ఆర్థిక జీవనాల్నిబట్టి తాపత్రయమనేది ఉన్నా లేక పోయినా స్త్రీ ఒడిదుడుకుల జీవిత నావలో ప్రయాణిస్తూ మునకలు వేస్తున్నది. ఆవిడ చచ్చినా తపస్విని అవజాలదు. ఆ మాట పైకంటే హాస్యాస్పదం కూడా. స్పందించే హృదయ స్థితులు, ఆంతరంగిక క్షోభల్ని గురించి పనిగట్టుకు ఆలోచించే తీరిక పై వారి కెక్కడుంటుంది?'

గాలి తెరల్లాగా తన మనసును తాకుతున్న ఊహాల్ని గురించి తెలుసుకునే బాహ్యజ్ఞానంలో లేదు పార్వతి. పరిసరాల్లోని వారందర్నీ ఆమె శూన్యంగా చూస్తున్నది. వారందర్లో వెలుగుతున్న కాంతిపుంజాలకు కారకమైన ఏ దివ్య జ్యోతినో వెదుకుతున్న దామె మనసు. ఆ చూపు అందుకే సరియైన విధిలో పనిచెయ్యడం మానుకుంది. అన్వేషణ భగవంతునిగూర్చే ఐనప్పుడు మధ్యమ దశవంటి దా స్థితి.

తనువు నిశ్చల సమాధిలో ఉంది. మనసు నిర్మల వికాస పథంలో సంచరిస్తూంది.

'తన జీవితం ఇలా నడిపిస్తున్నవాడు సర్వేశ్వరుడైతే- అర్థం ఒక్క టనిపిస్తుంది. తనను పలువురిలోనుంచి ప్రత్యేకించి పరీక్షిస్తున్నవాడు దైవమే. అలా ఈ మనసును ఏకాగ్రం చెయ్యడానికే అందరి ధర్మాలకు, అన్ని అనుబంధాలకు వ్యతిరిక్తురాల్ని చేశాడు!"

పార్వతి కళ్ళు రెపరెప లాడాయి. ఒళ్ళంతా పులకించింది.

పూల మొక్కల్లో కలకల నినాదాలు చీల్చుకుంటూ క్లబ్బు గదుల్లోని హాస ప్రతిహాసాల మధ్యగా పవిత్రగీతం— ఎన్నడూ విననిది పార్వతి వీనుల్ని సోకుతున్నది వినూత్నంగా.

'నా జీవితాన్ని నీకే అర్పణ చేసుకుంటాను — ఆ ఆనందాన్నుంచి దూరంచెయ్యాలని ఎందరు ఆటంకించినా సరే. బలవంతపెట్టి కానీ, తిరస్కరించి కాని నీ నుంచి నన్ను మరలించలేరు, దేవా! అలాగనే నన్ను ఆశీర్వదించు...'

గగనానీల సమన్విత శూన్య ప్రదేశంలోకి నిగిడ్చి ఉన్నాయి పార్వతి చూపులు.

'స్వల్పమైన సంకేతాలుగా తన అస్తిత్వాన్ని నిరూపించుకోని, ఇక మీ యిష్టం-అన్న ధోరణిలో మౌనం వహిస్తా డీ భగవానుడు!'

సెక్రటరీ పద్మావతి ఎప్పుడు వచ్చిందో — "ఏమిటాలోచిస్తున్నావు పార్వతీ!" అని అడిగి, చెయ్యి పట్టుకుని బరబరా లాక్కు వెళ్లిపోయింది.

పార్వతి బాహ్యాడంబరానికీ, అంతః ప్రవృత్తికీ మధ్య ఉన్న తేడా ప్రతివాళ్ళకూ చిత్రంగా కనిపిస్తుంది. వింతగా చూచి ఏమీ అనుకోలేక పోయినవారు కూడా ఉన్నారు.

పార్వతి, టైమయింది కనుక ఇంటికి పోదామనుకుంది. కానీ, పద్మావతి బలవంతంగా టాతాఖానీ వేయించి వదిలింది కాదు.

ఎల్లాగో ఆవిణ్ణి తప్పించుకుని ఆఫీసు రూములోంచి ఇవతలకు అడుగుపెట్టిన మరుక్షణంలో హాల్లోనుంచి నవ్వులు వినవచ్చాయి. అటు చూచింది పార్వతి కళ్ళు తిప్పి.

"ఏమండీ, కవితగారూ! బహుకాల దర్శనం!" అంది సత్య గొంతుక.

'కవితా?' అనుకుని ఆశ్చర్యపడింది పార్వతి.

"ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి? ఇన్నాళ్లకి మళ్ళీ మేం సుకృతం చేసుకున్నాం!" హేమకుమారి వగలు.

"హల్లో, కవితా! వస్తే వచ్చావు కానీ, ఈ రెండు నెలలూ ఢిల్లీలో ఏం చూశావో అవన్నీ చెప్పకుంటే నిన్నొదిలేది లేదు" అంది తెలుగు వచ్చిన అరవ క్రిష్టియన్ పిల్ల ఫ్లోరా.

అమ్మాయిల గడబిడే కానీ, ఆ కవితగారెవరో ? ఆ వ్యక్తి సరిగ్గా కనిపించడంలేదు; ఆవిడ నోటి మాటా విని పించలేదు. ఆ మధ్య గదిలోని లైట్లవల్ల కిటికీ ఊచల నీడలు పార్వతిమీద పడుతున్నాయి.

గుమ్మంలోకి వెళ్ళింది చూడాలనే కుతూహలంతో.

పార్వతి కళ్ళు ఒక్కసారిగా విచ్చుకున్నాయి.

'ఈ ముఖం ఎక్కడో చూసినట్లుందే! ఊc హూ! ఔను. ఆ వేళ ట్రెయిన్‌లో కనిపించింది. తన కంట్లో నలుసు పడటం, ఆవిడ నవ్వడం - చాలా రోజులై పోయిందిగా? తలుచుకుంటే నవ్వొస్తుంది. ఈవిడా ? కవితా ఈమె పేరు ?

ఒకవేళ రచయిత్రి కవిత కూడా ఈమే నేమిటి? ఆవిడ గుర్తి స్తుందేమో తనను?'

అంతా కవిత చుట్టూ మూగారు. నవ్వులు.

"నా అడ్వెంచరెన్నెక్కడికీ పారిపోవు కానీ– మన లలి తేది ?" అంది కవిత - చుట్టూ కలయచూస్తూ.

"లలితకి నెలలు నిండాయి!" మళ్ళీ కిలకిలా నవ్వులు. సన్నగా నవ్వుతూ నలువైపులా చూస్తున్న కవితకు గుమ్మం దగ్గర నిలబడ్డ పార్వతి కనిపించింది.

కవిత ముఖం ఒక్కక్షణం సాలోచనగా మారింది. అంతలో నవ్వుతూ, "నేను గుర్తున్నానా ?" అని అడిగింది పార్వతిని పలకరిస్తూ.

పార్వతికి ఊపిరాడలేదు. నవ్వొకటి నవ్వేలోపున–

"వీరు నీకు తెలుసా, కవితా? నెలవుతుంది మన క్లబ్బు మెంబరై. ఇలారండి పార్వతీ!" అన్నది ఫ్లోరా చలాకీగా.

పార్వతి కవితకు కాస్త దగ్గరగా జరిగేలోగా సెక్రటరీ పద్మావతీదేవి హడావిడి పడుతూ రానే వచ్చింది.

"ఇదిగో కవితా! ఈవిడ మనక్లబ్బు కొత్తమెంబరు మిసెస్ పార్వతీరాజ్ బి. ఎ. ప్రస్తుతం ఏ ఉద్యోగంలోనూ లేరు. అసలు నీకు చెప్పడం మరిచిపోయాను, పార్వతీ! ఈమె గారు మనక్లబ్బు కంతటికీ ఒక ప్రత్యేక కళ అనుకో. ఈవిడ వచ్చినరోజు ఈ క్లబ్బుగోడలు దద్దరిల్లిపోతాయని వేరే చెప్ప నక్కర్లేదు. ఎందుకంటే గాథలు వ్రాస్తుంది, గ్రంథాలు

వ్రాస్తుంటుంది మరి! మొన్ననే ఢిల్లీలో అఖిలభారత రచయితల సమావేశానికి వెళ్ళొచ్చారు ఈమెగారు! పేరు కవిత," పరిచయం ముగించి నవ్వింది పద్మావతి.

"మహా బాగా చెప్పావనుకుని పప్పులో అడుగేశావే, పద్మా! పొడిపొడిగా కవిత అనడమేమిటి?-కవితా కరుణాకర్ అనాలి కానీ" అందొక నిత్యవిమర్శకురాలు.

పద్మావతితోసహా అందరూ నవ్వారు, ఒక్క పార్వతి మినహాయించి

"నేనేం పెళ్ళికూతుర్ని కానులే చిట్టీ! సిగ్గుపడటానికి టైం లేదుమరి!" కవిత మాటలకు తన నవ్వూ మేళవించింది పార్వతి.

పద్మావతిగారు వెళ్ళాక – "ఏమండీ పార్వతీ! మీ కంట్లో నలుసు ఎంతగోడవచేసింది!" అంది కవిత.

ఇద్దరూ గొంతువిప్పి నవ్వుకున్నారు ఒక్కసెకను.

ఇంకా ఏమన్నా మాట్లాడుతుందేమోనని ఆశించింది పార్వతి. కానీ, కవిత వెళ్ళిపోడానికప్పుడే సిద్ధమైంది. పార్వతి ఆమె వ్రాసేవి తనకు అమిత ఇష్టమని చెబుదామనుకుంది. 'మీ రెలా వ్రాస్తారు?' అని అడగాలనుకుంది. తనకు నేర్పమని కోరి చూద్దామనుకుంది. ఏదీ కాలేదు. అందుకు కారణం కవిత మళ్ళీ పార్వతిదగ్గర సంభాషణ కదపకపోవడం.

రాత్రి నిద్రపోయేముందుకూడా కవిత గూర్చే ఆలోచనలు కమ్ముకున్నాయి. లేతనీలపురంగు చీరతో కళ్ళకు

కట్టింది. 'ఆమెకు నీలివర్ణం అభిమానం కాబోలు... అందరికీ తెలుసు కవిత...'

మర్నాడు క్లబ్బులో కవితను చూచేదాకా పార్వతికి మరో ఆలోచనా, ఆత్రుతా లేవు.

"నా అసలు పేరు సుమిత్రాదేవి. కవిత పెన్‌నేమ్" అని చెప్పింది కవిత.

ఎంతవరకు పరిచయం సాగినా కేవలం ముక్తసరి మాటలు దొర్లుతున్నాయి ఇద్దరి మధ్యా.

బాడ్మింటన్ కోర్టువైపునుంచి ఒక అప్సరసలాంటి పిల్ల పరుగెత్తుకుంటూ వచ్చి కవితను అమాంతం కౌగలిం చేసుకుంది.

"నాకు తెలీకుండా వచ్చేశావూ, నా కవీ!" అంది గోముగా.

"మరేం చెయ్యను? టెలిగ్రామ్ కొడితే - అసలే సన్నని అమ్మాయివి గదా - ఏమన్నా అయిపోగలవని భయంవేసింది. కానీ, నన్నిలా కొత్తవాళ్ళముందు కవీ అంటూ పిలవద్దని ఎన్నిసార్లు చెప్పాను? మగమనిషినేమో నని వాళ్ళు కంగారు పడటానికి!"

"ఏమో బాబూ! నాకు తెలీ దదంతా, అయినా పెన్‌మేన్ గాళ్ళందరికీ పెన్‌నేమ్ పిచ్చొకటికదా నా ప్రాణా నికి!" బుంగమూతి పెట్టి అం దా అమ్మాయి.

'ఇక్కడి గోపికలందరికీ ఈవిడ కృష్ణుడు కాబోలు!' అనుకుంది పార్వతి కవితను పరీక్షగా చూస్తూ.

ఆమె కవితే ఆమెకు కళ. హుందాతనం పెట్టుకోని ఆభరణం చురుకుదనం ఎక్కువై, గంభీరత సడలినప్పుడు ఈమెకు అన్నికళల్లో అభినివేశమున్నదేమో అనిపిస్తుంది.

'మాటవరసకి ఒకసారి ఇంటికి రమ్మనేనా పిలిచింది కాదీవిడ.' కవిత నిర్లక్ష్యానికీ, నిర్లిప్తతకూ బాధపడి అక్కడితో ఊరుకోలేదు పార్వతి. "మీరు మా యింటి కొకసారి రండి. ఇక్కడికి దగ్గరే" అని ఆహ్వానించింది ధైర్యం తెచ్చుకొని.

"నే నెందుకు రావాలి? మీరే రండి." తేలిగ్గా అనేసి, పార్వతి కళ్ళలోని అరుణిమను చూచిందో లేదో గానీ – అడ్రస్ చెప్పింది కవిత.

'ఛీ–నే నెందుకు బయటపడిపోయాను తెలిసి తెలిసీ!' పార్వతి మనసులోనే సిగ్గుపడింది. మారు మాట్లాడలేదు.

మర్నాడు క్లబ్బువైపు పోకుండా కాళ్ళు ఆగలేదు. కళ్ళు కవితను వెతకడం మానలేదు.

రాలేదో, వచ్చి వెళ్ళిపోయిందో – ఆమె మాత్రం అగపడలే దెక్కడా.

'అహం ఆవిడ నిలువెత్తునా ఉంది. సౌజన్యం సౌహార్దం రచనల మేరకే. కావాలంటే అలాటి దర్పం తను కూడా చూపించగలదు' మర్నాడు క్లబ్బుకు వెళ్ళాలని పించక ఇంట్లో కూర్చుని ఇవే ఆలోచించుకొంటూంది సాయంకాలం దాకా.

తలుపు చప్పుడైంది. ఎవరో అనుకుంటూ గుమ్మం అవతల నిలబడ్డవ్యక్తిని చూచి నిర్ఘాంత పోయింది పార్వతి.

కవిత !

పార్వతి అనిమేషత్వం గమనించి చిరునవ్వుతో లోపలకు వచ్చింది కవిత.

"మీ యిల్లు చాలా అందంగా ఉంది, పార్వతి గారూ !"

పార్వతి ఊరుకుంది. ఏమంటే ఏం తంటా వస్తుందో నని భయం !

ఆమెగారికి తగిన మర్యాదచేసి, వేరే కుర్చీలో కూర్చోబోతున్న పార్వతి చేతిని అమాంతంగా పట్టుకుని పక్కన కూర్చోబెట్టుకుంది కవిత మృదువుగా.

"ఇలా వేరుగా చూస్తే నేను వెళ్ళిపోవలసొస్తుంది" అంది. పార్వతి తెల్లబోయింది మొదట. వెనువెంటనే దేన్నో జయించినట్టు వెన్నెల వెలుగు ప్రసరించింది ముఖం మీదకు.

"మీకథలు నాకెంతో ఇష్టం" అంది పార్వతి. ఆమె సామీప్యంలోని కొత్తదనాన్ని తట్టుకుంటూ.

"ఉఁ హూఁ!" అంది కవిత. "నా నవలలు చదివారా?" ప్రశ్నించింది తన ప్రశ్నగా.

"లేదండీ, నాకు తెలీదు. వ్రాశారా మీరు ?"

"ఏవో కొన్నే లెండి ! పదివరకు ఉంటాయి."

"అన్ని ఉన్నాయా? నేను చదవలేదు సుమండీ! అసలు మొన్న మొన్నటిదాకా సాహిత్యంపట్ల నాకు అంత శ్రద్ధ

లేదండీ!" నొచ్చుకుంటూ - "ఇంకా వ్రాస్తున్నారా!" అని అడిగింది ఆసక్తి చూపించి.

"వ్రాస్తున్నాను. తిరిగే కాలూ, తిట్టే నోరూ ఆగవన్నట్టు సాహిత్యపు మెదడూ, సంగీతపు గొంతుకా ఊరికే ఉండవు."

"ఎలా వ్రాస్తారండీ?" అన్నది పార్వతి. కవిత చిరునవ్వు నవ్వి ఊరుకుంది.

"నాకు కథలు వ్రాయాల నుంది." పార్వతి ఎలాగైతేనేం ప్రయత్నించి ప్రయత్నించి, కోరిక వెల్లడించింది.

"ఊఁ హూఁ! అదా ప్లాను? పిలిచిన కారణం ఏమిటో అనుకున్నాను! వ్రాయండి!"

"నేర్పించకపోతే ఎలా వస్తుంది కవితగారూ!"

"నేర్పిస్తేవచ్చేదా అని! రావచ్చునేమో ప్రయత్నిద్దాం లెండి. ఆ మధ్య ఓ వ్యాసం ఏదో పత్రికలో చూశాను—ఆ పార్వతి మీరు కాదేమిటి?"

పార్వతి సిగ్గుపడుతూ అంది: నేనే గానీ, అదేదో భావలహరిలాగా వ్రాశాను. మరి కథలు వ్రాయటం చేత కాకుండా ఉంది."

"అయితేనేం?" 'మృత్యువు' అని పెద్ద వ్యాసం వ్రాసి, ఎడిటర్‌గార్ని హడల గొట్టేశారుగా మొదటే!"

ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు. అప్పుడే సాయంకాల స్నానం పూర్తిచేసి మేడమీదకు పోతున్న రాజు, కొత్త వ్యక్తి గొంతుక విని వెనక్కి తిరిగి చూశాడు. కవిత

అతన్నిచూచి, తక్షణం పార్వతిని చూచింది. పార్వతి కవితను అడగవలసిన వాటికోసం ఉబలాటపడుతూ ఇదంతా గుర్తించ లేదు.

హఠాత్తుగా– "మావంటివాళ్ళు... మీ వారికి నచ్చ రనుకుంటాను." అంది కవిత

కంగారుపడి, "ఏం!" అంది దారితోచక పార్వతి.

సాధారణంగా కవిత గ్రహించ లేనిదంటూ ఉండదు. ఏకసంతాగ్రాహికి ఉండే శక్తిలాటిదేదో ఉంది కనుక మను షుల్ని నిలువునా చదివేస్తుంది.

"ఏమో! భారత స్త్రీ లక్షణాల్ని పాటించినట్టు లేను ఇవాళ. బొట్టు కూడా పెట్టుకోలేదేమో!" అంది నవ్వేస్తూ.

అప్పుడు చూచింది పార్వతి. నిజమే! మొన్న క్లబ్బుకు వచ్చినప్పుడు కనిపించిన కాస్త ఆడంబరమూ ఇప్పుడు పూర్తిగా లేదు. నుదుట బొట్టు లేదు. సాదాచీర కట్టుకుంది. జడలో ఒక లిల్లీ పువ్వుంది.

అంతా మరిచిపోయి, "మీకు నీలంచీర లిష్టం కదూ! తెల్లది కట్టుకున్నా రేం!" అంది పార్వతి కవితనే చూస్తూ.

"మీ కెలా తెలుసు!" కవిత విస్తుపోయింది.

"మీారంటే నా కిష్టం గనుక "

"ఊం ! అలాగా!" నవ్వింది కవిత సున్నితంగా.

# 33

"శాఖాగ్రముల్లోని ఆకులలో కొన్ని వడిలి నేల వ్రాలినాయి. మిగిలిన పర్ణాంతరాంతరములనుండి రెండు మూడు అస్తంగత దివాకరుడి నులువెచ్చని కిరణములు ప్రసరిస్తున్నవి. జీవితయానం చేసిచేసి, ఆశయములు నశింప చేసుకొని అలసి నిలచినట్టి స్త్రీ వలె ఉంది ఆ వృక్షం."

సిగ్గుపడుతూ నవ్వాపుకుంటూ కవిత ముఖాన్ని చూచింది పార్వతి.

"ఇంకా పూర్వంలో ఉన్నారు కొద్దిగా. ఆ ఫక్కీ వదిలేవరకు మీ వ్రాతల్ని ఇప్పటి పాఠకులు అభిమానిస్తారని గట్టిగా చెప్పలేను."

"పోనీలెండి!" అంది పార్వతి అలిగినట్టు.

వాళ్ళిద్దరూ కూర్చున్న సిమెంటుబెంచీ కెదురుగా మోడులాటి చెట్టొకటుంది. కవిత ఇంటి వెనుక భాగం అది.

"అలగకండి!" అంది కవిత నవ్వి.

"శిష్యురాలిని ఎక్కడైనా మర్యాదచేసి పిలుస్తారేమిటి?"

"అట్లే కానిమ్ము! సుస్థిర ధైర్యమ్ముతో నుండుము శిష్యురాలా! నా యావత్పాండిత్యమును నీకు ధారవోసెద."

పార్వతి కిలకిలా నవ్వింది.

"ఉండు- వీడెందుకో నామీదకొచ్చి పడుతున్నాడు" అంది కొడుకును చూస్తూ.

"అమ్మా! భూమి గుండ్రంగా ఉంటుందా, నలుపల కలుగా ఉంటుందే?" అన్నాడు పిడుగు కాగితం సరంజా మాతోసహా వాళ్ళ అమ్మ ముఖం చూస్తూ.

"పార్వతీ! అదేదో కాస్త నువ్వు గీసి చూపించ గలవా? నాకు బొత్తిగా డ్రాయింగు రాదు." కవిత అర్ధన.

"అబ్బే - నా కసలు రాదు. ఓ స్ట్రెయిట్ లైన్ కూడా గియ్యలేను..."

"నమ్మను. ఒక స్ట్రెయిట్ లైన్ కూడా గియ్యలేని వాళ్ళుంటారా? ఉంటే వాళ్ళ జీవితాలు కూడా బహుశా స్ట్రెయిట్‌గా ఉండవేమో?"

పార్వతి కవిత మాటకు ఏమో అనుకుంది, "అంతే లెండి!" అంది.

కవిత చప్పున మాటమార్చి, "మీ నాన్నగారిని అడ గరా నాన్నా!" అంది.

"అడిగానమ్మా! గుండ్రంగా ఉంటుందన్నారు "

"మరేం ఫర్వాలేదు-కోడిగుడ్డు ఆకారంలో ఉంటుం దని వ్రాసెయ్యి."

పార్వతి నవ్వింది ఫక్కున కవిత మాటలకు.

"నేను వ్రాసుకుంటాలే" అంటూ తురుమన్నాడు సుపుత్రుడు.

"మా ఇద్దరి అభిప్రాయాలూ తెలుసుకుని గానీ, ఒక అభిప్రాయానికి రారు మా పసివాళ్ళిద్దరూ" అంది కవిత.

పార్వతి ఆమెను చూస్తూ, "మీ ఇద్దరి అభిప్రాయాలూ ఏకీభవించినట్లు కనిపించ లేదు నాకు" అంది.

"అదే నేను చెప్పేది! నేటి స్త్రీ స్థితి సమాజంలో ఎలా ఉన్నాగానీ, అదునుదొరికినప్పుడు ఈ మాత్రం వ్యతిరేకభావం ప్రకటిస్తుండాలి. అప్పుడుగానీ మగవాడు ఆడదాని విలువని గ్రహించి, గౌరవించడానికి ప్రయత్నించాలనుకోడు. సగటు మనుషుల్లో స్త్రీకి తామెంత అవసరమో మాత్రమే ఆలోచించే వార్ని లెక్క కట్టలేము"

పార్వతి వెనక్కువాలి కవిత కొంగు వేలికి చుట్టుకుంటూ అంది: "అయితే – భర్తని ప్రతిఘటించి మాట్లాడితే లోకం ఊరుకోదు; భర్తగారు కాస్తకూడా సంహించలేరు కవితగారూ!"

"అవును! పొద్దు తెలీకుండా ప్రతిఘటిస్తూ కూర్చుంటే అంతేమరి! పైగా చేతులారా బ్రతుకు అశాంతికి నిలయంగా చేసుకున్నట్టవుతుంది. అందుకే ఏదైనా పరిమితంగా ఉండాలనే అంటాను. కొన్నిధర్మాలు అవెటువంటివైనా తప్పని సరిగా శిరోధార్యాలైపోయాయి స్త్రీకి. నిర్ణేతలు దివికి పోయుంటారు గనక దిగిరారు. ఇక నెత్తికెక్కిన వాటిని దించుకునే శక్తి ఇప్పట్లో మనకురాదు. ప్రయత్నంవల్ల ప్రయోజనం ఉండదు కానీ, సంఘ జీవితంలో ఎవ్వరికీ తెలియకుండానే వెలివేయ్యబడతాము!"

పార్వతి శ్రద్ధగా వినటంచూచి నవ్వి, "స్త్రీ ఎటువంటి మర్మవేదనలను దాచుకుంటున్నదన్నా, మనో నిర్ణయాల్ని మార్చుకుంటున్నదన్నా ఇదే కారణం!" అంది కవిత నిట్టూర్చి బాధగా.

పార్వతి హుషారుగానే ఇంటికి వచ్చింది. తండ్రి, సరస్వతి పోయిన తర్వాత తిరిగి పార్వతికి ఉల్లాసం కలగడం ఇదే మొదలు. ఎందుకో, ఏమో ఆలోచించ లేదు ఆ పిల్ల.

పార్వతి రావటాన్ని చూచాడు రాజు.

అతని దగ్గరికి విద్యార్థులు అప్పుడప్పుడు వస్తుంటారు క్లాసులో పాఠం బుర్రకెక్కకపోతే. ఒక్కొక్కర్ని చూస్తే-ముఖ్యంగా వాళ్ళ చూపులు చూస్తే చీపురు పట్టుకోవాలనిపిస్తుంది పార్వతికి. కానీ, కొందరి అమాయకత్వాన్ని గురిస్తే జాలికూడా కలుగుతుంది. ఎటుతిరిగీ శేఖరంమాత్రం జ్ఞప్తికి రాక తప్పదు.

కొందరి చిరునవ్వుల్లో విషం ఉంటుంది. అది తెలుసుకుని దూరంగా వైదొలగిపోయినా ఆ విషపుగాలి ప్రభావం కొద్దికాలం వెన్నాడుతుందని చెప్పవచ్చు.

దుస్తులు మార్చుకొని వచ్చి హాల్లో కూర్చుంది. పైనుంచి మాటలు వినిపిస్తున్నాయి.

"అదేమిటోయ్ ! ఇండస్ట్రియల్ లేబర్ గురించి చెప్పమని ఈ బొమ్మలేస్తూ కూర్చున్నావు? చిత్రాలు వెయ్యడం వచ్చేమిటి నీకు?" రాజు కంఠం అది.

"ఏదో మాస్టారూ!" అబ్బాయి గొంతుక.

"ఏదీ చూడనియ్యి. బాగా వేశావే! ప్రఖ్యాత చిత్రకారుడి వొతావేమో? మనుషుల్లాగే ఉన్నాయి నీ బొమ్మలు."

"కొందరు మనుషులు కదిలే బొమ్మలతో సమానం అంటాడు వీడు."

"ఎవరు?"

"ఇదిగో—ఈ కాబోయే ప్రసిద్ధ రచయిత"

రాజు నవ్వుతూ, "మరింకేం! ఇద్దరూ కళాకారులే! విశ్వం. కథలు వ్రాస్తున్నావా నిజంగా?" అని అడిగాడు.

"ఏదో... మాస్టారూ..." విశ్వం బాగా సిగ్గుపడ్డట్టున్నాడు.

వాళ్ళు వెళ్లాక రాజు అడిగాడు పార్వతిని, "నువ్వు కలిసి తిరుగుతున్న ఆవిడ ఎవరు?" సమాధానాన్ని కోరాడు.

"ఆవిడపేరు కవిత. ఒక రచయిత్రి." ఏ భావాన్నీ ప్రకటించకుండా చెప్పింది.

"మంచిదాన్లా కనిపిస్తోంది" అన్నాడు.

"అవును." బల్లమీది పేపరు చేతిలోకి తీసుకుంటూ అంది పార్వతి.

అతనికి కవితనుగురించి అడిగే అవసర మేమిటో ఆశ్చర్య పెట్టింది ఆమెను. అంతకంటే అద్భుతంగా, విచిత్రమైన గర్వరేఖ విద్యుద్వేగంతో శరీరాన్ని ఆవేశించింది.

# 34

"కవితా! కవితా! ఎక్కడా? త్వరగా రమ్మంటే..."

"అబ్బబ్బ! కాస్త ఆగ వమ్మాయ్! ఉరుకులూ పరుగులే ఎప్పుడూ అయితే భరించలేను నిన్ను"

"నే నాగితే కైం ఆగుతుందేమిటి?"

"ఆగుతుందనే అనుకుంటాం అవసరాన్ని బట్టి."

క్లబ్బులో దసరా ఉత్సవాలు ఆర్భాటంగా చేస్తు న్నారు. సెక్రెటరీ పద్మావతికి ఊపిరి అందడంలేదు

ప్రసిద్ధగాయనీ మణిని పిలిపించడం ఒక పెద్దఏర్పాటు. మధురమైన సంగీతం ఉత్తేజాన్ని పుట్టిస్తుంది శ్రుతి విహిత మైన గానాన్ని, అందులో నిబిడీకృతమైన భక్తిభావాల్ని పార్వతి అనుభవించి మనస్ఫూర్తిగా అభినందించుకుంది. అయినా కవిత పక్కనుంటే నిశ్చలంగా కూచోలేదు. ఆ పిల్లలో చైతన్యం స్రవించి ఉరకలేస్తుంది.

గాయని జయదేవుని అష్టపది ఎత్తుకునేసరికి ఆ ఉద్రేకం మరీ అధికమైంది.

"ఎంత బాగా పాడుతోంది కవితా! గానం, గానా నికి తగ్గ గళం అదృష్టం అంటారు కదూ?"

"అవును."

"ఆవిడతో మాట్లాడాలనుంది."

"పరిచయం చేస్తాను. ముందు సంగీతం ఆపనియ్యి."

"ఆఁ! నీకు తెలుసా, ఈ పాడుతున్నావిడ ?"

కవిత చిరునవ్వు నవ్వింది. "తెలియకేం? మా రచయితలకు అందరూ తెలిసినట్టే ఉంటారు. ఎక్కడో చూసినట్టు, ఎప్పుడో మాట్లాడినట్టు—అలా."

"ఇకనుంచి నేనున్నూ ఎవర్ని చూసినా — ఎక్కడో అగుపించినట్టు - మరెప్పుడో తెలిసి ఉన్నట్టు అనుకుంటాన్లే!" పార్వతి నవ్వుతూ అంది.

"నువ్వు నన్నే తెలుసుకోలేవు - ఇంకా పై వాళ్ళ గురించి నీకేం తెలుస్తుంది?" అన్నది కవిత.

"అదేం కాదు" అంది పార్వతి మొండిగా.

ఇంతలో పార్వతి కనురెప్పలు హఠాత్తుగా నిలబడి పోయాయి. ఎదుటిబెంచీ వరసల్లో ఒకచోట ఎవర్నో చూసి కవితకు మరికాస్త దగ్గరగా జరిగింది.

"కవితా! చూడు - కుడివైపు — తెల్లచీర కట్టుకుందే - చూశావా? ఆ అమ్మాయికి చాలా గర్వం, ఎందుకోగాని! నాతో చదువుకుంది. పైగా ఏం గొప్ప అందమూ కాదు"

"ఎవరి అందాలు వాళ్ళవి!" అన్నది కవిత నిర్లిప్తంగా.

"ఏమో - నీకే కనిపించాలి ఆవిడగారి అందం నన్నడిగితే మా సరోజ 'లైట్ ఆన్ ది వరల్డ్' అనేది" కొంటెగా నవ్వింది పార్వతి.

"నేను చెప్పేది ఇప్పట్లో నీకర్థం కాదేమో? కొందరి కొందరి అందాలు కొన్ని కొన్ని సమయాల్లో ప్రస్ఫుట మౌతాయి కళ్ళకి. మిట్టమధ్యాహ్నం చెమటలు కారుస్తూ కొందరు అందంగా కనిపిస్తారు నాకు."

"బలే! బాగుందికాని నీ సానుభూతి పొందిన ఆ పుణ్య వతికి అంత తెలివి తేటలూ లేవు. వీళ్ళ అమ్మ ఎటువంటిదట తెలుసా?"

"సరే, వింటాగాని నువ్వు కాస్తమూరం జరగాలి." అంది కవిత విసుక్కుని.

పార్వతి తెల్లబోయి ఇంచుమించు కవితమీద వాలి పోయి ఉన్నదంతా సరిగ్గా కూర్చుంది.

కవిత నవ్వేసింది.

"మరేంకాదు. ఈ లిప్‌స్టిక్ చూస్తే మహా ప్రమా దంగా కనిపిస్తోంది. నీ పెదాల మీదైతే కొంచెం చెరిగినా ఫరవాలేదు- తంటా అంతా నా బుగ్గల కొస్తుంది పిల్లా!"

"అలా అనకపోతే — రాసుకోవడం మానెయ్యమని చెప్పకూడదూ?" అంది పార్వతి

"నా కోసం మానేస్తావా?"

"తప్పక."

"అయితే మరో బాధకూడా చెప్పుకోలేక ఇన్నాళ్ళూ ఆగాను. నువ్వు పరుగెత్తి వచ్చి నా పక్కన కూర్చున్నప్పు

డంతా ఈ జడలు ఉన్నాయే - చెడ్డ ఇబ్బంది పెట్టేస్తున్నాయి."

కవిత పక్కన కూర్చున్న మరో అమ్మాయి ఫక్కున నవ్వింది.

పార్వతి నవ్వుతూ, "కత్తిరించెయ్య మంటావా? చిన్నప్పుడు మా బావ అనేవాడులే మాటిమాటికి" అంది.

"అంతపని చెయ్యకు, కాస్త ఒక్క జెడ వేసుకుంటే ధన్యురాల్ని."

"నీ కంత ఇబ్బందిగా ఉందని నాకు తెలీదే! ఇక నెప్పుడైనా నీ కిష్టం లేనట్టు కనిపిస్తే ఒట్టు—"

కవిత నిర్ఘాంత పోయింది ఒక క్షణం ఆపిల్ల ప్రేమకు.

* * *

ప్రేమ అనేది పాతాళ గంగలాంటిది. అది హృదయంలో అనేకమైన కట్టుదిట్టాల్లో ఉంటుంది. హృదయాన్ని చీల్చుకుని ఉప్పెనై పొంగడమే ప్రారంభించిందంటే దాన్ని ఆపడం ఎవరి శక్యమూ కాదు. ఉరకలేసే నిర్ఝరి ఎవరిమీదకు జల్లులుగా జాలువారుతుందో ఎవరికి వారే గ్రహించలేరు. యౌవ్వన ప్రారంభంలోనో, యౌవ్వన మధ్యంలోనో ఈ ప్రేమ వాహిని అంతర్యపు లోతుల్లోంచి ప్రవహిస్తూ స్త్రీని ప్రేమమయిగా మార్చగల అవకాశం ఉంది. పురుషుడైతే యౌవ్వన మధ్యంనుంచి చివరివరకు ప్రకృతి పరిశీలకుడుగానో, విశ్వశక్తికి ఉపాసకుడుగానో నిలిచిపోతాడు. అటువంటి ప్రేమకు

గాని, ఇటువంటి ఆరాధనకుగాని అర్థంగా, ఆధారంగా, నిలబడి అందుకునే వారి అదృష్టం అనుపమానం.

ఒకసారెప్పుడో ప్రేమను గురించి అడిగిన పార్వతికి సరిగ్గా ఇటువంటి సమాధానమే చెప్పింది కవిత. నాలుగు రోజుల కొక్కసారైనా పార్వతి వింత ప్రశ్నలకు జవాబులు చెప్పే గడ్డు సమస్య తప్పడం లేదు కవితకు.

"కవితా! కవితా! నువ్వు లేకుండా నేను బ్రతకలేను" అంది పార్వతి ఉన్నట్టుండి.

"ఇంకా ఉన్నాను కదా!" కవిత సిద్ధంగా ఉన్నట్టు జవాబు చెప్పింది.

"అబ్బ! నా తప్పులే ఎంచుతావ్. నిజంగానే నువ్వు దగ్గర లేకుండా నేను బ్రతకలేను, కవితా!"

"తప్పు! బ్రతకలేనూ అనుకో కూడదు"

"ఎందు కనకూడదు? నా యిష్టం!"

"సరే. ఆ మాట నా దగ్గరనకుండా నీ ఆత్మీయుల దగ్గర అను - అప్పుడు తెలుస్తుంది."

"నాకు ఆత్మీయు లెవరున్నారు? ఈ ప్రపంచంలో నువ్వొక తెవే."

"ఆగాగు... మీ అత్త మామ లేమయ్యారు? ఇంకా ఎవరెవరో ఉన్నారన్నావే?

"వాళ్ళంతా వేరు. నిన్నుమించిన ఆత్మీయురాలు..." పార్వతిమాట సగంలోనే ఆగిపోయింది.

"ముఖ్యంగా మీ ఆయన సంగతో? అది చెప్పు" అంది కవిత సూటిగానే.

"ఆయనా లేదు ఈయనా లేదు—అందరూ ఒకటే. ఎవర్నీ నమ్మలేక పోతున్నాను నిన్ను తప్ప."

"అయితే అసలు లోపం నీలో ఉంది!" కవిత అనేసింది పోల్చినట్టు.

పార్వతి పౌరుషం రెచ్చింది. "అదేంకాదు. రాజు నన్ను ద్వేషిస్తారు. అభిమానం కొద్దిగా నన్నా లేనిచోట ఆత్మీయత ఎక్కడినుంచి రాగలదో ఊహించు. రచయిత్రివి కదా?"

"ద్వేషంలో అంతర్లీనమై ప్రేమ ఉంటుంది పారూ! దగ్గరాతున్న ప్రేమని సహించలేక పోవడం తప్ప ద్వేషానికి ఇంకొక నిర్వచనం లేదు. ద్వేషాన్ని ప్రేమామృతంతో చల్లబరుస్తుంటే, పెరుగు చిలికితే వెన్న వచ్చినట్టు శాంతి సౌఖ్యాలు దొరుకుతాయి." ఉపన్యాస ధోరణిలో చెప్పింది కవిత.

"నువ్వేలా చెప్పినాసరే - ద్వేషంకూడా నీకు ప్రేమలా తోస్తుందేమో గాని, నాకు - ఊఁహూ-అలా అనిపించదు. ఆ ప్రేమామృతాన్ని నువ్వే నాకిస్తే చాలు!"

"అంతే! ఇక ఇప్పుడు నువ్వర్థం చేసుకోలేవు" అన్నది కవిత వాదానికి ముగింపుగా.

# 35

ఒకా నొకరోజు పార్వతిని చూచి దిగ్భ్రమించి పోయాడు రాజు 'పార్వతేనా?' అనుకుని నమ్మలేకపోయాడు, బాహ్యరూపంచూసి. హృదయ పరిణామాల్లాగ పైపై మార్పులు కంటికి కనిపించనివి కావు. పార్వతి దేవతలా కనిపించింది.

అతను స్త్రీలో ఒకవిధమైన నిరాడంబరత్వాన్ని కోరతాడు. ఆ విధంగా కనిపించిన వాళ్ళంతా అతనికి దేవతలే. కవిత అంటే అందుకే మంచి అభిప్రాయం ఏర్పడ్డది అతని మనసులో. అంతేకాని కొందరు ఎంత నిరపేక్షకులుగా, ఎంత నిర్లిప్తులుగా కనిపిస్తారో లోపల అంత విషాన్ని దాచుకుంటారన్న సంగతీ, అటువంటి వాటికీ మనిషి బాహ్య ఆడంబరాలకూ సంబంధం అంతగా ఉండదన్న సంగతీ అతనికి తెలుసునో, తెలియదో? రాజు ఇల్లాంటి విషయాల్లో అమాయకుడు అయినా అంతకుమించి పట్టుదల, మొండితనం ఉన్నవాడు అవి చూసి అందరూ హడలిపోవలసిందే.

ఆలోచనా పరుడౌతున్న రాజుకు పార్వతి అలా కనిపించడం ఇష్టమే అయినా ఎందుకో కష్టం కలిగించింది. చిత్రమైన బాధ మొదలైంది. తనవల్లే పార్వతి ఇలా తన అభిరుచులన్నీ చంపుకొని విరక్తురాలై పోతూందేమోనని బాధపడ్డాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ రాజు కిల్లాటి అ స్తవ్య స్తమైన వేదన వదలటం లేదు. పార్వతి జీవితం నిరాశ పెంచుకుంటున్న దన్న ఆందోళనే పట్టుకుంది అతన్ని. తిరిగి ఎలా ఆమెలో ఉత్తేజాన్ని పుట్టించాలనే ఆలోచన లీలా మాత్రంగా మసలు తున్నది అంతరాంతరాల్లో.

తప్పుకుని తప్పుకుని చివరికి ఒకరోజు తెగించాడు రాజు. ఏదో చెప్పాలని నిశ్చయించుకున్నాడు

నెలలూ, ఆ పైన వారాలూ గడిచాయి. పార్వతితో మాట్లాడటానికి అతను కోరినటువంటి అవకాశం దొరక్క నిశ్చయం నిశ్చయంగానే ఉండిపోయింది.

రాజుకు తననెవరో నిలవనియ్యన ట్లనిపిస్తున్నది.

అతను గుర్తించాడు, పార్వతిలో దైవభక్తి ఎక్కు వవుతున్నదని. నిజానికి అతను గుర్తించలేదు—ఆ అమ్మాయి లోని సర్వ ప్రాణాలు ఎవర్ని జపిస్తుంటాయో, ఆమె ఎవర్ని దైవంకన్నా ఎక్కువగా పూజించి ఆరాధిస్తుందో. కాని 'పార్వతికి కవిత అంటే ప్రాణం' అన్న సంగతి తెలుసు.

ఒకసారి కవిత వస్తే అతనికి మంచినీళ్ళు అందిస్తున్న దంతా ఆ నీళ్ళన్నీ తెల్లని బట్టలమీదికి ఒంపేసి మరీ పోయింది తిరిగి చూడకుండా.

చూస్తుండగానే కత్తిపీటమీద పడవలసిన ప్రమాదం తప్పింది ఒకనాడు.

మరొకరోజు వీధిలో కవిత గొంతు వినిపించి నట్ట యింది పార్వతికి. అంతే! తను మేడ మీదున్నది. మెట్లు

దిగాలి అన్న విషయం పూర్తిగా మరిచిపోయింది. ఆ రోజు మెట్లదగ్గర తను చెయ్యి పట్టుకోనట్టయితే జారిపడేదనే రాజు అనుమానం.

పార్వతికి స్వంతాన్ని గురించిన ఆలోచన తగ్గిపోయింది క్రమంగా. నిరంతర నామస్మరణ – కవిత! కవిత!

రాజు ఇలా సతమత మాతున్నాడు. రామనాథంగారు వచ్చారు రాఘవపూర్ నుంచి. కొడుకుదగ్గర గడిపిన నాలుగు రోజులూ ఆయనకు తృప్తినిచ్చాయి. 'ఫర్వాలేదు. ఈ కుర్రకుంకలు కాస్తంత బాధ్యతనెరిగి నడుచుకుంటున్నారు. ఈ సంగతి జానకికి చెప్తాను' అని అనుకున్నారు. రాజును పిలిచి అవసరమున్నా లేకపోయినా ఏవో సూక్తులు బోధించి వెళ్ళేరు.

ఆయన వెళ్ళినతర్వాత ఒకరోజు పొద్దున్న అయిదు గంటలకు నిద్రలేచింది పార్వతి. స్నానం చేసింది. కొత్త అలవాటు ననుసరించి గీత చదువుకున్నది. ఆ పైన ఏదో పని ఉండి మేడమీద గదిలోకి వెళ్ళి రాజును చూసి ఆశ్చర్యపోయింది.

అత నంత వేగంగా నిద్రలేవడు. "పార్వతీ!" అన్నాడు రాజు. ఆ పిలుపులోని ధ్వని కొత్తగా ఉంది.

"ఏం?" అన్నది పార్వతి సంభ్రమంగా.

"నాన్నగారు నీకు చెప్పలేదా, సెలవుకి అక్కడికి రమ్మని!"

"నాతోనూ అన్నాడు మామయ్య. కానీ మీరు వెళ్ళండి. నేను రాను."

"క్రిందటి వేసవికీ వెళ్ళలేదు. ఈ పదిరోజుల సెలవుల్లో నైనా వెళ్ళకపోతే అమ్మ కోప్పడుతుందేమో?"

"అందుకే మీరు వెళ్ళండి తప్పకుండా. నా కిక్కడ పనులున్నాయి." అతన్ని చూడకుండానే చిన్నపిల్లవాడికి చెప్పి నట్టు చెప్పింది.

కవిత దగ్గర చిన్నపిల్లలా అయిపోయే పార్వతి రాజు దగ్గర పెద్దదానిలా మాట్లాడుతుంది.

"నువ్వు ఒక్కదానివే ఉంటావా ఇక్కడ?" ఆశ్చర్యం ప్రకటించాడు.

"మరేం భయంలేదు. అంతగా భయమైతే కవిత దగ్గరి కెళ్ళిపోతాను. మీరు వెళ్ళండి - లేకపోతే ఎండలో ఎండిపోయారో, వానలో తడిసిపోయారో అని అత్తయ్య బెంగ పెట్టుకుంటుంది." చివరను నవ్వు దాచుకో లేక పోయింది.

"ఎందుకు నవ్వడం? ఉద్యోగం లేదుగా - ఇక్కడేం పనులు?"

పార్వతి మాట్లాడలేదు. వెళ్ళిపోబోయే పార్వతిని ఆగ మన్నాడు.

"ఉద్యోగం చెయ్యకూడదా పార్వతీ!" అదే అతడు ముఖ్యంగా అడగాలనుకున్న ప్రశ్న.

నవ్వి, "నా ఉద్యోగంకోసం ఎవరూ శ్రమ పడక్కర్లేదు. ఉద్యోగం చేసి సంపాదించిన పొగడ్తలు భరించినంత వరకు చాలు!" అంది ఇక అక్కడ ఆగకుండా.

~ ~ ~

కాలేజీకి సెలవు లిచ్చారు. రాజు ఊరెళ్ళే ప్రయత్నం మానుకున్నాడు. పార్వతి కారణమేమని అడగలేదు. ఆమెకు ఇరవై నాలుగు గంటలూ కవితతోనే లోకం అయిపోతూంది.

రాజు ప్రయాణం మాని ఉండిపోయాడే కాని అతనికి ప్రతిక్షణం లోటుగాను, మందంగాను గడుస్తున్నది. పార్వతైనా, ఎప్పుడూ కవితంటూ ఇంట్లో ని: వకపోవడం చూస్తే ఒళ్ళు మండేది అప్పుడప్పుడు. ఎదుట పడితే కోపం తీర్చుకోవాలనే అనుకునేవాడు.

తీరా సమయం చిక్కేసరికి ఏమనాలో తెలీక మాటలు వెదుక్కునేంత పనయ్యేది.

పార్వతి అన్నివిషయాల్లో కొత్తగా కనిపిస్తున్న దతనికి. మొహంలో స్వల్పంగా వ్యక్తమయ్యే హుందాతనంతో, కొత్తగా తెచ్చి పెట్టుకున్న మృదుత్వంతో, సహజంగా ఉన్న సూటిదనంతో తననొక ముల్లులా తీసి పారేసి నవ్వుతూ మాట్లాడే పార్వతిని ఎలా కోప్పడాలో, ఆమెపైని ఎలా కసి తీర్చుకోవాలో ఇన్నాళ్ళకు రాజుకు సమస్యగ మారింది.

కాకినాడ రోడ్లన్నీ తిరిగాడు. అన్నిరకాల ఆలోచనలతో యుద్ధంచేస్తూ తిరగడమే చేతనైంది.

ఒక సందులో ప్రిన్సిపాల్‌గారు కనిపించి అతన్ని బజారుదాకా తీసుకుపోయారు.

“రావోయ్! మా అమ్మాయికోసం చీరెలు కొనాలి. అలా వెళ్దాం” అంటూనే ఆయన ఒక పెద్ద బట్టలషాపులోకి దారి తీశాడు. వెళ్ళకపోతే బావుండదని రాజూ వెళ్ళేడు ఆయనవెంట లోపలికి.

తీరా లోపలికి వెళ్ళాక, “నువ్వేమన్నా తీసుకుంటావా? మంచి సూటింగ్సూ, శారీస్ ఉన్నాయి” అని ఆయనంటే బదులేం చెప్పాలో తోచలేదు. అప్పుడే అతని దృష్టి ఒక అందమైన చీరపై పడింది. ఒకప్పుడు అటువంటి చీరలంటే చాలా ఇష్టం పార్వతికి. తీసుకుంటే బాగుండునని పించింది. యాంత్రికంగా తీసుకున్నాడు.

అది ఆ అమ్మాయి కెలా ఇవ్వాలో ఊహించుకునే సరికి చిరుచెమటలు పట్టిపోయాయి. ఎందుకనో తను మరీ వెర్రివాడై పోతున్నాడు అని మనసు కనిపించింది. ‘ఆమె ఆడది - ఏం చెయ్యగలదు తనదగ్గర? నిస్సారంగా మాట్లాడితే తను ఊరుకునే మనిషేనా? ఆ సంగతి తెలీదూ ఆవిడ గారికి!’

ఆ రోజు కవిత వచ్చింది. మర్నాడు పార్వతి దొరక లేదు. రెండు మూడు రోజులు రాజు మొహం చూసే తీరిక కూడా చిక్కలేదు పార్వతికి.

మరో రోజు పార్వతి కవిత కొత్తనవల ఒకటి చదవడం ప్రారంభిస్తూ రాజు పిలుపువిని తల ఎత్తిచూసి అక్కడే పుస్తకాన్ని బల్లమీాద పెట్టి లేచింది.

రాజు కుర్చీలో కూలబడ్డాడు. అతనిదగ్గరికెళ్ళి నిలబడి, "ఎందుకండీ ?" అంది వింతగా అతన్ని పరికిస్తూ.

"ఇది చూడు !" అన్నాడు చేతిలోని పాకెట్టును అతి సామాన్య ధోరణిలో చూపిస్తూ.

ఆమె దాన్ని అందుకున్నాక ఆమె మొహాన్ని చూస్తూ కూర్చున్నాడు రాజు కుర్చీలో వెనక్కి వాలి.

"ఏమిటిది ?" అంది విప్పుతూ. ఆమెను అతని మారేమన స్తత్వం ఆశ్చర్య పెడుతూంది. తన తండ్రీ, తన సరస్వతీ పోయిన దగ్గర్నుంచి తనపట్ల ఇలా ప్రవర్తిస్తున్నాడు. అది చిత్ర మనిపించింది. కాని కొన్ని నెలలనుంచి అతడి ప్రవర్తన మరీ విచిత్రంగా మారుతున్నది. ఈ ధోరణి తనకు ఏమంత బాగా లేదు. అయినా ఒకొక్కసారి తెలియని గర్వం ఆవహిస్తుంది.

"చీరా ? దేనికిది ?" అంది గంభీరంగా.

"నేను కట్టుకుంటాను. బావుందా ?" అదోకలా నవ్వాడు రాజు.

పార్వతి నవ్వలేదు.

"ప్చ ! ఈ కలర్ కవిత కిష్టంలేదు" అంది.

"కవిత కిష్టంలేకపోతే ఇప్పుడెవరి క్కావాలి ? నీ కిష్టం కాదా ?"

"మా కవిత కిష్టంలేనివి నాకూ ఇష్టం ఉండవు" అంది ఎటో చూస్తూ.

"అదంతా నీ భ్రమే! మొదట కవిత నీకు తెలుసా?"

"పోనీ, భ్రమే అయినా నిజమనుకుంటాను. ముం దీ చీర వాపసిచ్చి-రెండు సాదాచీరలు తీసుకుంటే పనికొస్తాయి." వెళ్ళబోయింది పార్వతి.

"పార్వతీ! నువ్వీ చీరకట్టుకోవాలి" అన్నాడు రాజు. అది ఆజ్ఞా కాదు, అర్థింపూ కాదు. అతని మొహంలో ఏ భావం కనిపించలేదు పార్వతికి.

ఆగి, "ఎందుకని?" అంది ఆతన్నే చూస్తూ.

"ఎంతో శ్రమపడి తెచ్చాను గనుక."

"బజార్లో కనిపిస్తే తేవడంకూడా శ్రమేనా? అయినా నాకు నచ్చలేదు మరి."

"నాకు నచ్చింది. అందుకే కట్టుకోమని కోరడం."

"అదేదో శాస్త్రం చెప్పినట్టుంది. నేనేం పతివ్రతని కానే, పతికోసం పాట్లు పడడానికి? పైగా నాకు పౌరు కూడాను" అంది నవ్వుతూ.

"ఎలా నా మాట వినవో చూడమంటావా?" అన్నాడు ఈ సారి రాజు కినిగానే.

"నా సంగతి మీకు తెలుసు. ఆ భగవంతుడు దిగినా సరే - నా కిష్టంలేని పనిని నా చేత ఎవరూ చేయించలేరు" అంది పంతంగా నవ్వి వెళ్ళిపోతూ

రాజుకు కోపం రాలేదు కాని, ఒకలాంటి బాధ కలి

గింది ఆమె అంత తేలిగ్గా చూస్తుంటే తనెలా నిగ్రహిం చుకో గలుగుతున్నాడో అతనికే అర్థంకావడం లేదు ఈ మధ్య.

## 36

కిటికీలోనుంచి చల్లని గాలులు వచ్చి పార్వతి ముంగు రుల్ని మృదువుగా తాకుతున్నాయి.

టేబిల్ ముందు కూచొని ఏదో వ్రాస్తూ మధ్య మధ్య కిటికిలోనుంచి వినీలాకాశంలోని మేఘ సముదాయాన్ని భావావేగంతో చూస్తున్నది.

హఠాత్తుగా వచ్చి కళ్ళు మూసేశా రెవరో.

చేతుల స్పర్శవల్ల కవిత కాదని తెలుసుకుంది. కాని ఎవరో గుర్తించలేక పోయింది పార్వతి. ఎందుకంటే ఇద్దరు ముగ్గురు స్నేహితురాళ్ళు ఏర్పడ్డారు అందులో ఎవరో?

చేతులు వదిలేసి, "ఇంతమాత్రం గుర్తించలేని స్నేహితురాల్ని సంపాదించుకున్నాను." అంది బుంగమూతి పెట్టి సరోజ

"సరూ!" అని హడావుడి పడిపోయింది పార్వతి. "ఎప్పుడొచ్చావూ? ఏమిటీ, డాక్టర్ సరోజాదేవీ!" అంటూ

సరోజను సోఫాలో కూలవేసి రాజుకు చెప్పడానికి పరు గెత్తింది.

"ఇదేం అవస్థ!" అంటూ కూచుని దిక్కులుచూచింది సరోజ.

"రండి. మీ సరోజ వచ్చింది."

రాజు తెల్లబోయాడు.

"నువ్విలా రా! ఒక సంగతి అడగాలి" అన్నాడు.

"ఏమిటి? అవతల అదొక్కతే కూచుంది."

"ముందు కూచుందూ నువ్వు" కుర్చీలోకి తోశాడు ఆవిణ్ని.

"చచ్చిపోయాను. ఏమిటా సంగతి?" అంది కూలబడి.

"ఇందాక నువ్వు 'మీసరోజ' అని అన్నావు. దాని అర్థమేమిటి?" గమ్మత్తుగా అడిగాడు.

కుర్చీలోంచి గబుక్కున లేచింది. "ఇదడగటానికేనా? ఏమిటో అనుకున్నా. అయినా ఈ సంగతి నన్నడిగేకంటే మీ దగ్గరున్న సరోజ ఫోటో నడిగితే సరి!" సుతారంగా నవ్వి సరోజకోసం తొందరపడుతూ వెళ్ళిపోయింది మరీ తెల్లబోయాడు రాజు.

సరోజ విసుక్కుంది పార్వతి ఎంతకూ రాక. "బాగుంది నీ అతిథి మర్యాద" అంది రాగానే.

"క్షమించండి, డాక్టరుగారూ! ఎక్కడికన్నా వెళ్తే గంటలకొద్ది రాకపోవడం ఒకరోగం - తమరు దీని కేదేనా మందివ్వాలి!"

"అలాగే ఇస్తానుకాని, ఎక్కడికి పారిపోయావ్ నేను రాగానే!"

"రాజుతో చెప్పేను, ఆయనగారి ప్రియ మిత్రురాలొచ్చిన వార్త."

"అంత సఖ్యత ఏడ్చిందేమిటి మీ ఇద్దరిమధ్యా!"

"ఈమధ్యే ఏడుస్తున్నదిలే. నిజంగా కోపం వచ్చిందా సరూ ?"

"నాకెందు కోపం! నువ్వొక ఉత్తరం ముక్క వ్రాయకపోతే మాకు వేరే గతిలేదనుకోకు."

"అదేనా కోపం! నేనేం చెయ్యను? ఇప్పుడేమన్నా తీరిక దొరికితే ఉత్తరాలు వ్రాయా లనిపించదు. కథలో, వ్యాసాలో వ్రాసుకోవాల నిపిస్తుంది."

"అదెప్పటినుంచి! పోనీ, ఆ సంగతైనా వ్రాసేవు కావు? నా స్నేహితురాలేనని ఎంత ఇదిగా చెప్పుకుందును అందరితో." అంది సరు కొత్తగా స్నేహితురాల్ని చూస్తూ.

"ఆహా! ఈ మహా రచయిత్రిని గురించి నువ్వు లోకానికి చాట నక్కరలేదు."

"పోనీ, పత్రికల్లో ఏమన్నా వచ్చాయా?"

"రెండు వ్యాసాలూ, అయిదు కథలూ పడినట్టున్నాయి. అవి మా కవిత కొక లెక్కే కాదు."

"కవిత ఎవరూ ?"

"ఒక రచయిత్రి. స్నేహితురాలని తప్ప మరేమనీ చెప్పలేను. ఆమె వల్లే..."

పార్వతిని మాట పూర్తి చెయ్యనివ్వలేదు, సరోజ. "అదా సంగతి! అవును మరి. అంత గొప్ప స్నేహితురాల్ని చూసుకొనే నన్ను మరిచిపోవడం."

"ఫో! నీ కెప్పుడూ వేళాకోళాలే, తగువులే." అంది పార్వతి.

"నీ కింత భారమౌతానని తెలిస్తే మా నాన్నగారు కొత్తగా కొన్న కారులోనే వచ్చేదాన్ని తిరిగి వెంటనే వెళ్ళిపోవడానికి."

"అలా కోపంగా మింగేసేట్టు చూడటం మాని ఓ సారి నవ్వవే సరూ! ఎన్నాళ్ళయిందో నీ నవ్వు చూసి!"

సరోజకు నవ్వు వచ్చింది నిజంగానే.

అప్పుడే వచ్చాడు రాజు. "నమస్కారం రాజుగారూ! మీ రాణీగారి అతిథి సత్కారానికి మొహం తిరిగిపోతూంది." అంది సరు నమస్కారంతో అభినయించి నవ్వుతూ. పార్వతి నవ్వింది

రాజు నవ్వలేదు మౌనంగా ప్రయత్నించి నవ్వాడు. "ఇప్పుడు జీవితం ఎలా అని పిస్తోంది మహాశయా?" అంది సరోజ పార్వతికి తెలీకుండా అతన్ని పరీక్షిస్తూ.

"నువ్వా. ఈ యక్షిణీ నాకు జీవితంమీదే రోత పుట్టించేశారు. ఇంకేమనిపిస్తుంది" అన్నాడు రాజు పార్వతిని చూస్తూ.

పార్వతి కాఫీలు తెస్తానంటూ లేచి వాళ్ళకు అడ్డుగా ఉండకూడదనే వెళ్ళిపోయింది.

సరోజ ప్రశ్నించింది: "రాజూ! అప్పుడు పిచ్చివాడిలా ఆత్మహత్య చేసుకుంటానని జడిపించావు. గుర్తుందా? అయి దేళ్ళు ఆగమన్నాను. ఇప్పుడు ఎలా వుంది? బ్రతకాల నుందా?"

"ఇంకా సంవత్సరానికి పైగా ఉంది గడువు. అప్పుడే చెప్తాను." నవ్వాడు రాజు సరూ కళ్ళల్లోకి చూసి.

"పార్వతిలో మార్పు కనుపిస్తూంది" అన్నది సరోజ. "నువ్వేమైనా చెప్పు - పార్వతి ముమ్మాటికీ మంచిపిల్ల" అంది మళ్ళీ అతను మాట్లాడక పోవడంవల్ల.

"కాదన్న వారెవరు?" అన్నాడు.

"మునుపు కాదనే వాడివి."

"ఔను." అని తేలిగ్గా నవ్వేసి, "ఒకరోజు కవిత పార్వతిని గురించి ఎవరితోనో చెప్తుంటే విని నమ్మ గలిగాను, నువ్వు చెప్తే ఎవడిక్కావాలి?" అన్నాడు కొంటెగా.

సరోజ మొహాన్ని కందగడ్డలా చేసుకుంది.

రెండు రోజులు విహాయసంలో విహరించే రాజహంస లాగ పార్వతి మనసు సంతోషంతో రెక్కలు విప్పుకుంది. సరోజతో వాదోపవాదాలతోనే రెప్పపాటులో కాలం జరిగి పోయిన ట్లనిపించింది. సరోజ వెళ్ళిపోయేరోజు కవితకు పరి చయం చేసింది.

"నా స్నేహితురాలు. డాక్టరై కొత్తగా ప్రాక్టీసు పెట్టింది. ఎవ్వర్ మిస్ సరోజాదేవి." చిరునవ్వుతో చెప్పింది.

"పొరపాటు – నాకూ ఇప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవా లని పిస్తోంది" అన్నది సరోజ నవ్వుతూ.

"అంతేలెండి ఎప్పటికైనా. మా పార్వతి మీా గురించి చాలాసార్లు చెప్పింది. అందువల్ల మీారు మరుపురారు నాకూ-డా" అంది కవిత.

పార్వతి ఉనికి మరిచి స్వప్నంలో విహరిస్తున్నది. కవిత తనను ప్రేమతో సంబోధించినప్పుడంతా హృదయ యానికి ఎందుకో అనుభూతమైన దివ్యత్వం సంప్రాప్తించిన ట్లుంటుంది. ఆమె 'మా పార్వతి' అని వేరొకరితో చెప్తుంటే – వినగలిగితే చాలు – శోభా దరిద్రాణంగా ఉన్న వనాంతరాన చిటికెలో కోటి మల్లెతీవెలు కొల్లలై పుష్పించినట్టు లోపించిన కళలు ప్రభవించడానికి నాంది జరుగుతుంది పార్వతి విషయంలో. కాంతికి దూరమైన హృదయ కుటీరంలోకి చిలిపి వెలుగులు ప్రసరించితే ఆ అందం వర్ణనకు అందదు. పార్వతి మానసిక ఆనందం అటు వంటిది.

## 37

పుష్యమాసపు ప్రారంభ దివసాలు. అతి శీతలంగా వీచే గాలులు శరీరపు జడత్వాన్ని వదిలించడమేకాదు; అంత

ర్యపు లోతుల్లోకి ప్రవేశించి అక్కడ స్మృతుల శ్రుతులను స్పృశించి పలికించి భావాతీతమైన అనుభూతుల్ని శరీరానికి, మేధకు కలిగిస్తాయి. ప్రపంచమే జలదరించి పువ్వులు రాల్చిన ట్లుటుంది ప్రకృతికాంతితోపాటు అవర్ణనీ యానందానికి అందరూ నోచుకున్న రోజులు.

పార్వతికి ఇరవై సంవత్సరాల పైన వయసున్నా-ప్రపంచం, కాలచక్రం, ఋతుచక్రం, సృష్టితారతమ్యాలు, సౌభాగ్య దౌర్భాగ్యాలు, వ్యసన నిర్వ్యసనాలు, జీవన్మర ణాలు, చిత్రంగా కనిపిస్తున్నాయి. లోక పరివృతంగా ఉన్న అందాలన్నీ నూత్నంగా గోచరిస్తున్నాయి. పార్వతి ఏ ఆనం దాన్ని అందునుంచి అనుభవించినా, ఆశించినా, ఆశ్చర్యం లేదు. తనకు తెలియని శక్తిని అన్వేషించడానికి జీవితం ఒక రహదారి అయింది. ఈ మార్గంలో ప్రయాణించగా సూక్ష్మంలో పరమంగాను, పరమంలో సూక్ష్మంగాను ఉన్న అజ్ఞాతశక్తి కొంతయినా జ్ఞాతం కాకపోదు. పార్వతికి ఇట్లాంటి విషయాల్లో కొన్ని దృఢమైన నమ్మకాలు ఉన్నాయి.

సంసార జీవితంపట్ల క్రమేణా మంచి అభిప్రాయాలు కొద్ది కొద్దిగా ఏర్పడుతున్నాయి. ఒక మాదిరి ఉత్సాహం గానూ ఉంటున్నది

అప్పుడప్పుడు నిరుత్సాహంకూడా హృదయాన్ని ఆవ రించు కుంటున్నది.

అభిలాష కలిగినప్పుడంతా కలుసుకోకుండా అని వార్యంగా కవితకు కాస్త దూరం కావలసి వచ్చింది.

కాకినాడ నుంచి వెలువడే 'కవిత' అనే పక్ష పత్రికకు సహాయ సంపాదకురాలైంది కవిత, ఆ పత్రిక అధినేతల కోరికపై.

కవిత సంగతి వదిలి పార్వతికిమాత్రం చిరాకు పుట్టింది. ఆఫీసుకు వెళ్ళి కలుసుకున్నా, మాట్లాడటానికి తీరికగా నిలబడటం లేదు కవిత.

పార్వతి విసుగూ, నిరాశా గమనించి, ఒక ఉదయం పదిగంటల సమీపాన వచ్చిపడ్డది కవిత హఠాత్తుగా.

అడుగులో అడుగేస్తూ వచ్చిన ఆమెను చూడలేదు పార్వతి. మంచంకోసకు వాలి ఇంటి వాసాలు రెప్ప వాల్చకుండా చూస్తున్నది. పక్కన పుస్తకాలు పడి ఉన్నాయి.

కవిత చూచింది. శరత్ 'భైరవి,' టాల్‌స్టాయ్ 'రిసరెక్షన్,' తెలుగు పత్రికలు, మరొకవైపు మామ్ కథలు, తన నవలలు మొత్తానికి చిందర వందరగా ఉంది ఆ భాగం.

కవిత పొడిదగ్గు వినిపించగానే కంగారు పడుతూ లేచి కూచుంది పార్వతి. తర్వాత కవితను చూస్తూ నవ్వేసింది.

"ఏమిటి విశేషం? అంతులేని ఆలోచ నేమిటో అమ్మాయిగారికి?" కూచుంటూ అన్నది కవిత.

"నువ్వు పక్కను లేకపోతే ఇక ఆలోచనలే తోడు నాకు. అన్నట్టు నీ 'అగాధం' నవల నిన్ననే పూర్తి చేశాను."

"ఎలా వుంది?" కవిత మామూలుగానే ప్రశ్నించింది.

"ఏడ్చినట్టుందంటే ఏం చేస్తావూ?" అంది పార్వతి నవ్వుతూ.

కొద్దిసేపు ఎటో చూసి, "అభిప్రాయాల్ని తెలుసుకొనే వరకే మా రచయితల పని. అందరి అభిప్రాయాల కనుగుణంగా రచనా విధానాన్ని, పద్ధతిని మార్చుకోవాలని ఎక్కడా సిద్ధాంతీకరింప బడిలేదు. కానై తే స్వేచ్ఛావాహినిగా సాగిపోయే కవన ప్రవాహాన్ని అదుపులోకి తెచ్చుకోవటానికి క్రమ క్రమంగా ప్రయత్నిస్తాం.

"ఆ మధ్య నేను ఒక నవల వ్రాశాను. నువ్వూ చదివావేమో? అందులో అన్ని పాత్రలు దరిద్రజీవితానికి ప్రతిబింబాలు. అలా వ్రాసిన నవల అదొక్కటే. తక్కిన వేవీ అలా ఉండవు. అందుకనే ఆ పుస్తకం చదివిన ఒక పాఠకురాలు కోప్పడుతూ వ్రాసింది — ఇంకేమీ గొప్ప ఇతివృత్తం మీకు దొరకలేదా? అల్లాంటి హీనులగురించి వ్రాస్తే మీకేం జరుగుతుంది? అంటూ. అది చూస్తే నాకు నవ్వొచ్చింది. ఆవిడ ఉనికి ఎక్కడో తెలీలేదు కాని ఒక ప్రశ్న వేయాలని పించింది. అసలు ప్రాకృతిక సృష్టికి ప్రతి సృష్టి చేసే ప్రతిభ రచయిత కున్నదని ఒక పేరు. సృష్టికర్తలన్నమాట అటుంచినా ఒకటి చెప్పగలను. భగవానుడు వాళ్ళు నీచులు, పాపకర్ములు అని, వాళ్ళని వదిలి పెడతాడా? ఇదీ అంతే. భగవంతుడు సృష్టిస్తున్నాడు, మేం వ్రాస్తున్నాం, చదివిన వాళ్ళు చదువుకున్నారు. ఇందులో సూక్ష్మ పరిశీలనా దృష్టితో అర్థం చేసుకునే వాళ్ళంటూ

ఒక తెగ ఉన్నారు సాహిత్య పరంగా చెప్పే దేనికైనా సర్వజనీనతను ఆధారంగా చేసుకున్నప్పుడు ఉన్నత సాహిత్య సృష్టికి, అది సాధన మవుతుందని చెప్పవచ్చు" అంది గంభీరంగా,

"అబ్బ! ఎంత చెప్పావు కవితా! నువ్వు వ్రాసిన దాన్ని నేను మెచ్చుకోక పోవడం ఉంటుందా?" అంది పార్వతి.

అప్పుడే రాజు లోపలికి రాబోయి కవితను చూసి వెనక్కు వెళ్లాడు.

ప్రేయసీ ప్రియుల్లాగ వాలి ఒకరూ, సోలి ఒకరూ అవ్యాజ ప్రేమతో మాట్లాడుకుంటున్న దృశ్యం కళ్ళకు కట్టింది.

పార్వతిలో ఇంత హృదయపూర్వకంగా ప్రేమించే తత్వమున్నదని ఇదివరకు అతనికి తెలీదు. అదే అను కున్నాడు.

"కవితా! ఎప్పుడూ నన్నడగటమే కాని నువ్వు ఏ యే రచయితల రచనల నెక్కువగా అభిమానిస్తావో ఎన్నడూ నాకు చెప్పనే లేదు." అంది పార్వతి.

"ఫిలాసఫిక్ గా ఉన్న రచనలు నన్నెక్కువ ఆకర్షిస్తాయి. ముఖ్యంగా రచన ప్రపంచ స్వరూపాన్ని రంగు టద్దాల్లో చూపించినా, భూతద్దంలో చూపినా హృదయాన్ని స్పందింప చేయాలి. ప్రతి ఒక్కరిచేత ఆలోచింప జేయాలి. అది ముఖ్యం, ముమ్మాటికీ"అన్నది కవిత మూడు ముక్కల్లో.

"ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది, కవితా, ఇలా పుట్టటానికి బదులు ఏ శరత్ బాబు నవలగానో పుట్టి ఉంటే బాగుండునని. రచనలో కూడా ప్రాణం ఉంటుందంటావు కదూ?"

"నిజమే. ప్రతి నవల అమోఘ హస్తంతో వ్రాశారు శరత్ బాబు!"

"రాధాకృష్ణ కూడా సరిగ్గా ఇలాగే అనేవాడు నేనే మొదట్లో ఒప్పుకునే దాన్ని కాను."

హఠాత్తుగా పార్వతి దగ్గర కొత్త వ్యక్తి పేరు విని ఎవరా అతనని తబ్బిబ్బయింది కవిత.

"అన్నట్టు నీ కతని సంగతి తెలీదు కదూ? ఒకరోజు చెప్పబోతుంటే మరేవో మాటల్లోకి దించావు. ప్రప్రథమంగా నిన్ను నాకు పరిచయం చేసేడు అతనే."

రాధాకృష్ణ గురించి చాలా చెప్పింది పార్వతి. అతని నిగ్రహం, ఆత్మవిశ్వాసం తెలివితేటలు ఒకసారి స్మరించింది కవిత దగ్గర.

"మొన్ననే అతని ఉత్తరం వచ్చింది. తను పెళ్ళి చేసుకోబోతున్నట్టు. పెళ్ళికి ఇంకా రెండు నెలల వ్యవధి ఉందని వ్రాశాడు. 'వితంతువుని చేసుకునే అవకాశం కుదరలేదు, పార్వతీ! ఒక బీద కుటుంబంలోని అమ్మాయిని వివాహం చేసుకుంటున్నాను' అంటూ తన అభిలాష నెరవేరనందుకు నైరాశ్యంతో వ్రాశాడు."

కవిత నిట్టూర్చి, "తీరా ఆచరణలో పెట్టే సమయానికి ఆదర్శాలు ఇలాగే తగలబడిపోతుంటాయి. అదేమోచిత్రం!" అంది ఇంకేమీ అనలేక.

"మా అక్కని భార్యగా పొందగలిగితే అతను మరీ అదృష్టవంతుడవును" అంది పార్వతి.

"ఏం? మీఅక్క అంత గొప్ప వ్యక్తా?" అని ప్రశ్నించింది కవిత.

"సౌందర్యవతి, అంతేకాక సౌజన్యవతికూడా. మా సరస్వతిని చూచి చాలా మంది అసూయపడేవారు." స్మృతి పథంలో కనిపించే సరస్వతిని చూస్తూ అరమోడ్పు కళ్ళతో అంది.

కవిత పరధ్యానంగా ఉందేమో వినలేదు శ్రావణ మేఘాల్లాటి కలహ సంఘటనలు ఎంతవేగంగా వస్తాయో ఊహించడం కష్టం.

"ద్వేషం. అసూయ లేశమాత్రం కూడా లేని వ్యక్తి ఎక్కడా ఉండదనే అనుకుండాను" అంది పార్వతి. విననట్టు ఊరుకుంది కవిత.

"నీ కెవరి మీదనైనా అసూయ కలిగిందా కవితా, ఎప్పుడైనా?"

వెంటనే తల ఎత్తి "నీకు ఉందేమిటి అసూయ ఎవరి మీదైనా ?" అనడిగింది కవిత కుతూహలంగా చూస్తూ.

"ఊఁ" అంది పార్వతి పెదవి విప్పకుండా.

"ఎవ రా మనిషి?"

"ఒక స్త్రీ. కాని - ఆమె గురించి నీకు చెప్పే అవసరం లేదు. ఎందుకో ఆమె కనిపించినా, మాట్లాడినా, అదో విధమైన వికారం కలుగుతుంది. అది కోపమో, అసూయో తెలుసుకోలేక పోతున్నాను" అంది నిట్టూరుస్తూ పార్వతి.

కవిత ఊహిస్తూ, "ఆమెకి సరిగ్గా నీ వయసు ఉంటుందనుకుంటాను" అంది.

"అరె! నీకెలా తెలిసింది?" అంది పార్వతి కళ్ళు విప్పార్చి.

"ఇంకా విను; నీ కన్నా తెలివితేటలు గలదై ఉండాలి!"

"అయితే నేను శుద్ధ మొద్దావతారాన్ననా నీ ఉద్దేశం?" కోపగించు కున్నట్టంది పార్వతి.

కవిత నవ్వుతూ, "నీతో బలే తంటా సుహా తల్లీ! పోల్చి చెప్తున్నానంతే! ఔనో కాదో చెప్పు అల్లరి చెయ్యక. నువ్వ సూయ పడుతున్న ఆ అమ్మాయి అన్ని విషయాల్లోను నీకన్న ఒకటి రెండు మెట్లు అధిగమించి ఉంటుందని నా అనుమానం..."

కవిత మాట పూర్తి చెయ్యనివ్వలేదు పార్వతి. "ఛ! ఛ! నే నొప్పుకోను. అన్నిట్లో సమానమంటే ఏమో గాని నా కంటె హెచ్చయినదేం లేదు ఆ అమ్మాయిలో. ఆమె మాటలు నా కెందుకో వెగటు పుట్టిస్తాయి."

"అలా చెప్పు. ఆమె యాసగా మాటాడుతుందేమో" అన్నది కవిత పార్వతిని శల్య పరీక్ష చేస్తున్నట్టు.

"అది కాదు కవీ! ఆమెను ఎప్పుడు కలుసుకున్నా ఒకటే చిక్కు. తన భర్తగారి మంచితనాన్ని, తన పిల్లల చిలిపి పనుల్ని, తన సంసారంలోని సౌఖ్యాన్ని వర్ణిస్తుంది కదా! వినలేక చావాలి. అంత డాబుగా చెప్పుకోవలసిం దేముందో తెలీదు. నాకే కాదు, ఎవరికైనా తలనొప్పి నిశ్చయంగా వస్తుంది."

"మనలో ఏవో లోపించినప్పుడే అవతలి వాళ్ళపై అసూయ కలగడాని కవకాశం ఉంది. అసూయంత హీన మైంది మరొకటి లేదు" అన్నది తేలిగ్గా.

పార్వతి కవిత చేతిలో ఉంచిన తనచేతిని విసురుగా ఇవతలకు లాక్కుంది.

"అక్కడికి నేను పరమ మూర్ఖురాలినైనట్టు నీ అభి ప్రాయం కాబోలు. పోనీ, అసహ్యించుకో ఇష్టం వచ్చినట్టు" అంది ఆవేగంతో.

"అంతే మరి! కోపంకన్న ప్రమాదకరమైంది అసూయ. కోపం చల్లారుతుంది. కాని ఇది రగులుతుంది. అయినా అసహ్యపడి మనం చేసేదేముంది? మైలార్డ్! పార్డన్ డెమ్ - అంటూ వాళ్ళ తరఫున దేవుడి నొకసారి స్మరించి ఊరుకోవా లనిపిస్తుంది నాకు.

పార్వతికి ఉచ్ఛ్వాస నిశ్వాసాల వడి ఎక్కువైంది. దుఃఖమూ వచ్చేటట్టు ఉంది. "మహానుభావురాళ్ళు! తమవంటి

సాధు స్త్రీ రత్నాలకి అసూయ, కోపం లాంటి మానవ సహజ గుణాలు ఏ కోశానా ఉండవు. అదృష్టవంతులు" అంది తనను చూడని కవితను సూటిగా చూస్తూ.

"నా కెవరిమీదా అసూయ లేదు. నిజమే!" అంది కవిత పార్వతి కోపాన్ని లక్ష్యం చేయక గంభీరంగా.

"మీ లాంటి వారు దాచుకున్నట్టు కాకుండా నేను పైకి వెల్లడి చెయ్యటమే పొరపాటైంది" అన్నది పార్వతి కసిగా, అక్కడినుంచి లేచి.

"దాచుకున్నా, వెల్లడి చేసినా అది తప్పే అవుతుంది పారూ!"

ఇద్దరూ మౌనం వహించారు. పార్వతి బల్లదగ్గర నిల బడి, ఏదో పత్రికను చిత్రవధ చేస్తున్నది.

కొంత సేపటికి కవితే లేచి, "పార్వతీ! నువ్వొక కథ వ్రాసి ఇవ్వాలి. మా పత్రికలో వేస్తాం" అంది అతి సహజ ధోరణిలో మృదుత్వం ధ్వనించేటట్టు కూడా.

"అక్కర్లేదు. నువ్వే చూస్తావు కదూ ఆ కథను? చచ్చినా ఇవ్వను. నీలాంటి మహా రచయిత్రి చేతిలో పడ నివ్వను నా కథల్ని. అవమానం చెయ్యటానికే కాచు కుంటారు గర్వంతో."

"నేను మహా రచయిత్రినా?" అంది నవ్వుతూ కవిత.

"పిచ్చి పిల్లలా కోపం దేనికి? బాగానే వ్రాస్తావని అడుగుతున్నా."

"ధన్యురాల్ని! మహారచయిత్రిగారు స్వాన్‌లాగ నడుస్తుంటే స్వైన్‌లా నే నెందుకు వెనక? తమరు వెళ్ళచ్చు."

"కోపంతో ఏం లాభం లేదు పారూ! హృదయముంటే దాన్ని అదుపులోకి తెచ్చుకోవడం నేర్చుకోవాలి. నీ కింకా వయసుకి తగ్గ అనుభవంలేదు" అన్నది కవిత వెళ్ళుతూ.

నిర్విచారంగా వెళ్ళుతున్న ఆమెను చూస్తుంటే పార్వతికి గుండెల్ని పిండుతున్న ట్టనిపించింది.

'తన నిష్కల్మషమైన ప్రేమ నీమె కొంచెంకూడా తెలుసుకోదు.' ఉక్రోషంతో కళ్ళు తుడుచుకుంది పార్వతి. ఎన్నిసార్లు అవమానించింది? ఆమె మాటలు తన నెన్నిసార్లు బాధించాయి? ఒకసారి ఉత్సవాల్లో కార్యదర్శినిగారి ప్రోద్బలంతో ఒక కథ వ్రాసి చదివితే, "ఓ నవ రచయిత్రీ, శత శతాభి నందనలు. కాని, మళ్ళీ ఇల్లాటి ఘోరమైన కథలు వ్రాయకు. ఏమన్నా అంటే గురువునని అనుమానించి నలుగురూ నన్నే దుయ్యబడతారు" అనేసింది నలుగుర్లో.

మరోకసారి షాపింగ్‌కు కలిసి వెళ్ళినప్పుడు ముచ్చటైన కృష్ణవిగ్రహం కనిపిస్తే కొనుక్కున్నది తను.

"మీరాబాయ్ వైపోగలవు, జాగ్రత్త" అని అక్కడా నవ్వడమే తనవైపు చూసి.

ఎందు కలా పరిహసించిన ట్టంటుందో తెలీదు. ఆమె ఎంత నిరసనగా చూసినా, వదిలి ఉండలేని తన బలహీనతేమిటో? ఊ బంధం ఏమిటో?

రాజు రావటంతో చప్పున తల దించుకుంది పార్వతి ఆలోచనలు కట్టిపెట్ట ప్రయత్నిస్తూ.

"నీ కవిత కాదు గాని నన్ను ప్రాణాలతో ఉండనిచ్చే టట్టు లేదు. ఆకలేస్తోంది. వంటగదికి పద తిన్నగా!"

"ఇదిగో, వస్తున్నా" అంది తల దించుకునే. తన సజల నయనాలు అతనికి కనిపిస్తాయని భయం.

రాజు ఏమనుకున్నాడో! పార్వతి ముఖ వివర్ణం చూశాడు

"కవిత ఏమన్నా అందా ?" అన్నాడు పెదాలు బిగ బెట్టి, ఆమె చుబుకాన్ని పైకెత్తుతూ మొహాన్ని పరీక్షించా లనే ప్రయత్నంతో.

అతని చేతిని తోసి "పదండి" అని చరచర పోయింది పార్వతి మొహం దాచుకొంటూ.

క్లబ్బుకు వెళ్ళింది పార్వతి మధ్యాహ్నం ఉండబట్ట లేక; అనుకోకుండా కవిత అక్కడ ఉంది ఆమె ఉండాలని వాంఛిస్తుందేమో మనసులో పార్వతి. కవిత ఎవరితోనో నవ్వుతూ మాట్లాడుతున్నది. పార్వతివైపు చూడలేదు. లేక చూడనట్టు నటించిందో ర్వతి కవగతం కాలేదు.

"రండి ! కేరమ్సు ఆడదాం !" అంటూ కొందరు కవితను లాక్కుపోయారు అక్కణ్నుంచి కవిత నామ మాత్రంగానైనా పిలవకుండా వాళ్ళతో వెళ్ళిపోయినా పార్వతి పెంకితనంగా అనుసరించింది ఏముంటుందో చూడా లని.

కవిత ఛలోక్తులు విసురుతూ ఆ అమ్మాయిలతో హుషారుగా ఆడుతుంటే రెప్పవాల్చకుండా చూస్తూ నిలబడ్డది పార్వతి.

"చూడండర్రా! ఈ కోయిన్ సూటిగా పోకెట్‌లో పడకపోతే నా పేరు కవితకాదు" అంది కవిత స్ట్రయికర్ గురిపెట్టి.

'చస్తేపడదు. ఎక్స్‌పర్టుకి మల్లే పోజు పెట్టేస్తే సరేమిటి?' అనుకుంది పార్వతి. కవిత ఓడిపోతే వెయ్యి కొబ్బరికాయలు కొడతానని దేవుణ్ని మొక్కుకుందేమో కూడా ఆ క్షణంలో కోపంతో. కాని అలా జరగలేదు అపర విక్రమార్కుడిలా విజయం సాధించి ఆవిడ మరో గేమ్‌కు సిద్ధమైంది.

చలికాలం మాట మరిచి పార్వతి ఒళ్ళు పూర్తిగా వేడెక్కి, కొద్దిసేపు నిప్పులమీద పెనంలా కాలింది. తను కూడా కులాసాగానే ఉన్నట్టు కవితకు తెలిసేలా ఒకసెట్టు టెన్నిస్ ఆడి ఇంటికి వెళ్లింది. ఆ రాత్రి నిద్రకోసం గింజుకున్నదా అమ్మాయి.

మర్నాడు ఆదివారం పక్కమీదనుంచిలేచి అద్దంలో చూసుకుంటే కళ్ళు ఎర్రనై కనిపించాయి. నిత్య కృత్యాల్లో నిమగ్నురాలైంది. కాని హృదయాన్నెవరో శరీరంనుంచి వేరుచేస్తున్నంత బాధగా ఉంది.

ఆదివారంకనుక చాలాసందడిగా ఉంటుంది క్లబ్బులో.

ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలంతా తప్పక వస్తారు. కవిత కూడా రావడాని కవకాశముంది.

అన్నిటికన్న ఆ భావనే అక్కడిదాకా నడిపించింది ఆ యువతిని.

యువతుల క్లబ్బు సందడిగా ఉన్నమాట నిజమే. కాని కవిత కానరాదు.

హాల్లో ఉన్న స్త్రీలలో డాక్టర్‌గారి సతీమణి నవ్వుతూ, "కవిత రాలేదని అదోకలా ఉన్నారు పార్వతిగారు" అంది పార్వతిని అభిమానంగా చూసి.

పార్వతి లేని చిరునవ్వు నవ్వింది. ఫ్లోరా అందుకుని, "కవితా వాళ్ళింటికి వెళ్ళాను. ఏదో నవల వ్రాయటం ప్రారంభించి నట్టుంది. మళ్ళీ ఆమెగారు మన లోకంలో పడటానికి కనీసం నెలైనా అవుతుంది" అంది పెదవి విరిచి.

పార్వతి ఏదో ఊహించేలోగా హఠాత్తుగా ఊడిపడిన పద్మావతి ఏ సంగతీ చెప్పకుండానే ఆమెను లాక్కుపోయిం దక్కడినుంచి "చూడు! పార్వతీ! మన లైబ్రరీ పెద్దదికదా? ఆ భాగాన్ని నువ్వు నిర్వహిస్తుండాలి" పద్మావతి ఇంచు మించు రహస్యంగా చెప్పింది.

"నేనా?" అన్నది పార్వతి సంశయిస్తూ.

"అవును. నీ మాట నేను మరిచిపోతే, కవితే జ్ఞాపకం చేసింది. సాహిత్యాభిలాష ఉన్న కొద్ది మెంబర్లలో నువ్వొకదానివి — ముఖ్యంగా మరి! ఏమంటావు?" అనడిగిం దావిడ.

"అలాగే!" అని అస్పష్టంగా చెప్పి లోపలి కెళ్ళింది పార్వతి.

అదే ఆలోచిస్తూ నడుస్తున్న పార్వతికి కవిత పేరు వినిపించింది ఒకవైపునుంచి. ఆ వంకకు చూచింది. పింగ్ - పాంగ్ ఆడుతున్న కొంద రమ్మాయిలు ఆట నిలిపి కవిత వ్రాసిన నవల గురించి చర్చించుకుంటున్నారు. మరొక వ్యక్తి రావడం వాళ్ళు గుర్తించ లేదు. కాని, నవలకు వ్యతిరేకంగా ఆ అమ్మాయిలు అభిప్రాయ పడుతుండటం చూచి తనే జోక్యం చేసుకుంది పార్వతి.

"ఏమిటర్రా అది?" అని పార్వతి ప్రశ్నించగానే, "కవిత కొత్త నవల మాకేం నచ్చలేదండీ! దాని గురించే అనుకుంటున్నాం!" అంది అరుణ, లాయరుగారి కూతురు.

పార్వతి ఆ పిల్లల విమర్శలు ఆలకించి మళ్ళీ వివరంగా కథంతా జ్ఞప్తికి తెచ్చింది.

"సత్యదూరం కాని వస్తువే అది. పైగా జీవిత స్వరూపం అద్దంలోలా కనిపిస్తుంది. అలాటిది మీకు నచ్చ లేదంటే కారణం తెలీడం లేదు" అంది.

"బలే! మీరు కూడా అలాగే చెప్తున్నారు. ఒక విధంగా మీ రన్నట్టు కథనం అంతా జీవితాన్ని ప్రతిబింబింప జేసింది కాని, అసలు ఇతి వృత్తమే సహజంగా లేదు. కథానాయకుణ్ని ఘోరంగా చిత్రించి, రచయిత్రిగా అతని గతిని సూచన మాత్రంగానైనా నిర్ణయించకుండా సాను

భూతి మాటలతో ముగించడమా? తగలబడినట్టే ఉంది" అంది ఓవర్సీరుగారి అమ్మాయి.

పార్వతి ఉద్రేక పడుతూ అంది: "విజయా! నువ్వు మొదటేమన్నావ్? జీవితాన్ని ప్రతిబింబింపజేసింది అన్నావు తర్వాత అర్థం లేకుండా వాదన పెంచడంకోసం తక్కినదంతా చెప్పావు. పోనీ, నువ్వన్నదీ నిజం అనుకుం దామంటే వీల్లేకుండా ఉంది. జీవిత స్వరూపంగా తోచినచోట అసహజత్వానికి చోటులేదు."

పార్వతితో ఏకీభవించడం ఆ గ్రూప్‌లో కొందరికి అయిష్టంగా ఉంది.

"ఏమైనా చెప్పు, పార్వతీ! కవిత మంచి నవలలు వ్రాసి వ్రాసి, హఠాత్తుగా ఇలాటి చెత్త నవలొకటి మా ప్రాణం మీదికి వ్రాసి పడేస్తుంది రచయిత ఎప్పుడూ ఒక్క విధంగా వ్రాస్తారను కున్నాను. రకాని కొకలా వ్రాస్తుం దీమె" అంది ఒకావిడ.

"దయచేసి చెత్త అనవద్దు!" అంది పార్వతి గంభీరంగా.

రేఖ అనే కలవారి అమ్మాయి సాహిత్యం గూర్చి కాస్తయినా తెలీక పోయినా నవ్వుతూ, "మా అభిప్రాయాలు చెప్తున్నాంగాని ఆవిడ రచయిత్రి కాదని అనలేదు కదండీ!" అన్నది కవ్వించడానికి.

కానీ, అనుకోని సంఘటన ఎదురైంది. చటుక్కున లేచి నిలబడిన పార్వతి పెదాలు అదురుతుండగా, "మీకొక అభిప్రాయం చెప్పే అర్హతకూడా ఉందా? సూక్ష్మంగా చూచే వాళ్ళకే దేన్నిగురించిగాని చెప్పే శక్తి ఉంటుంది. విలువ తెలీకుండా మాట్లాడే దానికి ఎంతకాలమూ చాలదు." అని కోపంతో విసురుగా వెళ్ళిపోయింది.

ఆ కొమ్మలందరూ బొమ్మల మాదిరిగా నిలబడీ కూచునీ అటే చూస్తుంటే పద్మావతి గబగబా వచ్చింది.

"ఏమిటా అమ్మాయి అలా కోపంగా వెళ్లింది? ఎవరు కోపం తెప్పించారు?" అనడిగింది ఆత్రుతగా, కంగారుగా.

మొదట మౌనంగా ఊరుకొని తర్వాత అంతా చెప్పేరు.

"ఏడ్చినట్టే ఉంది! ఆ అమ్మాయికి కవితంటే ప్రాణం కదా? ఎందుకలా అనవసరంగా వాదించారని పనిలేక?" విసుక్కుం దా కార్యదర్శిని.

"పోనీ పద్మా! నువ్వే చెప్పు. ఆ నవల అసహజంగా లేదూ?" అంది విజయ.

"మన మొహాలు కూడా అసందర్భంగానే ఉన్నాయి. ముందా అమ్మాయి కోపం ఎలా పోతుందా అని నేను చస్తుంటే" అంది పద్మావతి ఏడుపు మొహం పెట్టి. తర్వాత ఏదో నిశ్చయించుకొంది.

# 38

పార్వతికి దేహమూ, మనసూ భారంగా అయిపోయాయి క్లబ్బులో వాగ్వివాదం జరిగి ఇంటికి వచ్చాక. కాకినాడ వచ్చిన తర్వాత ఇంత బరువుగా, సమస్యగా గడిచిన రోజులేదు ద్వేషాన్ని, కోపాన్ని ఒకసారి బాగా చవి చూసి పర్యవసానాల్ని కూడా అనుభవించి, దెబ్బతిని ఉన్న పార్వతి మరొకసారి అటువంటి హేయానుభవాల్ని ఊహించుకోవడానిక్కూడా భయపడింది. కవితతో తనకు పంతమా? ఇది ద్వేషంగా మారుతుందేమో అనుకునేసరికి శరీరం కంపించింది.

అంతర్వేదన ఎలాఉన్నా వెనకదీస్తున్న హృదయాన్ని ముందుకు నడిపించలేకుండా ఉంది ఆరురోజులు గడిచినా పార్వతి కావాలనే కవితను కలుసుకోవడానికి ప్రయత్నించలేదు. ఆమె తనకోసం వస్తుంది అనే ఆశతోకూడిన విశ్వాసం నిలవరించింది అనుక్షణం. అదొక విధమైన పట్టుదలలో కవిత తలపు మధురమైన స్పందన కలిగించేది. 'ఇల్లాటి చెలిమి ఎక్కడైనా ఉంటుందా?' అనుకుంది పార్వతి తనను గురించి తనే ఆశ్చర్యపడుతూ. ఇంత ప్రాణాధికమైన ప్రేమ ఏర్పడటానికి కారణం ఎన్నో సంవత్సరాల స్నేహానుబంధం అనైనా చెప్పగలదా ఎవరితోనైనా తను?

ఊరికే కూచుంటే పార్వతి ఊహలు విచిత్రమైన పోక

డలు పోతున్నాయి. హృదయ సముద్రాన్నెవరో కలచి వేస్తున్నట్టయినప్పుడు ఆందోళనతో, పిరికితనంతో సరాసరి వెళ్ళి కవిత పాదాలమీద పడిపోవాలని పిస్తున్నది. ఒకొక్కసారి.

'ఇలా ఉండలేను! వెళ్ళి క్షమించని వేడుకుంటాను' అనుకుంది పార్వతి.

పార్వతి మానసికంగా బాధపడుతూ మౌనంగా ఉండడానికి కారణాన్ని రాజు చురుకుగా అన్వేషించాడు. పార్వతి చెప్పకపోయినా ఆమెకూ, కవితకూ, ఎక్కడో బెడిసి కొట్టి ఉంటుందనుకున్నాడు.

మంచి శాస్తే జరిగిం దనిపించిం దతనికి పార్వతిని చూస్తుంటే. ఎందుకనో కవితమీద అతనికి కోపం వస్తున్నది తరుచుగా. పార్వతి కవితకోసం అలమటించిపోవడం చూస్తే సహించలేక పోతున్నాడు.

తనకంటే ఆమె ఎక్కువా? సాధారణంగా స్త్రీలు భర్తను ప్రేమించినట్టు మరెవర్నీ ప్రేమించలేరు. ప్రేమించినా ఆ తర్వాతనే. తన కర్మానికి ఈవిడ తత్వం ఇటువంటిదైంది. ఛ—ఏం బ్రతుకు! కాని మనసులోని సంగతెలా ఉన్నా పార్వతి ఒకప్పుడు తనంటే ఎక్కువ ఇష్టాన్ని కనబరిచేది. ఇప్పుడిలా మారిపోవాలెందుకని?

ఒక పట్టాన పూర్తయ్యేది కాదు రాజు స్వగతం.

ఒకసారి "నాకంటె కవిత నీ కెక్కువా?" అని రాజడిగిన దానికి సమాధానంగా నవ్వుతూ "చెప్తే సిగ్గు పడి

పోతారు. తమరు" అంటూ అతను చెప్పమని బలవంతం చెయ్యకపోయినా "ఆమె మీదున్న అభిమానంలో సహస్రాంశం కూడా మీమీద లేదు నాకు"అన్నది తిరిగి. అల్లాటి సంఘటన లెన్నో జరిగాయి.

ఏ దెలా జరిగినా పార్వతిపట్ల ప్రేమలాటి భావం, కవితపై అసూయ వంటి భావం ఒక్క-సారే ములకెత్తాయి అతనిలో.

సాయంత్రం డ్రెస్ వేసుకుని, "అలా ఉన్నావేం?" అన్నాడు పార్వతిని చూస్తూ ఆమె మ్లానతను తను గుర్తించినటు తెలియాలని అతని ఉద్దేశం.

"ఎలా ఉన్నాను?" అంది అంతవరకు ఊరికే పట్టుకు కూచున్న మేగజిన్ పేజీలు తిప్పుతూ.

"నీకేం పని లేదేమో-అలా షైరు వెళ్ళొద్దాం రా!" అన్నాడు.

"ఊఁహు - రాను" అంది ఎప్పటి మాదిరిగానే.

రాజు ఏదో అనడానికి సిద్ధమై మళ్ళీ ఏమనుకున్నాడో తన దారిని నడవ బోయాడు.

"పోనీ... వస్తాను రాజూ!" అని చప్పున నాలుక కరుచుకుంది.

"వస్తానుండండి!" రాజు వెనక్కు- తిరిగి ఆమె కళ్ళల్లోకి చూచి నవ్వాడు.

తర్వాత "ఇలాగేనా రావడం?" అన్నాడు ఆమె చెదిరిన జుత్తునూ, నలిగిన బట్టల్నీ చూస్తూ.

"ఫర్వాలేదు, పదండి" అంది పార్వతి, బయటి కెళ్ళాలంటే పెద్ద ఆర్భాటంతో గాని కదలని పార్వతి.

అతని వెంటనంటే వెళ్ళింది ఉదాసీనంగా. ఆకుపచ్చ చీర కట్టిన భూ మాత ఒడిలో కూచున్నా రిరువురూ. పార్కులో సందడి తక్కువగా ఉన్నది. కాని సంకోచంగా అతని పక్కన కూర్చున్నది పార్వతి. ఈ అనుభవం మరీ కొత్తగాను, కాస్త చిరాకుగాను ఉంది.

ఒకరోజు రాజు దగ్గర ఇలా సరోజ కూచుంటే తనకు కోపం వచ్చింది. ఎందుకనో?

మెలకువ వచ్చిన దానిలా అయింది పార్వతి రాజు పలకరింపుతో.

పదండి. వెళ్ళిపోదాం. ఇక్కడేం బాగులేదు నాకు" అంది విసుగ్గా.

"అప్పుడేనా? అసలు రాకపోతే బాగుండేది" అన్నాడు ఆశ్చర్యపడినాక కోపం తెచ్చుకొని.

"నేను వెళ్తాను. మీరు రుండండి." అతను వినిపించుకోలేదు.

"పార్వతీ! నన్ను 'మీరు' అంటూ పిలవడం ఎందుకు ప్రారంభించావు?" అడిగాడు ఎలా అన్నా ఆమె నక్కడ ఉండేటట్లు చెయ్యాలని. "నా ఇష్టం" అన్నది. మామూలు ధోరణే ఆమెది." నువ్వలా పిలుస్తుంటే అదోకలా ఉంది ఎందుకో. 'బావా' అని పిలువు! సంతోషిస్తాను." అన్నాడు పరీక్షగా ఆమెను చూస్తూ.

పార్వతి నవ్వింది. కాని కవిత గురించిన బాధ మన సులో లేకపోతే ఇంకా నిండుగా నవ్వేదే.

"ఊహుఁ. బావా అనిపిలవడం ఎప్పుడో మరిచి పోయాను. ఇప్పుడలా పిలిచినా బాగోదు వినడానికి" అంది.

"ఎందుకు బాగుండదు? పోనీ, నా పేరుతో పిలు స్తుండు ఎప్పట్లా" అన్నాడు రాజు చేతివేళ్ళు పరిశీలించు కుంటూ.

"ఇప్పుడు నిలదీసి మిమ్మల్ని ఎన్నయినా అడగ గలను. పోనివ్వండి. అసలు సంగతేమిటంటే - మా అక్క మిమ్మల్ని ఇలా పిలవమని చెప్పింది. పిలుస్తున్నాను అంతే!" అంది సూటిగా.

'ఈమె నిలదీసి అడిగేది ఏమిటో' అనుకున్నాడు రాజు రహస్యంగా.

"ఎవరు? సరస్వతా చెప్పింది?" అన్నాడు పైకి ఆశ్చ ర్యాన్ని ప్రకటిస్తూ.

"ఔను. అది వెర్రిది. పైగా చచ్చిపోయింది దాని మాట ఎలా కాదంటాను?" జీవితాంతం వరకు నా కోసమని తపన పడింది."

రాజు కొద్దిసేపు ఊరుకొని అన్నాడు; "నువ్వలా పిలిస్తే నా కిష్టం అనుకున్నదేమో మీ అక్క. కాని నేను స్వయంగా చెప్తున్నాను కదా ! ఇకనుంచి అలా పిలవడం మానేసి 'రాజూ' అనే పిలువు"

"అసలు మిమ్మల్ని పిలిచే అవసరమేముంది నాకు? అంత

అగత్యం ఎప్పటికీ రాదనే అనుకుంటున్నా. అందులో మీ ఆజ్ఞలంటే నాకు మంట. మీ అందరి దగ్గరా గెలిచేను గాని కవిత నన్ను ఓడించింది” అంది అతన్ని లెక్క చెయ్యకుండా వ్యంగ్యంగా.

“పారూ!” అని ఆమె చేతిని పట్టుకు నొక్కాడు.

“వెళ్దాం” అంది చెయ్యి అలానే ఉంచి.

౽ ౽ ౽

ఆ రాత్రి కలత నిద్రపోయింది పార్వతి. తన కిష్టం లేని పనేదో జరిగిపోతున్నది. ఆ అక్రమ తిమిరావహంలో రెండే రెండు దివ్య పాదారవిందాలు వెలుగులు విరజిమ్ము తున్నాయి. అంతవరకు అగుపించని ఆ చరణద్వయం ఆకస్మి కంగా దృశ్యం కావటమే ఆశ్చర్యం. తమస్సును చీల్చివేసే ఓజస్సులా దృఢగాంభీర్యాలతో అలరారుతూ పవిత్రతకు ప్రతిరూపాలైన పాదాలు. ఎవరివి? ఏమిటది? ఆ పాదద్వయం ఎక్కడినుండి అగుపిస్తున్నట్టు? మనసు ఊహిస్తున్నది; పెద వులు పలుకలేక పోతున్నాయి. సువర్ణ రత్న స్థగితాలై వజ్ర కాఠిన్యాన్ని స్ఫురింప చేసినా అధమాధముల ఆక్రందనలకు సైతం కరిగి మృదుత్వాన్ని వహించే సర్వేశ్వరుని చరణ కమలాలు.

పార్వతి ఆ పాదాలపై తల ఉంచింది. తనకు కలుగు తున్న అపరిమితమైన సుఖానుభూతిని విపరీతమైన అశాంతి నాశనం చేస్తూంది. ఆ శాంత్యశాంతుల పోరాట మధ్యంలో పెదవులు ఏదో నామోచ్చరణకోసం విశ్వప్రయత్నం చేస్తు

న్నాయి కాని పరమాత్ముడికి వినిపించేది హృదయ వినిర్గత మయ్యే ఆవేదనే.

'ఈ జన్మ నీకే అర్పణ' అని ఘోషించింది పార్వతి గుండె తననుండి ప్రాణాలు వేరు చెయ్యబడుతున్నట్టని పించింది. కరుణ విలసిత ప్రసన్నవదనంతో భగవానుడు తన ప్రాణాల్ని పరిపూతం చేస్తున్నాడు. కాని ప్రాణోత్క్రమణ సమయం యాతనామయం. శూన్యమైపోతున్నది శరీరం. మనస్సు స్తంభించి పోయింది. ఊపిరందడం దుస్సాధ్యంగా ఉన్నది.

గింజులాటలో పార్వతి కళ్ళు విచ్చుకున్నాయి. చటుక్కున లేచి ఏ కేకా వెయ్యలేదు ఆమె. మధురమైన కల. మళ్ళీరాని కల. మనః ఫలకంమీద తిరిగి కనిపించింది. కళ్ళు ధారలు కట్టాయి. ఆ సమయంలో ఆ అశ్రువులు సుఖ స్పర్శనిస్తున్నాయి ఆ కల నిజ మవ్వకూడదా? పోనీ, ఆ కల లోనే తను ఉండిపోకూడదూ? అనుకుంది పార్వతి.

బెడ్‌లాంప్ గుడ్డి వెలుగులో వాచీ చూచింది. ఆగిపోయిం దది. కళ్ళద్దుకుని లేచి డ్రాయరులో రిస్టువాచీ చూచింది. పన్నెండు గంటలు. ఇంతేనా? అర్ధరాత్రి దాటిపోయినట్టుగా ఉంది నిశ్శబ్దంగా.

'నిద్ర మళ్ళీ రావడం కల్ల. తిరిగి ఆ మధుర స్వప్నం రాగలదనే ఆశ ఉంటే బలవంతంగానైనా నిద్రపోతుంది తను. కాని—'

వీధివాకిట్లోకి వెళ్ళి నిలబడ్డది. చిరుచలికీ, చీకటికీ బెదరకుండా నిబ్బరంగా ఉంది మనసు. కల కలిగించిన ఉద్వేగం ఇంకా తగ్గలేదు. హృదయాన్ని చీల్చి దైవానికి అంకితం చెసెయ్యా లన్నంత తృణీకారంగా ఉన్నది శరీరం మీద. మమతలన్నీ పాపాల్లా తోచి కలత పెట్టాయి.

'ఛీ!' అనుకున్నది. శీతభానుడి కాంతికిరణాలు చీకటిని పూర్తిగా తరమలేక పోతున్నాయి. గుడ్డివెలుగులోనే మహా చిత్రకారుడి చిత్ర పటం కనిపిస్తున్నది. మహాగాయకుడిగానం విశ్వవ్యాపకమై వినిపిస్తుంది. 'గగనానిల తేజోజ్వల భూమయ సృష్టిలో, మృగ ఖగ నగ తరుకోటులలో పరమాత్ముడు వెలిగే ముచ్చట' అది. సూక్ష్మాతి సూక్ష్మాణువులనుంచి కూడా వినిపించే పరమార్థం. 'భువన మెల్ల నీవై యుండి నన్నొకని బ్రోవభారమా' అని గాయకుని నిరవధిక గంభీర మధుర కంఠంతో ఊళవేసే గాలిలో ఏకమయి గానం చేసే మానవాళి మనసు...

కాని పార్వతి మనసు కొన్ని దినాలై భగవ ద్విష యాల్లో నిశ్చలంగా నిలవడంలేదు.

కవితను తక్షణం చూడా లనిపించింది పార్వతికి. ఎన్ని భావాలు పరుగులెత్తినా ఆగలేకపోయింది. ఆలోచించే నిగ్రహం పోయింది.

తలుపు దగ్గరకు వేసి నడవసాగింది. నిర్మానుష్యంగా ఉన్న ప్రదేశాలు, నిశీథస్థలాలు అప్పుడు పార్వతిని భయపెట్ట

లేదు. కవిత నివాసం దగ్గరేమీ కాదు. కాని ఏదో శక్తి నడిపించింది ఆ అమ్మాయిని.

తీరా ఇంటి దాకా వెళ్ళి రెండుసార్లు తలుపు తట్టి నాక సంకోచం కలిగింది. 'ఇంత రాత్రివేళ రావడమేమిటి తను ? ఎవరైనా ఏమనుకుంటారు' అనుకుంది.

కరుణాకరం తలుపు తెరవగానే ఉలిక్కిపడి ఏమని చెప్పాలో తోచక నిలబడింది.

"లోపలికి వెళ్ళండి. కవిత వ్రాసుకుంటోంది" అన్నాడతను. అప్పుడు ధైర్యం వచ్చింది.

మెల్లగా వెళ్ళి ఏక దీక్షగా వ్రాస్తూన్న కవిత పరవశత్వాన్ని చూచింది, ఆమెకు తెలీకుండా.

ఆమె రచయిత్రి. ఆమె వర్చస్సు, వాగ్ఝరి - ప్రకాశించడం, ప్రవహించడం ఆ హస్తంలో నుండే.

అక్కడ అహంకారానికి, అధఃకారానికి తావులేదు. ప్రాచీనమని, అధునాతనమని భేదం ఉండదు. ప్రకృతికి ప్రతికృతి జరిగే ఆ సమయంలో ఒకటి ఉన్నతంగాను, మరొకటి అధమంగాను కనుపించదు. ఒకరు ఉత్తములని, మరొకరు అధములనే తారతమ్యభావం నశిస్తుంది. సుమనో విమనో వృత్తుల సూక్ష్మీకరణ తరుణంలో సృష్టికర్త మనస్సే అయిపోయి కరుణ గాంభీర్యాలు నిండుతాయి. అదొక వింతైన మానస విహృతి. అంతర్నేత్ర బలంతో ఆ విహరణంలోనే రకరకాల జీవిత మర్మాలను భేదించడమైనా, భిన్న విభిన్న

మానవ ప్రవృత్తుల్ని చిత్రించడమైనా జరుగుతుంది. ఏదో ఒక ధ్యేయంతో సాగేది రచన.

"కవితా !" అనే మృదువైన పిలుపుతో కవిత తదేకతకు భంగం వాటిల్లింది. ఆ వేళప్పుడు పార్వతి రాకను ఊహించ లేదామె.

"పారూ !" అని చిరునవ్వుతో చేతిని అందుకుంది ప్రేమగా.

"కవితా ! ఇంత రాత్రులుకూడా వ్రాస్తున్నావా ?" అంది పార్వతి బెంగురుగా.

"అదిగో, అప్పుడే దెబ్బలాటకు ఆరంభించావు" అంది కవిత మనసారా నవ్వుతూ. "ఈ నవల ముగింపు ఇప్పుడే అయిపోవాలని పట్టుదలగా కూచున్నాను పారూ ! నువ్వలా కూచో. ఇంత రాత్రివేళ నన్ను చూడా లనిపించిందా ?"

"ఊఁహు. నువ్వలా వ్రాస్తూ కూచుంటే నే నిలా నిల బడి కదలను. అర్ధరాత్రులు మేలుకుంటే ఆరోగ్యం చెడి పోదూ ?"

"కొంచమే ఉంది. వ్రాయనియ్యి పారూ !"

"వద్దు. వ్రాయద్దు. ఇంకా నా మాట వినకపోతే ఆ కాయితాలు లాక్కుంటాను మరి !" అంది పార్వతి వినిపించు కోకుండా.

కవిత నవ్వి, "నీకు తెలీదు పారూ ! నాలా కొంత అనుభవం అయ్యాక ఏ భయాలూ మనల్ని చేరవు. రాటు

చేరిపోయి ఏ క్షణాని కేమౌతుందన్నా అనుభవించడానికి సిద్ధంగా ఉంటాం" అంది.

కవిత చెప్తూ ఏ వైపో చూస్తున్నది కాని వెచ్చని నీటిచుక్కలు శరీరాన్ని ఆ కేసరికి ఉలిక్కిపడి గాభరాగా లేచింది కుర్చీలో నుంచి.

"ఏమిటది పారూ! దగ్గరకు తీసుకుంటూ ఆత్రుత పడింది కవిత.

"ఇల్లాటి మాటలు నా దగ్గ రనకు కవీ! నీకు ఈ ధైర్యం ఉంటే నీ మనసులోనే దాచుకో నువ్వు లేకుండా నే నీ ప్రపంచంలో ఉండలేను. ఎక్కడి కెళ్ళినా నన్నూ తీసు కెళ్తావా?" పార్వతి కంఠంలో దుఃఖం ధ్వనించింది.

"పిచ్చి పిల్లా!" అంది కవిత. ఈ వేదన అర్థంకానిది. కాని అనంతం. పార్వతిలోని సంక్షోభాన్ని తెలుసుకుంది. దాన్ని ఏ ఏ ఓదార్పూ వెంటనే తగ్గించదని తెలుసు.

"చెప్పవ్? నేనూ నీ నీతోనే వస్తాను ఎక్కడి కెళ్ళినా..." పార్వతి కవిత హృదయంలో తల దాచుకుంది బరువుగా.

"పిచ్చిదాని వేమిటి? నేనుమాత్రం నిన్ను విడిచి ఇప్పుడెక్కడికి వెళ్తున్నాను?" కసురుకుంది కవిత. "నీ మనసు బాగు లేనట్టుంది. నేను ఉత్తరదేశంలో ఒక ప్రాంతానికి వెళ్ళాలి. నిన్నుకూడా తీసుకుపోతాను" అన్నది మళ్ళీ ఆమె.

కొద్దిసేపు కవిత మాటలు విని "ఇంటికి వెళ్తాను కవితా!" అంది పార్వతి కులాసాగా.

"ఓహో! అర్ధరాత్రి మళ్ళీ ఇంటి కెళ్తావా? నేను పంపిస్తా ననుకునే వచ్చావా? వీల్లేదు. ఈనాటి కిక్కడే నీ నిద్ర, కావాలంటే నేను తోడు పడుకుంటాన్లే.

"మహద్భాగ్యం! కాని తలుపులు సరిగ్గా వెయ్యకుండా వచ్చాను."

"మరేం, భయంలేదు. మీ రాజుగారు పరాక్రమవంతులే! దేవుడిమీద ఆ బరువేదో వేసి పడుకో" అన్నది కవిత నిశ్చింతంగా.

## 39

ప్రాచీన శిలా నిర్మాణ కౌశల్యాన్ని, వైభవాన్ని విలోకిస్తూచిహ్నమాత్రంగా మిగిలిన వాటి శిథిల గతికి వాపోయారు కవిత, పార్వతీను. అలసటగా అందాకా ఒక రాళ్ళ గుట్టమీది కెక్కి కూచున్నా రిద్దరూ.

తామిద్దరూ తప్ప మరెవ్వరూ వెంట రాకూడదన్న పార్వతి నిబంధనను తు. చ. తప్పకుండా పాటించింది కవిత.

దూరానికి అందంగా కనిపిస్తున్న శిథిల దేవాలయ ప్రాంగణాన్ని చూస్తూ "శిథిలాలయమ్ములో శివుడు లేడోయి" అంది రాగసహితంగా పార్వతి.

"కానీ, దేశంలోని అక్రమ వ్యవహారాల్ని చూచి

నప్పుడూ, చెయ్యవలసిన మహాద్రోహాలు చేసి వరాలు పొంద డానికీ వచ్చేవారిని చూసినప్పుడూ ఇలాంటి శిథిలాల్లోకే పారిపోవాలని పిస్తుంది పరమాత్ముడి కూ-డా" అన్నది కవిత.

"ఇలాంటి తియ్యని కబుర్లు చెప్తావనే నిన్ను నేను ప్రేమి స్తున్నాను" అంది పార్వతి కవిత కళ్లల్లోకి చూస్తూ.

"అందుకనే నేనూ నిన్ను ప్రేమిస్తున్నానోయ్!" పార్వతి చెంపను ముద్దుపెట్టుకుంది కవిత.

పార్వతి నవ్వుతూ "నిన్న రాత్రి నాకో కల వచ్చింది" అంది.

"ఏమిటది?" యథాలాపంగా ప్రశ్నించింది కవిత.

"శౌర్య సాహస గాంభీర్య వితరణాది ధీరగుణ సంప న్నుడైన రాజకుమారుడి నట నేను. ఒక రోజు దేశసంచా రార్థం బయల్దేరాను. వెళ్ళగా వెళ్ళగా ఒకఊరు వచ్చింది... ఊరు కాదు, రాజ్యం."

"సరి, ఇక ను వ్వాగు. నేను తక్కి-నభాగం చెప్ప గలను. ఆ నగరాన్నేలే రాజన్య శేఖరుడికి లేక లేక ఒక కుమారిక కలిగి తక్షణం పెద్దదైంది. ఆవిడ సంగీత సాహిత్య నృత్య చిత్రకళాదుల్లో కడు ప్రవీణురాలు. కావున ఏ కవితా సుందరి అనో, సాహిత్య సుందరి అంటూనో పేరు పెట్టి అనుకుందాం. ఆ తర్వాత స్వయంవర సభలోకి హఠాత్తుగా వచ్చి నిలబడిన మారు వేషధారి అయిన రాజపుత్రుడి

మెడలో హారంవేసి ఊరుకుంది అదీ కథ! కానీ, ఇందులో రాజకుమారుణ్ని నేనైతే రసవత్తరంగా ఉండును."

"ఎల్లా తలక్రిందులైనా ప్రేమకి అర్థం ప్రేమే! కాని నిజంగా నాకొక చక్కని కల వచ్చింది ఆ రోజు – నీదగ్గరకొచ్చిన రాత్రి." పార్వతి అంతా చెప్పి "ఆ సమయంలో ప్రాణాలు నిజంగా నన్ను చీల్చుకుని సర్వేశ్వరుడిలో కలిసి పోతున్నట్టే అనిపించింది కవితా!" అంది.

"నా పార్వ తెప్పుడూ అదృష్ట వంతురాలే మరి!" అన్నది కవిత పార్వతి బుగ్గలు నొక్కుతూ.

ఎందుకో పార్వతి కళ్ళు చెమర్చాయి గొంతులోకి జీర వచ్చింది. వెంటనే రెప్పలు ఆర్చేసుకుంది కవితకు కనిపించకుండా.

"సరే! అలా విహరించి వద్దాం. ప్రేయసీ రా!" అంది కవిత తను లేస్తూ.

"చిత్తం!" అంటూ పార్వతి ఉత్సాహంగా అనుసరించింది

శిథిలంగా చెదురు మదురుగా పడిఉన్నా శిల్పకారుడి నైపుణ్యాన్ని వేవిధాల చాటుతున్న శిల్పాలు గుండెల్లో బండల్ని దించుతున్నాయి. ఇద్దరూ కళాదృష్టి కలవారే ముగ్ధులై చూస్తున్నారు. చైతన్య శూన్యమైన ఆ ప్రదేశంలో ఆ స్త్రీ లిద్దరి ఉనికి వింత శోభ తెచ్చింది. గుట్టల కనక మైదాన మార్గంలో పశ్చిమాద్రికి పరుగెడుతున్నాడు దినకరుడు.

పువ్వుల రథంగా చెక్కబడిన ఒక శిల్పాన్ని చూచి ఎంతటి కళాఖండం అనుకున్నారు ఆ యువతులు.

"ఆ శిల్పి హస్తాన్ని నేనై ఉంటే ఎంత ధన్యురాలినై ఉందును!" అంది కవిత సహజమైన కవితా ప్రకర్షవల్ల.

"అప్పుడా హస్తానికి సేవచేసి ఆరాధించి ఉండేదాన్ని నేను" అన్నది పార్వతి గంభీరంగా.

"నీ మొహం! బస్సువేళ అవుతున్నది. బయల్దేరదాం ఇక."

"అబ్బ! ఉండు కవితా! ఎప్పుడూ తొందర నీకు చూడు, ఇదంతా ఆనందవనంలా లేదూ? ఇలా నిర్జనంగా ఉన్నచోట, ఏ వేళకూ సంబంధించని వేళ నీతో ఒంటరిగా కూచుంటే - ఆ అనుభూతి అని చెప్పలేని అనుభూతి కలుగుతోంది నువ్వు నా దానివేనని పిస్తుంది కవీ!"

"నీ దాన్నే! మరేం చెయ్యను?" పాడుపడి ఒంటరిగా నిలబడిన ఒక స్తంభాన్నానుకుని కూర్చుంది కవిత. ఆమెకు దగ్గరగా పార్వతీ చేరింద.

"ఒక టడగనా?" అంది హఠాత్తుగా కవిత.

"ఏమిటది?" పార్వతి ఆత్రుతగా చూచింది ఆమె వైపు.

"ఆ రోజు నా మీద ఎందు కంత కోపం వచ్చిందట నీకు?"

"తెలీనట్టడుగు తున్నావు. నన్ను బొత్తిగా మూర్ఖురాల్ని చేశావుగా!"

కవిత నవ్వి, నా మీద కూడా నీకు అసూయ ఉన్నదని అందా మనుకున్నాను ఇంకా" అన్నది.

"పోదూ! ఇలా అర్థం చేసుకోనట్టు మాట్లాడితేనే నాకు బాధ. ఎంతైనా ప్రేమింపబడే వాళ్ళకి ప్రేమించేవాళ్లు లోకువట."

"కాదు పారూ! నాలో కూడా ఒక సమయంలో అల్ప భావాలు లేచి సంచలనం తెచ్చేవి. కాని ప మనసుల మెత్తదనాన్ని కనుగొనడం, మహాపురుషుల మాటల్లోని నిర్మలత్వాన్ని గ్రహించడం, భగవంతుని పక్షపాత రాహిత్యాన్ని ఊహించడం నేర్చుకున్న తర్వాత మనిషి తేలిక స్వభావాల్ని ప్రయత్నం లేకుండానే విడనాడి ఔన్నత్య పథాల దరిదాపులకి చేరగలడు"

"నువ్వన్నది నిజమే! పోనీగాని ఆ దృశ్యం ఎంత సుమనోహరంగా ఉందో చూడు కవితా! కొండల అంచులనెప్పుడు స్పృశిస్తానా అంటూ పరుగెత్తే దివాకరుడు. అతని పరుగుకి కందిపోయి ఎర్రబడుతున్న ఆకాశము. మళ్ళీ ఆ ఆ వెలుగు కిరణాలను చూచేది ఎప్పటికో అన్నట్టు అచేతనంగా నిలబడిపోయి ఆదిక్కుకే చూస్తున్న సమున్నత వృక్షరాజాలు..."

తక్కిన భాగాన్ని కవిత పూర్తి చేసింది.

"తమ విభులు అస్త మనస్కులైనారనే హైమ

నస్యంతో నన్నట్టు ఆ మహా వృక్షాలను మరింతగా పెనవేసు కుంటున్న సుమలతికలు మానసాన్నే నందనం చేస్తున్నాయి."

"నీ వర్ణనేం గొప్పగా లేదు" అంది పార్వతి కవితను చూస్తూ పెంకి తనానికి.

"ఏది నచ్చలేదు? వృక్షాలను తీగలల్లుకోవడమేనా? నువ్వెంత కొత్తదనాన్ని ఆశించినా సరే, పురుషుణ్ణి స్త్రీ ఎలాగో అలా అల్లుకుని ఆధారపడటం వాటి నైజం. అతి సహజమైన గుణం."

పార్వతి చిరాకు పడ్డది. ఇంకొక సంగతి తెచ్చావు. ప్రతి స్త్రీ పురుషుడికి దాసోహం అనెయ్యాలని ఎక్కడా లేదు. సమాన హక్కులు లభిస్తున్నప్పుడు ఎందుకని ఆధారపడాలి?" గడ్డిమొక్కలు ఏరుతూ అడిగింది.

"ఆధార పడకపోయినా అల్లుకోవాలి"

"ఏడ్చినట్టుంది. ఇంత నవ నాగరికురాలివి ఇదీ చెప్పేది" అంది పార్వతి మొగం చిట్లించి.

కవితతో ఇటువంటి సంభాషణ ఎంతవరకు పోయిందో గమనించలేదు ఆ అమ్మాయి.

కవిత చిద్విలాసంగా వింటూ "ప్రకృతి సిద్ధంగానే స్త్రీకి కొన్ని బలహీనతలున్నాయి. వాటిని తలోదరులు తల దాల్చక తప్పదోయ్!" అంది.

"ఏమిటో అవి సెలవివ్వండి"

"ముఖ్యంగా పిల్లల్ని కనడమనే సృష్టి బాధ్యతొకటి." పార్వతి తెచ్చి పెట్టుకున్న గాంభీర్యంతో "అదే

నేనూ అనుకుంటున్నా! ఈ యుగం పూర్తికానియ్యి. తిన్నగా దేవుడి దగ్గరికెళ్ళి మగవాళ్లు మగపిల్లల్ని కనేటట్టు, ఆడవాళ్లు ఆడపిల్లల్ని కనేటట్టు ఒప్పందం చేసుకుంటాను" అంది.

"నేనుకూడా నీతో వస్తాన్లే ఒక రచయిత్రి నంటూ. కాని దేవుడుకూడా మగవాడే కాబట్టి కోపంవచ్చి లోకమంతా ఆడ పిల్లల్నే చేశాడంటే అప్పుడు మనకి మరీ తంటా వచ్చి పడిందన్న మాటే!"

సెలయేటి గలగలల్లాగ నవ్వుకున్నా రిద్దరూ.

"పాత జోకేగాని నువ్వంటుంటే విపరీతంగా నవ్వొచ్చింది" అంది కవిత. కాని వెంటనే గంభీరంగా మారిపోతూ "ఏమైనా అనుగాని స్త్రీ ఒక పురుషుడికి తనను తానర్పించుకోవడంలోనే బ్రతుకు అనే పదానికి సరైన అర్థం ఇమిడి ఉందనుకుంటాను నేను" అంది.

పార్వతి కళ్ళు కాస్త కిందికి వాల్చింది.

"పురుషుడికే స్త్రీ తన సర్వస్వాన్ని అర్పించుకోవాలనేముంది? నిష్కామంగా నిర్వ్యాజ ప్రేమతో స్త్రీకి అర్పింకోకూడదా? కాకపోతే భగవంతునికి పవిత్రంగా అర్పణ కాకూడదా?" ఎన్నాళ్ళనుంచో కవితనుకూడా అడగకుండా హృదయ కుహరంలో దాచిన సమస్యను అడిగి బరువు తీర్చుకుంది.

"కొంచెం ఆలోచించవలసిన ప్రశ్నే వేశావు. స్త్రీకి స్త్రీ అర్పించుకోవడం అనగా అది మానసికమైన ఆరాధనకే

చెందినది. ఇక రెండవది — భగవంతునికి ప్రియమైనదే. అయితేనేం ? ఈ రెండు లక్ష్యాలకీ గొప్ప తేడా ఉన్నదనుకోను. ఉన్నా, అది స్వల్పమాత్రమని నా అభిప్రాయం. ఐహిక సుఖాల్ని, బాధల్ని, ఆవేదనల్ని అన్నింటినీ అనుభవించి వాటిపై విముఖులైన తర్వాత ఆధ్యాత్మిక భావపూర్ణతతో, ప్రేమార్ద్రి హృదయంతో నిలిచిన వారినికూ భగవానుడు సులభంగా స్వీకరిస్తాడు."

పార్వతి ఏమీ అనలేదు కొంతసేపు.

ఇంకొంచం సేపట్లో ఇద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఊళ్ళోకి నడిచారు. సూర్యుడు క్రుంగిపోయినా వెలుగు తగ్గలేదు. ఊళ్ళో దీపాలు కనిపిస్తున్నాయి.

## 40

"ఇవాళ మా పుట్టినరోజని విన్నారా ?" అన్నాడు రాజు అద్దంలో చూసుకుని తల దువ్వుకుంటూ.

"ఓహో ! అందుకేనా వేగంగా తెల్లవారింది? పాపం! పుట్టిన తర్వాత ఇన్ని సంవత్సరాల కొచ్చింది మరి పుట్టిన దినం !" అంది పార్వతి.

"ఇలాటి వట్టి చప్పని మాటలు నా దగ్గర పనికిరావు. ధైర్యం ఉంటే నే నడిగినదాన్ని ప్రజంట్ చెయ్యి" అన్నాడు.

"ఏం కావాలో అడగండి. శక్తిమేరకు చూద్దాం" అంది పార్వతి సవాలు చేస్తున్నట్టు నిలబడిపోయి.

"ఆ తర్వాత ఏడ్చుకుంటావేమో ?"

"ఎందుకూ ఏడ్చుకోడం? అంత ప్రమాదకరమైనదైతే నే నివ్వనని ముందే చెప్తున్నాను" అంది నవ్వుతూ

"పోనీయ్! ఇవ్వలేనిది కోరి తిప్పలు పెట్టనెందుకులే నిన్ను. అదిగో, ఆ ఉంగరం ఇస్తే చాలు ఊఁ క్విక్!"

"బాబోయ్! ఇది కవిత నాకిచ్చింది. ఇంత తేలిగ్గా ఇచ్చెయ్యడమే? నా వల్లకాదు. పోనివ్వండి! ఇంకా మీకు మూడుసార్లు అవకాశం ఇస్తున్నాను. ఏది తేలికని తోస్తే దాన్నిస్తాను."

"ఉఁహు. అదేం కుదరదు కోరిన దివ్వకపోయాక ఇంకేం లాభం? స్వార్థం వదిలిపెట్టి మాట నిలబెట్టుకోవోయ్ అమ్మా!" చిలిపిగా పార్వతివంక చూశాడు అతను.

"బాగుంది. ఇది స్వార్థమా? కానేకాదు. ఇంకేవరైనా అయితే ఏమోగాని నా కవిత ప్రేమతో ఇచ్చిన వస్తువు నెప్పటికీ ఇంకొకరికి ఇవ్వలేను."

"కవిత నీకంత ఎక్కువా? మా అందరికంటె?" తృణీకరిస్తున్నట్టుగా అన్నాడు.

"అవును నిజమే! నిశ్చలంగా అంది.

"నవ్వొస్తోంది" అన్నాడు రాజు నవ్వుతూ.

"ఎందుకని ?"

"మీ మూడునాళ్ళ ప్రేమాభిమానాలు చూస్తుంటే."

"మూడునాళ్ళ ప్రేమెందు కౌతుందీ?"

"నాకు ట్రాన్స్ఫర్ ఆర్డరు వచ్చినప్పుడు తెలుస్తుందిలే. తొందర పడకు."

పార్వతి గతుక్కుమన్నది. వెంటనే ఏ మాటా అనలేక పోయింది

రాజే మళ్ళీ అందుకొని "కావాలంటే నేనే కోరి ట్రాన్స్ఫర్ చేయించుకో గలను ఇంకో ఏడాది కంతా" అన్నాడు సగర్వంగా.

ఏమనాలో తోచ లేదు పార్వతికి. రాజు నోటితో విన్న తర్వాతనే ఆ ఆలోచన రేగింది ఆమెలో కూడా.

అతన్ని బ్రతిమాలా లనిపించింద ఆ ప్రయత్నాని ఇప్పుడప్పుడే పూనుకోవద్దని. కాని అది కూడా లాభం లేదని పించింది. కవితకు దూర మవ్వాలిక తను. అమ్మయ్యో! ఆమెను విడిచి తనను తాను భరించగలదా?

రాజు అందంగా నవ్వుతూ "అందుకే నన్ను బ్రతిమాలుకో" అన్నాడు

"బ్రతిమాలుకుంటే ఏమవుతుంది?" ప్రశ్నించింది.

"కనికరించి నీ కోసమని ఏ బిజినెస్లోకి దిగటమో, వేరే ఏదైనా పోస్టులోకి ప్రవేశించడమో చేస్తాను మనం కూడా ఎప్పటికీ ఇక్కడే ఉండిపోవచ్చు."

పార్వతి కళ్ళు విచ్చుకున్నాయి. "నిజంగానా? ధన్యురాల్ని. అయితే ఈ ఉంగరం తీసుకోండి."

వేలినుంచి తియ్యబోతున్న పార్వతిని ఆపి "ఉహుఁ-

అదికాదు. ఇంకోకటి అడుగుతా నుండు..." అన్నాడు రాజు వేలితో తలకాయ గీక్కుంటూ.

అంతలో వాకిట్లోనుంచి చప్పుడు, రిక్షా గంట, మాటలు ఒక్కసారే వినిపించి ఆత్రంగా వెళ్ళి చూశా రిద్దరూ.

జానకమ్మ వాకిట్లో నిలబడి తనతో వచ్చిన అబ్బాయితో ఏదో చెప్తున్నది.

అతను, "తర్వాత వస్తానండీ మళ్ళీ. నాన్న మా అన్నయ్యతో అర్జెంటు విషయం ఒకటి చెప్పమన్నాడు." అని మొగమాటంగా నాలుగు ముక్కలు చెప్పి వెళ్ళి పోయాడు.

నిజానికి జానకమ్మ గాభరాపడి తన కొడుకూ, మేన కోడలూ సంవత్సరంనుంచి కంటి చూపుకి కరువై పోయారే అనే కంగారుతోనే వేసవికి రావాలనుకున్న మనిషేమో వసంతాగమనంతోనే వచ్చేసింది

"ఏ సెలవలకీ రాకపోతిరి! ఆయనకి పట్టకపోతే నా మన సూరుకుంటుందా? ఆఖరుకు మనవాళ్ళ అబ్బాయి వస్తుంటేనూ — ఉండబట్టలేక వచ్చేను" అందావిడ తన గొడవలోనే.

కొడుకుతో పాటుగా పార్వతి కూడా నిశ్శబ్దంగా ఉండటం చూసి జానకమ్మ మరింత ఆశ్చర్యంగా, "అదే మిటే పార్వతీ! చెక్కబొమ్మలా అలా నిలబడిపోయావు! అయ్యో! ఎంత సన్నబడి పోయావే! అంతే మరి. ము

ఎప్పుడైనా ఒక పూచికపుల్ల పనిచేసిన పాపాన పోతేకదా?" అన్నది నొచ్చుకుంటూ.

"అవును నేను కనిపిస్తేగా నీ కళ్ళకి!" రాజు చిరునవ్వుతోనే కోపం ప్రదర్శించాడు.

కొడుకు మీది ముద్దుకొద్దీ జానకమ్మ నవ్వుతూ "తల్లి దిష్టి కాకపోతే—నువ్వు కాస్త బొద్దుగానే వున్నావురా రాజూ! ఇదే బొత్తిగా చిక్కిపోయింది. పెద్దవాళ్ళ పోషణ లేకపోతే పిల్ల లిట్లాగే అయిపోతారుకదా! చిత్రం!" అంది చివరికి నిట్టూర్చి.

పార్వతి నవ్వి "నే నిలా సన్నబడిపోవడానికి కారణం ఎవరనుకున్నా వత్తయ్యా! చెప్పనా?" అంది.

"ఎవరే!" అంది పరధ్యాసగా ఆవిడ.

"మీ కొడుకుగారే! అస్తమానం దుక్కలా ఉన్నానని దిష్టివేస్తుంటే ఏమవుతుంది మరి!"

"నిజమేనా?" కోప్పడు తున్నట్టు అడిగింది జానకమ్మ లోలోపల వాళ్ళ మధ్య మార్పు వచ్చినట్టు గమనించి మురుస్తూ.

"లేదమ్మా! నే నెంత మంచివాణ్ణో నీకు తెలీదూ?" అన్నాడు.

"సరేకాని - ఉండత్తయ్యా! నీ కోసం కాఫీ తయారు చేస్తాను" అంటూ పార్వతీ వెళ్తుంటే ఆపుచేసి, "అదేమిటే? నేను చేసుకోలేనూ? మేం ఉక్కు మనుషులమే అమ్మాయి! ఎంత శ్రమన్నా పడగలం" అంది జానకమ్మ లేని ఆ విశాల భవనంలో వంట ఇల్లు వెతుక్కుంటున్నట్టు చూస్తూ.

అయినా పార్వతి ఆమెను వెంట నంటి వెళ్ళింది.

"ఇద్దరికోసం ఇంత ఇల్లా!" నివ్వెర పోయింది జానకమ్మ. ఆమె అక్కడ సతమత మవుతుండగానే పార్వతి తన పనుల్లోనూ, ఆలోచనల్లోనూ మునిగింది.

ఎనిమిది గంటల ముప్ఫయ్ నిమిషాలకు సైకిల్ మీద ఒక కుర్రవాడు వచ్చి పార్వతితో "కవితగారు మిమ్మల్ని వాళ్ళింటి దగ్గర ఇప్పుడే కలుసుకోమన్నారు. వీలవకపోతే పదింటికి ఆఫీసులో నన్నా తప్పక కలుసుకోవాలన్నారు" అన్నాడు తొందరగా.

పార్వతి ఆత్రుత పడింది. "అంత అవసరమా? అయితే ఇప్పుడే వస్తున్నాను. నువ్వెళ్ళిపోయ్!" అంది గబగబా గదిలోకి వెళ్తూ.

రెండు నిమిషాల్లో తెమిలి కవితకోసం బయల్దేర బోతున్న ఆమెకు ఎదురు వచ్చాడు రాజు.

"ఈ హడావి డేమిటి?" అన్నాడు తాపీగా ద్వార బంధం మీదికి చెయ్యి చాస్తూ.

"కవిత రమ్మని కబురు చేసింది." అంది బీర్వాలోని వ్రాసిన కాయితాలు మడిచి కవర్లో పెడుతూ.

"ఆ సంగతి నాకు తెలుసు. అంత అవసర మేమిటా అని?" గుంభనగా అన్నాడు.

"అవసరం లేకపోతే రమ్మంటుందా? ఏదో కారణం ఉంటుంది అంది."

"పార్వతీ, ఇప్పుడు వెళ్ళొద్దు!"

ఆశ్చర్యపడ్డది పార్వతి ఇంతలోకే వచ్చిన మార్పుకి.

వింతగా పరిశోధనగా చూచింది అతనివైపు. అత్యావసరంగా పిలిపిస్తే వెళ్ళకపోవడమేమిటి? ఆమె ఏమనుకుంటుంది?"

"ఏమనుకుంటే నేం? అసలు ప్రతిక్షణం ఆవిడకోసం నువ్వు పరుగెత్తడం మెచ్చుకోదగ్గ విషయం కాదు."

పార్వతి నవ్వింది. "నన్ను మెచ్చుకోమని ఎవర్నీ వేడుకోవటం లేదే!"

"ఏమైనా సరే! నువ్విప్పుడు వెళ్ళటానికి ఒప్పుకోను. నీ స్వేచ్ఛకు ఇన్నాళ్ళూ నేను అడ్డు చెప్పలేదు. ఇక ముందు కూడా అపరంజి పంజరంలో చిలుకలా పడి ఉండమని శాసించను. కాని నా మాట నువ్వు వినాలి."

"ఏఁవిటీ సొద? అటు ఆలస్య మవుతోంది." రెండడుగులు ముందుకువేసి విసుక్కుంది. కాని రాజు తప్పుకోకుండా అలాగే నిలబడ్డాడు.

"కవిత ఎక్కడికీ పారిపోదు పారూ! ఈ ఒక్కరోజు నువ్వెక్కడికీ వెళ్ళవద్దని మాత్రం కోరుతున్నాను. అంతే కదా? నా కోసం ఆ మాత్రం నిగ్రహించుకోలేవా?" సాత్వికంగా అడిగాడు.

"మీ కోసమా? ఏమిటో కొత్తగా వుంది నాకు. ఆమె పిలుపును అతిక్రమించి నిలవరించుకునే సామర్థ్యం లేనే లేదు నాకు. దారి వదలండి. తొందరగా వెళ్ళాలి"

"పెద్దమాటలు ఉపయోగించి హడలగొట్టేస్తున్నావు కాని నువ్వు అబలవేనని గుర్తుంచుకుంటే మంచిది." రాజు పేలవంగా నవ్వుతూ అన్నాడు.

పార్వతి సహనం మెల్ల మెల్లగా తగ్గుతూ వచ్చింది

"అబల మాత్రమే కాదు శక్తి కూడా స్త్రీయే."

"మగవాడు తలుచుకుంటే స్త్రీని ఏమైనా చెయ్య గలడు."

"హుఁ, మీ రంటున్నది కేవలం బలాబలాల గురించి. శక్తి ప్రదర్శించి ఆడదాని ఆత్మశక్తిని గెలవలేడు మగ వాడు." చరచర అతన్ని దాటి పోవాలనుకుంది పార్వతి.

కాని ఆమె ప్రయత్నం సాగనివ్వకుండా మరింత అడ్డు నిలబడ్డాడు రాజు.

పార్వతి ఎంత కోపోద్రిక్తురాలవుతున్నా రాజుకు ఆమె మీాద అనురాగమే కలుగుతున్నది.

"నన్ను వెళ్ళ నివ్వండి." అతన్ని ప్రక్కకు తొలగించ బోయింది.

రాజు చప్పున పార్వతి చేతుల్ని తన చేతుల్లోకి తీసు కుని బిగించి పట్టుకున్నాడు.

"నిన్ను ప్రేమిస్తున్నాను పారూ! నన్ను..." అతని గొంతు బొంగురుపోయి ఆ పైన మాటరాలేదు.

పార్వతి పడగ విప్పిన నాగులా విసురుగా తలెత్తి చూచిం దతన్ని. ఆమె ఊహించని సంఘటన. అతని కళ్ళ ల్లోని సౌమ్యాన్ని, దైన్యాన్ని గుర్తించగలిగే స్థితి కా దామెది. ఆవేశం పొగలు కక్కుతూ వచ్చి ఏవగింపుతో శరీరం నిప్పు రవ్వల్ని కురిసింది.

"ఛీ!" అదిరి పడేటట్టు విదిలించుకుంది. దూరంగా నిల్చబడింది.

"రాజూ! మీారు వట్టిమూర్ఖులు! కళ్ళు మూసుకు

పోయి ఇంత అసహ్యంగా ప్రవర్తిస్తారని ఏనాడూ ఊహించక పోవడం నా తప్పు. ప్రేమ అనేది ఇంత చంచలంగా ఉంటుందా ఎక్కడైనా! ఆనాడు నన్ను ప్రేమించడం లేదని ఖచ్చితంగా చెప్పారు. చెయ్యాలంటే అన్నీ జ్ఞాపకం చెయ్యగలను. నన్ను ప్రేమిస్తున్నట్టు చెప్పడానికి సిగ్గుగాని, అభిమానంగాని అడ్డు రాలేదా మీకు?"

"పార్వతీ!"

"మీది తృష్ణ. లాలస. వాంఛ. అంతేగాని ఇది ప్రేమ అనుకుని మిమ్మల్ని మీరు వంచింకోకండి. ఆవేశంతో తాత్కాలికంగా పరవళ్ళు తొక్కేది ప్రేమ కాదు. మీ లాంటి చంచల హృదయులకి మనస్సు, శరీరం అర్పించు కోవడంకన్న బ్రతుకంతా భగవంతుడికి అంకితం చెయ్యడం లోనే సుఖమూ, శాంతీ ఉంటాయి. నా సర్వస్వాన్ని భగ వానుడు తీసుకున్నాడు. నన్ను వేధించకండి. కావాలంటే కొద్దిరోజుల్లో మీ దారికి అడ్డు తొలగి పోతాను."

"పార్వతీ!"

వినిపించుకోలేదు పార్వతి. ఎగసిపడే గుండెతో కవిత సన్నిధిలో వాలిపోయింది.

"ఏం జరిగిందిరా రాజూ!" అని ప్రశ్నించిన జానక మ్మకు సరైన సమాధానం లభ్యం కాలేదు. ఆమె ఆశిం చనూ లేదు. పార్వతి కేకలు వినిపించి పనిచేసుకుంటున్న ఆమె వచ్చేసరికి అంతా జరిగిపోయింది. ఇంత ఏమిటంటే రాజు కంఠం గట్టిగా వినిపించలేదామెకు. పైగా "ఏం లేదమ్మా!" అంటూ వాడిన పూగుత్తిమీద తుషార జలంలా

మొహం మీద చిందిన చిరుచెమటల్ని తుడుతుకుని వెళ్లాడు ఎటో.

"కవితా! నన్నెవరూ బ్రతకనివ్వడం లేదు. నీ చల్లని నీడ నా కియ్యి కవీ!"

"ఏం ? ఏం జరిగింది? అదోక మాదిరిగా ఉన్నావేమిటి ?" తీక్ష్ణకిరణాల తాకిడికి సోలిపోయిన సుకుమార ముకుళంలా కనిపిస్తున్న పార్వతిని చూస్తూ అడిగింది కవిత.

"నిన్ను నా నుంచి వేరు చెయ్యాలని చూస్తున్నారు కవీ శత్రువులు. పోనీ, నువెందుకు పిలిపించావో చెప్పు" అంది అలసట ఇంకా అణగక ముందే.

"ఏదీ! నువ్విస్తానన్న వ్యాసం గురించి అడగటానికే. నేనూ, మా ఎడిటర్‌గారూ ఆ పత్రిక భవిష్యత్తుకోసం నానా కలలూ కంటున్నాం."

"అందుకేనా పిలవడం ? తెచ్చాను. ఆ బాగ్‌లో ఉంటుంది—తీసుకో. ముందు నాకు మంచి నీళ్ళిచ్చి కాస్త పడుకోడాని కేదైనా పక్క చూపించు. ఏమిటో కళ్ళు తిరుగుతున్నట్టుగా ఉంది."

"అదేం ? ఏమయింది పారూ ?" కవిత కంగారుగానే నారింజ రసం తయారుచేసి ఇచ్చింది.

అప్పటినుండి మూడు రోజులవరకు పార్వతి మనఃస్థితి ఒక్కలాగే ఉంది. రాజు ప్రవర్తన అందుకు సహకరించి మరింత కలవర పెట్టింది ఆమెను. చిత్రమైనది మనసు. అది ఒకొక్కప్పుడు ఎందుకు బాధపడుతుందో బాధకు లోనౌతున్న వాళ్ళకే తెలియదు, ఇతరుల కేం అవగత మౌతుంది?

రాజు పార్వతిని తప్పుకొని తిరుగుతున్నాడు. అతను ఆ విధంగా మసలడం కొత్తేమీకాదు. కాని ఆ గాంభీర్యంలో మ్లానతను గమనించాకకూడా తనకేమని ఊరుకోలేక పోతున్నది. జీవన వ్యామోహం, తీరని తమి చేసే విచిత్ర లాస్యానికి రూపకల్పన కష్టసాధ్యం. చెట్లను, గుట్టల్ని దాటుకువచ్చే పర్వత వాహినిని పోలి అంత శ్శరీరపు గతుకుల్లోంచి ఎగసిపడే ప్రవాహానికికూడా అడ్డులేదు

"పార్వతీ, ఈ మంచినీళ్ళు కాసిన్ని తీసుకెళ్ళి బావకిచ్చేసిరా అమ్మా!"

"ఉండత్తయ్యా! నువ్వొక దానివి! నువ్వే ఇచ్చిరాకూడదూ?" పార్వతి బిగదీసుకు పడుకుంది. కాని నిజానికి పడుకోలేదు.

అదేదో పని తనే పూర్తి చేసుకు వచ్చిన జానకమ్మ తనదురదృష్టాన్ని పునఃస్మరించుకోకుండా ఉండలేకపోయింది.

"నా చేతులతో పెట్టగా వాడింత అసంతృప్తిగా ఎప్పుడూ భోజనం చెయ్యలేదు. నేను వచ్చినరోజు బాగానే ఉన్నాడు ఇంతలో ఏమైందో వాడికి? ప్చ! అంతా కర్మ-అంటారు ఎవరికర్మ కెవరు కర్తలు? గీతలోనో మరెందులోనో 'ఈ పిల్లలు నీ పిల్లలు కారు. ఈ సంసారం నీ సంసారం కాదు' అన్నాడు దేవుడ ..." జానకమ్మ తన ధోరణిలో మాట్లాడుకుంటూ నిద్రపోయింది గాని తన ఒక్కొక్క-మాట ఒక్కొక్క- రాయిగా పార్వతి గుండెల్లోకి దూసుకు పోయినట్టు ఆమె కెలా తెలుస్తుంది?

అది నిశీథి. నిశీథయుగాన్ని ఎన్ని దీపాలూ తీసి వెయ్య

లేవు. బెడ్ లైటు సన్నని కాంతులు వెదజల్లుతున్నది.

పార్వతి లేచి కూచొని జానకమ్మ మొహం చూచింది. చెప్ప శక్యంకాని విధంగా బరువు నిండింది అంతర్యాన. స్త్రీ ఎంత ఉన్నత స్థితుల్ని పొందినా ఆవేదన అనేది పుట్టింటి వారిచ్చిన సారెలా ఆమెను వెన్నంటి వస్తుంది. కోరని వరంగా ఇచ్చాడేమో జగదీశ్వరుడు ?"

పార్వతి కళ్ళు అశ్రుసిక్తాలై గవాక్షంలోనుంచి వెన్నెల చాలుల్లోకి చూశాయి. ఆ తర్వాత అనంత ఆకాశమూ—ఈ చూపు, అర్థపూర్ణమైన ఈ చూపు విశ్వాంత రాళాన్ని చీల్చుకుని ఔన్నత్య పథాల్లోకే ఆగకుండా సాగి పోతున్నది.

'భగవాన్ ! అన్ని ప్రేమల్లోకి నీ ప్రేమ గొప్పదని తెలుసుకున్నాను. మానసికంగా నీ ప్రేమను అనుభవించాను కాని చివరికి - చివరి కిప్పుడు నాలాగ జీవిస్తున్న ఒక వ్యక్తిని అభిమానిస్తున్నాను. ప్రేమించడానికి ప్రయత్నిస్తున్నాను. ప్రాపంచిక బంధాల సంబంధాలు, ఐహిక సుఖాల అనుభవాలు పూర్తయితేగాని 'ఆధ్యాత్మిక భావపూర్ణత సిద్ధించదని మా పట్ల నిర్లిప్తత వహిస్తావు కాబోలు. నీ అంతర్యాన్ని అర్థం చేసుకోవాలనే ప్రయత్నం ఎంతటిదో నువ్వు చూపించిన దారిలో మారు పలుకకుండా నడిచిపోవడం అంతటిది !

"అమ్మాయ్ ! నిద్రపోలేే?" జానకమ్మ లేచి వింతగా అడిగింది.

"నాలుగు రోజులు నుంచి నిద్ర రావడం లేదు

అత్తయ్యా!'' కళ్ళు తుడుచుకోకుండానే జానకమ్మ ఒడిలోకి వాలిపోయింది.

తెల్లవారిన తర్వాత పార్వతికి రాజు కనిపించలేదు. ఆమె లేవకముందే అత నెటో వెళ్ళిపోయాడు.

తిరిగి అతను నాలుగు గంటల ప్రాంతాన వచ్చినప్పుడు జానకమ్మ బాధపడుతూ, "ఈ పిల్లవాడితో నేను బాధ పడ లేకుండా ఉన్నాను ఈశ్వరా! 'భోజనానికైనా రాకుండా ఈ తిరుగుళ్ళేమిట్రా తండ్రీ' అని గద్దించి అడిగితే, 'హోటల్లో భోజనం చేశానమ్మా!' అని నెమ్మదిగా చెప్ప డమా? నా ప్రాణానికి వెర్రికాలం వచ్చి పడ్డది'' అనుకుంది.

పార్వతి ఆ స్వగతాలన్నీ వింటూనే ఉంది. ఆవిడ చేతిలోని కాఫీ కప్పు తను తీసుకుంటూ, "నేనిచ్చి వస్తా నత్తయ్యా!'' అంది, విస్మయ పడుతున్న ఆవిడవైపు తలెత్తి చూచే సాహసం లేకపోయింది ఆ సమయంలో.

కిటికీలోనుంచి వచ్చి నుదురును వెచ్చగా స్పృశిస్తున్న సూర్య కిరణాలు కళ్ళల్లోకి ప్రవేశించబోతున్నా లెక్క చెయ్యకుండా రాజు ప్రపంచ చైతన్యాన్ని చూస్తున్నాడు.

'జీవితమంతా చీకటేరా మాన వాధమా!' అని ఒక రేడియో పాట క్రిందిగదుల్లో ఎక్కడినుండో అమంద ధ్వనితో విన వస్తున్నది.

'నిజమే. బ్రతుకేందరికీ నందనవనం కాదు!' అను కున్నాడు రాజు.

కాని జీవితం అరణ్యమైనా పూర్తిగా కంటకమయం కాదని రాజు కెప్పుడు తెలుస్తుంది ? అక్కడా తప్త హృదయాన్ని తాత్కాలికంగా చల్లబరిచే సుందర సరోవరాలు ఉంటాయి. శీతల తరుచ్ఛాయలు ఉంటాయి.

తల్లి అనుకొని తల తిప్పి చూచిన రాజు ఉలిక్కిపడ్డాడు. దేవీ మూర్తిలా నిర్మలంగా, నిరాడంబరంగా, నిశ్చలంగా నిలబడి ఉంది పార్వతి. రాజు తడబడి లేచాడు.

"తీసుకోండి !"

పొగలు కక్కే కాఫీని రెండు గుక్కల్లో మింగి ఖాళీ కప్పు అక్కడే కిటికీ దగ్గరుంచి అదోక మాదిరిగా వెళ్ళబోయాడు.

"రాజూ !" పార్వతి పిలుపులో మార్దవ గాంభీర్యాలు మిళితమై ఉన్నాయి.

"ఏం కావాలి పార్వతీ ?" కొద్దిగా వెనక్కు వచ్చి అడిగాడు.

"మీరు కావాలి !" నిస్సంకోచంగా చెప్పింది.

రాజు సిగ్గు పడ్డాడు

"క్షమించు, పార్వతీ ! నిన్ను చిన్నప్పుడు తెలుసుకోలేక పోయాను. ఇప్పుడూ తెలుసుకోలేదు. మూర్ఖంగా నిన్ను బాధ పెట్టాను కూడా. అవన్నీ మరిచిపోలేదు."

అతని సమీపానికి వచ్చేసింది పార్వతి.

"లేదు, రాజూ ! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీరు ప్రేమించినంతకాలమూ ప్రేమిస్తాను. మీరు ప్రేమించ

కుండా నేను ప్రేమించడం బానిసత్వం అనిపిస్తుంది నాకు..."
అంది అతని చేతిని పట్టుకుంటూ.

రాజుకు కళ్ళల్లోసైతం ఘర్మజలం చిమ్ముతూంది.

"పారూ !" అన్నాడు మరేమీ అనలేక ఆమెను దగ్గరికి తీసుకుంటూ.

ఇరువురిలోను తెలియరాని ప్రేమానుస్పందన. అధికార యుతమైన ప్రేమలాలస. అనురాగ వేగ సంచలిత హృదయాలతో ఒక రొక్కరు ఆరాధించుకున్నారు ఆ క్షణం. ఇక విడిపోయి బ్రతకలే మనుకున్నారు.

హృదయంలో పదిల పరుచుకున్నాడు రాజు పార్వతిని.

"పారూ ! నన్ను క్షమిస్తావా ?"

"ఎప్పటికీ క్షమించను." నవ్వింది.

ఉలిక్కి పడింది పార్వతి.

"పార్వతీ ! పార్వతీ !..." కవిత పిలుస్తున్నది.

"కవిత !"

వివశురాలైంది. పరుగెత్తి వెళ్ళింది. కాని కవిత ఇక తనను మరీ అర్థంచేసుకోదు అన్న ఆందోళన ముఖంలో ప్రస్ఫుట మవుతున్నది.

"ఎప్పు డొచ్చావు కవితా ?" కంపించే స్వరంతో అడిగింది.

"అరగంట ఐంది తల్లీ ! భగవంతుణ్ణి జపిస్తూ కూచున్నాను."

"నువ్వు పిలవటం వినిపించ లేదు కవితా !"

"అదే చెప్తున్నానేమో? దేవుణ్ణి ప్రార్థిస్తూ కూచు న్నాను. మా పార్వతి జీవితం బాగుబడితే సంతోషమే కాని ఆమె నన్ను మరిచిపోకుండా మాత్రం కాపాడు భగవాన్ అంటూ."

"కవీ!" ఆమె నింక మాట్లాడ నివ్వలేదు పార్వతి. "నిజంగా ఈ హృదయార్పణ ఎవరికి జరిగిందో నీకూ్కడా తెలీదు కవితా!" కవిత భుజంమీాదకు వాలిన పార్వతి పెద వులు కంపించాయి. కాని మాటలు వాటి వెనుకనే పోయాయి.

భావాతీత హృద్వేదన కవితకు తెలియనిది కాదు. ఆమె వీనులతో వీక్షించ గలదు. కన్నులతో ఆకర్ణించ గలదు!

అక్కడకు వచ్చిన రాజు చిరునవ్వుతో కవితకు నమ స్కరించి బయటకు వెళ్ళిపోయాడు.

జానకమ్మ ఏదో పనిమీాద వస్తున్నదంతా "అమ్మాయ్! దీపాలు వెలిగించుకోకుండా నిలబడ్డారా సందెచీకటి లోనూ..." అన్నది ఆ పనికి తనే పూనుకుంటూ.

"హృదయ జ్యోతి వెలిగినాక ఇతర దీపాలతో అవ సరం ఉండదు పిన్నిగారూ!" అంది కవిత.

— సమాప్తం —

Principles and Modern Applications
Second Edition
By Ralph H. Petrucci, California State College at San Bernardino
1977, 672 pp.
Order Code 97954

381

The second edition of this leading chemistry text has been substa[ntially] revised. While it continues to provide students with an introduction to beyond the traditional basic principles of chemistry, this edition deem[pha]sizes historical aspects and places a greater emphasis on quanti[tative] subject matter.

These major changes have been made: material formerly i[n] Problems Supplement has been incorporated into the text itself and new and updated problems have been added (over 1300 in all are provided); SI units are now utilized; the number of worked examples text has been doubled and each example is keyed to several s[imilar] exercises; exercises are now grouped according to the major co[ncepts] illustrated; a greater emphasis has been placed on quantum numb[ers]; new section on molecular orbital theory of homonuclear diatomic [mole]cules has been added; the section on nuclear chemistry has completely rewritten; sections on oxidation states and oxidation-red[uction] states have been totally reorganized; the section on the predicti[on of] structure of mononuclear compounds of representative elemen[ts by] valence shell electron repulsion theory has been expanded; and the s[ection] on chemcial kinetics has been strengthened by more examples illust[rating] the Bronsted-Lowry and Lewis systems and the inclusion of the so[lvent] system theory of acids and bases.

An individually-paced Student Study Guide (order code 39500) Solutions Manual (order code 39499) containing detailed solutions over 1300 problems in the text are available for sale to the student.

**CONTENTS**

382

తక్కువ ధరలు!!

ఈ మధ్యకాలంలో
...ంచని ధరలతో వెలువడిన
కొత్త ప్రచురణలు




Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-4